# మూకపంచశతి

మూకకవి విరచితము

అనువాదము:

శ్రీ గురుశిశువు

విద్వాన్ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు






ప్రచురణ:

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1992

# మూక పంచశతి

మూకకవి విరచితము

అనువాదము

శ్రీ గురుశిశువు

## విద్వాన్ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు




ప్రచురణ

శ్రీ యమ్.వి.యస్. ప్రసాద్, I.A.S.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# Mooka Panchasati

By

## Mookakavi

*Translated by :*

Sree Guru Sisuvu

Vidwan Kalluri Venkata Subrahmanya Dikshitulu

Religious Publication Series No : 407

First Edition : 1992
No. of Copies : 1,000
Price :

*Published by :*

Sri M.V.S. Prasad, I.A.S.,
*Executive Officer,*
T.T. Devasthanams, Tirupati.

*Printed at :*

Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

అనంతశక్తి స్వరూపిణి కంచి కామాక్షీదేవి. ఆ మాతృమూర్తి దయకు పాత్రుడైన కవీంద్రుడు మూకకవి. పుట్టుకతోనే ఈయన మూగ. కామాక్షీదేవి కటాక్షవిశేషంచేతను, కంచి కామకోటిపీఠానికి 19వ ఆచార్యులైన శ్రీ మార్తాండ విద్యాఘనేంద్రస్వాముల వారి ఆశీర్వాద బలం వల్లను తన మూగతనాన్ని పోగొట్టుకొని సార్థక నామధేయుడైన ధన్యజీవి ఈ కవి. కామాక్షీదేవిని గూర్చి 'మూక పంచశతి' అనే 500 శ్లోకాల స్తుతిరత్నాల్ని వెలయించిన ఈ మహనీయుడు క్రీ.శ. 399-489 సం.ల మధ్యకాలంలో కంచి పీఠాన్ని 20వ ఆచార్యులుగ అధిష్ఠించారని ప్రచారంలో వుంది. మణిప్రభ గ్రంథకర్త రామిలుడు, హయగ్రీవవధ రచయిత మేంఠుడు-అనే సుప్రసిద్ధ సంస్కృతకవులు మూకకవీంద్రుని శిష్యులట.

'మూక పంచశతి' అనే ఈ స్తుతి గ్రంథంలో దేవి యౌవనాటోపం, లావణ్యం, శృంగారం మున్నగు విషయాలు భక్తిపారవశ్యంతో వర్ణింపబడ్డాయి. చిద్రూపగాను, మోక్షప్రదాయినిగాను, ఆనందాద్వైత మూర్తిగాను జగన్మాత ఈ గ్రంథంలో మనకు దర్శనమిస్తుంది. "సాధకుడు లోకోత్తరమైన ఈ స్తుతిని పఠించినంత మాత్రాన ఈ మహాకవితోను, ఆ పై పరదేవతతోను ఐకాత్మ్యానుభూతిని పొందినట్టి స్థితిని పొందగలడు"-- జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి స్వాములవారి ఈ మాట 'మూక పంచశతి' విషయంలో ప్రత్యక్షరసత్యం.

మూలకర్త భావం చెడకుండ ఈ గ్రంథాన్ని ఛందోబద్ధంగా అనువదించిన కవితాతపస్వి శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు. వీరి జీవితచరిత్ర, పాండిత్యప్రతిభలు మున్నగు విషయాల్ని గురించి శ్రీ నుదురుమాటి వేంకట రమణ శర్మగారు పీఠికలో చక్కగ వివ

రించారు. శ్రీ చివుకుల సుబ్బరామశాస్త్రిగారు మూకకవి కవితా వైశిష్ట్యాన్ని గూర్చి అనువాద ప్రశస్తిని గూర్చి మనోజ్ఞంగా పరిచయం చేశారు. అందువల్ల తిరిగీ మూలకార, అనువాదకుల్ని గురించి వివరించ బూనడం చర్విత చర్వణమవుతుందని ఆ ప్రయత్నం విరమించడమైంది.

ఈ మహోత్కృష్ట గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానములు ముద్రించి భక్తజనావళి కందిస్తున్నందుకు ఆనందిస్తూవుంది. వారి ఆదరాభిమానాల్నిది పొందగలదని మా విశ్వాసం.

తిరుపతి
19-5-1992.

ఎం.వి.యస్. ప్రసాద్,
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు.

శ్రీః

# మూక పంచశతి

## విషయ సూచిక

# శ్రీకామకోటి జగద్గురుచంద్రశేఖరేంద్రసరస్వతీ శ్రీచరణు లనుగ్రహించిన శ్రీముఖము

శ్రీ కామాక్షీదేవికరుణాకటాక్షతరంగిత పుణ్యకవితానిధియై మూకకవి యను కవిశిరోమణి 'మూకపంచశతి' అను పేరుతో ప్రసిద్ధమైన కృతి రచించి లోకోత్తర శాశ్వతపుణ్యకీర్తి విశేషమును బరమానందానుభూతిని బడసిరన్నది అందఱికిని తెలిసినదే. ఈ స్తోత్రరత్నమందు కాంచీమధ్యగత కామకోటి పీఠాధిష్ఠాత్రి చంద్రశేఖరు నైశ్వర్యరూపిణియగు కామాక్షియనుపరదేవతను ఆరూఢయౌవనాటోప తరుణిమ సర్వస్వం, నిత్యతరుణి లావణ్యామృత తరంగమాల, విభ్రమసమవాయ సారసన్నాహ శృంగారా ద్వైత తంత్ర సిద్ధాంతము, మీనధ్వజ పరమతాత్పర్యము, కందర్ప సూతికాపాంగే మనసిజ సామ్రాజ్యగర్వబీజము, పుష్పాయుధవీర్యసరసపరిపాటి మదనాగమసమయ దీక్షితకటాక్ష, కుసుమశర గర్వసంపత్కోశగృహము, ఆనందబ్రహ్మతత్త్వ బోధసిర పంచశరశాస్త్రబోధన పరమాచార్యదృష్టిపాత, ఇత్యాదిగ వర్ణించుచు నావెంట లావణ్యామృత పరకాష్ఠాభూతయైన యా పరదేవతను కారణ పరచిద్రూప, కైవల్యానందకందము, ఆమ్నాయరహస్యము ఉపనిషదరవింద కుహరమధుధార వాఙ్మనోఽతీత ఆనందాద్వైతకందళి, ముక్తిబీజము ఆగమ సల్లాపసారయాథార్థ్యము బోధామృతవీచి, అభిదాకృతి, ఐకాత్మ్యప్రకృతి, నిగమవచస్సిద్ధాంతము గురుమూర్తి అని యిట్లు సాక్షాత్కారింపజేయుచు యౌవనశృంగారాది విషయరసానుభవసామగ్రిని జ్ఞాన వైరాగ్యాది బ్రహ్మానందానుభవ సామగ్రిగా బర్యవసింపజేయుచు

"శివశివ పశ్యంతి సమం శ్రీకామాక్షీ కటాక్షితాః పురుషాః |
విపినం భవన మమిత్రం మిత్రం లోష్టం చ యువతి బింబోష్ఠమ్ ||

అని పరదేవతానుగ్రహమునకు ఫలమైన పరమ వైరాగ్యాతిశయమును బ్రకటించెను. ఐదువందల శ్లోకములుగల ఈ గ్రంథమందు ఒకానొక అనుపూర్వివిశేష మిట్లు కనబడుచున్నది.

ఒక శిశువు కన్ను మొదలయిన యింద్రియముల పాటవ మేర్పడుటకు ముందు మనోభావమాత్రముచే తన కోరిక నెట్లు భావించునో అట్లే ఆర్యా శతకమునందు భక్తశిశువుయొక్క మనఃప్రవృత్తిని అంబికాస్వరూపానుసంధాన సమర్థముగ నీ కవి స్పష్టపరచినారు. అది యీ శ్లోకమునందు సూచితము.

"అంతరపి బహిరపి త్వం జంతుతతే రంతకాంతకృదహంతే |
చింతితసంతానవతాం సంతతమపి తంతనోషి మహిమానమ్ ||

రెండవశతకమందు శిశువు కొంచెము గ్రహణశక్తి పెంపొందినమీదట తన దాపున వర్తించు వస్తువుయొక్క దర్శనస్పర్శనాదులచే నానందింపగల్గును. అట్లే భక్త బాలకుడు మిక్కిలి క్రిందుగా దనకందుబాటులోనున్న జగన్మాతయొక్క నిరంతరధ్యానఫలమయిన పాదారవింద సందర్శనానందమనుభవించును. ఈ భావము —

"మరాలీనాం యానాభ్యసన కలనా మూలగురవే
దరిద్రాణాం త్రాణవ్యతికర సురోద్యానతరవే |
తమస్కాండ ప్రౌఢిప్రకటన తిరస్కారపటవే
జనోఽయం కామాక్ష్యాశ్చరణనలినాయ స్పృహయతే"

అను శ్లోకమున సూచితము. మనస్సు, జ్ఞానేంద్రియములయొక్కయు స్ఫూర్తి తరువాతనే వాక్ప్రసారము అగును. అట్లే ఆర్యాపాదారవింద శతకముల తరువాత తన ప్రేమకు స్థానమైన వస్తువును నిరర్గళముగ స్తుతింపనారంభించెను.

"పాండిత్యం పరమేశ్వరి స్తుతివిధౌ నైవాశ్రయంతే గిరాం
వైరించాన్యపి గుంఫనాని విగలద్గర్వాణి శర్వాణి ! తే |
స్తోతుం త్వాం పరిపుల్ల నీలనలినశ్యామాక్షి ! కామాక్షి మాం
వాచాలీకురుతే తథాఽపి నితరాం త్వత్పాదసేవాదరః||"

అని ఇట్లు స్తుతిశతకము చెప్పబడినది. లౌకికము లయిన విద్యలందు నేర్పరియగు నొకయువకుడు ఎట్లు లౌకికసంపదలను బడయనర్హుడగునో అట్లే యితఃపూర్వకృతస్తుతికి ఫలముగా భక్తుడు అంబికాకటాక్ష విశేషమును బడసి పరమజ్ఞానానుభవము వడయుటకు దగిన తేజఃపుష్టి మొదలయినవానికి పాత్రము కాగలడు. ఈ విషయము —

"అస్తం క్షణా న్నయతు మే పరితాపసూర్య
మానందచంద్రమస మానయతాం ప్రకాశమ్ |
కాలాంధకార సుషమాం కలయన్ దిగంతే
కామాక్షి కోమలకటాక్ష నిశాగమస్తే||"

అను నీ వర్ణనలచే కటాక్షశతకమునందు సూచింపబడినది.

లౌకికైశ్వర్య సంపూర్ణు డొకడు మంచివయసులో తానెట్లు శృంగార సుఖానుభవమునకు పాత్రు డగునో అట్లే దేవియొక్క పరమానుగ్రహపాత్రు డైనవాడు ఆ తల్లి మందస్మిత చంద్రికాయుతుడైన ఆనందచంద్రునివలె అలౌకిక నిరతిశయానందానుభవస్వరూపుడై ప్రకాశించును. ఈలాటి భావ ప్రణాళిక నీ మహాకవి గ్రంథసమాప్తిశ్లోకమునం దిట్లు ఆవిష్కరించెను.

"ఆర్యామేవ విభావయ న్మనసి యః పాదారవిందం పురః
పశ్య న్నారభతే స్తుతిం చ నియతం లబ్ధ్వా కటాక్షచ్ఛవిమ్ |
కామాక్ష్యా మృదులస్మితాంశులహరీ జ్యోత్స్నావయస్యాన్వితా
మారోహ త్యపవర్గసౌధవలభీ మానంద వీచీమయీమ్ ||"

సాధకుడు లోకోత్తరమైన యీ స్తుతిని బఠించుమాత్రమున నా క్షణము యీ మహాకవితో, నామీదట పరదేవతతోడను ఐకాత్మ్యానుభూతిని బడ సినట్టి స్థితి నందగలడు.

ఇతి
నారాయణస్మృతిః.

# మూ క క వి

శ్రీ కాఞ్చీ కామకోటి పీఠమందు పందొమ్మిదవ యాచార్యుల యిన వారు శ్రీమార్తాండ విద్యాఘనేంద్ర స్వాములవారు. వారిని సేవించి శ్రీ కామాక్షి దర్శన భాగ్యము పొంది పుట్టు మూగతనము వాసి యాయమ్మమీద నైదువందల శ్లోకములను 'మూకపఞ్చశతి' యను పేర రచించినవారు శ్రీమూకకవియను ప్రసిద్ధివడసిన మహానుభావులు. వీరు క్రీ|| శ|| 399–489 వరకు ఇరువదియవ ఆచార్యులుగ నా పీఠ మధిష్ఠించిరనియు 489 లో అనగా ధాతృ సం||ర శ్రావణపూర్ణిమనాడు గోదావరి తీరమందు సిద్ధిపొందిరనియు వినికిడియే కాని నిర్ధారణగ జెప్ప లేము. వీరి శిష్యులు మణిప్రభకర్తయైన రామిలుడు, హయగ్రీవవధ కర్తయైన భర్తృ మేంఠుడును నన్నదమ్ములు. మేంఠుడు బిల్హణునిచే రాజశేఖరునిచే స్తుతింపబడెను. బిల్హణు డీయనను కాశ్మీరప్రభువగు మాతృగుప్తుని యాస్థాన మందున్నట్లు పేర్కొన్నాడు. ఇతడు రామచరితమును 100 సర్గల కావ్యము రచించెనట.

శ్రీ శివాయ గురవే నమః

# ప రి చ య ము

అనంతశక్తియైన పరదేవతయనుగ్రహమునకు పాత్రులైనవారికి లోకమం దసాధ్యమైన పని లేదు. మూకకవి ఆర్యాశతకమందు ఇట్లు పేర్కొన్నారు.

**మూకోఽపి జటిల దుర్గతి శోకోఽపి**
**స్మరతి యః క్షణం భవతీమ్‌।**
**ఏకో భవతి స జంతుః**
**లోకోత్తర కీర్తిరేవ కామాక్షి !**

మూగవాడుగాని చిక్కువీడని కష్టములకు గుఱియైనవాడుగాని క్షణకాలము నిన్ను దలచినవాడు లోకోత్తరకీర్తిశాలి యగును అని మూకకవి పుట్టుమూగయై కామాక్షీకరుణకు పాత్రమై బ్రహ్మానందరూపిణి యగు నా దేవిని యైదువందల శ్లోకములచే స్తుతించిరి. ఈ స్తుతిగ్రంథము మూకపంచశతి యనుపేరనొప్పుచున్నది.

బ్రహ్మానందానుభవ మన్నది విరక్తుల విషయమని యందఱకు దెలియును కాని యీ గ్రంథములో పరమేశ్వరీ పరమేశ్వరుల శృంగార వర్ణనాత్మకముగా కవియొక్క యానందానుభవము కనిపించుచున్నది. ఇది యెట్లు అను సందేహము సహజముగా కలుగును. శృంగారాది విషయసామగ్రి జ్ఞానవైరాగ్యాది బ్రహ్మానందానుభవ సామగ్రిగా పర్యవసించు ననునది సిద్ధపురుషుల సిద్ధాంతము. అతిరహస్యము, బ్రహ్మాండపురాణాంతర్గత లలితోపాఖ్యాన ప్రారంభమున వ్యాసభట్టారకులు మంగళాచరణము గావించుచు నందీ రహస్యమించుక వెల్లడించినారు.

**అస్తు వః శ్రేయసే నిత్యం వస్తు వామాఙ్గ సున్దరమ్,**
**యత స్తృతీయం విదుషాం తురీయం త్రైపురం మహః.**

లలితోపాసకులకు తృతీయమగు కామపురుషార్థము తురీయముగా (మోక్ష పురుషార్థముగా) పర్యవసింపజేయునట్టి వామాఙ్గ సుందరమైన తేజస్సు (త్రిపుటికి పూర్వసిద్ధమైన వస్తువు) మీకు మోక్షరూపమైన శ్రేయస్సును అనుగ్రహించుగాక. ఇది వ్యాసులవారి యాశీస్సు. ప్రకృత మీ గ్రంథమున కవి శ్రీమాతను కామాక్షిని కారణపరచిద్రూప శృంగారాద్వైత తంత్ర

సిద్ధాంతము కైవల్యానందకందము అమ్నాయరహస్యము ఉపనిషదరవిందకుహర మధుధార ఇత్యాది పదములనే వర్ణించిరి. మఱియు

కామపరిపన్థి కామిని కామేశ్వరి కామపీఠ మధ్యగతే|
కామదుఘా భవ కమలే కామకలే కామకోటి కామాక్షి ||

అను శ్లోకమున పరదేవత విరక్తునికి మాత్రమే స్వాధీన యని వర్ణించిరి. కామవిరోధి యగు కామేశ్వరుని కామించినది కావున శృంగారాది విషయకామన గలది కాదు. కామమున కీశ్వరి, కామముల నిచ్చునది, జగద్రచనారూపమైన కామకలా స్వరూపము. కావున నాదికారణము. గ్రంధము మొదటి శ్లోకమున మొట్టమొదటగా పేర్కొన్న కారణపరచిద్రూప, బ్రహ్మవిద్యారూపిణి యని ఆ యమ్మ రూపము ప్రస్తుతింపబడినది. ఈ శ్లోకములో జగజ్జనని బ్రహ్మత్వభావన చెదరకుండుట కాంద్రీకర్త యధాతథముగనే యనువదించుట గమనార్హము. ఈ యాదికారణము లోకవిలక్షణము లోకోత్తరము నగుటచే నిందు కార్యకారణములకు సామ్యవైషమ్యములు రెండును గోచరించును. లౌకికమైన స్త్రీపురుష ప్రవృత్తి వైషయికము, అలౌకికమైన యీ శక్తి శక్తుల యైక్యము నిర్విషయము. కేవల బ్రహ్మరూపము, తంత్రయోగసిద్ధాంతముల ననుసరించి శక్తి సుషుమ్నానాడి (బ్రహ్మనాడి) ద్వారమున అకులకుండలినీరూపుడగు శివుని పొందు స్వభావము గలది. ఇట్టి మంత్రశాస్త్ర రహస్యములు కులపర్వతసార్వభౌమసర్వస్వ మిత్యాదులందు కవి సునిపుణముగ ధ్వనింపజేసినారు. అనువాదకులు గూడ కులపర్వతేశ్వరు మహైశ్వర్యంబు సర్వస్వమున్ అని మూలమునే పలికిరి. ఇందు ముఖ్యమైన మంత్రాక్షరములను విషయానుగుణముగా మూకకవి పొదివిరి.

ఐశ్వర్య మిన్దుమౌళే రైకాత్మ్యప్రకృతి కాఞ్చి మధ్యగతమ్|
ఐన్దవకిశోరశేఖర మైదంపర్యం చకాస్తి నిగమానామ్|| ఆర్యా. 7 శ్లో.

ఇందు ఐకారము నాలుగుమార్లుపయోగింపబడినది. దీని తెనిగింపులో గూడ నా రహస్యము చెదరకుండుట విశేషము.

ఇందు కిశోరశేఖరున కెక్కటి యొక్కటియైన భావమై
పొందిన నైజభావమది పొల్పగు జాబిలిరేఖ శేఖర
మ్మందునఁ జెక్కికొన్న నిగమాగము పర్యవసాన మైన యా
యందము చూడఁజూడ నిదె యందమనన్ దులకించె ముందటన్.

28 వ శ్లోకములో ఏకారము ఐదుమారులు, 13 వ శ్లోకమం దాకారము నాలుగు సారులు దొరలినవి. ఇందలి రహస్యములు మంత్రశాస్త్రజ్ఞులందుకొన వలసినవి. మూకకవి పరదేవతను పలుతీరుల భావించెను. పలుతీరుల దర్శించెను కూడ. ఆ భావన విషయగౌరవమున కనుకూలముగ నున్నది. చూడుడు ఆర్యా. 99 వ శ్లోకము, అమ్మవారి యధరబింబము బింబమువలె (దొండపండువలె) నున్నదనుటకు చేసిన యద్భుత కల్పనము. దానికి తగినట్లున్నది శ్రీ దీక్షితుల యాంధ్రీకరణము.

**కలికీ నీ కలమంజుభాషణము లాకర్ణించి యూహించి నీ**
**గలమున్ పంజరమంద యున్నదని చిల్కాన్ దాని బట్టంగఁ దా**
**నిలిపెం గావలె శంబరారి యెఱుగాన్ బింబంబు మేల్ డంబరం**
**బలరన్ నీ రదనాంబరం బదిగదా అంబా ! కదంబప్రియా !**

మూలమందలి యనుప్రాససౌందర్యము నినుమడించిన దీ యనువాదము.

ఆర్యాశతకము పదునెనిమిదవ శ్లోకమున పంచభూతములు సూర్యచంద్రులు హోత యనునవి శివుని యష్టమూర్తులుగ ప్రసిద్ధములైనవానిని కామాక్షీ స్వరూపములుగ కవి పేర్కొన్నారు. అందులో శివాశివుల కద్వైతము (అభేదము) శాస్త్రసిద్ధమైన వస్త్వైక్యము సంపాదింపబడినది. ఈ గ్రంథమునకు కీలకమనదగిన ఆర్యాశతకమున కేవలము దేవీస్వరూపము భావితమైనది. మాటలురాని బాలుడు స్వరూపదర్శన మంది కవిత్వము వడసి దృష్టమైన రూపమును సౌందర్యదృష్టితో వర్ణించెను, అందాతని కున్న భౌతికభావన తొలగి యాధిదైవికస్థితి నందుకొని తుదకు కేవలాధ్యాత్మికమైన బ్రహ్మభావన కలిగినది. స్థూలరూపమందు అనగా పాంక్త స్వరూపమున నున్న ప్రకృతియందు నివృత్తి కళాదర్శనమై యా చూచిన రూపమే ఆర్యాశతకమందు స్తుతివిషయమైనది. ఈ మహాగ్రంథము నాంధ్రీకరించిన మహాకవి శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులవారు. వీరి కవిత్వమున వలయు సుగుణము లన్నియు బ్రోదికొనియున్నవి. అనువాదము కవులకు పరీక్షాస్థానము. మూలమున నున్న కవి భావనావిశేషమును గుర్తించి భాషాస్వాభావిక మాధుర్యమును జాతీయతను విడనాడక పొందైన పదముల ప్రయోగింపవలయును. అందును ఆంధ్రమున యతిప్రాసలకు లొంగవలయును. సిద్ధకవులు సహజపాండిత్యమున నైనయు కవిత్వము నాశ్రయింతురు. అంద్రప్రయత్నముగనే వారి సంస్కారవిశేషమున పదార్థములు దొరలును. అప్పుడాయా శబ్దము లాపాతరమణీయములై యర్థా

నుగుణములై తమతమ యలంకారముల దొడిగికొని యర్థగాంభీర్యమును పోషించుచుండును. శబ్దసంపత్తి కేవల శబ్దమాధుర్యము నవలంబింపక అర్థపోషకమైయుండుటచే శబ్దప్రధాన కావ్యమువలె నధమకక్ష్యను జేరక ఆలోచనామృతముగూడ యగుచుండును. సిద్ధులు కవులుగా ప్రసిద్ధి నొందక ఆచార్యస్థానము నలంకరించుటచే వాల్మీకి వ్యాస జగద్గురు శంకరులవంటి మహానుభావుల రచనల నాలంకారికులంతగా పట్టించుకొనరైరి. అవి కేవల మలౌకికస్థానము లగుటయే కారణము. ఇట్టి కవితకు ప్రత్యేకస్థానము కల్పింపబడినది, దుర్వాసోమహర్షి విరచితమైన ఆర్యాద్విశతి (శ్రీనగరవర్ణనము) ఆదిశంకర భగవత్పాదుల సౌందర్యలహరి వానికి చెల్లె లనదగిన మూకపంచశతియు నా కోవకు జెందినవే. ఇన్నిటి ననువదించిన శ్రీ దీక్షితులును గురుకృపచే నా సిద్ధకవుల గ్రంథముల పరిచయము వడసి యనువదించి యా పాకమును జవిగొని యనుభవించి తామును ఆ కక్ష్యనే ప్రవేశించిరి, దాని ఫలమే వారి గురుకృపాలహరి. ఈ నడుమనే రచించిన "గురుచంద్రదర్శన సాహస్రి" అను సంస్కృత స్వతంత్ర కావ్యమును. నారాయణీయ మను శ్రీకృష్ణ భాగవత సంగ్రహ కావ్యమును ఆర్యాద్విశతిని యనువదించి యనువాదములోని మెలకువను గడించిరి. పాదారవిందశతకమం దిరువది యవశ్లోకములోని శ్లేషకు చేసిన యనువాదమిది.

అనయమ్మున్ నయనమ్ముటుల్ శ్రుతులయత్యంతంబులం దాకియిం
పెనయన్, స్వచ్ఛతచే సమత్వయుతిచే నింపౌ ద్విజశ్రేణి చా
యను దా నయ్యధర మ్మటుల్ మసలి, ముక్తాలంబమై యొప్పి సు
స్తన యుగ్మమ్మటు, వొల్చు నీ పదము భక్తప్రాప్యమున్ గొల్చెదన్.

ఇందు దేవి చరణమునకు నయనము అధరము వక్షోజయుగము నను మూ డుపమానము లీయబడినవి. వానివాని విశేషములం దున్న శ్లేష పోకుండ ననువాదము స్వతంత్రరచన యట్లు సాగించిన శ్రీ దీక్షితులవారు ప్రశంసార్హులు. దీని యర్థమును గ్రంథమున జూడవచ్చును. కొన్నిచోట్ల పద్యపూరణమునకు మూలమున లేని విషయములు చేర్చిన జాడలున్నవి. అయిన నవి మూలమునకు రంజకములుగనే యున్నవి.

ఎత్తిన నిందు జహ్నసము; ఇందు కిరీటున కెత్తికొన్న సం
పత్తి, విశిష్ట పౌష్టికవిపాకము, పౌష్పశర మ్మొకింత క
న్నెత్తి కనుంగొనం గలిగె నిచ్చటఁ గంపతటమ్ము నందు మా
కిత్తటి నెత్తటిన్ దల పొకించుకయున్ జొరరాని సత్తయై.

ఆర్యా. శ్లోక. 24

ఇందు నాల్గవ పాదమందలి భావము మూలమందు లేదు. లేకు న్ననేమి కామాక్షీదేవి తలపునకు గూడ నందని సత్తాస్వరూపిణి యను భావము తనకు దర్శనమిచ్చినదని యుప్పొంగుట కెంతో పోషకమగుచు కాంచీక్షేత్ర మహిమను బెంపొందించినది. మఱియు నిచట "అభ్యుదయం కిఞ్చి దర్ధశశిమౌళేః" అను దానికి ఇందు కిరీటున కెత్తికొన్న సంపత్తి యని ఆత్తయౌవన మనుమాటకు ఎత్తిన నిండు జవ్వనము అను తెలుగు నుడికారపు సొంపుల నడుమ పౌష్పశరం అను మూలములోని తద్ధితాంత ప్రయోగములోని యందము విడువలేక యథాతథముగ నదే పదమువాడు టలోను ననువాదకుల మెలకువ విశదమగుచున్నది. శ్వేతా మన్దరహసితే అను మూకకవిశ్లోకము సంస్కృతసారస్వతమునకే యొక విశిష్ట రసస్థానము. తదనువాదము మంచి పరీక్షా ఘట్టము. దాని తెనిగింపు సొంపు చూచి తెలియవలసినదే. ఇట్టి వెన్నో మెలకువల జూపబూనిన గ్రంథ ముద్గ్రంథ మగునని విరమింతును.

ఈ గ్రంథ పారాయణ మపూర్వ ఫలప్రదము. ఇక దీనిని రచించిన కవిభాగ్య మేమనవలెను? ఆర్యాశతకమున చిన్మయశరీరిణి యగు నమ్మ శరీర సౌందర్యము వర్ణించుట వలన నీ కవికి విరక్తి జనించి నివృత్తి కలాస్వరూప ముదయించెను. అందులకు గుర్తు — "నిస్సరతి వదన కమలా ద్వాణీ పీయూషధోరణీ నిత్యమ్" ఈ శతకము పఠించినవారి వదన కమలమం దమృతధోరణియైన వాణి వెలువడునని భక్తులను దీవించుటలో స్వానుభవమునే యీకవి స్ఫురింపజేసినారు. ఇట్టి స్ఫూర్తి యీ గ్రంథమందు పలుతావుల నెత్తావుల జిమ్ముచున్నది.

గురుముఖ లబ్ధమైన విద్యయే సఫలమని యెన్నోమారు లీయన పేర్కొ న్నారు. అది వీరి యాచార్యులైన శ్రీ కామకోటి పీఠాధీశ్వర శ్రీ మార్తాండ విద్యాఘనేంద్ర సరస్వతీ స్వాముల యెడల మనలను విధేయు లను జేయుచున్నది. గురుసేవలో గురుపాదుకకు ప్రధానస్థాన మీయబడినది. అది యుపాసన యొక్క పరమావధి కావున తుది శతకమున జనని పాదా రవిందముల నెత్తికొని తదుపాసనకు వాక్సిద్ధి (కవితాస్ఫూర్తి) ప్రధానఫలమని యెన్నోచోట్ల చెప్పినారు. అట్టి కవిత్వము కేవల శబ్దార్థముల కూర్పు మాత్రమైన లౌకిక విషయము కాదు. అది నిజమైన క్రాంతదర్శనము. బ్రహ్మదర్శనమే. అట్టి దర్శనము శ్రీ మూకకవీంద్రులకు గలిగినది. కావున వారికి కవిశబ్ద మన్వర్థము. ఆర్యాశతకమందు గలిగిన నివృత్తికళ పాదార

విందమందు సుప్రతిష్ఠ గడించినది. అట్టిభూమిక తానందుకొన్న సూచనగ కవి ఫలశ్రుతి నిట్లు పేర్కొన్నారు.

ఈ కామాక్షి పదాంబుజ స్తుతిచయ మ్మెవ్వాడు లోకాన క
స్తోకాహ్లాద నిదానమైనది జపించుచున్ నిత్య మాతండు లో
కైకారాధ్యు డగున్ గవీంద్ర తిలకుండౌ నెల్ల భోగంబు లం
బా ! కాంచున్ పరచిత్స్వరూప పరిణామ బ్రహ్మమున్ దానగున్.

ఈ లీలన్ వరముల్ పరం బొసంగు నెంతేఁ బావనమ్మున్ స్వత
స్సౌలభ్యంబు పరాపరాత్మక చిదంశ స్ఫూర్తికిన్ దీప మా
మూల మ్మమ్మ దలంచి యీ తెలుగు సొంపుల్ నిండ గీర్తించినం
జాలున్ జాలును జాలుఁ జాలు జపయజ్ఞంబుల్ మహాయాసముల్.

ఈ పరదేవతాస్తుతికంటె జపాదులు బహుళాయాసము లని వాక్రుచ్చిరి. సోపానపరంపరగా తా నధిగమించిన యుపాసనాఫలము వ్యక్తమయినట్లు శ్రీకామాక్షీ కటాక్షపాత్రము తానైనట్లు గుర్తుగ నామె కటాక్షమును నుతించి శాంతికలా భూమిక నందుకొనిన తన స్థాయి యెఱుకపడ స్తుతి శతకమున శ్రీమాతను స్తుతించి చివర --

పాతేన లోచనరుచే స్తవ కుణ్డలాంశు
వీతేన శీతలయ భూధరకన్యకే మామ్.

అని తాను శాంతిసౌధారోహణము చేసినట్లు తెలిపి యానంద పారవశ్యమున నమ్మవారి మందహాసమును బొంది యపవర్గానందస్వరూపమే తానైన జాడలను వ్యక్తము చేసినారు. ఇట్ల లౌకికానందమును పొందినవారున్మత్తునట్లు బాలుడట్లు పిశాచము పట్టినట్లు కన్పింతురు. ఆ విధముగ క్రోధభట్టారకులుగ ప్రసిద్ధినందిన పరదేవతావరివస్యాసార్వభౌములైన శ్రీ దుర్వాసో మహర్షులు రచించిన ఆర్యాద్విశతి చివర ఫలశ్రుతిలో వారు నిట్లు మహాద్భుతముగ బేర్కొన్నారు.

లలితాయా స్తవరత్నం లలిత పదాభిః ప్రణీత మార్యాభిః,
ప్రతిదిన మవనౌ పఠతాం ఫలాని వ్యక్తుం ప్రగల్భతే సైవ.

దీనికి దీక్షితుల యనువాదము :

లలితాస్తవ రత్న మ్మిది
యలతి లలిత పదనిగుంభ మార్యావృత్తా.

వలి పారాయణ సేయన్
గలుగు ఫల మ్మొకుకసేయు గల దావిడయే.

కామకోటి శ్రీవారు తమ శ్రీముఖములో :

"ఆర్యామేవ విభావయన్ మనసి యః" అను శ్లోకభావమును వివరించుచు నుపాసనయొక్క క్రమమును పేర్కొని యనుగ్రహించిన శ్రీముఖమును శ్రద్ధాభక్తులతో పరికించినచో నీ గ్రంథముయొక్క సంపూర్ణభావము హృదయమున కత్తుకొనును. శ్రీవారి భావమునే యనుసరించి నేను భంగ్యంతరములో శాంతికళామయమగు నివృత్తి ప్రతిష్ఠ విద్య శాంతి శాంత్యతీత భూమికా పంచకమును మోక్షసౌధారోహణసోపాన పరంపరగా లక్షించి యీ పరిచయమును రచించితిని. ఈ రీతిని భావించి యనువదించిన శ్రీ దీక్షితులుగారును శాంతిరూపమైన భూమికాపంచకము నధిరోహించి శ్రీ గురుకృపాలహరీ గ్రంథరూపమున శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ జగద్గురు స్తుతి సలిపి కృతకృత్యులై రనుటకు గ్రంథ ఫలశ్రుతి రూపమున జెప్పిన యీ క్రింది పద్యము నిదర్శనము.

భావింపం గని యార్య నెట్టయెదుటన్ బాదారవిందంబు సం
భావింపం గనుచున్ స్తుతిం జలిపి యాపై శ్రీ కటాక్షద్యుతిన్
సేవింపన్ నరుఁడెక్కు మందహసిత శ్రీ చంద్రికా కాంతితో
సావాసంబుగ ముక్తిసౌధ వలభిన్ స్వానంద వీచీకళన్.

నన్నీ గ్రంథమునకు పరిచయము వ్రాయ నియమించి భావింపజేసి ధన్యాత్ముని గావించినందుల కనువాదకుల కెంతయు కృతజ్ఞుడను.

ఉభయభాషా విద్యాప్రవీణ,

విజయవాడ. చివుకుల సుబ్బరామశాస్త్రి.

శ్రీ శివాయ గురవే నమః

# కమనీయ కవితాతపస్వి

# శ్రీ దీక్షిత కవి వర్యులు

వాల్మీకి వ్యాస కాళిదాస ప్రభృతులగు (తాత్త్విక) రససిద్ధులైన తాపస కవివరేణ్యుల యడుగుజాడలలో బ్రహ్మశ్రీ వేదమూర్తులు జగద్గురు కృపాత రంగితాంతరంగులునగు శ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షిత కవివరేణ్యులు కవితాతపస్విగా అర్ధశతాబ్దమునుండి సంస్కృతాంధ్రకవితారససిద్ధులై గద్య పద్యరచనా వ్యాసంగమున సరస్వతీ సమర్చనముతో సహృదయసమారాధన మొనర్చుచున్నారు.

వీరు కౌండిన్యసగోత్రులు. శ్రీ భోగేశ్వరసోమయాజులు శ్రీమతి రామలక్ష్మమ్మ అను దంపతులకు పుత్రరత్నముగా జన్మించి తమ పూర్వ పుణ్యమునకు సఫలతను సంపాదించుకొనిరి. కీలకసంవత్సరము క్రీ॥ శ॥ 1908 లో దత్తాత్రేయ జయంతి వీరి జనన సమయము. పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా భద్రకాళీ వీరభద్ర క్షేత్రమైన పట్టిసము వద్ద తాళ్ళపూడి వీరి జన్మస్థలము. శాండిల్యసగోత్రులైన కంభంపాటివారికి వీరు దౌహిత్రులు. గౌతమసగోత్రులైన ఈమనివారి పట్టిని జేపట్టి వీరు గృహస్థులైరి.

## విద్యావ్యాసంగము

వీరికి పండ్రెండవ యేటనే పితృవియోగము జరిగినందున ముఖ్యముగా తమ మాతృచరణారాధనమున సంస్కృతాంధ్రసాహితీమకరందమాధురిని గ్రోల నారంభించిరి. పోలవరమున నెన్మిదవ తరగతివరకు నాంగ్లవిద్యనభ్యసించి 1922 లో ఆనాటి స్వాతంత్ర్యోద్యమ ప్రభావమున పాఠశాలావిద్యకు స్వస్తిచెప్పిరి. 'మా కొద్దీ తెల్ల దొరతన'మను గేయమును గానముచేసిరి. ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ విద్యార్థిగా కొద్ది కాలము పరీక్షా వ్యాసంగముతో 1932 లో మదరాసు విశ్వకళాపరిషత్తువారి విద్వాన్ పరీక్షలో ప్రథమశ్రేణియందు సర్వప్రథములైన పట్టభద్రులుగా విజయము నొందిరి.

**సాహిత్యాచార్యులు**

దక్షారామమునొద్దగల కోటిఫలిక్షేత్రవాసులైన గాయత్రీ మంత్ర సిద్ధులు బ్రహ్మశ్రీ దర్భా బైరాగిశాస్త్రిమహోదయుల పాదారవింద సన్నిధిని శ్రీ దీక్షితులుగారొనర్చిన కావ్యనాటకాలంకారాది సాహిత్యాధ్యయనము గురుకృపచే వీరికి కోటిగుణితముగా ఫలించినది.

**విద్యాగురువులు**

విజయవాడలోని ఆయుర్వేద కళాశాలలో ప్రధానాధ్యాపకులైన వైద్య వల్లభ సర్వతంత్రస్వతంత్ర శ్రీరాణీ వేంకటాచలపతి ప్రసాద చయనులు మహోగ్నిచిద్యజ్వ పూజ్యచరణచరణకమల భృంగాయమానులై (వీరు తురీయాశ్రమమున ప్రకృతము శ్రీశ్రీశ్రీ పరిపూర్ణ ప్రకాశానందభారతీ మహాస్వాములుగా స్వాత్మారాములై యున్నారు) పరదేవతానుగ్రహము నొంది విద్యాదీక్షితులై తమ దీక్షితనామసార్థకతను సంపాదించుకొనిరి.

**జగద్గురువులు — గురుజగత్తు**

శ్రీకాంచీ కామకోటి పీఠాధీశ్వరులైన ప. ప. శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ సంయమీంద్రులను — వారి కాశీయాత్రలో ఆంధ్రదేశమున గుంటూరులో చాతుర్మాస్యవ్రతములోనున్నపుడు దర్శనముచేసికొనిరి. ఆనాటి ప్రథమదర్శనమున శ్రీవారి కృపాకటాక్షామృతాభిషేచనానుభూతితో శ్రీ దీక్షితులుగారికి జగత్తు గురుకృపామయముగ దివ్యదర్శనమయ్యెను. అదియే వారి నవనవోన్మేషమైన బుద్ధిలో నిత్య నూతన యౌవనోన్మీలనము నొందుచు ప్రత్యక్షరరసాస్వదమగు వారి కవితావిపంచిలో సరస్వతీ పాదమంజీరమధురనాదముగ మనకు ప్రస్ఫుటమగుచుండును. "సిద్ధః కవీనాం కవితైవ యోగః" అని ఆనాడు వారు పొందిన శ్రీవారి ఆశీస్సే నాటినుండి నేటికి వారి కవితాతపస్సునకు జీవనాడిగానున్నది.

**ఉద్యోగము**

వీరు తమ 18 వ ఏటనుండి మూడు సంవత్సరములు స్వగ్రామమున కరణీకము చేసిరి. నాల్గేండ్లు పోలవరంలోను, 1935 నుండి 1966 వరకు విజయవాడ మునిసిపల్ హైస్కూలులోను పండితులుగా పనిచేసిరి, 1967 లో కొత్తగూడెములోను, 1968 దాక భీమవరంలో సంస్కృత కళాశాలలో

అధ్యాపకులుగను, 68 నుండి 74 వరకు కొవ్వూరులోని ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ సంస్కృత కళాశాలలో ఆచార్య పదవిని నిర్వహించి ప్రకృతము వృత్తిచే విశ్రాన్తులుగా నున్నారు.

గ్రంథరచన

ఇరువదవ సంవత్సర మీడులో మాళవదేశాధిపతి మంత్రియైన దేవేశ్వర మహాకవి కృతమైన "కవికల్పలత" అను గ్రంథము నాంధ్రీకరించి ప్రచురించిరి. 1936 లో భాగవత మాహాత్మ్యమును పద్యకావ్యముగా రచించి వేంకట్రామ అండ్ కో వారిచే ప్రచురింపఁజేసిరి.

1936 నుండి 1945 మధ్యలో వీరు "వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం" అనిన సూక్తికి ఆలంబమైన వ్యాస భగవానుని అష్టాదశ పురాణ మహాసముద్ర మథనము జేసి అందు పదకొండు మహాపురాణములను తెలుగున గద్యగ్రంథములుగా నిర్మించి కవులకు నికషోపలమైన గద్యరచనమున సిద్ధహస్తులుగా ఖ్యాతి నార్జించిరి. ఈ పురాణములను వేంకట్రామ అండ్ కో వారు ప్రచురించిరి. వేటపాలెము సారస్వత నికేతనమునకు స్వర్ణోత్సవము జరిగిన సందర్భములో "మంజీరము" అను నొక చిన్న మృదుమధుర స్వతంత్ర ఖండకావ్యమును రచించి సరస్వతికి కాన్కవెట్టిరి. సహజ పండితుడైన పోతనామాత్యుని శ్రీమదాంధ్ర మహాభాగవతమును పరిష్కరించి వేంకట్రామా అండ్ కో వారి ముద్రణమున కందించిరి. 1968 లో స్కాందపురాణము నాంధ్రీకరించిరి. వ్యాసమహా పురాణములను కేవలము తెనింగించుటయేకాదు లోతునకు దిగి అవి వేద తాత్పర్యము నుపబృంహణము చేయుచున్నతీరు — ఆధిభౌతిక, ఆధిదైవిక — ఆధ్యాత్మిక దృక్పథములతో నవి లోకముయొక్క నిత్యజీవితమునందు అనగా ధర్మార్థ కామ పురుషార్థ సంపాదనమందు, కడపటి లక్ష్యమైన మోక్ష పురుషార్థమునందును ఎట్లు పర్యవసించుచున్నవియు తెలుపుచు వీరు సుమారు నలువది సంవత్సరములు అగాధ పరిశోధనలు చేసిరి. అవి వెలుగులోనికి రావలసియున్నవి. అందులకు నాల్గు లక్షలు కావలయును. యావద్భారతమునందాకీర్తి దక్కించుకొనవలెనన్న ఆంధ్రవసుంధర కది యొకపెద్ద మొత్తము గాదు. దానివలన పొందు లాభము మాత్ర మంకెల కిముడునది కాదు. ఆ భాగ్యమెప్పటికో! 68 లోనే 'నవనీత' మను పేర శ్రీ కంచి కామకోటి జగద్గురువుల దివ్యబోధలను తేటతెనుగున తేటగీతములుగా రచించిరి. దుర్వాస స్సుకృతి కృతియైన 'ఆర్యాద్విశతి'ని ఆంధ్రీకరించి ఆంధ్రప్రదేశ్

హైకోర్టు జడ్జి బ్రహ్మశ్రీ గొల్లపూడి వేంకటరామశాస్త్రిగారి ఆలంబనమున దానిని ప్రచురించిరి. "భద్రాద్రి రామప్రభూ" వంటి పెక్కు శతకములు, ప్రజ్ఞానిధులు కళానిధులు వంటి చిన్న గద్య గ్రంథములును రచించిరి. వీరు రచించిన శ్రీ కాంచీ కామకోటి జగద్గురు దివ్య చరిత్రము 'ఆంధ్రప్రభ'లో ప్రతి ఆదివారము ధారావాహికము ప్రచురించబడినది. ఆంధ్రప్రభలో గ్రంథ సమీక్షకులుగా వివిధములగు ఉత్తమ గ్రంథములపై వీరి ఉత్తేజకరములగు విమర్శలు ప్రసిద్ధినొందినవి.

మూకకవి రచించిన "మూకపంచశతి" అను కాంచీ కామాక్షీ దేవీ స్తుతి కావ్యమును వీరాంధ్రీకరణ పద్యములతో తాత్పర్యమునుగూడ వ్రాసి ప్రచురించిరి.

**గురుకృపాలహరి**

ఈ పేరుతో వీరు 306 శ్లోకములుగల సంస్కృత స్వతంత్ర కావ్యమును సతాత్పర్యముగ రచించి ప్రచురించిరి. ఇది వీరి కృతిరత్నహారమున నాయక మణిగా వెలుగొందుచున్నది. ఇది జగద్గురువులైన శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వరులు శ్రీ మచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ సంయమీంద్రుల స్తుతి రూపకావ్యము. ఇందు గురుకృపారసము కావ్యామృతమైనది. జగత్తునంతను గురుకృపాంతరంగితము గావించి సర్వశ్రేష్ఠమైన ప్రకృతిశక్తి యాధారమున సర్వోత్కృష్టము బ్రహ్మానందాభేదమగు గురుకృపా దివ్యదర్శన మీ కావ్యము సాక్షాత్కరింపఁజేయును. ఇది శ్రీవారి పీఠాధిరోహణ స్వర్ణోత్సవ సందర్భ మున శ్రీచరణ సరోజ నివేదితమై జిజ్ఞాసూపకారకముగా లోకమునకు ప్రసాదింపబడినది. ఇది ఉన్నత శ్రేణికి చెందిన ఉత్తమోత్తమ సంస్కృత పద్య కావ్యము.

**నారాయణీయము**

కేరళ రాష్ట్రమున గురు – (బృహస్పతి) – వాయుదేవులచే ప్రతిష్ఠింప బడిన 'గురువాయూరప్పన్' ప్రసిద్ధినొందిన శ్రీ కృష్ణభగవానుని దివ్యలీలను వర్ణించుచు భాగవతసారముగా నూరు దశకములతో సహస్రశ్లోక పరిమితము సంస్కృతకావ్యమును రచించి కేరళ కవి శ్రీ నారాయణభట్టు తన పక్షవాతరోగమును నిర్మూలించుకొనెను. దానిని శ్రీ దీక్షితులుగారు పద్య కావ్యముగా నాంధ్రీకరించి సమూలముగ సాంద్రతాత్పర్యముగా ప్రచురించిరి. నాటి కేరళ గవర్నరు శ్రీ బూరుగుల రామకృష్ణరావుగారి ఆలంబనమున

నా కృష్ణ భగవానునికే దాని నర్పించి 'వాసుదేవస్సర్వ' మను సిద్ధస్థితిని సంపాదించుకొనిరి. వీరి యాంధ్రీకరణము కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, శ్రీ కుప్పా లక్ష్మావధాని ప్రభృతి కవిపండిత ప్రకాండుల స్తుతికి పాత్రమైనది.

## అముద్రిత రచనలు

తెనాలి రామకృష్ణకవికృత 'పాండురంగ మాహాత్మ్య వ్యాఖ్య', శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచితమైన 'ప్రబోధసుధాకర' మనెడి కృష్ణభక్తిప్రధానమైన గ్రంథమున కాంధ్ర పద్యానువాదము మున్నగునవి అముద్రితములు గలవు. 'శ్రీనాథీయ' మను శ్రీనాథ మహాకవి చరిత్ర మితివృత్తముగా గల స్వతంత్ర పద్యప్రబంధ మొకటిగలదు. ఇది స్వర్గీయ కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి కంకిత మీయబడినది. ఇట్లింకను వీ రపుడపుడు రచించిన వివిధ పద్య వద్య సంకలనాత్మకములైన గ్రంథములును నముద్రితములుగా నున్నవి. వీరి అముద్రిత రచనలలో జగద్గురు చంద్రదర్శన సాహస్రి" అను సంస్కృత పద్య కావ్యము శ్రీ జగద్గురువుల చరిత్రాత్మకముగ రచింపబడినది. అయ్యది స్వయంప్రకాశమైన ఇతివృత్త మహిత మగుటచే ముద్రణ ప్రకటనలకు సులభసాధ్య మగుటలేదు.

## సభలు — సమ్మానములు

శ్రీ దీక్షితులుగారి కంఠస్వరము మధురమైనది. వారు పద్యమును చదువుతీరు విలక్షణముగా నుండును. ఒకటి రెండు రాగచ్ఛాయలలో మాత్రమే అది నడచును. ఐనను ఆ మాధుర్యము సభను విశేషముగా రంజింప జేయును. వీరికి సన్మానములందు ప్రీతిలేదు. యావదాంధ్రము నేగాక దక్షిణ రాష్ట్రములలో శ్రీ కామకోటి జగద్గురువులు విజయంచేసి యున్నప్పుడును వీరనేక పండిత సభలలో బాల్గొని తమ సంస్కృతాంధ్ర కవితోపాయనములచే పండిత పామరుల నుత్తుతలూగించిన ఘట్టము లసంఖ్యాకములు. అనేక సందర్భములలో జరిగిన సన్మానములు విశేషముగ నున్నవి. బిరుదములన్నను వీరికి వైముఖ్యము మెండు. ఐనను వీరి కవి యెవ్వియు తృప్తిగాని, ఆనందమునుగాని గలిగింపవు. అజరామరమగు తమ కవితామృత మనుపానముగా జేసికొని వీరు నిరంతరము నాస్వాదించు జగద్గురు భక్తి రసాయనమే వీరి నిత్యనూతనోత్తేజమునకు, నానందమునకు మూలకందము.

రాష్ట్రీయోపాధ్యాయ పండితపరిషత్తు నిర్వాహకులుగా ఉపాధ్యాయ పండితుల యోగక్షేమములకై వీరు కృషిచేసిరి. ఆంధ్రప్రదేశ్ విద్యాపరిషత్కార్యదర్శిగా దక్షతతో నా పదవిని నిర్వహించిరి.

కవితావ్యాసంగములేని క్షణమైన వీరి జీవితమున మనము దర్శింపలేము. వారితో సంభాషణము నిత్యనూతనమై ఆనందసంధాయకమగుచుండును. వారి ఉత్సాహశక్తి ఎదుటివారిని మంత్రముగ్ధుల నొనర్చుచుండును. వారి కవితా వనిత రసజ్ఞుల దృష్టికొక విశ్వసమ్మోహనాస్త్రమై విరాజిల్లుచుండును. వీరి చాటుపద్యరచన లసంఖ్యాకములు గలవు. అందు మచ్చునకు — ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారిని నాటి మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి పదవినుండి దింపినపుడు వీరు ఆంధ్రపత్రికలో వ్రాసిన పద్యమిది — "అది ప్రకాశంబు తెలుగువా డవ్వెలుంగు | వలన గనువిప్పె నవ్వేడి వెలుగు నోర్వ | లేము వద్దని యేడ్చెదరేల దాన | వాన కురియదు పంటలు పండ వింక." చక్కని కావ్య మర్యాదాశోభితమైన ఈ కవితాఖండిక ఎంతగ సహృదయ హృదయాహ్లాదియై నాటునో స్పష్టమగుచున్నది గదా! అట్లే మదరాసు రాజ్యాంగ తేజోమండలమను పేర నాటి రాజగోపాలాచారిమంత్రివర్గమును నవగ్రహమండలముగా పోల్చి వ్రాసిన పద్యములు మున్నగునవి నాటి దినపత్రికలలో ప్రముఖస్థానము నాక్రమించినవి. ప్రతి రాజకీయ పరిణామమునందును వీరి పద్యము లుత్తేజము చేయని సందర్భము లేదనియే చెప్పవచ్చును.

**కుటుంబము**

విద్వత్పౌరాణికులుగ, పండిత ప్రకాండులుగను ఆంధ్రదేశమున మదరాసు ప్రాంతముననను విశేష యశస్సు నార్జించిన బ్రహ్మశ్రీ వీరభద్రశాస్త్రి గారు, రిటైర్డు తహసీల్దారు బ్రహ్మశ్రీ సూర్యనారాయణగారును శ్రీదీక్షితులుగారికి తమ్ములు. ఆరుగురుకుమారులును నల్గురు కుమార్తెలును మనుమలు మనుమరాండ్రతో తామరతంపరయైన వీరి కుటుంబము సర్వజగద్రక్షకమైన జగద్గుర్వనుగ్రహమును సర్వదా పొందుచు వృద్ధినొందుచున్నది.

**స్వభావము**

శ్రీ దీక్షితులుగారు స్వతంత్రస్వభావులు, వారి మనసు మిక్కిలి మెత్తనైనది. "హితం మనోహారి చ దుర్లభం వచః" అనినట్లు వీరెల్లపుడు దుర్లభవాక్కులకై వెదకికొనుచు లోకహితమును సంపాదించుకొను

టకై శ్రమపడరు. కొంచెము పెళుసుగానున్నను సత్యమును పల్కుటకు వెనుదీయరు. అన్యాయమునకు అసత్యమునకు లొంగి తాత్కాలికముగ ఎదుటివారిని మెప్పించుటకైనను ఓటమికి సిద్ధపడరు. ఒకప్పుడు వారి విజృంభణము వేడిగాడ్పువలె నున్నను అది సహస్రకిరణకాంతి సంకాశమే గాని అగ్నితప్తముగా మాత్ర మెన్నటికినిగాదు. అన్నిటికంటెను వారిలో రాకాసుధాకరశరచ్చంద్రికల వెదజల్లెడి దివ్యానుభూతిగల సన్నివేశము ఒకటి గల్గుచుండును. అది శ్రీ కాంచీకామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ సంయమీంద్రుల పాదారవిందసంస్మరణము. అపుడు వారి శిరస్సు అవనతమగును. కన్నులనుండి బాష్పబిందువులు రాలును. మేను చెమర్చును. మనస్సు ద్రవించును. కంఠధ్వని రుద్ధ మగును. క్రమముగా ముఖమున మందస్మిత మంకురించును. ఇది దీక్షితులుగారి స్వభావము. వా రాకృతిగొన్న గురుభక్తి.

వీరి కవితాగుణగణప్రశస్తికిగాని వానిసుదీర్ఘ పరిశీలనకుగాని ప్రస్తుతాంశమున తావులేనందున తత్సుధాసేచనానుభూతితో రసజ్ఞు లట్టిప్రయత్న మొనర్తురని విశ్వసించుచు విరమించుచున్నాను.

శ్రీ దీక్షితులుగారి అకారణకరుణకు అవ్యాజములైన యాదరాభిమానములకు అమోఘములైన యాశీస్సులకు పాత్రమైన నేను స్థాలీపులాకన్యాయమున వ్రాసిన ఈ నాల్గుమాటలలోని గుణములను గ్రహింప విజ్ఞుల వేడికొందును.

అస్మద్గోత్రం వర్ధతామభివర్ధతామ్

స్వస్తి శ్రీః

విజయవాడ–2 — నుదురుమాటి వేంకట రమణ శర్మ,
15–2–1977 — పండితుడు,
C.V.R.G.M.H. School, Vijayawada–2



# మూకపంచశతి

## ఆర్యాశతకము

కారణపరచిద్రూపా కాంచీపురసీమ్ని కామపీఠగతా
కాచన విహరతి కరుణా కాశ్మీరస్తబకకోమలాంగలతా||

ఒకకృప చిత్స్వరూపము అహో! పరదేవత కామకోటిపీ
ఠిక విహరించుచున్నయది ఠీవిగఁ గుంకుమపూవుగుత్తిపో
లిక నునుమేనుతీవ హవళింపఁగఁ గాంచిపురమ్ములోపలన్
సకలచరాచరాత్మక విశాల జగద్రచనాది హేతువై.

సృష్ట్యాదికారణమయిన పరతత్త్వము కేవలజ్ఞానస్వరూపము కుంకుమపూగుత్తివలె నెఱ్ఱనై మృదువైన లతవంటి శరీరముగలదియు నగు నొక కృప (కామాక్షియనుట) కాంచీక్షేత్రమున విహరించుచున్నది. ఈ స్తుతియందంతట ఆగమయోగసంకేతార్థ సమృద్ధి గలదు. ఉదాహరణకు:- ఇచట కాంచి మూలాధారము. ఇందు విహరించుశక్తి కుండలిని. తద్రూపగా కామాక్షి భావిత యగుచున్నది. గ్రంథమందంతట నున్న యిట్టి రహస్యములను భావుకులు భావింతురుగాక!

**కంచన కాంచీతిలకం కరధృత కోదండ బాణ సృణి పాశమ్**
**కఠినస్తనభర నమ్రం కైవల్యానందకంద మవలంబే||** ౨

ఒక కాంచీ తిలకాయమానమగు రూ పొప్పారు నల్వేతులం
దొకవిల్లమ్ములు పాశ మంకుశముఁ జెల్వొందంగఁ గైవల్యనా
మక మానందము మూలకంద మది శుంభత్కుంభికుంభాభ పీ
నకుచాభోగవినమ్రమైన యొక యంద మ్మాశ్రయింతున్ మదిన్.

నాల్గుహస్తములందు వరుసగా విల్లు బాణములు అంకుశము పాశమును ధరించినదై కఠినకుచభారముచే వినమ్రమై కాంచీనగరభూషణమై మోక్షానందమునకు మూలకందమైన యొకానొక వస్తువును నా దిక్కుగ తలచుచున్నాను.

**చింతితఫల పరిపోషణ చింతామణిరేవ కాంచినిలయా మే**
**చిరతర సుచరిత సులభా చిత్తం శిశిరయతు చిత్సుధాధారా||** 3

అది చింతామణి చింతితార్థఫలమీయన్ బ్రాజ్మహాపుణ్య సం
పదచే నొయ్యనఁ జేతికందెడి మహాభాగ్యమ్ము కాంచీపురీ
సదనాంతఃస్థిత చంద్రికాకళిక స్సాక్షా చ్చిత్సుధాధార నా
హృదయ మ్మెప్పుడుఁగూడఁ జల్లఁబఱచున్ హేరాళముగ్ధాకృతిన్.

కోరిన కోర్కెలెల్ల నించు చింతామణి బహుజన్మార్జిత పుణ్యముల కందుబాటగునది కాంచీపురవాసినియునైన యొక జ్ఞానామృతధార నా మనసును జల్లబరచుగాక!

**కుటిలకచం కఠినకుచం కుంద స్మితకాంతి కుంకుమ చ్ఛాయం**
**కురుతే విహృతిం కాంచ్యాం కులపర్వతసార్వభౌమ సర్వస్వమ్||** ౪

కౌటిల్యమ్ము కచమ్ములం గుచములన్ గాఠిన్యమొప్పంగ నె
ప్పాటన్ గుంకుమవన్నె మేనిసొబఁగై వాలారు లేనవ్వులో
నీటుల్ మల్లెల మొల్లలం గెలువఁ గాంచీఖేలనోత్సాహముల్
వాటించున్ కులపర్వతేశ్వరు సమగ్రైశ్వర్య సర్వస్వముల్.

వంకరలు దిరిగిన జుట్టు, బిగువైన చనుకట్టు, మొల్లలవంటి చిఱునవ్వు, తళుకు కుంకుమపూవువంటి నేమ్మేనిసొలువును గలదియై కులపర్వతసార్వభౌముని సర్వైశ్వర్య సమృద్ధి కాంచియందు విహారము సేయుచున్నది.

**పంచశర శాస్త్రబోధన పరమాచార్యేణ దృష్టిపాతేన**
**కాంచీసీమ్ని కుమారీ కాచన మోహయతి కామజేతారమ్||** ౫

అరయంగం గుసుమాస్త్ర శాస్త్రసురహస్యార్థావబోధమ్ము నన్
బరమాచార్యకమౌ నపాంగసరణిన్ బంచాస్త్రునిం గెల్చు నా
బిరుదున్ మోహమునందు ముంచుచుఁ గడుం బిర్వీకుగావించు సుం
దరి కాంచీనగరీ విహార పరమానందాదృతిన్ గుల్కెడిన్.

కామశాస్త్రమును బోధించు పరమాచార్యమూర్తియైన కటాక్షముతో నొక బాలిక కాంచీనగరమునందు కాముని జయించిన జగజెట్టిని మోహపెట్టుచున్నది, తృతీయ పురుషార్థమైన కామమును తురీయమైన మోక్షపురుషార్థముగా బర్యవసింపజేయునది కామాక్షి అమ్మవారని భావము.

**పరయా కాంచీపురయా పర్వతపర్యాయ పీన కుచభరయా**
**పరతంత్రా వయ మనయా పంకజసబ్రహ్మచారి లోచనయా||** ౬

తమ్ములకున్ సత మ్మనుఁగుఁదమ్ములు గన్నులుగల్గు కన్నె శై
లమ్ముల కీడుజోడగుచు లక్షితమౌ కుచభారమొప్ప నం
దమ్ముల కిక్క యొక్కపరదైవము కాంచిపురాధిరాజ్ఞి యా
యమ్మ కధీనమైన బ్రతుకై బ్రతుకం గనినార మియ్యెడన్.

పర్వతములకు బర్యాయములయిన వలుదపాలిండ్లబరువుతో పద్మములకు నీడు జోడులగు కన్నులతో నలరు కాంచీపురవాసిని యగు నీ పరదేవతచే మేము మైమఱచి యున్నాము.

**ఐశ్వర్య మిందుమౌళే రైకాత్మ్యప్రకృతి కాంచిమధ్యగతం**
**ఐందవకిశోర శేఖర మైదంపర్యం చకాస్తి నిగమానామ్||** ౭

ఇందుకిశోరశేఖరున కెక్కటి యొక్కటియైన భావమై
పొందిన నైజభావ మది పొల్పగు జాబిలిరేఖ శేఖర
మ్మందునఁ జెక్కికొన్న నిగమాగమపర్యవసానమైన యా
యందము చూడఁజూడ నిదె యందమనం దులకించు ముందటన్.

ఇందుశేఖరుని ఏకాత్మభావ స్వభావమైన యైశ్వర్యము బాలేందుశేఖరము (చిచ్చంద్రమండలాధిష్ఠాత్రి) వేదములయొక్క సిద్ధాంతార్థమునైన వస్తువు కాంచీనగర మధ్యమున భాసిల్లుచున్నది. పరదేవతామంత్రములో ఐకారముయొక్క పరమతాత్పర్య మీశ్లోకమున సూచితము.

**శ్రితకంపాసీమానం శిథిలిత పరమశివధైర్య మహిమానం**
**కలయే పాటలిమానం కంచన కంచుకిత భువనభూమానమ్||** ౮

భువనము లంగరక్షయయి పోషణసేసెడి పూర్ణభావ మై
భవమది శంభుధైర్యము ప్రభావము లోబిగువున్ సడల్చుచున్
దవిలి చరించి కంప దరిదాపుల నింపును సొంపు నింపు నా
ప్రవితతరక్తిమం బరమరక్తి మదిం దలపోయుచుండెదన్.

పరమశివుని ధైర్యముబిగి సడలింపజేయునట్టిదియు, సకల భువనాంతరమైన పూర్ణవస్తువును, లేదా భువనములకు కంచుకమువలె రక్షకమునైనదియు కంపాతీర సమాశ్రయమునైన యొక యెఱుపును రక్తితో భావించెదను.

**అదృత కాంచీనిలయా మాద్యా మారూఢ యౌవనాటోపాం**
**ఆగమ వతంస కలికా మానందాద్వైత కందలీం వందే||** ౯

ఖ్యాతిగ నాగమోక్తిశిఖలందున నందముగుల్కు మొగ్గ క
ద్వైతముదమ్ము లేమొలక పైఁజివురాకున కప్పుడప్పుడే
బాతిగ నంకురించు నెలప్రాయపుఁ జిన్నెల వన్నెలాడికిన్
జేతులుమోడ్తు గాంచిపురసీమల వేడుక నాడుదానికిన్.

కాంచీనగర విహారమం దాదరముగలదియై, సమభివ్యక్తయౌవనాటోపము గలదియై, ఆనందరూపమగు అద్వైతతంత్రమునకు సారాంశమై ఆగమశిఖలందు (వేదాంతముల యందు) అలంకరించిన యొక చిన్ని మొలకకు మ్రొక్కెదను.

**తుంగాభిరామ కుచభర శృంగారిత మాశ్రయామి కాంచిగతం**
**గంగాధర పరతంత్రం శృంగారాద్వైత తంత్ర సిద్ధాంతమ్||** ౧౦

గంగాజూటునిపై మరుల్గొనినదై కాంచీపురప్రాంగణం
బుం గైసేసి సమున్నత స్తనభరప్రోత్తుంగశృంగారమై

శృంగార మ్మనుపేరి ద్వైతవిమతశ్రీతంత్ర సిద్ధాంతమై
సింగార మ్మొలికించు వైభవము నే సేవించెదన్ దిక్కుగన్.

ఉన్నతకుచమండలముచే సింగారింపబడి గంగాధరునియందు మనసుంచి కాంచీ నగరమధ్యమం దధివసించు శృంగారరసస్వరూపమైన అద్వైతశాస్త్ర పరమసిద్ధాంతమును (సారాంశమును) ఆశ్రయించెదను. శాంతరసపర్యవసన్నమైన శృంగారరసమే పరదేవత యొక్క స్వరూపమని యిచట సూచింపబడినది.

**కాంచీ రత్నవిభూషాం కామపి కందర్ప సూతి కాపాంగీం**
**పరమాం కలా ముపాసే పరశివ వామాంకపీఠికాసీనామ్॥** ౧౧

పరమవిలాసభాసుర మపారకృపారసపూరమౌచు నా
స్మరు మఱలం దనంతఁ గనఁజాలు నపాంగవిలాసమొప్ప న
బ్బురముగఁ గాంచిరత్నమయభూషణయై యలరారు దేవి య
ప్పరమశివాఙ్కపీఠి నిలువంగను మేల్కళ గొల్తు నిచ్చలున్.

అద్భుతవిలాసములతో, అపారకృపారసముతో మన్మథుని బ్రసవించు కటాక్షములతో గాంచీరత్నభూషణమై పరమశివుని వామాంక పీఠికయం దాసీనురాలగు నొకానొక పరమకళ నుపాసించెదను.

**కంపాతీర చరాణాం కరుణా కోరకిత దృష్టిపాతానాం**
**కేళీవనం మనో మే కేషాంచి ద్భవతు చిద్విలాసానామ్॥** ౧౨

అనుకంపాతటినీతటాంతసరణిన్ వ్యాపించి శ్రీకాంచిలో
ననుకంపారుచి మొగ్గవెట్టెడు కటాక్షాలోల సచ్చిద్విలా
సనికాయ మ్మొకయంద మాడుకొన నంచత్కేళికోద్యానమై
యనువౌఁ గావుత నాదు డెందము నితాంతానంద చాంద్రద్యుతిన్.

కంపాతీర విహారములు, కరుణారసముచే మొగ్గదొడుగు తళుకు జూపులు గలవి యునగు నొక చిద్విలాసములకు అనగా కామాక్షికి నా మనస్సు విహారవన మగుగాక! ఇచట కంపా శబ్దము ప్రథమ స్పందనమునకు గమకము. అక్కడినుండియే శక్తి విహారారంభము గనుక.

**ఆమ్రతరుమూలవసతే రాదిమ పురుషస్య నయన పీయూషమ్**
**ఆరబ్ధ యౌవనోత్సవ మామ్నాయ రహస్య మంత రవలంబే॥**

అల యేలమావి గున్న మొదలందు వసించుచు నాదిదేవు క
న్నుల కమృతంపుసోన యయి నూతననూతన యౌవనోత్సవ
మ్ములకు నిధానమై శ్రుతిసమూహము మూలరహస్యమైన యా
పొలుపు తలంపులో నొలుకఁబోసెడి వాసికి నుల్లసిల్లెదన్.

ఏకామ్రవృక్షము క్రింద వసించు నాదిమపురుషుని చూపులకమృతమయి, నూతన యౌవనోత్సవముగలదైన యామ్నాయముల లోని రహస్యమును నాలో నవలంబము సేసికొందును, అకారము ప్రకృతి, మకారము జీవుడు, రేఫ ప్రకాశము కలిసి ఆమ్ర మయినది. లోకానుగ్రహముకొరకు ఆ మూడు తత్త్వములయందు అధిష్ఠించియున్నది పరదేవత.

**అధికాంచి పరమయోగిభి రాదిమ పరపీఠ సీమ్ని దృశ్యేన**
**అనుబద్ధం మమ మానస మరుణిమ సర్వస్వ సంప్రదాయేన||** ౧౪

శ్రీకాంచీపురసీమ నాదిమ మహాశృంగార పీఠాగ్రమం
దేకాగ్ర స్ఫుటయోగభూమికల మౌనీంద్రుల్ మహాయోగులా
లోకింపం గనవచ్చు నయ్యెఱుపు లోలో నిండుగైకొన్న యా
యాకారమ్మున నత్తుకొన్నది మదీయమ్మైన చిత్త మ్మిటన్.

కంచియందు పరమయోగులచే నాదిమహాపీఠమందు దర్శనీయమైయున్న ఎఱుపుయొక్క నిండుదనపు (అరుణిమ సర్వస్వముయొక్క) పరిపాటితో నా మన సత్తుకొన్నది.

**అంకితశంకరదేహా మంకురితోరోజ కంకణాశ్లేషైః**
**అధికాంచి నిత్యతరుణీ మద్రాక్షం కాంచి దద్భుతాం బాలామ్||** ౧౫

అత్తుకొనం గుచంబు లెద, నద్దిర బంగరు చేతిగాజు లం
దొత్తుకొనంగ, శంకరుని నొప్పఁగఁ గౌగిటఁదార్చు బాలికన్
జిత్తము వింతలన్ మునుచు చేడియ నంచిత నిత్యయౌవనో
దాత్తను గాంచిలోన నొకతన్విని జక్కనిదానిఁ గాంచితిన్.

బిగికౌగిలిలో మొలకచనులయొక్కయు కంకణములయొక్కయు గుర్తులను శంకరునిమేన ముద్రవేయుదానిని యెల్లప్పుడు నిండుజవ్వనముచే నలరు నొక వింతగొలుపు ముద్దరాలిని కాంచిలో గన్గొంటిని. "అంకిత శంకరదేహా" అనగా ఈశ్వరునిసత్తువ స్ఫురింపజేయుశక్తి యని రహస్యార్థము.

**మధుర ధనుషా మహీధరజనుషా నందామి సురభి బాణజుషా**
**చిద్వపుషా కాంచిపురే కేళిజుషా బంధుజీవ కాంతిముషా॥**

కాంచిపురాన నాడుకొను కన్నియ మంకెనపువ్వువన్నె వం
చించి చరించు చిన్మయ విచిత్ర శరీరిణి కొండకోన జ
న్మించిన కూనయై, పరిమళించెడి నమ్ములు తీపినించు వి
ల్లంచిత రీతిఁ దాల్చు నొకయమ్మ యొడిన్ విలసింతు ముచ్చటన్.

తియ్యని విల్లును, సువాసనలనించు బాణములును దాలిచి మంకెనపువ్వు రంగును దొంగిలించుచు (మంకెనపువ్వుకంటె ఎఱ్ఱనగు శరీరము కలదయి) గాంచీపురమం దాడుకొనుచుండు కొండరాచూలియైన యొక చిద్రూపముతో మురియుచున్నాను.

**మధురస్మితేన రమతే మాంసల కుచభార మందగమనేన**
**మధ్యేకాంచి మనో మే మనసిజ సామ్రాజ్య గర్వబీజేన॥** ౧౪

సముదంచద్రుచి నొప్పు మన్మథ మహాసామ్రాజ్య గర్వైకబీ
జముతోడన్ మధురస్మితాంకురముతోఁ జంచ త్కుచాభోగభా
రముతోడన్ మెలమెల్లనన్ నడచు సంరంభమ్ముతో గాంచిమ
ధ్యమునన్ వర్తిలు సొంపుతోన మురియున్ ధన్యంబు నా చిత్తమున్.

ఒత్తుకొనియున్నపాలిండ్లబరువుచే మెల్లనగు నడకయు, సొంపులుగులుకు చిఱునవ్వును గల మన్మథసామ్రాజ్యగర్వబీజమై కాంచీమధ్యమునందు వసించు శృంగార రసాధిదేవతతో నా మనసు వినోదించుచున్నది.

**ధరణిమయీం తరణిమయీం పవనమయీం గగన దహన హోతృమయీమ్**
**అంబుమయీ మిందుమయీ మంబా మనుకంప మాదిమా మీక్షే॥** ౧౫

ధారుణియై దివాకర సుధాకర బింబములై సమీరమై
నీరును నిప్పునై వెడద నింగియునై మఱి హోతృరూపమై
అరయ నమ్మలందఱికి నమ్మయుఁ దానయి యున్న యమ్మ గం
పా రమణీయతీర వనవాటిఁ జరించెడి కొమ్మఁ గాంచితిన్.

భూమి సూర్యుడు వాయువు ఆకాశము అగ్ని సోమయాజి ఉదకము చంద్రుడు అను అష్టమూర్తులు తానేయైయున్న ఆదిమజనని గంపాతీరమున గాంచుచున్నాను.

**లీనస్థితి మునిహృదయే ధ్యానస్తిమితం తపస్య దుపకంపమ్**
**పీనస్తనభర మీడే మీనధ్వజ తంత్ర పరమతాత్పర్యమ్॥** ౧౯

వర మీనధ్వజ తంత్రసారమగు తాత్పర్యమ్ము పీనస్తన
స్ఫురణమ్మున్ ముని రాజరాజ హృదయాంభోజాత లీనస్థితిన్
పరమధ్యాననిరూఢి సుస్తిమితమై వర్తించి కంపాతటాం
తరసీమన్ దప మాచరించు నొక సౌందర్యమ్ము నూహించెదన్.

మునుల హృదయమునందు లీనమయి ధ్యానమునందు నిలుకడగొని కంప యొడ్డునందపము సేయునది నిండుపాలిండ్ల గులుకునదియు నగు కామశాస్త్ర పరమ తాత్పర్యమును స్తుతింతును. (అంబికాచక్రమున కిదిగుర్తు).

**శ్వేత మంధరహసితే శాతా మధ్యే చ వాఙ్మనోఽతీతా**
**శీతా లోచనపాతే స్ఫీతా కుచసీమ్ని శాశ్వతీ మాతా॥** ౨౦

చల్లదనంబు చూపులను జక్కని తెల్లదనంబు నవ్వులన్
గల్లదనమ్ము నెన్నడుమునన్ గడునిండుదనంబు గుబ్బలం
దుల్లసిలన్ నిరంతరము నొప్పెడు నెప్పలకుప్ప మాటచే
నుల్లముచేతఁ బట్టువడకున్నది కన్నది యోర్తు కాంచిలోన్.

చిఱునవ్వున దెల్లనిదై నడుమున సన్ననిదై వాల్జూపుల జల్లనిదై చనుకట్టున నిండైనదై మాటకు మనసునకు నందనిదై కలకాలము తల్లియై యొకతల్లి యుల్ల సిల్లుచున్నది. అంబికాచక్రము జీవస్థితిని అతిక్రమించినస్థితి అది ఖేచరీముద్రాస్థానము. అక్కడ శ్వేత అచ్ఛమైనది అంటే జీవత్వమువదలిన కేవల సంవిద్రూపము. మధ్యము మణిపూరక స్థానము అందు శాతా సూక్ష్మమైనది. అనగా పశ్యంతీవాగ్రూపము. వాఙ్మనోతీతా - పరావాగ్రూపిణియన్నమాట. కుచసీమ్ని స్ఫీతా అనగా అనాహతములో మధ్యమావాగ్రూపిణియన్నమాట.

**పురతః కదాను కరవై పురవైరి విమర్ద పులకితాంగలతామ్**
**పునతీం కాంచీదేశం పుష్పాయుధ వీర్య సరసపరిపాటీం॥** ౨౧

ఎన్నఁడు ముందటన్ నిలువరించుకొనంగలనో పురారి తాఁ
గ్రన్ననఁ గౌగిటం బొదువగాఁ బులకించెడి మేనిదాని గాం

చి న్నిరతిం బవిత్రమును జేసెడుదానిని బుష్పబాణు వి
ద్యున్నత విక్రమైక రసవ త్పరిపాటిని మాటిమాటికిన్.

త్రిపురవైరి బిగికౌగిటి సమ్మర్దముచే బులకించు నెమ్మేనుగలది కాంచీమండలము నెల్ల బవిత్రము సేయునది యగు పుష్పబాణుని పరాక్రమ రసపరిపాటిని నేనెన్నడు నాముందు సాక్షాత్కరింపజేసికొందునో కదా! శక్తికుండలిని శివకుండలితో బ్రహ్మరంధ్రముతో విమర్దము పొందినపుడే బ్రహ్మానందస్ఫూర్తి అగుట: అదే రూపము పరమపురుషార్థమైన మోక్షముగా పరిణతిచెందిన మాన్మథశృంగారముయొక్క పరమపరిపాటి - అది పరాకళ - అదే కామాక్షిగా ఉపాస్య అని భావము.

**పుణ్యా కాఽపి పురంధ్రీ పుంఖిత కందర్పసంపదా వపుషా**
**పులినచరీ కమ్పాయాః పురమథనం పులక నిచులితం కురుతే||** ౨౨

బళి! పుణ్యాత్మకురా లొకానొకతె కంపాసెక తైకాంత సు
స్థలిలోఁబుంఖిత సూనసాయక మహైశ్వర్యాన నెమ్మేనఁ గౌ
గిలిలో దార్చి యనంగవైరి నొకభంగిన్ జారురోమాంచకం
చులితాంగున్ బొనరించుచున్న దదిగో శుద్ధాంతరంగమ్మునన్.

పుణ్యశీలయైన ఒకానొక పతివ్రత పూవిలుతుని కలిమియెల్ల పుంజీభవించిన మేనితో కంపానది యిసుక తిన్నెల మసలుచు పురారిని పులకరింపజేయుచున్నది.

**తనిమాద్వైత వలగ్నం తరుణారుణ సంప్రదాయ తనులేఖమ్**
**తటసీమని కమ్పాయా స్తరుణిమసర్వస్వ మాద్య మద్రాక్షమ్||** ౨౩

అల కంపాతటసీమఁ జూచితిమి శూన్యాద్వైతమధ్యమ్మునై
ఎలప్రాయంబునఁ గుల్కు నిండుదన మెంతే లేఁత కెంజాయలన్
దులకింపుల్ గొను మేనిచాయ మది కెంతో కూర్చు నాగర్భమం
జుల సచ్చిత్సుఖగర్భ నిర్భరకృపా శోభార్భక శ్రీకళన్.

సన్నని నడుము, లేత యెఱుపురంగుతోడి శరీరముగల ఆద్యమగు నొక నడిప్రాయంపు నిండుదనమునుగల్గి గంపాతీరమందు ఉండెడి సచ్చిదానందమూర్తిని కృపాశోభతో గూడిన యొక బాలికారూపమైన లక్ష్మీకళను జూచితిని.

**పౌష్టిక కర్మ విపాకం పౌష్పశరం సవిధసీమ్ని కంపాయాః**
**అద్రాక్ష మాత్తయౌవన మభ్యుదయం కించి దర్ధశశిమౌళేః||** ౨౪

ఎత్తిన నిండుజవ్వనము; ఇందుకిరీటుని కెత్తికొన్న సం
పత్తి, విశిష్ట పౌష్టిక విపాకము, పౌష్పశర, మ్మొకింత క
న్నెత్తి కనుంగొనంగలిగె నిచ్చటఁ గంప తటంబునందు మా
కిత్తఱి నెత్తఱిన్ దలఁపొకించుకయుం జొరరాని సత్తయై.

పౌష్టిక కర్మములు వాపీ కూప తటాకాది నిర్మాణములు. వానియొక్క ఫల రూపములు పూవుల బాణములను దాల్చి నిండు జవ్వనముచే నొప్పచు నర్ధచంద్ర బింబమును గిరీటముగా సంతరించుకొనియుండు శంకరుని అభ్యుదయమును గంపా తీరప్రాంతమున నల్లల్లన దర్శించితిని. జగద్రూపముగ పరిణామము పొందిన స్వరూప మిచట భావింపబడినది.

సంశ్రిత కాంచీదేశే సరసిజదౌర్భాగ్య జాగ్రదుత్తంసే
సంవిన్మయే నిలీయే సారస్వత పురుషకారసామ్రాజ్యే॥ ౨౫

వర కాంచీపురవాసమై కమలినీభాగ్యేతరమ్మైన శే
ఖరమై కేవల సంవిదేకరస సౌఖ్యస్ఫూర్తియై భావని
ర్భర సారస్వత పౌరుషాత్మక మహాసామ్రాజ్యమై యొప్ప న
బ్బురమౌ న య్యనుభూతిలోన లయమైపోదున్ స్వతస్ఫూర్తిలోన్.

తామరపూల దురదృష్ట రేఖచేత (చంద్రరేఖచేత) సంతరింపబడిన కిరీటము గలది. జ్ఞానమయమైనది కాంచీదేశమున నెలకొన్నదియునగు సర్వ విద్యాపాండిత్యమను నిండు మగతనముయొక్క సామ్రాజ్యమందు (సమృద్ధియందు) లీనుడ నయ్యెదను. తామర పూల దురదృష్ట రేఖ కిరీటముగా గలది యనుటచే మూలాధారాది షట్చక్రములకు ముకుళీభావమును సమకూర్చెడి చిచ్చంద్రమండలము పరదేవతయొక్క పరమార్థరూప మని సూచింపబడినది.

మోదిత మధుకర విశిఖం స్వాదిమ సముదాయసార కోదండమ్
ఆదృతకాంచీఖేలన మాదిమ మారుణ్యభేద మాకలయే॥ ౨౬

తుమ్మెద ల్లుల్లసిల్లు నెలతూపులు తియ్యదనాలకెల్ల సా
ర మ్మరువిల్లునుం గలిగి రంజిలు కాంచిపురమ్ములోన ని
త్యమ్మును నాటలాడుకొనునాదరముం గొనియున్న యంద మా
ద్యమ్ములకెల్ల నాద్యమగు నయ్యెఱుపుందనముం దలంచెదన్.

తుమ్మెదలను సంతోషపెట్టు బాణములు కలది. (పూలు బాణములుగా ధరించిన దన్నమాట) తీయని పదార్థములకెల్ల సారభూతమైన విల్లు గలది. చెఱకువిల్లు ధరించునదియనుట. (ఆనందములన్నిటికి సారమైన కారణానందము ఆమె స్వరూపమని భావము) కాంచీనగర విహారమునందు వేడుకపడునదియు నగు మొట్టమొదటి అరుణ్యవిశేషమును (ఒకానొక ఎఱుపును) సంభావించెదను.

ఉరరీకృత కాంచిపురీ ముపనిష దరవిందకుహర మధుధారామ్
ఉన్నమ్ర స్తనకలశీ ముత్సవలహరీ ముపాస్మహే శంభోః॥ ౨౭

కాంచిపురీ విహారములఁ గౌతుకముం గొనియున్నదాని న
ర్చించెద శంభునుత్సవ సరిల్లహరిం బరమోన్నమత్కుచా
భ్యంచిత హారవల్లరినిఁబ్రాఁబలుకుందుద తమ్మిపూవులో
వంచిన తేనెసోన పరువం బగుదాని ననన్యసుందరిన్.

ఉపనిషత్తులనెడి పద్మములందు జాల్వారు తేనెధారయై కాంచీపుర విహారకుతూహలినియు సమున్నత కుచకలశయునై యున్న శంభుని పరమోత్సవ ప్రవాహమును ఉపాసింతును.

ఏణశిశు దీర్ఘలోచన మేనఃపరిపంథి సంతతం నమతామ్
ఏకామ్రనాథ జీవిత మేవంపద దూర మేక మవలంబే॥ ౨౮

అవలంబించెద మిట్టిదన్ పదముచే నందంగరానట్టి వై
భవ మేకామ్ర మహేశ జీవితము దీవ్యద్భక్త పాపౌఘ శా
త్రవ మేణార్భక దీర్ఘలోచనము నిత్యశ్రీకృపాస్మేర కై
రవబంధూపమ సుస్మితానన ముదార బ్రహ్మభావ మ్మెదన్.

లేడిపిల్ల కన్నులవలె సోగలైన కన్నులు గలది. మ్రొక్కువారి పాపముల హరించునది. ఏకామ్రనాథుని జీవితమైనది. యిట్టిట్టిదనరానదియునై యున్న యేకైక పదార్థమును నిరంతర కృపాధారకాధారమైన నవ్వుమోముగల కేవల బ్రహ్మవస్తువును నాకాధారముగ గైకొను చున్నాను.

స్మయమానముఖం కాంచీ మయమానం కమపి దేవతాభేదమ్
దయమానం వీక్ష్య ముహుర్వయ మానన్దామృతాంబుధౌ మగ్నాః॥ ౨౯

ఆనందామృతవార్ధిలో మునిఁగినా మాలో విలోకించి యెం
దే నొక్కండగు దేవతాంతర మహో! యేవేళ భక్తాళి నెం
తేనిం జాలిగఁ జూచుదానిని సత మీక్షించికే నిండు హ
ర్షానన్ వచ్చెడిదాని నవ్వుమొగమై రంజిల్లుదానిం దమిన్.

నవ్వుమోము గలది. దయచూపునది. కాంచీపురమున జరించునదియునగు నొకానొక దేవతను గాంచి మే మానందసాగరములో మున్కలిడుచున్నాము.

**కుతుకజుషి కాంచిదేశే కుముద తపోరాశి పాక శేఖరితే**
**కురుతే జనో మనోఽయం కులగిరి పరిబృఢ కులైక మణిదీపే||** 30

కలువ లొనర్చు మేల్తపము గట్టివిపాకము పూవుబంతిగాఁ
దలను ధరించి కాంచిపురిఁ దాఁ దిరుగం గుతుకమ్ముగొన్న యా
కులగిరినాధ సాధుకుల కుంజలసన్మణి మంజుదీపికా
కళికకు వీఁడు చిత్తమున గైవసముం బొనరించినాఁడిటన్.

కాంచీదేశమందు ముచ్చటపడునది. కలువలు చేసికొన్న తపస్సుయొక్క పరిపాకము కిరీటముగా ధరించునది. (చంద్రుడు కిరీటముగా గలదనుట) కులపర్వతముల కెల్ల సార్వభౌముడైన హిమవంతునియింట మణిదీపమయి యున్నదానియందు వీడు మనసు పెట్టుకున్నాడు.

**వీక్షేమహి కాంచిపురే విపుల స్తన కలశ గరిమ పరవశితమ్**
**విద్రుమసహచర దేహం విభ్రమ సమవాయసార సంనాహమ్||** 3౧

కాంతుము కంచిలోపలన క్రమపృథుస్తనకుంభజృంభణా
క్రాంతము విద్రుమాదృతసురాగము విభ్రమయోగసార సం
క్రాంత ముదాత్తదైవము పరాత్పరభావము దేవదేవుశు
ద్ధాంతము సంతతాభ్యుదయ దాన దిగంత యశోనిశాంతమున్.

విపుల కుచకుంభ భారముచే వివశమై, పవడముల కీడుజోడగు నెఱ్ఱని నెమ్మేని సోయగముకలదై సకల విలాససారమెల్ల రూపుగొన్న పరదేవతా రూపమును కాంచీపురమున గాంచుచున్నాము.

**కురువిందగోత్ర గాత్రం కూలచరం కమపి నౌమి కంపాయాః**
**కూలంకష కుచకుంభం కుసుమాయుధ వీర్యసార సంరంభమ్||** 3౨

వినతుడనై భజింతుఁ గురువిందసగోత్రము గాత్రమొప్ప ఠీ
విని పువువింటిజోదు నెఱ విక్రమసార విజృంభణమ్ము నె
క్కొని యురువంకరాయు కుచకుంభములం గడుఁగుల్కుదాని నిం
పెనయఁగఁ గంప యొద్దనఁ జరించు నొకానొకదాని నెమ్మదిన్.

పవడములకు సగోత్రమైన గాత్రముకలది (అరుణశరీరిణి యన్నమాట) చంకల నొరయు కుచకుంభముల యొప్పుగలది, పూవిలుకాని పరాక్రమ సారభూతమైన సంరంభము గలదియునై కంపాతటమునందు వర్తించు నొక వస్తువును నమస్కరించెదను.

**కుట్మలిత కుచకిశోరైః కుర్వాణైః కాంచిదేశ సౌహార్దమ్**
**కుంకుమశోణై ర్నిచితం కుశలపథం శంభుసుకృత సంభారైః॥** 33

చెలువగు కుంకుమారుణరుచిస్ఫురణమ్మునఁ దిక్కుటిల్లి చ
న్మొలకల పూపమొగ్గయిడి పొల్పగు కాంచిపురంబు చాయ నె
చ్చెలితనము న్ఘటించి విలసిల్లెడి శంభుని పుణ్యరాశి ని
ల్వల తగనిండి మేల్కుశలభావ పథమ్మొక దుల్లసిల్లెడిన్.

మొగ్గదొడుగు చనుమొలకల నింపుగుల్కునవి. కుంకుమపువ్వువలె నెఱ్ఱనివి కాంచీ దేశముతో జెలిమివాటించునవియు నైన శంభునిపుణ్యముల రాశిచే మా క్షేమమార్గము నిండియున్నది.

**అజ్కితకచేన కేనచి దంధంకరణౌషధేన కమలానామ్**
**అంతఃపురేణ శంభో రలంక్రియా కాపి కల్ప్యతే కాంచ్యామ్॥** 34

పొలుపగు తమ్మిపూలఁ గనుమూతఁలొనర్చెడునౌషధంబుపూఁ
తల నెఱనిండు చీఁకటులఁదార్చెడు వేనలికొప్పు నొప్పు చేఁ
జెలువగు శంభునంతిపురిచేత నొకానొక సున్నితంపు విం
తల జిలుగైన మేల్పనితనంబు స్ఫురించెడుఁ గాంచిలోపలన్.

కమలములు కనుమూయుటకు గారణమైన యౌషధముచే (చంద్రుడన్నమాట) నలరు వేనలిగల శంకరుని అంతఃపురముచే కాంచీనగరమునం దొకానొకయందము తీర్చి దిద్దబడుచున్నది.

**ఉరరీకరోమి సంతత మూష్మలఫాలేన లాలితం పుంసా**
**ఉపకంప ముచితఖేలన ముర్వీధరవంశ సంపదున్మేషమ్||**

నాదిగ జేసికొందు నొక నాయకు చేతుల లాలనంబునన్
మోదమునన్ జెమర్చు ననుముంగురులం గడు నొప్పు ఫాలమై
కాదన కెల్లవేళ ననుకంప ముదంచిత ఖేలనంబునై
యాదట నొప్పు భూధరకు లాభ్యుదయోదయ సంపదున్నతిన్.

సెగలుచిమ్ము ఫాలభాగముగల పురుషునిచే లాలింపబడునది. కంపానదీతీరమున నాటలాడునదియు నగు పర్వతరాజుయొక్క భాగ్యోన్మేషము నెల్లప్పుడును భావించెదను.

**అంకురిత స్తనకోరక మంకాలంకార మేకచూతపతేః**
**అలోకేమహి కోమల మాగమ సంలాప సారయాథార్థ్యమ్||**

అతికుతుకానఁ గాంతుము నవాంకురితస్తనకోరక ద్యుతిన్
జతురత రాగమోక్తి రససారతరార్థ యథార్థభావ నా
యతరుచి నేకచూతపతి యంకతలంబున నింపునింపు మేల్
రతనపుసొమ్ముదార మునిరాజ మనఃకుహరాగ్రదీపికన్.

ఏకామ్రేశ్వరుని యంకపీఠమున కలంకారమై యంకురించు కుచకుట్మములతో నింపుగుల్కుచు వేదగోష్ఠికెల్ల సారభూతమైయున్న యొకానొకసత్యమును మునిరాజ హృదయ దీపికయగు దానిం జూచుచున్నాము.

**పుంజితకరుణ ముదంచిత శింజిత మణికాంచి కిమపి కాంచిపురే**
**మంజరిత మృదులహాసం పింజర తనురుచి పినాకి మూలధనమ్||** ౩౯

పుంజిత సత్కృపారసము మూలధనంబు పినాకపాణికిన్
శింజిరత్న కాంచికము శ్రీరుచి పింజరిత స్వరూపమై
రంజిలుఁ గాంచి మంజరిత రమ్య దరస్మిత సుందరాస్యమై
రంజిత సాధులోకనికరంబు నిరంజన భావపుంజమై.

కరుణ రసము మూర్తీభవించినది మణికింకిణులచే మ్రోయు నొడ్డాణముగలది పూగుత్తులబోలు చిఱునవ్వుల గుల్కునది యలముకొను నెమ్మేని తళుకులు గలదియునై పినాకపాణి మూలధన మొకానొకటి కాంచీనగరమునం దొప్పుచున్నది.

**లోలహృదయోఽస్మి శంభో ర్లోచనయుగలేన లేహ్యమానాయామ్**
**లాలిత పరమశివాయాం లావణ్యామృత తరంగమాలాయామ్||**

లావణ్యామృత సింధువీచిక నవేలన్ లాలితేశాన పే
లావిన్యాసకళన్ సదాశివదృశా లక్ష్యైక లేహ్యాకృతిన్
భావమ్మెంతయు లగ్నమైనది కృపాపాథోధిఁగాంచీపుర
శ్రీవాల్లభ్యమునందు శాంకరపురంధ్రీ భావసభ్యమ్మనన్.

శంభునిచూపులచే లేహ్యమానయు పరమశివుని లాలించునదియు నగు నొక లావణ్యామృత తరంగపంక్తి నోలలాడవలెనని కుతూహలపడు హృదయము గలవాడనై యున్నాను.

**మధుకర సహచర చికురై ర్మదనాగమ సమయ దీక్షిత కటాక్షైః**
**మండిత కంపాతీరై ర్మంగళకందై ర్మమాస్తు సారూప్యమ్||** 3F

అళినికరాళియైన చికురాళి స్మరాగమశాక్త దీక్షిత
మ్మలగు కటాక్షముల్గలిగి పూర్ణశుభాంకురపాళి యెల్లనున్
మొలచెడు మూలకందమయి పొల్చుచుఁ గంప తటాంతమందు రం
జిలు నొక సొంపుతోడ విలసిల్లుత మాకు సరూపభావముల్.

తుమ్మెదలకీడు జోడయిన జుట్టుతో మన్మథశాస్త్రమను శాక్త తంత్రమందు దీక్షపొందిన కటాక్షములతో గూడి కంపా తీరము నలంకరించియున్న శుభ పరంప రలకెల్ల మూలమైన యొక వస్తువుతో మాకు సారూప్యము సిద్ధించుగాక!

**వదనారవింద వక్షో వామాంకతటీ వశంవదీభూతా**
**పురుషత్రితయే త్రేధా పురంధ్రిరూపా త్వమేవ కామాక్షి||** ४O

అదిరా నెమ్మొగమందు వక్షమున వామాంకమ్మునందున్ వశం
వదయై ముప్పురు మూర్తులం దొకతెవై వర్తించి కామాక్షి! చా
రు దయార్ద్రశ్రీ వెదజల్లు ముప్పురు పురంధ్రుల్గా విరాజిల్లి సం
పదలెల్ల న్విలసిల్లఁజేయుదుకదమ్మా! యో పరాదేవతా!

కామాక్షీ! ముగ్గురుమూర్తులలో నొకని ముఖపద్మమందు, మఱొక్కని వక్షః స్థలమందు, మఱియొకని వామాఙ్కసీమయందు వశంవదవై మూడు రూపములతో త్రిశక్తి రూపిణివై యున్నదానవు నీవే.

**బాధాకరీం భవాబ్దే రాధారా ద్యంబుజేషు విచరంతీమ్**
**అధారీకృత కాంచిం బోధామృతవీచి మేవ విమృశామః||** ౪౧

మూలాధారము మున్నుగాఁగలుగు సంభోజాతషట్కమ్మునన్
లీలాలాస్య మొనర్చు నర్తకిని గాంచీపట్టణాధార ను
ద్వే లమ్మైన భవాబ్ధిబాధలను బాధింపన్ సమర్థంబు ని
ర్మ్మల మ్మైాత్మవిమర్శసేసెద సుధాబోధాబ్ధి వీచీకళన్.

సంసార సాగరమునకు బాధకమై మూలాధారాది చక్రములందు సంచరించునదై కాంచీనగరము తన నివాసముగా జేసికొన్న యొకానొక జ్ఞానామృత తరంగమును గూర్చి విమర్శించుచున్నాము.

**కలయా మ్యంతః శశధరకల యాంకిత మౌళి మమల చిద్వలయామ్**
**అలయా మాగమపీఠీ నిలయాం వలయాంకసుందరీ మంబామ్||** ౪౨

అలయన్ మౌళిలసత్సుధాకరకళన్ వ్యాలోల చిద్వల్లరీ
వలయన్ శ్రీవలయాంక సుందరిని సంభావింతు సర్వాగమా
గ్ర లసచ్ఛ్రీ మనురాజ పీఠనిలయన్ గైవల్య లీలాశ్రయన్
విలసత్స్వాదు మనఃకుశేశయచయాభిధ్యేయ రూపాశ్రయన్.

చంద్రరేఖచే గుర్తింపబడిన కిరీటముగల్గి అచ్ఛమైన జ్ఞానముచే పూర్ణమై ఆగమ పీఠమం దధివసించుచు పూర్ణాంకస్వరూపిణియై యున్న యాయమ్మను లోలోన ననుసంధానము వేసెదము.

**శర్వాది పరమసాధక గుర్వానీతాయ కామపీఠజుషే**
**సర్వాకృతయే శోణిమ గర్వాయ సమర్ప్యతే హృదయమ్||** ౪౩

హృదయ మ్మర్పనసేతు శోణిమమదశ్రీ రేఖకున్ సంపదా
స్పదకున్ శర్వముఖాగ్రసాధక గురుస్వానీత కుద్యద్రమా

స్పద కాంచీపుర కామపీఠ పరమాస్థానాగ్ర సంరాజ్ఞికిన్
సదసద్వస్తు వివేక విస్తృత రహస్యజ్ఞాన విజ్ఞేయకున్.

మహాసాధకులయిన గురుమండలముచే గొనిరాబడి కామకోటిపీఠ మధిష్ఠించియున్న ఎఱుపుయొక్క గర్వము నిగ్గు ఎల్ల తానైయున్న యొక సర్వాకృతికి నా హృదయ మర్పించెదను.

**సమయాసాంధ్యమయూఖైః సమయా బుద్ధ్యా సదైవశీలితయా**
**ఉమయా కాంచీరతయా న మయా లభ్యేత కింను తాదాత్మ్యమ్||** ౪౪

సమబుద్ధిన్ పరిశీల్యమాన సమయన్ సాంధ్యారుణ చ్ఛాయకున్
సమమౌ వన్నియఁగుల్కుబాలిక మహస్థన్ గాంచిలోనన్ వినో
దము గావించెడు నమ్మయైన యుమతోఁ దాదాత్మ్యముంబొందు భా
గ్యము నాకబ్బక యేమగున్ గురుకటాక్ష శ్రీవిలాసమ్మునన్.

సంధ్యారాగకిరణములవలె నెఱ్ఱనై సమబుద్ధితో నెల్లప్పుడు విమర్శింపబడునదై కాంచీపురమున విహరింప గుతూహలము గొన్న ఉమాదేవితో నే నైక్యము పొందకుందునా? ఉమాశబ్దములో ఉకారము పురుషేచ్ఛారూపము 'మా' అనునది జీవప్రకృతి. ఈ రెండిటి సమష్టివిద్యారూప నిర్గుణ ప్రకృతి. అదే పరాకళ, సమయకళ. ఆ కళతోడి తాదాత్మ్యమునే సాధకుడు కోరునది.

**జంతో స్తవ పదపూజన సంతోష తరంగితస్య కామాక్షి**
**బంధో యది భవతి పునః సింధోరంభస్సు బంభ్రమీతి శిలా||** ౪౫

నమ్మిక నీపదాబ్జ భజనమ్మున హర్ష తరంగితాంతరం
గమ్మగు జంతుకోటి కిఁకఁ గల్గదు బంధము; కల్గెనేని ని
త్యమ్మొక రాతిబండ నదియందు జలమ్ములఁ దేలియాడదే
యమ్మరొ! నీ దయార్ద్ర హృదయమ్మునకున్ సరి యేది తెల్పగన్.

కామాక్షీ ! నీ పాదములను బూజించు నానందముచే నుప్పొంగువానికి సంసార బంధము మఱల కలుగదు. కల్గెనేని నట్టేట నీటిపై రాతిగుండు తేలియాడవలసినదే. అనగా అసంభవ మన్నమాట.

**కుండలి కుమారి కుటిలే చండి చరాచరసవిత్రి చాముండే**
**గుణిని గుహారణి గుహ్యే గురుమూర్తే త్వాం నమామి కామాక్షి||** ౪౬

కుండలి కుమారి కుటిలా
చండి చరాచరసవిత్రి సతి గుహ్యే చా
ముండా గుణిని గుహారణి
దండిని గురుమూర్తి మ్రొక్కెదన్ కామాక్షీ!

ఓ కుండలీ! (శక్తి కుండలీరూపిణీ) రెండున్నరచుట్టలుగా జుట్టుకొన్న సుషుమ్నా నాడి యన్నమాట. కుమారి! కుటిలా! చండీ! చరాచరజననీ! చాముండా! (అసురవృత్తిని) హరించుదానా! గుణిని = సత్త్వాదిగుణవతి ప్రకృతి యన్నమాట. గుహారణి = బుద్ధి యను అరణి గలదానా! బుద్ధిగుహయందు నీవారశూకమట్లు సూక్ష్మమైన అగ్నిశిఖాస్వరూపమై భాసించునదని యర్థము. గుహ్యే = గోపనీయ, గురుమూర్తీ! కామాక్షీ! నిన్ను నమస్కరించెదను.

**అభిదాకృతి ర్భిదాకృతి రచిదాకృతి రపి చిదాకృతి ర్మాతః**
**అనహంతా త్వ మహంతా భ్రమయసి కామాక్షి శాశ్వతీ విశ్వమ్॥** ౪౭

అమ్మా! భేద మభేద మాకృతిగ నీ వజ్ఞానమున్ జ్ఞానరూ
పమ్మై యెందు నహంతయౌచు ననహంతాస్ఫూర్తి గామాక్షి ని
త్యమ్మై నన్ శాశ్వతసత్య మీవయి యనిత్యమ్మైన యీ యెల్ల వి
శ్వమ్ముమ్మన్ సంభ్రమవిభ్రమమ్ముల భ్రమింపంజేయుచున్నావుగా.

నీవు అభేదస్వరూపిణివి, ఏకము, అద్వితీయమును అయిన పరబ్రహ్మమే అన్న మాట. అట్లయ్యు భేదరూపిణివై, కేవలజ్ఞానరూపిణివయ్యు నజ్ఞానరూపిణివై, అన హంకృతి వయ్యు నహంతాకృతివై శాశ్వతివై యున్నావు. నిర్గుణము ఏకరూపమునై సర్వానుస్యూత మైన బ్రహ్మమయ్యు భేదాభేదరూపము, జడాజడరూపము, అహంప్రత్య యదృశ్యము నయి నీవు విరుద్ధగుణాభాసముచే నీ లోకమును తికమక పెట్టుచున్నావని భావము.

**శివ శివ పశ్యంతి సమం శ్రీకామాక్షీకటాక్షితాః పురుషాః**
**విపినం భవన మమిత్రం మిత్రం లోష్టం చ యువతిబింబోష్ఠమ్॥** ౪౮

అపరిజ్ఞేయ మహాద్భుతంబిదియుఁ గామాక్షీకటాక్షైక ల
క్ష్యపదమ్మౌ పురుషోత్తముల్ శివశివా కన్గొందురెందెందునున్
విపరీతావిపరీతభేదసమతన్ మిత్ర మ్మమిత్రమ్మునున్
విపినమ్మున్ భవనమ్ము లోష్టము వధూబింబోష్ఠమేకాకృతిన్.

శ్రీ కామాక్షీకటాక్ష మెవ్వరియందు బ్రసరించునో వారు అడవిని ఇల్లును, శత్రుని, మిత్రుని, లోష్టమును (మంటిబెడ్డను) మగువబింబోష్ఠమును (దొండపండువంటి పెదవిని) సమముగా భావించెదరు. దేవీకటాక్షలాభమునకు ఫలము సర్వసమత్వము, వైరాగ్యము నన్నమాట.

**కామపరిపంథి కామిని కామేశ్వరి కామపీఠ మధ్యగతే**
**కామదుఘా భవ కమలే కామకలే కామకోటి కామాక్షి॥** ౪౯

కామ పరిపంథి కామిని
కామేశ్వరి కామపీఠికా మధ్యగతా
కామగవివి గా కమలా
కామకళా కామకోటికళ కామాక్షి!

కాముని గెల్చినవాని యిల్లాలగు నో కామేశ్వరీ! కామకోటిపీఠ మధ్యమం దధిష్ఠించిన యో లక్ష్మి! కామకలా (ఈకారముచే వాచ్యమగుదానా) కామకోటీ! కామాక్షీ! మాపాలిటి కామధేనువవు కమ్మా!

**మధ్యేహృదయం మధ్యేనిటలం మధ్యేశిరోఽపి వాస్తవ్యామ్**
**చండకర శక్రకార్ముక చంద్ర సమాభాం నమామి కామాక్షీమ్॥** ౫౦

పొలుపొందన్ హృది పుండరీకమునను న్ భ్రూమధ్యమందున్ శిరః
స్థలి నామీఁదటఁ బొల్చు నంచిత సహస్రారాబ్జ మధ్యంబునన్
చెలువై చండకరేంద్రకార్ముక శశి శ్రీకోటి బింబ ప్రభా
కలితన్ బింబఫలాధరోష్ఠి నిదె మా కామాక్షి నే మ్రొక్కెదన్.

హృదయమునడుమ లలాటమధ్యమున శిరస్సుమధ్యమందు సూర్యునివలె ఇంద్ర ధనస్సువలె జంద్రునివలె భాసించు కామాక్షిని మ్రొక్కెదను. ఇందు మధ్యశబ్దము సంధ్యాస్థానమును సూచించును. పరదేవత సంధ్యాస్థానమం దభివ్యక్తయౌను గావున సంధ్యాదేవతగా నుపాస్యయై యున్నదని భావము.

**అధికాంచి కేలిలోలై రఖిలాగమ యంత్రతంత్రమంత్రమయైః**
**అతిశీతం మమ హృదయం విషమశరద్రోహి జీవనోపాయైః॥** ౫౧

శ్రేయశ్శ్రీ మహిమానుభావములు నిస్సీమప్రభావమ్ములై
ఆ యా యాగమ మంత్ర తంత్ర బహుయంత్రాకారతన్ గాంచి యీ
చాయం గేళికుతుహలమ్ము లసమాస్త్రద్రోహి సంజీవనో
పాయశ్రేణుల జిల్లనైనది మదీయమ్మైన చిత్తమ్మహో!

కాంచియం దాటాడ వేడుకగొన్నవి సర్వాగమప్రసిద్ధములగు యంత్రతంత్ర మంత్రములు స్వరూపముగా గలవి విషమశరవైరియగు పరమశివు నుజ్జీవింపజేయునవియు నగు నుపాయములచే (శివుని ప్రాణపదమయిన కామాక్షిచేత నన్నమాట) నా హృదయ మెంతయు జల్లబడినది.

**నందతి మమ హృది కాచన మందిరయన్తీ నిరంతరం కాంచీం**
**ఇందు రవి మండలకుచా బిందు వియన్నాద పరిణతా తరుణీ||** ౫౨

సుందరి యోర్తు హర్షమున సొంపులుగుల్కెడుఁ గాంచి పేరి య
మ్మందిరసీమ నిందు రవి మండలముల్ కుచమండలమ్ములై
అందముసూప బిందువయి యందొకస్పందమునందు నింగియై
యందును వింతనాద మొకటై పరిణామము సెంది వర్తిలున్.

ఒక యమ్మ కాంచిని నిజనివాస మొనరించుకొని సూర్యచంద్రమండలములే కుచ కుండలములుగా గలదై స్వభావముచే దా నపరిచ్ఛిన్నరూప యైనను బిందువుగా, ఆకాశముగా, నాదముగా క్రమపరిణామము పొందిన యొకయువతి నా హృదయమునందానందించుచున్నది. ఇచట ఆకాశము పంచభూతోపలక్షకము. నాదము (శబ్దము) శబ్దాదితన్మాత్రోపలక్షకము.

**శంపాలతా సవర్ణం సంపాదయితుం భవజ్వరచికిత్సాం**
**లింపామి మనసి కించన కంపాతట రోహి సిద్ధభైషజ్యమ్||** ౫౩

కంపాతీర వనస్థలిన్ మొలుచు మొల్కన్ జారు శంపాలతా
సంపూర్ణస్ఫురణాభిరామమగు భాస్వత్సిద్ధ భైషజ్యమున్
సంపాదింపగ సంసృతిజ్వర చికిత్సా ప్రక్రియన్ మేలుచుల్
నింపం బూయుదు నాదు చిత్తమున మానింపన్ వికారమ్ములన్.

మెఱపుతీగవంటి మేనిచాయ గలది కంపాతీరమునందు మొలచిన యొక సిద్ధౌషధమును సంసారజ్వర నివారణమునకై మనసునందు బూసెదను.

**అనుమిత కుచకాఠిన్యా మధివక్షఃపీఠ మంగజన్మరిపోః**
**ఆనందదాం భజే తా మానంగ బ్రహ్మతత్త్వబోధి సిరామ్‌||** ౨౪

శృంగారమ్మొలికించు నంగజరిపు శ్రీవక్షముం దాకు సూ
టిం గుర్తింపఁగనౌ కుచస్తబక కాఠిన్యమ్ముతో నొప్పు నా
నంగ బ్రహ్మ రహస్యబోధక సిరన్ ధ్యానించి సేవించెదన్
సాంగోపాంగ సమర్చనావిధి నమందానంద నిష్యందమున్.

మన్మథవైరియొక్క వక్షఃపీఠమునందు (ముద్రపడిన ఆనవాళ్ళను బట్టి) అనుమానింపబడిన కుచకాఠిన్యముకలదియై శృంగారరూపపరమబ్రహ్మానంద తత్త్వబోధకమైయున్న సిరను అనగా బ్రహ్మరంధ్రము మొదలు ఉపస్థేంద్రియముదాక వ్యాపించియుండు బ్రహ్మనాడీ (సుషుమ్నా) రూపిణిని పరాశక్తిని భజించెద.

**ఐక్షిషి పాశాంకుశధర హస్తాన్తం విస్మయార్హ వృత్తాంతమ్‌**
**అధికాంచి నిగమవాచాం సిద్ధాంతం శూలపాణిశుద్ధాంతమ్‌||** ౨౫

కాంతును పాశ మంకుశము కైకొనఁ గైకొని వింతగొల్పు వృ
త్తాంత మొకండు గాంచిపురమందు వసించెడి శూలపాణి శు
ద్ధాంత మనంతకోటి నిగమాగమ తంత్రవచో రహస్య సి
ద్ధాంతము సుప్రశాంత ముని దాంతమన స్సుమనో వసంతమున్.

పాశమును అంకుశమును చేతులం బట్టికొని వింతగొలువు వృత్తాంతమై, చరిత్ర గలదై, వేదముల పరమసిద్ధాంతమై యున్న శూలపాణి శుద్ధాంతమును (అంతఃపుర నివాసినియైన మహారాజ్ఞి నన్నమాట) దర్శించితిని.

**ఆహితవిలాసభంగీ మాబ్రహ్మస్తంబ శిల్పకల్పనయా**
**ఆశ్రితకాంచీ మతులా మాద్యాం విస్ఫూర్తి మాద్రియే విద్యామ్‌||** ౨౬

అమితానందవిలాసభంగిఁ గొని బ్రహ్మస్తంబపర్యంత శి
ల్పమునం దొప్పు ననల్పకల్పనము పేలం గాంచిలోనన్ విహా
రము గావించెడు నాదిమస్ఫురణ మారాధింతు విద్యా రహ
స్య ముపాస్య మ్మరవింద సుందర శుభాస్యమ్మైన సారస్యమున్.

బ్రహ్మాదిస్తంబపర్యంతమైన సృష్టిశిల్పము కల్పన చేయుట మూలమున నిజ విలాసభంగిమల నెల్ల విస్తరింపజేసిన కాంచీనగర నివాసినిని అనుపమము అద్యము నైన స్ఫూర్తిరూప మగు విద్య జ్ఞానశక్తియెడ నాదరము వడసెదను.

**మూకోఽపి జటిలదుర్గతి శోకోఽపి స్మరతి యః క్షణం భవతీమ్**
**ఏకో భవతి స జంతుః లోకోత్తరకీర్తి రేవ కామాక్షి||** ౨౭

అమ్మరో! మూగవాఁడయిన నల్లికగొన్న యనేక తీవ్ర శో
కమ్ములఁ గ్రుంగువాఁడయినఁగాని నినున్ క్షణమాత్రమేని చి
త్తమ్మున నెంచనేరుచు దతం డొకఁడే యెనలేనికీర్తిని
త్య మ్మతిలోకవర్తి యగునమ్మ పురారికుటుంబినీమణీ!

మూగవాడుగాని చిక్కువిడనిదుర్గతిలో బడినవాడుగాని శోకగ్రస్తుడుగాని నిన్నొక్క క్షణము స్మరించునేని ఆ జీవి లోకోత్తరకీర్తిశాలి యగును.

**పంచదశ వర్ణరూపం కంచన కాంచీవిహార ధౌరేయమ్**
**పంచశరీయం శంభో ర్వంచన వైదగ్ధ్యమూల మవలంబే||** ౨౮

పరశివు వంచనం జలుపు పట్టునఁ బంచశరుండు సాధనా
సరణిగఁ గొన్న మేటి నెఱజాణతనంబుల మూలకందమై
పరగుచుఁ గాంచిలోఁదిరుగు పంచదశాక్షర మంత్రరూప మ
ప్పరమ కృపాస్వరూప మది పట్టెద నాయెద లోనిపట్టునన్.

పంచదశాక్షరమంత్రస్వరూపము కాంచీపురీవిహారకౌశలము శంభుని వంచింపగల నెఱజాణతనమున కెల్ల మూలమును అయిన ఒక వస్తువును ఆశ్రయించుకొని యున్నాను.

**పరిణతిమతీం చతుర్ధా పదవీం సుధియాం సమేత్య సౌషుమ్నీమ్**
**పంచాశదర్ణ కల్పిత పదశిల్పాం తాం నమామి కామాక్షీమ్||** ౨౯

నిలిచి సుషుమ్నలోపల మనీషులకున్ పలుతీరులైన ప
ల్కులకులుకౌచుఁ జాలుకొని లోపల నేఁబదియక్షరమ్ములై
చెలఁగెడు మాతృకాఖ్య పదశిల్పము రూపయి యున్నయట్టి య
క్కలికిని మ్రొక్కెదన్ నిగమ కల్పలతా కలికన్ మనంబునన్.

జ్ఞానుల సుషుమ్నా నాడీమార్గమును జేరి పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపమున నాల్గువిధముల పరిణతి చెందినట్టియు పంచాశదక్షరకల్పితమైన పదశిల్పము గల యా యమ్మను కామాక్షిని నమస్కరించెదను.

ఆదిక్ష న్మమ గురురా డాది క్షాన్తాక్షరాత్మికాం విద్యామ్
స్వాధిష్ఠ చాపదండాం నేదిష్ఠా మేవ కామపీఠ గతామ్॥ ౬౦

స్వాధిష్ఠంబగు విల్లుతో నెదుట సాక్షా త్కామపీఠమ్మునం
దాది క్షాంతములైన యక్షరములే యాకారమై యున్న స
ర్వాది బ్రహ్మ మొకానొకండయిన విద్యా దేవతన్ దిక్కుగా
నాదేశించిరి దేశికేంద్రు లిదె నా కశ్రాంతనిష్ఠానిధిన్.

గురుసార్వభౌములు అకారాదిక్షకారాంతాక్షరమాలారూపమైన విద్యను (మాతృకా మంత్రరూపిణిని) తియ్యనివిల్లుగలదానిని ఇదివో ఈ కామపీఠమం దధిష్ఠించియున్న యమ్మను నా కుపదేశించినారు.

తుష్యామి హర్షిత స్మరశాసనయా కాంచిపుర కృతాసనయా
స్వాసనయా సకలజగ ద్భాసనయా కలిత శంబరాసనయా॥ ౬౧

కడు నలరించు నించువిలుకాని జయించిన వన్నెకాని, నె
య్యెడ వసియించు కంచిపురి నింపగు పీఠముపై, ప్రపంచ మె
ప్పుడు కనిపించునట్లు సలుపున్ దనకుం దను దాన యూతయై
యడరుచు శంబరాసనమునం దది నా మది కించుఁగావుతన్.

శివుని సంతోషింపజేయుచు కాంచీపురమందు వసించుచు స్వయమధిష్ఠానమై సకల జగత్తును భాసింపజేయునదై శంబరాసనమైయున్న యొకతల్లిచే నానందభరితుడ నగుచున్నాను.

ప్రేమవతీ కంపాయాం స్థేమవతీ యతిమనస్సు భూమవతీ
సామవతీ సత్యగిరాం సోమవతీ శిరసి భాతి హైమవతీ॥ ౬౨

నిండుదనంబు గల్గినది నీటులు గుల్కుచుఁ గంపయొడ్డునం
దుండఁ దమి న్వహించినది యోగి మనఃస్థితిఁ గాంచి వాడిపో
కుండెడుపల్కులంగలుగు కొండొక సామపుసొంపు తానయై
యుండెడుఁ గాంచి హైమవతి యొక్కతె జాబిలి మౌళిఁదూగఁగన్.

కంపానదిపై ప్రేమకలది యతుల చిత్తములయందు పూర్ణరూపమైనది వేద వాక్కులలో సామవేదము స్వరూపమైనది శిరస్సునందు చంద్రరేఖ గలదియు నై హిమవంతుని కూతురు భాసించుచున్నది.

**కౌతుకినా కంపాయాం కౌసుమచాపేన కీలితే నాంతః**
**కులదైవతేన మహతా కుట్మలముద్రాం ధునోతు నః ప్రతిభా||** ౬౩

కంపాతీరవిహార కౌతుకముచేఁ గౌసుంభవర్ణంబుచే
నింపౌ కౌసుమచాపఖేలనముచే నేవేళ చిత్తమ్మునన్
సొంపుల్ గుల్కు కులాధిదైవతముచే శోభిల్లు మచ్చేముషీ
సంప త్తెల్లను మొగ్గవిచ్చుకొనుతన్ సద్వాసనల్ నించుతన్.

కంపయందు కౌతుకము గలది పూలవిల్లు చేబట్టినది అగు ఒక గొప్పకులదైవతముచే మా ప్రతిభ మొగ్గవిడుచుగాక. వికసించుగాక యనుట.

**యూనా కేనాపి మిల ద్దేహా స్వాహాసహాయ తిలకేన**
**సహకార మూలదేశే సంవిద్రూపా కుటుంబినీ రమతే||** ౬౪

స్వాహాదేవిసహాయమే తిలకమై సొరుల్ పిసాళించు న
య్యూహాతీత మనోజ్ఞయౌవనముచే నొప్పైన నెమ్మోముతో
నాహా! యా సహకార మూలతలమం దానంద సంవిన్మయ
శ్రీ హొర్వొందు జగత్కుటుంబినియనన్ గ్రీడావినోదమ్ములన్.

స్వాహాదేవీసహాయుడు (అగ్ని) తిలకముగా గల ఒక పడుచువానితో నత్తినమేను గలదియై కేవలజ్ఞానరూపిణియగు నొక యిల్లాలు తీయమామిడిచెట్టుక్రింద క్రీడించుచున్నది.

**కుసుమశర గర్వసంప త్కోశగృహం భాతి కాంచి దేశగతమ్**
**స్థాపిత మస్మి న్కథమపి గోపిత మంత ర్మయా మనోరత్నం||** ౬౫

సుమశరు గర్వసంపదల సొంపగుకోశగృహ మ్మొకండు తా
నమరెనుఁ గాంచి దేశగతమై యచటన్ గడు జాగరూకతన్
విమలము నాదు చిత్తమను వింతగు రత్నము దాచిపెట్టితిన్
భ్రమమును సంభ్రమం బెడలి భాసిలగా స్థిరవిభ్రమమ్మునన్

మన్మథగర్వసంపదకు భాండాగార మొకటి కాంచీమధ్యదేశమందు వర్తించుచున్నది. నా మనస్సు అనెడి రత్నమును దానియందు దాపరిక మొనర్చితిని.

**దగ్ధషడధ్వారణ్యం దరదలిత కుసుంభ సంభృతారుణ్యమ్**
**కలయే తవ తారుణ్యం కంపాతట సీమ్ని కిమపి కారుణ్యమ్||** ౬౬

ఆరూఢింగను రక్తశుక్లమయ శబ్దార్థాత్మకమ్మౌ షడ
ధ్వారణ్యమ్ము దహించి వర్తిలును గంపాంతస్తటాంతమ్మునం
దారుణ్యమ్మొకయింత విచ్చిన కుసుంబాపూవు మేల్వన్నెయై
కారుణ్యమ్ము నొకానొకండదది మదిన్ గాఢంబుగా నిల్పెదన్.

శబ్దార్థరూపము షడధ్వము. అందు శబ్దాధ్వము వర్ణమయ పదమయ మంత్రమయము. విమర్శరూపము. అర్థాధ్వము కలామయ తత్త్వమయ భువనమయము. ప్రకాశరూపము. ఈ రెండధ్వములను దగ్ధమొనరించినమీదట భాసించునట్టి షడధ్వాతీతరూపిణియైన పరదేవతను నిన్ను వికసించిన కుసుంబాపూవువలె నెఱ్ఱనిచాయగల యౌవనమును గంపాతీరవర్తియగు నొకానొక కారుణ్యమును భావించెదను.

**అధికాంచి వర్తమానా మతులాం కరవాణి పారణా మక్ష్ణోః**
**ఆనంద పాకభేదా మరుణిమపరిణామపరిణామ గర్వపల్లవితామ్||** ౬౭

అరుణిమ పండఁబారిన హొయల్ గొని బింకమెలర్చుకొమ్మని
ర్భర సుఖపాకభేదమయి వర్తిలుఁ గంచిపురాన నొక్క సుం
దరి దరిలేని యా సొబఁగునన్ నయనామృతపర్వమున్ నిరం
తర మొనరించికొందును సనాతన నూతన మోహనాకృతిన్.

ఆనందపరిపాకవిశేషమును ఎఱుపురంగుయొక్క క్రమపరిణామ గర్వముచే జిగిరించుదానిని కాంచియందు వర్తించుదానిని కన్నులపండు వొనరించుకొనుచున్నాను. దర్శించుచున్నాననుట.

**బాణ సృణి పాశ కార్ముకపాణి మముం కమపి కామపీఠగతమ్**
**ఏణధరకోణచూడం శోణిమ పడిపాకభేద మాకలయే||** ౬౮

అంకుశ మమ్మ పాశము శరాసనముంగొని చేతులందు నే
ణాంకనవాంకుర స్ఫురణమైన కిరీటముతోడఁగామ పీ
ఠాంకితమైన యొక్క యరుణారుణ వర్ణవిపాక మాత్మలో
సంకలన మ్మొనర్చెదను సర్వశుభాకలనం దలిర్చెదన్.

బాణములు అంకుశము పాశము విల్లును హస్తములందాల్చి చంద్రవంక శిరము నంబూని కామకోటి పీఠమందున్న యొకానొక అరుణ్యపరిపాకమును భావించెదను.

**కిం వా ఫలతి మ మాన్యై ర్బింబాధర చుంబి మందహాసముఖీ**
**సంబాధకరీ తమసా మంబా జాగర్తి మనసి కామాక్షీ||** ౬౯

అలరెడు దొండపండుసరియౌ పెదవిం జిరునవ్వుపండు వె
న్నెల లెలయించి చిత్తగుహ నెక్కొను చీఁకటులన్ హరించు న
మ్మల గనినమ్మ నా హృదయమందిరమందు వసింప నొందు వే
ల్పులను భజింప వారొలుకఁబోసెదు మేళ్లలమేమి నాకిఁకన్.

దొండపండువంటి పెదవిని ముద్దుపెట్టుకొను మురిపెంపు జిఱునవ్వు వెన్నెలమునందులకింప తమంబు హరించు జగజ్జనని కామాక్షి నా మనసునందే వర్తించుచుండ నా కితర దేవతలవలన నొరుగబోవుఫల మేమి?

**మంచే సదాశివమయే పరశివమయ లలితపౌష్ప పర్యంకే**
**అధిచక్రమధ్య మాస్తే కామాక్షీనామ కిమపి మమ భాగ్యమ్||** ౭౦

పరయఁగ శ్రీసదాశివమయంబగుమంచమునందు బొందుగన్
బరశివరూపమైన విరిపానుపునన్ వరచక్రమధ్యమం
దరుణరుచి న్వసించు నొక యమ్మ పురారిపురాత్త సత్తపః
పరిణతి మచ్చిరార్జిత శుభస్ఫురణ మ్మొక భాగ్య మెన్నెదన్.

కామాక్షియను పేర నా భాగ్యమొకటి సదాశివమయమయిన మంచమునందు పరశివ రూపమైన పూలపానుపునందు శ్రీచక్రమధ్యమం దధిష్ఠించి యున్నది.

**రక్ష్యోఽస్మి కామపీఠీ లాలికయా ఘనకృపాంబుకాలికయా**
**శ్రుతియువతి కుంతల మణీమాలికయా తుహినశైలబాలికయా||** ౭౧

ఏలికయైనదాని భజియించెద నంచిత సత్కృపాపయః
కాలికఁ గామకోటిపద కల్పితలాలిక విశ్రుత శ్రుతి
శ్రీలలనామణీ చికుర చిత్రిత చిన్మయ రత్నమంజరీ
మాలిక నాగమూర్ధ సుషమా కళికన్ హిమశైలబాలికన్.

కామపీఠమను నుయ్యేలపైని తూగునది సాటిలేని కృపారసము వర్షించు మేఘమై శ్రుతులనెడి సుందరుల కొప్పులందు మణిమాలిక యైనదియు నగు హిమశైలబాలిక పాలనలో నే నున్నాను.

**శివే పురహరజాయే మాయే తవ తరుణ పల్లవచ్ఛాయే**
**చరణే చంద్రాభరణే కాంచీశరణే నతార్తిసంహరణే||** ౭౨

పురహరుజాయ! మాయ విను పొల్పగు లేఁజిగురాకుచాయలన్
బరుగుచుఁ జెంతవ్రాలిన జనమ్ముల దుఃఖములన్ హరించు నీ
చరణమునందుఁ గాంచిపురి సంచరణమ్మొనరించుదానియం
దరుదగుదాన నైందవకళాభరణా! లయమౌదు నెయ్యెడన్.

ఓ పురహరునిల్లాల! మాయా! చంద్రాభరణ! నీచరణము కాంచీ శరణము, ప్రణతార్తిసంహరణము కావున దానియందు నేను లీనుండ నయ్యెద.

**మూర్తిమతి ముక్తిబీజే మూర్ధ్ని స్తబకిత చకోరసామ్రాజ్యే**
**మోదితకంపాకూలే ముహుర్ముహు ర్మనసి ముముదిషాస్మాకమ్||** ౭౩

అలరుంబంతియయొౌచు నౌదలఁ జకోరానీకసామ్రాజ్యముల్
వెలయన్ రూపముగొన్న ముక్తిలతికాబీజంబునాఁ గాంచిలో
పలఁ గంపాతటసీమ నింపుతులకింపంజేయు నవ్వింతయౌ
చెలుపంబంద నిరంతరంబు మురియుం జిత్తమ్ము మాకెప్పుడున్.

చకోరసామ్రాజ్యము (చంద్రబింబము) తలపై పూబంతిగాగ రూపుగట్టిన ముక్తి బీజమై కంపాతీరమున సంచరించుచుండు హొకానొక తళుకుతో మాటిమాటికి మురియవలెనని మా కోరిక.

వేదమయీం నాదమయీం
బిందుమయీం పరపదోద్య దిందుమయీమ్
మంత్రమయీం తంత్రమయీం
ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీమ్॥ ౭౪

వేదమయి యంతటన్ నిండు నాదమునయి
బిందువయి పరపదోద్యత మ్మిందువునయి
మంత్రమయి బహువిధమ్మైన తంత్రమునయి
ప్రకృతియయి విశ్వవికృతియౌ పడతిఁ గొలుతు.

వేదమయి నాదమయి బిందువయి పరమపదమునందు (సహస్రారమందు) ఉద యమందు ఇందువయి (చిచ్చంద్రమండల స్వరూపిణి) మంత్రమయి తంత్రమయి ప్రకృతిమయి విశ్వవికృతిమయి యగు తల్లిని మ్రొక్కెదను.

**పురమథన పుణ్యకోటీ పుంజిత కవిలోక సూక్తిరసధాటీ**
**మనసి మమ కామకోటీ విహరతు కరుణావిపాక పరిపాటీ॥** ౭౫

పురహరుపుణ్యకోటి యయి పుంజితసత్కవికోటిసూక్తి ని
ర్భరరసధాటి యద్భుతకృపాపరిపాటి మదీయచిత్త మం
దిరమునఁ గామకోటి నిరతిన్ విహరించునుగాక మత్పురా
చరిత తపోవిపాక వికస త్సుమసౌరభ పుణ్యవాటియై.

పురారిపుణ్యములకోటి పుంజీకృత సుకవిసూక్తిరసధాటి కరుణారస పరిపాక పరి పాటియునగు కామకోటి నా మనసునందు విహారము నెఱపుగాక!

**కుటిలం చటులం పృథులం మృదులం కచ నయన జఘన చరణేషు**
**అవలోకిత మవలంబిత మధికంపాతట మమేయ మస్మాభిః॥** ౭౬

అందిన దూహకందనిది యంద మొకం డిదె కంపయొడ్డునన్
విందొనరించి కందొవకు, వేనలి వంకరటింకరై, కడున్
దొందర యొచు కన్నులను, దొడ్డతనంబు పిఱుందులందు నై
యందెలు సందడించు చరణాబ్జములన్ మృదులమ్మునై కడున్.

జుట్టునందు గుటిలమై కన్నులందు జటులమై (చంచలమై) పిఱుదులందు పృథులమై (విశాలమై) చరణములందు మృదులమై యున్న అమేయమైన యొక మూర్తి కంపాతీరమునందు మాకు గోచరించినది. ఆశ్రయము నైనది.

ప్రత్యఙ్ముఖ్యా దృష్ట్యా ప్రసాద దీపాంకురేణ కామాక్ష్యా
పశ్యామి నిస్తుల మహో పచేలిమం కిమపి పరశివోల్లాసమ్|| ౭౭

మా కామాక్షి ప్రసాదదీపకళికన్ భాసిల్లు ప్రత్యఙ్ముఖ
శ్రీకమ్మో నొక లోనిచూపున నహో చిత్రమ్ము పూఁదేనియల్
వాకల్ గట్టగఁ బండి నిండువలపుల్ పైపైగుబాళించు లీ
లా కైవల్యనివాస మా పరశివోల్లాసమ్ము నేఁ జూచెదన్.

కామాక్షమ్మ యనుగ్రహమనెడి దీపపుకళిక సహాయముతో లోపలిచూపుతో (ఆత్మోన్ముఖదృష్టితో) నిండుగ బండినది (పూర్ణభావము చెందినది) యగు పరశివుని ఉల్లాసము (పరమశివానందస్థానమైన కామాక్షిని) దర్శించుచున్నాను.

విద్యే విధాతృవిషయే కాత్యాయని కాలి కామకోటికలే
భారతి భైరవి భద్రే శాకిని శాంభవి శివే స్తువే భవతీమ్|| ౭౮

శ్రీవిద్యా! చతురాస్య సృష్టివిషయా ! శ్రీకాళి ! కాత్యాయనీ !
ఓ విశ్వేశ్వరి ! కామకోటి కల ! ఓహో భారతీ ! భైరవీ !
దేవీ ! శాంభవి ! సర్వమంగళ ! దయార్ద్రీ ! శాకినీ ! నిన్ను నం
బా ! వేమారు నుతింతుఁ గాంచిపురకామాక్షీ ! కటాక్షింపుమా !

బ్రహ్మకు గోచరమగు ఓ విద్యాధిష్ఠాత్రీ ఓ కాత్యాయనీ కాళీ కామకోటీ కలా రూపిణీ భారతీ భైరవీ భద్రా శాకినీ శాంభవీ శివా యని నిన్ను స్తుతించెదను. పరదేవతా ప్రకృతి యందు లోకానుగ్రహ నిమిత్తముగా నావిర్భవించిన ఆయా యవతారవిశేషము లీ నామములచే బేర్కొనబడినవి.

మాలిని మహేశచాలిని కాంచీఖేలిని విపక్షకాలిని తే
శూలిని విద్రుమశాలిని సురజనపాలిని కపాలిని నమోఽస్తు|| ౭౯

మాలిని శ్రీమహేశదృఢమానసచాలిని ! విద్రుమ ప్రభా
శాలిని ! దేవపాలిని నిశాచరకాలిని యో కపాలినీ
శూలిని ఆగమార్థ పరిశోధన కేళిని కాంచికాపురీ
ఖేలిని ! ఏకచూతపతి కేవలభావ సమైక్యశీలినీ !

ఓ మాలినీ (అకారాద్యక్షరమాలామంత్రరూపిణీ యనుట) మహేశ్వరుని మది కదిలించినదానా కాంచీనగరవిహారిణీ శత్రువులపాలిటికాలరూపిణీ (కాళీ) త్రిశూలధారిణీ ప్రవాళ(పవడము)కాంతిమయశరీరిణీ ! దేవతాపాలినీ కపాలధారిణీ నీకు నమస్కారము. అమ్మవారి రజస్తమః ప్రకృతికము లయిన యవతారము లివి.

**దేశికతి కిమేష శివే తత్తాదృక్తవ ను తరుణిమోన్మేషః**
**కామాక్షి శూలపాణేః కామాగమ సమయ తంత్రదీక్షాయామ్॥ ౮౦**

హరునకుఁ గామశాస్త్ర సమయాగమదీక్ష యొసంగుపట్టునన్
గురువగు నమ్మ ! యో కుసుమకోమలి ! నీ నవయౌవన ప్రభా
స్ఫురణ మనీదృశమ్మది యపూర్వవికాసము చంద్రమఃకళా
భరణ మనఃకుశేశయనివాస విలాసిని ! కామలోచనీ !

అట్టిట్టిదనరాని ఆ నీ యౌవనోన్మేషము శూలపాణికి కామశాస్త్రరూపమయిన శాక్త తంత్రదీక్ష ననుగ్రహించుటలో గురవగునా యేమి తల్లీ !

**వేదండకుంభ డంబర వైతండిక కుచభారార్త మధ్యాయ**
**కుంకుమరుచే నమస్యాం శంకర నయనామృతాయ రచయామః॥ ౮౧**

సమధిక కుంభికుంభ మదసంపదతోడ వితండవాద వి
భ్రమమునుజూపు మేల్కుచభరంబునఁ దూఁగెడు మధ్యమానఁ గుం
కుమపువు వన్నెయై కులుకు కొండొక శంకరలోచనామృత
క్రమమున కానతుండయి కరమ్ము కరమ్ములు దోయిలించెదన్.

ఏనుగు కుంభస్థలముయొక్క విలాసాటోపముతో వితండవాదము సేయు కుచ భారముచే కిటకిటలాడు నెన్నడుము కుంకుమపూవువన్నియగులుకునెమ్మేనును గల్గి శంకరుని చూపుల కమృతప్రాయమైన మా యమ్మను మ్రొక్కెదము.

**అధికాంచిత మణికాంచనకాంచీ మధికాంచి కాంచి దద్రాక్షమ్**
**అవనతజనానుకంపా మనుకంపాకూల మస్మదనుకూలామ్॥** ౮౨

కాంచితిఁ గాంచిలోపల నొకానొక కన్నియ నించుఠీవి క్రొ
మ్మించు వలెన్ తళుక్కనెడి మేనిజిగిన్ విలసించు దాని శ్రీ
కాంచనకింకిణీకమణికాంచి నుదంచిత చారుమూర్తి కం
పాంచిత తీరకల్పితవిహార ముదారకృపాప్రపూరమున్.

ఎంతయురాణించు మణిమయసువర్ణమేఖల దాల్చి అడుగడుగున నడుగులందు వ్రాలు భక్తజనము నాదరించుచు మాయెడ సుముఖియైయుండు నొకానొక యమ్మను గంపాతీరమున గాంచిలో గాంచితిని.

**పరిచితకంపాతీరం పర్వతరాజన్య సుకృతసంనాహమ్**
**పరగురుకృపయా వీక్షే పరమశివోత్సంగ మంగళాభరణమ్॥** ౮3

పరిచితరీతిఁ గంపనది వారఁ జరించెడు నొక్క యందమున్
పరమశివాంక సంగతికిఁ బాత్రత గాంచిన దివ్యమంగళా
భరణము సర్వకారణము పర్వతరాజ పురాకృత వ్రత
స్ఫురణ మశేష మియ్యెదుటఁ జూచితి మామక పుణ్యవేషమున్.

కంపాతీరపరిచయమువడసిన పర్వతసార్వభౌముని పుణ్యములరాశిని పరమశివు నొడిలోని మంగళాభరణమును గురుదేవుల పరమకృపచే దర్శించుచున్నాను.

**దగ్ధమదనస్య శంభోః ప్రథీయసీం బ్రహ్మచర్యవైదగ్ధీమ్**
**తవ దేవి తరుణిమశ్రీ చతురిమ పాకో న చక్షమే మాతః॥** ౮౪

ఇట్టె దహించె నమ్మదను నీశ్వరు ; డాతనిబ్రహ్మచర్యపుం
దిట్టతనమ్ము నోర్వదు గదే యిదె నీ నవయౌవనంపు శ్రీ
దెట్టువగొన్న నేరిమి, మదిందలపోసెద నట్టి నిన్ను, నీ
పట్టిని నన్నొకింత గని పట్టి దయం గనిపెట్టు మమ్మరో.

దేవీ ! నీ నవయౌవనశోభాచాతుర్యపరిపాకము మన్మథుని దగ్ధముచేసిన శంభుని సుప్రసిద్ధబ్రహ్మచర్య నిష్ఠానైపుణ్యమును జూచి యోర్వలేని దయ్యెను గదమ్మా.

మదజలతమాలపత్రా వసనితపత్రా కరాదృతఖనిత్రా
విహరతి పులిందయోషా గుంజాభూషా ఫణీంద్రకృతవేషా॥ ౮౫

కరములఁ దవ్వుగోలఁ దగఁగైకొని యాకులచీరఁగట్టి య
య్యురగకులేంద్రు నాభరణమూని మెయిన్‌గురివెందపేరు లిం
పొరయ మదాంబు సిక్తమయి యొప్పు తమాలదళంబు వీనులన్
దురిమి పులిందకన్యక మనోజ్ఞగతిన్ విహరించు నియ్యెడన్.

ఇచటినుండి ఆమ్నాయదేవతాభేదముచే ధ్యేయమైన ఆకారభేదములు వర్ణింపబడుచున్నవి. హస్తమునం దవ్వుగోలగొని ఆకులచీరగట్టుకొని సర్పరాజు నాభరణముగ గై సేసి గురివెందపూసల పేరులు దాల్చి మదధారచే దడియుచున్న ఇరుగుడు చిగురుల చెవులందు ధరించి పులిందకన్య యొకతె యిందు విహరించుచున్నది.

అంకే శుకినీ గీతే కౌతుకినీ పరిసరే చ గాయకినీ
జయసి సవిధేఽంబ భైరవమండలినీ శ్రవసి శంఖకుండలినీ॥ ౮౬

తొడపయి నాడు చిల్కయయి తోరపుపాటలు పాడు వేడ్కకై
యెడనెడ చెంతల న్నిలిచి యింపుగఁబాడెడు పాటకత్తెలై
వడిఁబడిగాపులై మసలు భైరవిమండలియౌచు వీనులం
దడరెడు శంఖకుండలములై సకలోన్నతి నుందు వమ్మరో.

అమ్మా! అంకతలమునం దాడెడు చిలుకతో గానముసేయువేడుకగొని యిరువంకల పాటకత్తెలు వంతపాడగ భైరవమండలముతో శంఖాకార కుండలములం దాల్చి నా దాపున నల్లసిల్లు తల్లివి నీవు.

ప్రణత జనతాపవర్గా కృత రణసర్గా ససింహసంసర్గా
కామాక్షి ముదితభర్గా హతరిపువర్గా త్వమేవ సా దుర్గా॥ ౮౭

దుర్గవు నీవే హత రిపువర్గవు కామాక్షి ముదితభర్గవు రణధీ
సర్గవు ససింహవర సంసర్గవు అపవర్గ మీవ స్వజనమ్ములకున్.

వినతులయిన జన సమూహముపాలిటి మోక్షమై యుద్ధములను రేచుచు సింహవాహనై కామాక్షీ! శత్రువర్గముంజెండాడి ఉగ్రుని కానందము నించు దుర్గవు నీవే.

శ్రవణచలద్వేదండా సమరోద్దండా ధుతాసురశిఖండా
దేవి కలితాంత్రషండా ధృతనరముండా త్వమేవ చాముండా॥ ౮౮

భండనసీమ నిండు సురవైరుల ముండితులంబొనర్చి వే
దండయుగంబు వీనులను దాలిచి పున్కలమాలదాల్చి చా
ముండ చరింతు వీవు సతమున్ పెనుప్రేవులు మేన వ్రేలఁగన్
జండతర ప్రభావమునఁ జెండి జగల్లయకర్త్రి కాళివై.

ఏనుగులు చెవులయం దూగులాడ యుద్ధమునందు బ్రచండమూర్తివై రాక్షసుల తలలు చెండి ప్రేవుల మాలలు కంఠమున డాల్చి నరులపునుకలను ధరించి వర్తించు చాముండవు నీవే.

ఉర్వీ ధరేంద్రకన్యే దర్వీభరితేన భక్తపూరేణ
గుర్వీ మకించనార్తిం ఖర్వీకురుషే త్వమేవ కామాక్షి॥ ౮౯

గిరివర కన్యకామణి యకించన యోగిజనార్తి యెల్లనున్
గరము హరింపఁగా దలఁచి కాదటె షడ్రసభక్తపూరమున్
సరవిని బెట్టఁ జే గరిటెఁ జక్కనఁ బూనెద వన్నపూర్ణవై
పరమశివాతిథి ప్రణయపాకవిధాయిని విశ్వమోహినీ!

ఓ గిరిరాజకన్యా! గరిటెనిండ యన్నము వడ్డించి దీనుల యపరిమితపరితాపము హరించుదానవు నీవే.

తాడితరిపు పరిపీడన భయహరణ నిపుణ హల ముసలా
క్రోడపతి భీషణముఖీ క్రీడసి జగతి త్వమేవ కామాక్షి॥ ౯౦

అరినికరంబుఁ గూలిచి భయంబు హరించెడి నేర్పు పేరిమిన్
గర మరుదైన నాగలియు రోఁకలియుం గొని పందిముట్టెతో
నురుభయముంబొనర్చు ముఖమొప్పఁగ నీవ వరాహవల్లభా
స్ఫురణమునన్ జగమ్మున నపూర్వగతిన్ విహరింతు వమ్మరో

శత్రువులం గొట్టి కూల్చుటలో, భక్తుల భయమును వారించుటలో నేర్పుగన్న నాగలి, రోకలియు దాల్చి వెఱపుగొల్పు పందిముట్టెతో (వారాహివై) నీ వీ జగమున గ్రీడింతువు.

**స్మరమథన వరణలోలా మన్మథహేలా విలాసమణిశాలా**
**కనకరుచిచౌర్యశీలా త్వమంబ బాలా కరాబ్జధృతమాలా॥** ౯౧

కరముల నక్షమాలఁగొని కామవిలాసవిహార రత్నమం
దిరమయి పుష్పబాణుని వధించినవాని వరించు వేడుకన్
బరగెదు బాల నీవయి కనత్కనకప్రభ దొంగిలించు మేన్
స్ఫురణముతోడ నో త్రిపురసుందరి! వర్తిలు దీవు నీవయై.

కరములయం దక్షమాలగొని కామలీలా విలాసములకు మణిమందిరమయి మేలిమి బంగారుచాయను గాజేయు శరీరకాంతితో కరపద్మములందు మాలధరించియుందు బాలవు నీవు.

**విమలపటీ కమలకుటీ పుస్తక రుద్రాక్ష శస్త హస్తపుటీ**
**కామాక్షి పక్ష్మలాక్షీ కలితవిపంచీ విభాసి వైరించీ॥** ౯౨

కమలకుటిం జరించి సితకాంతిపటిం ధరియించి పుస్తక
మ్మమరగ నొక్కచేత, నొకహస్తపుటిన్ రుదురాకమాల యం
దముగొనఁ గామలోచన సతమ్ముఁజరించెదు పక్ష్మలాక్షివై
ప్రమదమునన్ బ్రపంచితవిపంచి విరించి వరించినట్టిదై.

అచ్చము తెల్లనిచీరగట్టికొని కమలమను కుటీరమున పుస్తకము, రుద్రాక్షమాల హస్తములందు దాల్చి వీణెమీటుచు ఓ కామాక్షీ! నీవ విరించి యిల్లాలవై (వాణివై) విలసిల్లుదువు.

**కుంకుమరుచిపింగ మసృక్పంకిల ముండాలి మండితం మాతః**
**జయతి తవ రూపధేయం జపపట పుస్తక వరాభయకరాబ్జమ్॥** ౯౩

కుంకుమశోణశోభమయి కొండొకరూపము రక్తవాహినీ
పంకిల ముండమండితము భాసిలునమ్మ భవత్స్వరూప మే
ణాంకకిరీటుభామిని వరాభయ పుస్తక చారుముద్రల
య్యంకొకచేత నింపు తులకింప జపాంశుక మద్రికన్యకా!

అమ్మా! రక్తపంకిలములగు పుర్రెలమాలనుబూని జపమాల పుస్తకమును వర ముద్రను దాల్చిన నాల్గుహస్తపద్మములతో కుంకుమవర్ణమై నీ రూపము సర్వోన్నతమై యలరును.

**కనకమణికలితభూషాం కాలాయసకలహశీల కాంతికలామ్**
**కామాక్షి శీలయే త్వాం కపాల శూలాభిరామ కరకమలామ్||** ౯౪

ఆయత దివ్యరత్న కనకాభరణన్ గనుగొందునమ్మ కా
లాయసకాంతితోడఁ దగవాడు శరీరముదాని శూలముం
జేయిఁ గపాల మింకొకటఁ జిత్రముగా ధరియించుదాని న
బ్జాయతచారులోచన ననన్యమతి న్నిను గామలోచనన్.

సువర్ణమయరత్నభూషణములు ధరించి కాలాయసముతో (ఇనుముతో) తగవాడు కాంతికళచే మించి కపాలమును, శూలమును కరకమలములందు వహించియుండు నిన్నే అన్వేషించెదను. (భావించెదను).

**లోహితిమపుంజమధ్యే మోహితభువనం ముదా నిరీక్షంతే**
**వదనం తవ కుచయుగలం కాంచీసీమాం చ కేఽపి కామాక్షి||** ౯౫

లోహితకాంతిపుంజమున లోపలిచాయ సమేయకాంతిస
మ్మోహితవిశ్వజాలమగు ముద్దుమొగంబుఁ గుచద్వయంబు సర్వోహితదాన.
దక్షమయి యింపులుగుల్కెడుఁ గాంచిసీమ ను
త్సాహమునం గనంగలరు ధన్యతముల్ మఱి వార లెవ్వరో.

అరుణకాంతిమండలమునడుమ భువనములెల్ల మోహింపజేయు నీ మోమును, గుచయుగమును, యొడ్డాణమునకు నెలవైన కటిభాగమును కాంచీసీమను నెవ్వరో ధన్యులు దర్శింపగల్గుదురు.

**జలధి ద్విగుణిత హుతవహ దిశా దినేశ్వర కలాశ్వినేయదలైః**
**నలినై ర్మహేశి గచ్ఛసి సర్వోత్తర కమలదల మమలమ్||** ౯౬

జలధి ద్విగుణితశిఖిదిక్ కలి తార్క్యకలాశ్వినేయ గణితదళమ్ముల్
గల కమలమ్ముల జని పై నలరు సహస్రారకమల మందెదు జననీ.

నాల్గు ఆఱు పది పండ్రెండు పదునాఱు రెండును నైన దళములుగల కమలములు అనగా వరుసగా మూలాధార -- స్వాధిష్ఠాన -- మణిపూర -- అనాహత -- విశుద్ధ -- ఆజ్ఞా చక్రముల వెంట నన్నిటికి మీదిదైన విమలమైన సహస్రారకమలదళమును బొందెదవు.

**సత్కృతదేశికచరణాః సబీజ నిర్బీజ యోగనిశ్శ్రేణ్యా**
**అపవర్గ సౌధవలభీ మారోహం త్యంబ కేఽపి తవ కృపయా॥** ౯౭

ఓ జననీ! త్వదీయకృపనొందిన కొందఱు దేశికాంఘ్రినీ
రేజములం భజించి యలరించి మన మ్మటుపై సబీజ ని
ర్బీజ సమాధియోగమను వింతగు నిచ్చెన మోక్షసౌధవి
భ్రాజితచంద్రశాల కటు పైపయి కెక్కెదరమ్మ శాంభవీ!

గురుచరణమును గట్టిగ బట్టుకొని సేవించిన అదృష్టవంతు లేకొందరో నీద యచే సబీజ నిర్బీజ సమాధిరూపమయిన నిచ్చెనవెంట మోక్షసౌధము పై మేడకు (చంద్రశాలకు) ఎక్కెదరమ్మా!

**అంతరపి బహిరపి త్వం జంతుతతే రంతకాంతకృ దహంతే**
**చింతితసంతానవతాం సంతతమపి తంతనీషి మహిమానమ్॥** ౯౮

చింతితసంతతి న్నినుభజించెడు జంతువులన్ దనంత న
త్యంతము నంతకాంతకృదహంత స్వరూపముగాఁ జరించి నీ
వాంతరమందు బాహ్యమున నద్భుతమౌ మహిమానుభావ మ
శ్రాంతము సంతరింతువు నిశాకరబింబ విడంబితాననా!

అంతకుని యంతముచేసిన శివుని అహంతారూపమైయున్న నీవు సర్వజీవులలోన వెలుపలను నున్నావు. అవిచ్ఛిన్నధ్యానధారాసంపన్నులయిన యోగులకు అనుపమ ప్రభావమును అనవరతము విస్తరింపజేయుచున్నావు.

**కలమంజుల వాగనుమిత గలపంజరగత శుక గ్రహౌత్కంఠ్యాత్**
**అంబ రదనాంబరం తే బింబఫలం శంబరారిణా న్యస్తమ్॥** ౯౯

కలికీ! నీ కలమంజుభాషణము లాకర్ణించి యూహించి నీ
గలమన్ పంజరమంద యున్నదని చిల్కన్; దానిఁబట్టంగఁ దా
నిలిపెన్ గావలె శంబరారి యెఱుగాన్ బింబంబు మేల్ డంబరం
బలరన్ నీ రదనాంబరం బదిగదా అంబా! కదంబప్రియా!

అవ్యక్తమధురములయిన నీ పలుకు లాలించి నీ గళమను పంజరములో తనక వాహనమైన చిలుక యున్నదని అనుమానించి దాని వెలికిరప్పించుటకు శంబరాఁ (మన్మథుడు) ఎఱగా బెట్టిన దొండపండుకదమ్మా నీ పెదవి.

**జయ జయ జగదంబ శివే జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే**
**జయ జయ మహేశదయితే జయ జయ చిద్గగన కౌముదీధారే||** ౧౦౦

జయ జయ జగదంబ శివా!
జయ జయ కామాక్షి! తుహినశైల కుమారీ!
జయ జయ మహేశదయితా!
జయ జయ చిద్గగన సాంద్ర చాంద్రీధారా!

ఓ జగన్మాతా! శివా! సర్వోన్నతురాలవై వర్తింపుము. కామాక్షి! హిమాచల కుమారీ! సర్వాతిశాయినివై యలరుము. మహేశునిల్లాలా! సర్వాధికవై యుండుము. జ్ఞానాకాశమున వలముకొనిన నిండువెన్నల ప్రవాహమా! నీవు సర్వవిశేషవై రాజిల్లుము.

**ఆర్యాశతకం భక్త్యా పఠతా మార్యాకటాక్షేణ**
**నిస్సరతి వదనకమలా ద్వాణీ పీయూషధోరణీ దివ్యా||** ౧౦౧

ఈ యార్యాశతకమ్ము భక్తిఁగొని తా రెవ్వారు కీర్తింతురో
ఆ యా పుణ్యుల యాస్యపద్మములయం దావిర్భవమ్మంది జా
లై యేవేళను వాణి వెల్లిగొనునమ్మా యద్భుతస్ఫూర్తి మై
పీయూషాంచితధోరణిన్ పరశివప్రేమానుసంధాయినీ!

ఈ ఆర్యాశతకమును భక్తితో బఠించువారి ముఖకమలమునుండి ఆర్యా కటాక్షముచే అమృతధోరణియైన దివ్యవాణి (అలౌకిక భాష) వెలువడును.

* * *



# పాదారవిన్ద శతకమ్

**మహిమ్నః పన్థానం మదనపరిపంథిప్రణయిని**
**ప్రభు ర్నిర్ణేతుం తే భవతి యతమానోఽపి కతమః**
**తథాపి శ్రీకాంచీ విహృతిరసికే కోఽపి మనసో**
**విపాక స్త్వత్పాద స్తుతివిధిషు జల్పాకయతి మామ్॥** ౧

స్మరహరుభామ! నీదు మహిమన్ సరవిన్ సరిగా గణించి యే
ర్పరుపగ నెంతమేటి యొకపాటియు యెంతటి యత్నమున్న నీ
శ్వరి! ఎగయించెఁ గాంచిపురసౌధవిహారవిశారదా! మనః
పరమవిపాకమేదొ నను త్వచ్చరణ స్తుతిజల్పనమ్ములన్.

ఓ కాంచీవిహారరసికా! నీ మహిమమార్గ మిట్టిదని నిర్ణయించుటకు ఎంతవాఁడును జాలఁడు. ఐనను నామనఃపరిపాక మేమో కాని నీ పాదములను కొనియాడుటలో నన్ను వాచాలుని జేయుచున్నది.

**గలగ్రాహీ పౌరందరపురవనీ పల్లవరుచాం**
**ధృతప్రాథమ్యానా మరుణమహసా మాదిమగురుః**
**సమింధే బంధూకస్తబక సహయుధ్వా దిశిదిశి**
**ప్రసర్పన్ కామాక్ష్యా శ్చరణకిరణానా మరుణిమా॥** ౨

శ్రీమన్నందనవాటికా కిసలయ శ్రీగొంతుకన్ బట్టి యా
పైమున్నౌ నరుణద్యుతిం దొలిగురుత్వంబూని 'బంధూకశో
భామాధుర్యముతో వివాదపడి నీవా నేన యం చుద్గతిన్
గామాక్షీచరణారుణస్ఫురణముల్ గ్రమ్మున్ దిగంతమ్ములన్.

కల్పతరుపల్లవకాంతులకు గళగ్రాహియై ఉదయసంధ్యారాగచ్ఛాయలకుఁ దొలి గురువై మంకెనపూగుత్తులతో తగవాడునదై కామాక్షి చరణకిరణ రక్తిమ దిశదిశలం దలమి వెల్గొందుచున్నది.

మరాలీనాం యానాభ్యసనకలనా మూలగురవే
దరిద్రాణాం త్రాణవ్యతికర సురోద్యానతరవే
తమస్కాండప్రౌఢి ప్రకటన తిరస్కారపటవే
జనోఽయం కామాక్ష్యా శ్చరణనలినాయ స్పృహయతే|| 3

వరహంసమ్ముల కందమౌ నడక లభ్యాసమ్ము గావింపగన్
గురువై పేదలపాలి కల్పతరువై గోరాడి యంతస్తమః
పరమప్రౌఢి నెసంగు శాంభవి పదాబ్జద్వంద్వ మత్యంతసుం
దరముం గూర్చియ వీఁడు ముచ్చటపడుం దర్శింప నర్చింపగన్.

రాయంచలకు నడకనేర్పు మొదటిగురువై, దరిద్రుల సంరక్షించునెడ కల్పతరువై, చీకఁటుల యౌద్ధత్యప్రకటన మెదిరించుదిట్టయై యున్న కామాక్షీచరణకమలములకొఱకు వీడు (నే నన్నమాట) వేడుకపడుచున్నాడు.

వహంతీ సైందూరీం సరణి మవనమ్రామరపురీ
పురంధ్రీసీమంతే కవికమల బాలార్కసుషమా
త్రయీసీమంతిన్యాః స్తనతటనిచోలారుణపటీ
విభాంతీ కామాక్ష్యాః పదనలినకాంతి ర్విజయతే|| ४

వరసైందూరరుచిన్ వహించి వినమత్ స్వర్భామినీ దివ్యసుంద
దర సీమంతములన్ గవీంద్రకమలాంత ర్బాలభానుప్రభా
స్ఫురణమ్మై శ్రుతిసుందరీ కుచగిరి ప్రోద్యన్నిచోలారుణాం
బరమై యొప్పెడు శాంభవీచరణ శుంభత్పద్మరాగప్రభల్.

చెంత్రవాలెడి దేవకాంతల సీమంతసీమలందు/ కుంకుమరేఖయై కవులనెడి కమలములు వికసింప బాలసూర్యప్రభయై శ్రుతికామినీకుచతటములం దెఱ్ఱని పైటచెఱఁగై కామాక్షి చరణారవిందరుచి సర్వోన్నతమై యలరుచున్నది.

ప్రణమ్రీభూతస్య ప్రణయకలహత్ర స్తమనసః
స్మరారాతేశ్చూడానియతి గృహమేధీ హిమకరః
యయో స్సాంధ్యాం కాంతిం వహతి సుషమాభి శ్చరణయో
స్తయో ర్మే కామాక్ష్యా హృదయ మపతంద్రం విహరతామ్||

పొలయలుకన్ భయంపడుచు మున్ వినతుండగు శంభుదేవునౌ
దల దివి నిల్లుదీర్చు శశి దాలుచు నచ్చపు సాంధ్యరాగ మే
లలితపదారవిందరుచులం, బరమేశ్వరి యీ పదమ్ములం
దెలమిని నా మనమ్ము విహరించుత జాడ్యమువాసి నిచ్చలున్.

ప్రణయకలహమున భయవివశమైన మనసుతో వ్రాలిన శంకరుని శిరస్సనెడి ఆకాశమందు ఒకయింటివాఁడైయున్న చంద్రుడు ఏ తల్లిపాదముల కాంతిచే సంధ్యారాగ కాంతిని వహించునో అట్టి కామాక్షీదేవిచరణములందు నా మనసు మెలకువతో విహరించుగాక!

యయోః పీఠాయన్తే విబుధముకుటీనాం పటలికా
యయో స్సౌధాయన్తే స్వయ ముదయభాజో ఫణితయః
యయో ర్దాసాయన్తే సరసిజభవాద్యా శ్చరణయో
స్తయో ర్మే కామాక్ష్యా దిన మను వరీవర్తు హృదయమ్|| ౬

సురమకుటాళి వేనికడ సొంపులుగుల్కును బాదపీఠమై
వరకవిసూక్తు లుల్లసిలి వాటికవే యెట సౌధయోగతన్
బొరయు విధీంద్రముఖ్యు లెట ముందట దాసులరై చరింతు రా
పరశివభామినీ చరణపద్మములన్ హృదయమ్ము నిల్చుతన్.

దేవతాకోటికిరీటకోటి దేనికి పాదపీఠ మగునో, తమంతట నుదయించు కవితా రీతులు వేనికి సౌధములు (మేడలు) అగునో, బ్రహ్మాదులు వేనికడ దాసులగుదురో, యట్టి కామాక్షీచరణములందు నా హృదయ మనుదినము వర్తించుగాక!

నయన్తీ సంకోచం సరసిజరుచం దిక్పరిసరే
సృజన్తీ లౌహిత్యం నఖకిరణ చంద్రార్ధ ఖచితా
కవీంద్రాణాం హృత్కైరవ వికసనోద్యోగజననీ
స్ఫురన్తీ కామాక్ష్యా శ్చరణ రుచిసంధ్యా విజయతే|| ౭

కమలచ్ఛాయ నడంచి దిక్తటములం గల్పించి కెంజాయ స్వీ
యమృదుశ్రీనఖ రేఖ జంద్రకళచాయం దాపినట్లై కవీం
ద్రమనఃకైరవ సంవికాసజననీత్వ మ్మంది కామాక్షి పా
దములం గాంతి సమున్నతింబొలుచు సంధ్యాస్ఫూర్తిమ న్మూర్తియై.

కామాక్షీచరణకాంతియను సంధ్య పద్మప్రభను సంకోచింపజేయునదై నఖకాంతికిరణమనెడి అర్ధచంద్రునిచే బొదువఁబడినదై దిశలయందు అరుణకాంతి నుదయింపఁజేయునదై కవుల హృదయములనెడి కలువలకు వికాసారంభముఁ గూర్చునదై సర్వాతిశాయియై యొప్పుచున్నది.

విరావై ర్మాంజీరైః కిమపి కథయన్తీవ మధురం
పురస్తా దానమ్రే పురవిజయిని స్మేరవదనే
వయస్యేవ ప్రౌఢా శిథిలయతి యా ప్రేమకలహ
ప్రరోహం కామాక్ష్యా శ్చరణయుగలీ సా విజయతే|| ౮

మాంజీరధ్వని నేదొ పల్కునదియై మాధుర్యధుర్యంబుగన్
సంజాతస్మితరోచియై శివుఁడు సాష్టాంగంపడన్ యుక్తి దో
పం జెల్మి న్నెఱజాణనాఁ బ్రణయకోపమ్మంకుర మ్మంతనం
తం జక్కన్ సడలించు శాంభవి పదాంతశ్శోభ చెల్వొందెడున్.

అందెలరవళిచే నేమేమొ మధురముగ మాట్లాడుచున్నట్లుండి తనముందు నవ్వుచు వ్రాలిన శివుని ప్రణయకలహాంకురమును సడలించుటలో ప్రౌఢయగు చెలికత్తెవలె వర్తించు కామాక్షి చరణయుగళి సర్వోన్నతితో నలరుచున్నది.

సుపర్వస్త్రీ లోలాలక పరిచితం షట్పదచితైః
స్ఫుర ల్లాక్షారాగం తరుణతరణిజ్యోతి రరుణైః
భృతం కాంత్యంభోధి ర్విసృమరమరందై స్సరసిజై
ర్విధత్తే కామాక్ష్యా శ్చరణయుగలం బంధుపదవీమ్|| ౯

అమరస్త్రీ చలితాలకల్ పరిచయమ్మై లాక్షపారాణి పొం
కములం గుల్కుచు బాలభానురుచులై కాంత్యంబురానుషం
గములై శ్రీచరణంబు లయ్యళులు మూగన్ గెంపుతోగన్ మరం
దము జాలెత్తిడి తమ్ములందుఁ గ్రమబాంధవ్యంబు వాటించెడిన్.

దేవతాస్త్రీల చలించుముంగురులతో గూడి తుమ్మెదలతో గూడి పారాణి, లాక్షారాగముతో నెరనెరనై కామాక్షిచరణము బాలభాను ప్రభలచే నెరుపెక్కినట్టియు, కాంతిపుంజముచే నిండి జాలుకొను తేనియలతో నిండినట్టియు పద్మములతో చుట్టరికము నెఱపుచున్నది.

రజస్సంసర్గేఽ స్థితి మరజసా మేవ హృదయే
వరం రక్తత్వేన స్థితమపి విరక్తై కశరణమ్
అలభ్యం మందానాం దధదపి సదా మందగతితాం
విధత్తే కామాక్ష్యా శ్చరణయుగ మాశ్చర్యలహరీమ్|| ౧౦

జరిగి రజస్సుతోన నరజస్క మనఃస్థితిఁగాంచి రక్తిమం
బరగి విరక్తయోగి శరణమ్మయి మందజనానవాప్యమై
వరలి యమందమందగతిభాసురమై తనరారు శాంభవీ
చరణయుగంబు నించు మము సారెకు వింతలవింతవెల్లువన్.

రజస్సంపర్కము (పరాగసంబంధము) గలదయ్యు రజోగుణ సంబంధము లేని వారి హృదయమునందే నిల్చినదై, మిగుల రక్తమయ్యు (ఎఱ్ఱనిదయ్యు) విరక్తులకు మాత్రమే ప్రధానాశ్రయమై మందమతులకు అలభ్యమయ్యు ననవరతము మందగతిని (మెల్లని నడకను) పూనినదై కామాక్షీ చరణద్వంద్వ మాశ్చర్యపు వెల్లువను జాల్కొలుపుచున్నది.

జటాలా మంజీర స్ఫురదరుణ రత్నాంశునికరై
ర్నిషీదంతీ మధ్యే నఖరుచిరఝరీ గాంగపయసాం
జగత్త్రాణం కర్తుం మమ జనని కామాక్షి నియతం
తపశ్చర్యాం ధత్తే తవ చరణపాథోజ యుగలీ|| ౧౧

మంజీరారుణ రత్న కాంతిచయ సంపత్తిన్ జటాధారియై
రంజిల్లి నఖకాంతిపూర మను గంగాతీర్థ మధ్యమ్మునం
దుం జక్కన్ దపమాచరించును జగత్తున్ బ్రోవఁ గామాక్షి నీ
శింజన్నూపుర చారుదివ్య చరణశ్రీరేఖ యుద్యద్రుచిన్.

అందెలయందు బొదుపఁబడిన పద్మరాగముల తళుకులచే జటాధారియై నఖకాంతిప్రవాహ మను గంగాజలమధ్యమున నిలువఁబడి జగద్రక్షణము సేయుటకై నీ చరణపద్మద్వయి తపోనిష్ఠను బూనియున్నది.

తులాకోటిద్వంద్వ క్వణిత ఫణితాభీతివచసో
ర్వినమ్రం కామాక్షి విస్మృమర మహఃపాటలితయోః
క్షణం విన్యాసేన క్షపిత తమసో ర్మే లలితయోః
పునీయా న్మూర్ధానం పురహరపురంధ్రీచరణయోః|| ౧౨

అందెల|మ్రోఁతచేత నభయమ్ములు వల్కుచుఁ గాంతిచేత నె
ఱ్ఱందన మొంది యందముల రంజిలి ఘోరతమంబుఁ జించి యిం
పొందుపదమ్ము నొక్కక్షణ మొప్పగ శంభుపురంధ్రి నా శిరం
బందున నిల్పి నిండగు దయన్ నను బావనుఁజేయుఁగావుతన్.

అందెలరవళిచే నభయములు పలుకుచు కాంతిచే నెఱ్ఱనివై సొగసు గుల్కుచు తమస్సును హరించు తన పాదములను ఒక్క క్షణము నా శిరమునందు మోపి యప్పురహరుని ఇల్లాలగు కామాక్షి నన్ను పవిత్రుని జేయుగాక!

భవాని ద్రుహ్యేతాం భవనిబిడితేభ్యో మమ ముహు
స్తమో వ్యామోహేభ్య స్తవ జనని కామాక్షి చరణౌ
యయో ర్లాక్షాబిందు స్ఫురణధరణా ద్ధూర్జటిజటా
కుటీరా శోణాఙ్కం వహతి వపు రేణాఙ్కకలికా|| ౧౩

ఘనమౌ నే చరణమ్ములం దలరు లాక్షారాగవిస్ఫూర్తిచే
జననీ! శంభుజటాకుటిం గులుకు నా జాబిల్లిపూమొగ్గ యె
ఱనిరూపుం గొను, నట్టి నీ చరణముల్ రంజిల్లి సంసారమన్
వని నాలో నిబిడీకృతాంతరతమోవ్యామోహమున్ జెండుతన్.

ఓ భవానీ! శివజటాకుటీరమం దలరు చంద్రరేఖ యే చరణములందలి లాక్షారాగబిందు స్ఫురణము (చుక్క) దాల్చి కుంకుమతిలకము దిద్దుకొన్నట్లుండునో యట్టి నీ చరణములు సంసారముచే గాఢముగ నల్లుకొనిన మదీయ తమోగుణ వ్యామోహ పరంపరను నశింపజేయుగాక!

పవిత్రీకుర్యు ర్నః పదతలభువః పాటలరుచః
పరాగాస్తే పాపప్రశమన ధురీణాః పరశివే
కణం లబ్ధుం యేషాం నిజశిరసి కామాక్షి వివశా
వలన్తో వ్యాతన్వ న్త్యహమహమికాం మాధవముఖాః|| ౧౪

నలుపైనన్ దలఁదాల్పఁగా వివశులై నారాయణుం డాదిగాఁ
గల బృందారకబృంద మేమనుచు నో కామాక్షి! యే నీ పద
మ్ములవెంటన్ వలగొందు, రెల్లదురితమ్ముల్ వాపు నా పాటల
మ్ములడాల్నించు పరాగపుంజము మముం బుణ్యాత్ముల జ్జేయుతన్.

ఓ పరశివా! విష్ణుప్రముఖులైన దేవతలు వేని పరాగలేశమును తమ తలఁదాల్చుటకై యెడనెడ వివశులై పరిభ్రమింతురో యట్టి నీ చరణపరాగములు అరుణద్యుతిచే గుల్కుచు పాపహరణనిపుణములై మమ్ముఁ బవిత్రులఁ జేయుగాక!

**బలాకామాలాభి ర్నఖరుచిమయీభిః పరివృతే**
**వినమ్ర స్వర్నారీ వికచకచ కాలామ్బుదకులే**
**స్ఫురన్తః కామాక్షి స్ఫుటదలిత బన్ధూక సుహృద**
**స్తటి ల్లేఖాయన్తే తవ చరణపాథోజకిరణాః||** ౧౫

అచ్చములౌ నఖప్రభల యాకృతి బెగ్గురు లావరింపఁగా
వచ్చి వినమ్రమైన సురభామల వేనలి నిండుమబ్బులన్
ముచ్చట నించు నో జనని! మొల్లములై నెఱిమించు తీఁవలై
విచ్చినమంకెనం జెలిమి వెట్టెడు నీ చరణాంబుజచ్ఛటల్.

చక్కగ వికసించిన మంకెనపూల కీడుజోడులగు నీ చరణపంకజప్రభలు నఖప్రభారూపములైన బెగ్గురు పక్షులమాలచే నావరింపఁబడినదగు వినమ్రమైన దేవతాస్త్రీల కబరీభరమనెడి వర్షాకాలమేఘపంక్తియందు ప్రసరించి మెరుపుతీగలట్లు శోభించుచున్నవి.

**పరాగః సద్వేషః ప్రసృమరసరోజే ప్రతిదినం**
**నిసర్గా దాక్రామ న్విబుధజన మూర్ధాన మధికమ్**
**కథంకారం మాతః కథయ పదపద్మ స్తవ సతాం**
**నతానాం కామాక్షి ప్రకటయతి కైవల్యసరణిమ్||** ౧౬

విలసిలుపద్మకోశముల ద్వేషము రాగము పూని యే దిన
మ్మల విబుధాళిమౌళిశిఖ నక్కొనకెక్కెడు నీ పదాబ్జ మే
వలనునఁ జాటనేరుచునొ పల్కగదమ్మ నిజాంతికమ్మునన్
వలగొని వ్రాలు సాధులగువారలకున్ వరముక్తి సంపదన్.

దినదినము సరాగమై పద్మకోశములయెడ ద్వేషమును గొని పద్మములకంటె అందమయి విబుధజనుల తలపై కెక్కి త్రొక్కెడు నీ చరణపద్మము తనదరిని వ్రాలు సత్పురుషులకు కైవల్యసంపద నిత్తునని చాటించుచున్నది. ఇది యెట్లో చెప్పవమ్మా!

ధనమిచ్చుదానికి పద్మము శంఖము అర్బుదము మొదలైనలెక్కగల కోశమునెడల (ధనరాశియెడల) విముఖతయుండదు. విబుధజనులయెడల వినయముగూడ దాని లక్షణము.

ఈ రెండు ధర్మములు విరుద్ధములై యున్న పాదము మోక్షసంపదను తనవారి కిత్తు నని ప్రకటించుట అసంభవము. ఐన నట్టిపని నీ చరణము సేయుచున్నదని చమత్కారము. సహజమైన రాగము పద్మములయెడ ద్వేషముగల పాదము రాగ ద్వేషాదిద్వంద్వదూరమైన కైవల్యమును ఇచ్చుచున్నదని మూలశ్లోకచమత్కారము. అదియట్లుండగా పద్మకోశము = ముక్తిసంపద అను శబ్దములందు షట్కామలములు. మౌళిశిఖ = సహస్రారము యోగశాస్త్ర విశేషముల భావవిశేషము అనువాదమున స్ఫురింపఁజేయబడినది ఇది విరోధాభాసాలంకారము.

**జపాలక్ష్మీశోణో జనిత పరమజ్ఞాన నలినీ**
**వికాస వ్యాసఙ్గో విఫలిత జగజ్జాడ్యగరిమా**
**మనఃపూర్వాద్రిం మే తిలకయతు కామాక్షి తరసా**
**తమస్కాణ్డద్రోహీ తవ చరణ పాథోజరమణః||** ౧౭

పరమ జ్ఞానసరోజ సంవికసన వ్యాసంగుఁడై శ్రీజపా
సరణిన్ వెల్గుచు విశ్వమాంద్య ముడిగింప న్నేర్పుకాఁడై భవ
చ్చరణాంభోరుహ వల్లభుం దురుతమస్కాండంబుఁ జెండాఁడి ది
వ్యరుచిన్ నా హృదయోదయాద్రి తిలకమ్మోఁ గావుతం దల్లిరో.

నీ చరణమను సూర్యుఁడు దాసానిపువ్వువలె నెఱుపొంది పరమార్థ జ్ఞాన రూపమైన పద్మినికి వికాసము కూర్చువాఁడై జగములందలి గాఢమైన జాడ్యమును హరించువాఁడై యిప్పుడు నా మనసనెడి యుదయాద్రిం దిలకమై తులకించుగాక !

**నమస్కుర్మః ప్రేఙ్ఖ న్మణికటక నీలోత్పలమహః**
**పయోధౌ రిఙ్ఖద్భి ర్నఖకిరణ ఫేనై ర్ధవలితే**
**స్ఫుటం కుర్వాణాయ ప్రబల చలదౌర్వానలశిఖా**
**వితర్కం కామాక్ష్యాః సతత మరుణిమ్నే చరణయోః||** ౧౮

గణుతి లస న్నఖాంశురుచి గ్రమ్మెడు నుర్వుల వెల్లనైన శ్రీ
మణికటకాసితోత్పల సమంచిత కాంతిపయోధివీచి ను
ల్బణమగు బాడబానల కలాప మొకో యనిపించు దేవతా
మణిచరణంబులం దరుణిమన్ వినుతించి నమస్కరించెదన్.

అలముకొను నఖకాంతులనెడి నురువులచే వెల్లనై మిరుమిట్లుగొలుపు మణిమంజీరములందలి యింద్రనీల కాంతియను సముద్రమునందు దీవ్రముగ రేగిన బడబాగ్నిజ్వాలలోయను నూహను కల్పించెడి కామాక్షీచరణముల అరుణప్రభకు నమస్కరితుము.

శివే పాశాయేతా మలఘుని తమః కూపకుహరే
దినాధీశాయేతాం మమ హృదయ పాథోజవిపినే
నభోమాసాయేతాం సరసకవితారీతి సరితి
త్వదీయౌ కామాక్షి ప్రసృతకిరణౌ దేవి చరణౌ|| ౧౯

కామ్మా ! పగ్గములౌత నూతగ తమఃకూపంబులో సూర్య బిం
బమ్ముల్ గావుత నమ్మ మామక మనఃపద్మాటవీవాటి ని
త్యమ్మున్ శ్రావణమాసమౌత కవితాధారాసరిద్వేణి కో
యమ్మా ! నీ చరణమ్ము లాత్తకిరణవ్యక్తప్రభాసారణుల్.

దేవీ ! నీ చరణములు ప్రకాశకిరణములు వ్యాపింపగా దరిలేని తమఃకూపము నుండి జీవుల నుద్ధరించు పగ్గము లగుగాక ! నా హృదయమను తామరకొలనిఁ వికసింపఁజేయు సూర్యబింబము లౌగాక ! సరసకవితాసరోవరము నుత్తరంగితముఁ యుటకు శ్రావణమాసము లగుగాక !

నిషక్తం శ్రుత్యంతే నయనమివ సద్వృత్తరుచిరైః
సమైర్జుష్టం శుద్ధై రధరమివ రమ్యై ర్ద్విజగణైః
శివే వక్షోజన్మద్వితయ మివ ముక్తాశ్రిత ముమే
త్వదీయం కామాక్షి ప్రణతశరణం నౌమి చరణమ్|| ౨౦

అనయమ్మున్ నయనమ్మటుల్ శ్రుతుల యయ్యంతంబులం దాకి యిం
పెనయన్ స్వచ్ఛతచే సమత్వయుతిచే నింపౌ ద్విజశ్రేణి చా
యను దా నయ్యధరంబటుల్ మసలి ముక్తాలంబమై యొప్పి సు
స్తనయుగ్మమ్మటు వొల్చు నీపదము భక్తప్రార్థ్యమున్ మ్రొక్కెదన్.

శ్రుతి+అంతే=శ్రుత్యంతే, చెవిచివరదాక, నిషక్తం=ఉన్న, నయనమివ= కన్నువలె, శ్రుత్యంతే=వేదాంతమందు, నిషక్తమ్=ఉన్నది. సత్‌వృత్తరుచిరైః= గుండ్రనైనట్టియు, సమైః=సమముగానున్నట్టియు, రమ్యైః=అందమైనట్టియు, ద్విజగణ=పలువరుసచేత, అధరమివ=పెదవివలె, సద్వృత్తరుచిరైః=సచ్ఛీలురు, సమైః=సర్వసములు, శుద్ధైః=శుచిత్వసంపన్నులు, రమ్యైః=రమ్యులు అగు, ద్విజగణైః=విప్రసంఘములచే, పలువరుసచే, జుష్టమ్= సేవింపబడుచున్నది. ముక్తాశ్రితమ్=ముత్యాలమాల కాశ్రయమైన, వక్షోజన్మద్వితయమివ= కుచయుగమువలె, ముక్త+ఆశ్రితమ్=ముక్తులచే నాశ్రయింపబడినది, ప్రణతశరణమ్=ప్రణతులైనవారికి దిక్కైనదియు నగు త్వదీయం చరణం నౌమి= నీ చరణమును మ్రొక్కెదను.

నమస్యా సంసజ్జ న్నముచిపరిపంథి ప్రణయినీ
నిసర్గ ప్రేఙ్ఖోల త్కురలకుల కాలాహిశబలే
నఖచ్ఛాయా దుగ్ధోదధి పయసి తే వైద్రుమరుచాం
ప్రచారం కామాక్షి ప్రచురయతి పాదాబ్జసుషమా|| ౨౧

వ్రాలి నమస్కరించు సురవల్లభువల్లభవేణి నల్లత్రా
చై లలి నల్పు సేయఁగ నఖాంకురకాంతి పయఃపయోధి పై
జాలున విద్రుమప్రభ ప్రచారము పెంపొనరించుచున్న వం
— లలిత త్వదీయ చరణాబ్జ లసచ్ఛుషమా విశేషముల్

నమస్కరించుటకు దాపునవ్రాలిన శచీదేవియొక్క చెదరెడిముంగురులనెడి నల్లత్రాచుచే శబలితమైన నఖకాంతులనెడి పాల్కడలియందు నీ పాదారవిందముల కాంతి పవడంబుడంబును పెనుపొందఁ జేయుచున్నది.

కదా దూరీకర్తుం కటుదురితకాకోలజనితం
మహాన్తం సంతాపం మదనపరిపంథి ప్రియతమే
క్షణాత్తే కామాక్షి త్రిభువన పరీతాప హరణే
పటీయాంసం లప్స్యే పదకమలసేవామృతరసమ్|| ౨౨

ఓ లలితాంబ ! ఆకటుపటూద్భట ముత్కటఘోరపాపకా
కోలవిషమ్ముచేఁ గలుగు కొండొకతాపము నార్ప శంభుని
ల్లాల ! క్షణమ్ములో ద్రిభువనాంతర తాపమడంచు త్వత్పదా
బ్జాలఘుసేవనామృతరసౌషధ మెన్నఁడు వొంద నేర్తునో !

ఓ కామారిసుందరీ ! చేదువిషపాతకమగు గరళము వలని మహాతాపమును వారింపచేసికొనుటకు త్రిభువనపరితాప నిర్హరణచణమైన నీ చరణకమల సేవాచరణ రూపమైన యమృతరసము నేనాటికి బడయగలనో కదా !

యయోః సాంధ్యం రోచిః సతత మరుణిమ్నే స్పృహయతే
యయో శ్చాంద్రీ కాంతిః పరితపతి దృష్ట్వా నఖరుచిమ్
యయోః పాకోద్రేకం పిపఠిషతి భక్త్యా కిసలయం
మ్రదిమ్నః కామాక్ష్యా మనసి చరణౌ తౌ తనుమహే|| ౨౩

ఎన్నడు సాంధ్యరోచి యది యే యరుణప్రభ కిచ్చసేయునో
ఉన్నతి నే నఖద్యుతి నహో ! గని వెన్నెల వేడిసెందునో
ప్రన్నని క్రొన్ననల్ మృదులపాక మెటం జదుపంగఁ గోరునో
యెన్నెద మాత్మలోనఁ బరమేశ్వరి యా చరణారవిందముల్.

ఏ పాదములందలి అరుణచ్ఛాయ వడయువలెనని సాంధ్యరాగము ముచ్చటపడునో ఏ చరణముల నఖకాంతికి వెన్నెల మిక్కిలి తాపమొందునో యే యడుగుల మార్దవపరిపాకాతిశయమును లేజిగురు లాసక్తిమై నభ్యసింపగోరునో అట్టి శ్రీకామాక్షీదేవి దివ్యచరణములను మనసునందు నిలిపికొందును.

జగన్నేదం నేదం పర మితి పరిత్యజ్య యతిభిః
కుశాగ్రీయ స్వాన్తైః కుశలధిషణైః శాస్త్రసరణౌ
గవేష్యం కామాక్షి ధ్రువ మకృతకానాం గిరిసుతే
గిరా మైదంపర్యం తవ చరణమాహాత్మ్యగరిమా|| ౨౪

ఈయది లేదు లేదనుచు నీగి యతుల్ సువిమర్శమై కుశా
గ్రీయమతిన్ గ్రహించెదరు కేవలశాస్త్రపథంబులం బరి
జ్ఞేయము సుప్రకాశ మది నీ చరణాంబురుహప్రభావ మా
స్థాయుతి నయ్యకృత్రిమవచస్తుతి పర్యవసాన మమ్మరో !

నైజముగ కుశాగ్రబుద్ధులు శాస్త్రరీతులయందుకూడ కుశలప్రజ్ఞులు అయిన యతులు పరతత్త్వ మిదికా దిదికాదని యీ జగమ్మును నిరసించినవారఁదట అకృత్రిమవాక్కులకు (వేదములకు) ఐదంపర్యము ఇదే పర్యవసానార్థము అనగా నీ చరణప్రభాసంపదను అన్వేషింతురు.

కృతస్నానం శాస్త్రామృతసరసి కామాక్షి నితరాం
దధానం వైశద్యం కలితరస మానందసుధయా
అలంకారం భూమే ర్మునిజనమనశ్చిన్మయ మహో
పయోధే రంతస్థం తవ చరణరత్నం మృగయతే|| ౨౫

సతతమ్మున్ సకలాగ మామృతసరః స్నానమ్ము గావించి అ
ద్భుత మానందసుధా రసానుభవమందున్ స్వచ్ఛతంగాంచి యీ
క్షితికిన్ భూషణమై మునీశ్వరమన శ్చిత్సాగరాంతస్థమై
స్తుతిరమ్యమ్మగునమ్మ నీ చరణ మిచ్చో మాకు గమ్యంబగున్.

శాస్త్రములనెడి యమృతసరస్సులో స్నానము చేసినది యెంతయు వైశద్యమును (స్వచ్ఛత్వమును) దాల్చినది. ఆనందామృతరసభరితము, భువనాభరణమును మునుల మనస్సనెడి చిన్మయమహాసాగరము లోలోననున్న నీ చరణమను రత్నము వెదకిపట్టదగి యున్నది.

**మనోగేహే మోహోద్భవ తిమిరపూర్ణే మమ ముహు**
**ర్దరిద్రాణీకుర్వ న్దినకర సహస్రాణి కిరణైః**
**విధత్తాం కామాక్షి ప్రసృమర తమో వఞ్చనచణః**
**క్షణార్థం సాన్నిధ్యం చరణమణిదీపో జనని తే||** ౨౬

అమ్మరో! గాఢమోహతమ మల్లిన నాదగు చిత్తమన్న గే
హమ్మునఁ జిమ్మచీకటిని యంతముసేయఁగలట్టి నీదు పా
దమ్మను రత్నదీపమణి తాను క్షణార్ధము తోఁచుఁగాక స్వీ
యమ్మగు కాంతి భాస్కరసహస్రము పేదవడంగ జేయుచున్.

అమ్మా! మోహముచే బుట్టిన చీఁకటులు గ్రమ్మిన నా మనోగృహమందు లోలో నలముకొన్న తమస్సును హరింప నిపుణమైన నీ చరణమణిదీపము స్వీయకిరణములచే సూర్యబింబసహస్రమును బేదపడజేయుచు అర్ధక్షణమైన నాకు సాన్నిధ్యమనుగ్రహించు నుగాక!

**కవీనాం చేతోవ న్నఖరరుచిసంపర్కి విబుధ**
**స్రవన్తీస్రోతోవ త్పటుముఖరితం హంసకరవైః**
**దినారమ్భశ్రీవ న్నియత మరుణచ్ఛాయ సుభగం**
**మదన్తః కామాక్ష్యాః స్ఫురతు పదపఙ్కేరుహయుగమ్||** ౨౭

అది నఖరాంశుసంగత మయారె! కవీంద్రుల చిత్తమట్టు ల
య్యది విబుధస్రవంతివలె హంసక సుస్వనయుక్తి మ్రోయు న
య్యది తొలిసంజ మేలుసిరియ ట్లరుణోదయశోభనమ్ము నీ
పదకమలద్వయ మ్మది సదా స్ఫురియించునుగాక నా మదిన్.

కవీనామ్=కవులయొక్క న+ఖర+రుచి సంపర్కి=కఠినభావ సంపర్కములేనిది (శ్లేష) నఖర+రుచి సంపర్కి=గోళ్లకాంతులతోఁ గూడినది, హంసకరవైః=రాయంచ కూతలచే, పటుముఖరితం=మిగుల ప్రతిధ్వనించు, విబుధస్రవంతీస్రోతోవత్=గంగా ప్రవాహమువలె, హంసకరవైః ముఖరితమ్= అందెలచప్పుడులచే ధ్వనితమైనది. హంసక=

అందె, అరుణచ్ఛాయసుభగమ్=అరుణోదయకాంతిచే సుందరమైన, దినారంభ శ్రీవత్= ఉషఃకాలశోభవలె, అరుణచ్ఛాయసుభగమ్=అరుణకాంతిచే మధురమయిన, కామాక్ష్యాః పదపంకేరుహయుగమ్=శ్రీపాదపద్మద్వంద్వము మదంతః స్ఫురతు=నాలోపల స్ఫురించు గాక!

సదా కిం సంపర్కా త్ప్రకృతికఠినై ర్నాకిముకుటై
స్తటైః శ్రీహారాద్రే రధిక మణునా యోగిమనసా
విభిన్తే సంమోహం శిశిరయతి భక్తానపి దృశా
మదృశ్యం కామాక్షి ప్రకటయతి తే పాదయుగలీ|| ౨౮

అమ్మ! స్వభావకర్కశములౌ సురనాయక మౌళికోటితో
నమ్మిహిరాద్రితోడ నణువౌ మునిచిత్తముతోడ నిత్యసం
గమ్మననా? భవత్పదయుగ మ్మిది మోహము ప్రీల్చుఁ జల్లనే
యుమ్మటి భక్తచిత్తముల నొప్పఁగఁజూపు నదృశ్యవస్తువున్.

సహజకఠినములైన దేవతల కిరీటములతోడి నిత్యసంపర్కమువలననా యేమమ్మా నీ పాదయుగళి సమ్మోహమును భేదింపజేయుగల్గుచున్నది? మంచుకొండచరియల పరిచయము చేతనా యేమి భక్తులను చల్లబరుపగల్గుచున్నవి? అణుమాత్రమైన (సుసూక్ష్మమైన) యోగిమనసుతోడి అనుబంధముచేతనా యేమి దృశ్యముకాని వస్తువును (బ్రహ్మపదార్థమును) సుస్పష్ట మొనర్చుచున్నది?

పవిత్రాభ్యా మంబ! ప్రకృతిమృదులాభ్యాం తవ శివే!
పదాభ్యాం కామాక్షి! ప్రసభ మభిభూతైః సచికతైః
ప్రవాలై రంభోజై రపి చ వనవాసవ్రతదశాః
సదై వారభ్యన్తే పరిచరిత నానాద్విజగణైః|| ౨౯

లలితములున్ స్వభావమృదులమ్ములు పుణ్యములైన నీ పద
మ్ములకు భయమ్మునెంది యభిభూతములై పవడమ్ము లంబుజ
మ్ములును ద్విజాళితోడి యొక పొందు ఘటింపగఁ జేసికొంచు ని
చ్చలు వనవాససువ్రతదశన్ జలుపం దొరకొన్న వంబరో!

పవిత్రములు సహజమృదులములు నైన నీ పాదములచే దిరస్కృతములై జడిసి పోయిన పవడములు, పద్మములును ద్విజాళిపరిచర్యసేయుచు (బ్రాహ్మణసేవ చేయుచు) (శ్లేష) పక్షులను సేవించుచు, హంసలను గొలుచుచు నెల్లప్పుడు వన (జల) వాసవ్రత

దశను పవడములక్షమములో అరణ్యమందుండిచేయు ప్రతదశను ఆరంభించినవి. పవడములకంటె పద్మములకంటెను నీ పాదములు మృదులములని భావము.

చిరాద్దృశ్యా హంసైః కథమపి సదా హంససులభం
నిరస్యన్తీ జాడ్యం నియత జడమధ్యైకశరణమ్
అదోషవ్యాసఙ్గాత్ సతతమపి దోషాప్తిమలినం
పయోజం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగళీ|| 30

కననౌ హంసల నెన్నడో యది యిదో కన్పట్టు హంసాళిచెం
తన మూగన్, హతజాడ్య మియ్యది జడాంతర్వర్తియౌనద్ది, యెం
దు నదోషాశ్రయ మిద్ది, దూషిత మదో దోషాప్తి నా పద్మమున్
గని యీా నీ చరణాంబుజద్వితయ మో కామాక్షిరో! నవ్వెడిన్.

కామాక్షీచరణయుగము హంసలచే=యత్యాశ్రమవిశేషులచే ఎన్నటికోచూడబడునదై హంసలకు సులభమైయున్న పద్మమును జూచి పరిహసించుచున్నది. తాను జడత్వమును నిరసించి నియతముగ జడ (జల) మధ్యమందుండు పంకజమును గని హేళనచేయుచున్నది. దోషవ్యాసంగములేని నీ పాదయుగము నిరంతరము దోష+ఆప్తి మలినమ్=రాత్రి సంబంధముచే మలినమగు (మూసికొనిపోవు) పద్మమునుజూచి నవ్వుచున్నది.

సురాణా మానన్దప్రబలనతయా మండనతయా
నఖేన్దు జ్యోత్స్నాభి ర్విసృమర తమః ఖండనతయా
పయోజశ్రీ ద్వేషవ్రత రతతయా త్వచ్చరణయో
ర్విలాసః కామాక్షి ప్రకటయతి నైశాకరదశామ్|| 31

పరమానందనిధానమౌట దివిషద్వర్గానకున్ భూషణ
స్ఫురణం జారు నఖేందుకాంతుల తమస్స్రం జెండుటన్ దమ్మిలిన్
బరమద్వేషము నోముగాఁ గొనుట నీ పాదాంబుజశ్రీ నిశా
కరబింబస్థితిఁ జాటుచున్నది గదా! కామాక్షి నైజమ్ముగన్.

కామాక్షీ! దేవతల కానందము చేకూర్చుటచేత గోటికాంతులనెడి వెన్నెలలచేఁ జీకటిని జెండాడుటచేత పద్మములశోభయెడ ద్వేషవ్రతమును బూనుటచేత నీ చరణముల సొంపు చంద్రునిసొంపును వెల్లడించుచున్నది.

సితిమ్నా కాన్తీనాం నఖరజనుషాం పాదనలిన
చ్ఛవీనాం శోణిమ్నా తవ జనని కామాక్షి నమనే
లభన్తే మన్దారగ్రథితనవబన్ధూకకుసుమ
స్రజాం సామీచీన్యం సురపురపురన్ధ్రీకచభరాః॥ 3౨

చారునఖచ్ఛటన్ జరణసారసరక్తిమ నత్తమిల్లి మం
దారము పూలు మంకెనలు దారిచి కట్టిన పూలమాల శృం
గారము సామరస్యమును గైకొనునమ్మ నమన్మనోజ్ఞబృం
దారక సుందరీజన కనత్కచభారము లంబ! నీ దరిన్!

దేవతాస్త్రీలు నీ పాదములందు వ్రాలినపుడు వారి వేణీభరములు నఖప్రభల తెలుపు రంగును పాదముల యెరుపురంగును పరస్పరము కలియుటచేత మందార పుష్పములు (తెలుపు) మంకెనపూలు (ఎరుపు) కలిపి గ్రుచ్చి సంతరించిన మాలలతోడి సామరస్యమును బొందుచున్నవి.

స్ఫుర న్మధ్యే శుద్ధే నఖకిరణదుగ్ధాబ్ధిపయసాం
వహ న్నబ్జం చక్రం దరమపి చ రేఖాత్మకతయా
శ్రితో మాత్స్యం రూపం శ్రియమపి దధానో నిరుపమాం
త్రిధామా కామాక్ష్యాః పదనలిననామా విజయతే॥ 33

చేరి నఖాంశురూపమగు క్షీరపయోనిధిలోన శంఖమున్
వారిజముల్ సుదర్శనము బట్టుక రేకలరీతి చేఁప యా
కారముఁ దాల్చి మేలుసిరి గైకొని నీ చరణారవిందమన్
పేరఁ ద్రిధాముఁడైన యొక వేలుపు దా నవతార మెత్తెడిన్.

తెల్లని నఖకాంతులనెడి పాలసముద్రమునందలి పాలలో స్ఫురించుచు రేఖారూపమున పద్మమును జక్రమును శంఖమును ధరించుచు మత్స్యాకృతి (రేఖ) వడసి నిరుపమ లక్ష్మిని (శోభను) వహించుచు కామాక్షీపాదపద్మమనెడి విష్ణుమూర్తి మత్స్యావతారమూర్తియై సర్వాతిశాయియై విలసిల్లుచున్నాడు.

నఖశ్రీసన్నద్ధస్తబకనిచితః స్వైశ్చ కిరణైః
పిశఙ్గైః కామాక్షి ప్రకటితలసత్పల్లవరుచిః
సతాం గమ్యః శఙ్కే సకలఫలదాతా సురతరు
స్త్వదీయః పాదోఽయం తుహినగిరిరాజన్యతనయే॥ 3౪

అచ్చపు గోటికాంతులను నా పుపుగుత్తుల నిండి రక్తిమై
హెచ్చిన శోభఁగ్రొన్ననలలె యింపువహించి ఫలమ్ములెల్ల యీ
వచ్చిన సాధుగమ్యమగు స్వర్గతరూత్తమ మంచు నెంతు బల్
ముచ్చటనించు నీ చరణమున్ హిమవద్గిరిరాజకన్యకా!

ఓ తుహినగిరికన్యా! నీ పాదము నఖకాంతులచే సంఘటితములగు పుష్పమంజరులచే నిండి తన యరుణకిరణావళిచేత లేజివుళ్ళ తళుకును వెలువరించుచు కల్పతరురూపమున సత్పురుషుల కభిగమ్యమైయున్నది.

**వషట్కుర్వ న్మాంజీరకకలకలైః కర్మలహరీ**
**హవీంషి ప్రోద్దణ్డం జ్వలతి పరమజ్ఞానదహనే**
**మహీయ న్కామాక్షి స్ఫుటమహసి జోహోతి సుధియాం**
**మనోవేద్యాం మాత స్తవ చరణయజ్వా గిరిసుతే||** 3౫

ఘనమాంజీర కలస్వనమ్ముల వషట్కారమ్ము గావించుచున్
జననీ! జ్ఞానమహాగ్ని ప్రజ్వలనమందన్ కర్మమున్ మేలివా
సనల న్నించు హవిర్వితానముల నిచ్చల్ హోమమున్ జేయు స
న్మునిహృద్వేదికలోన నీదు చరణాంభోజాతమే యజ్వయై.

తల్లీ! నీ పాదమనెడి యొక మహానుభావుఁడు సోమయాజియై యందెల రవళినెపమున వషట్కారములు సేయుచు జ్ఞానులమనోవేదియందు ప్రస్ఫుటప్రభతో ప్రజ్వలించుచున్న పరమచిద్రూపమైన అగ్నియందు కర్మపరంపరలనెడి హవిస్సులను హోమము సేయుచున్నాడు. శ్రీచరణసేవ నైష్కర్మ్య పర్యవసానమని తాత్పర్యము.

**మహామంత్రం కించి న్మణికటకనాదైరివ జపన్**
**క్షిప న్దిక్షు స్వచ్ఛం నఖరుచిమయం భాస్మనరజః**
**నతానాం కామాక్షి ప్రకృతిపటు రుచ్చాట్య మమతా**
**పిశాచీం పాదోఽయం ప్రకటయతి తే మాంత్రికదశామ్||** 3౬

మణికటకస్వనంబునను మంత్రమొకందు జపించుచున్ దిగం
గణముల నచ్చమౌ నఖరకాంతిమయంబగు బూదిజల్లుచున్
గణుతి నదల్చి కొట్టుచుఁ గనన్ మమతాఖ్యపిశాచికా నివా
రణ మొనరింప నీ చరణరాజము మాంత్రికురీతిఁ జాటెడిన్.

ఓ కామాక్షి! మణిమంజీర నాదములచే నల్లలననేదియో మహామంత్రమును జపించుచున్నదై నఖకాంతిరూపమగు నచ్చమైన విభూతి దెసదెసలం జల్లుచు స్వభావదృఢమైన నీ పాదము వినతజనమమతాపిశాచము నుచ్చాటనము సేయుచు నొకానొకమాంత్రికు డట్లు వర్తించుచున్నది.

**ఉదీతే బోధేందౌ తమసి నితరాం జగ్ముషి దశాం**
**దరిద్రాం కామాక్షి ప్రకట మనురాగం విదధతీ**
**సితే నాచ్ఛాద్యాఙ్గం నఖరుచిపటేనాఙ్ఘ్రియుగలీ**
**పురస్త్రీ తే మాతః స్వయ మభిసర త్యేవ హృదయమ్॥** ౩౭

దేవీ! నీదుపదద్వయీ వరపురంధ్రీరత్న మత్యంత రా
గావేశమ్మున జ్ఞానచంద్రుఁ డుదయమ్మై చీఁకటుల్ బీదవో
గా వెల్వెల్లనయౌ నఖాంశురుచి చక్కన్ మేల్ముసుంగూని బల్
ఠీవిన్ దా నభిసారికాకృతిఁ జనున్ డెందంబుతోఁ బొందఁగన్.

దేవీ! నీపాదయుగళియను పతివ్రత రాగాతిశయమును ప్రకటించుచు జ్ఞానచంద్రుదుదయించి, తమమెల్ల (తమము=చీకఁటి, అజ్ఞానము) పేదవడజేయగా (నశింపజేయగా) నఖకాంతి యను తెల్లని మేల్ముసుగువెట్టి స్వయముగా హృదయమనెడి నాయకునికడకు అభిసరించుచున్నది. (వెన్నెలలో ప్రియునిగూర్చి సంకేతస్థలమునకు పోవు నాయిక జ్యోత్స్నాభిసారిక యనబడును.)

**దినారమ్భః స్సంపన్నలినవిపినా నామభినవో**
**వికాసో వాసన్తః సుకవిపికలోకస్య నియతమ్**
**ప్రదోషః కామాక్షి ప్రకట పరమజ్ఞాన శశిన**
**శ్చకాస్తి త్వత్పాదస్మరణ మహిమా శైలతనయే॥** ౩౮

అవు నిది సంపదబ్జవిపినాళి కహర్ముఖవైభవమ్ము స
త్కవిపికకోటిపాలిటి కొకానొక నవ్యవసంతశోభన
మ్మవు నిది సుప్రదోషసమయమ్మును బోధసుధాకరోదయో
త్సవమున కంబ! నీ చరణసంస్మృతివైభవ మద్రిరాట్సుతా.

పార్వతీ! నీ చరణధ్యానప్రభావము సంపదలనెడి పద్మములను వికసింపజేయుటలో నుదయసమయమై, సుకవికోకిలములకు నూతనవసంత శోభయై పరమజ్ఞానచంద్రోదయమగుటకు ప్రదోషసమయమునునై యలరుచున్నది.

ధృతచ్ఛాయం నిత్యం సరసిరుహమైత్రీపరిచితం
నిధానం దీప్తీనాం నిఖిలజగతాం బోధజనకం
ముముక్షూణాం మార్గప్రథనపటు కామాక్షి పదవీం
పదం తే పాతఙ్గీం పరికలయతే పర్వతసుతే||

తమ్ములమైత్రికిం బరిచితమ్మయి ఛాయధరించి సన్నిధా
నమ్మయి కాంతి, కెల్ల భువనమ్ములకుం దెలివిన్నొసంగి, ని
త్యమ్ము ముముక్షుకోటి కొక దగ్గఱిత్రోవనుఁజూపు నీదు పా
ద మ్మలరించుకొన్నది పతంగపదప్రభ నద్రికన్యకా!

నీ పాదము ఛాయాసహితమై (ఛాయ=కాంతి; సూర్యపత్ని) నిత్యమును పద్మముల చెలిమి కలదియై కాంతులకు నిధియై చైతన్యస్ఫోరకమై మోక్షార్థులకు మార్గము చూపుటలో సర్వసమర్థమును నైన నీ పాదము సూర్యస్థానమును ఆక్రమించుకొన్నది. సూర్యునియం దీ లక్షణము లన్నియు కలవు.

శనైస్తీర్త్వా మోహాంబుధి మథ సమారోఢుమనసః
క్రమాత్ కైవల్యాఖ్యాం సుకృతిసులభాం సౌధవలభీం
లభన్తే నిశ్శ్రేణీమివ ఝటితి కామాక్షి చరణం
పురశ్చర్యాభిస్తే పురమథనసీమన్తిని జనాః|| ४०

అల్లనఁ దాటి మోహ మను నంబుధి సత్కృతిలభ్యమౌచు శో
భిల్లెడి ముక్తిసౌధవలభిన్ వడినెక్కెడు నిచ్చెనట్టు లు
త్ఫుల్లములౌ పురశ్చరణపుణ్యములం బడయంగనేర్తు ర
ల్లల్లన నీ పదమ్ముల జనాళి పురారిమనోవిహారిణీ!

అనేకోపాసనాపురశ్చరణలు చేసిచేసి మోహసముద్రమును దాటి క్రమముగ పుణ్యాత్ములకు మాత్రమే సులభమైయున్న కైవల్య మను సౌధాగ్రమును క్షణములో నెక్క దలచువారు నీ చరణమును నిచ్చెనగా బడయనేర్తురు.

ప్రచండార్తి క్షోభప్రథమసుహృదే ప్రాతిభసరి
త్ప్రవాహప్రోద్దండీకరణజలదాయ ప్రణమతామ్
ప్రదీపాయ ప్రౌఢే భవ తమసి కామాక్షి చరణ
ప్రసాదౌన్ముఖ్యాయ స్పృహయతి జనోఽయం జనని తే||

అపదపాలి యాపదల కాదిమమిత్రము ప్రాతిభప్రవా
హోపచయానకుం జలద ముద్ధతమైన భవాంధకారమున్
జోపెడి దీపమై పొలుచు, సొంపగు నీ చరణప్రసాదని
క్షేపము వీఁడు సమ్ముఖముచేసికొనంగ సముత్సుకించెడిన్.

ప్రణతులగువారి తీవ్రవిపత్తులపాలిటి విపత్తులకు (అనగా ఆపదలను నశింపజేయు సాధనములకు) మొదటిచెలికాడును ప్రతిభాప్రవాహమును (జ్ఞానవికాసమును) ఉద్ధృతము సేయు కారుమేఘమును గాఢమైన సంసారతమస్సును హరించు మహోజ్యోతియును అగు నీ చరణానుగ్రహ మున్ముఖమగుటకై వీఁడు మనసుపడుచున్నాఁడు.

మరుద్భి స్సంసేవ్యా సతతమపి చాంచల్యరహితా
సదారుణ్యం యాన్తీ పరిణతి దరిద్రాణసుషమం
గుణోత్కర్షా న్మాంజీరక కలకలై స్తర్జనపటుః
ప్రవాలం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగళీ|| ౪౨

మరుదాసేవ్యమ యయ్యునన్ జలనమ న్మాలైన లేనట్టిదై
యరుణంబై పరిపాకయోగ్యదశచాయం బేదయై యుండుటన్
బరిహాసం బొనరించు నీ చరణయుగ్మ మ్మాప్రవాళమ్ము న
మ్మరో! తర్జించు గుణప్రకర్షత రణన్మాంజీరశింజానమై.

నీ పాదము ఎల్లప్పుడు మరుత్తులచేత=వాయువులచేత (శ్లేష.) దేవతలచేతను సేవింపబడునదయ్యు చాంచల్యములేనిదై నిరంతర మెరుపెక్కియు పరిపాకదశలో (పండినప్పుడు) కాంతిహీన మయియుండు పవడముంగని గుణోత్కర్షవలన (తన యందలి గుణాతిశయముచే) అందెలమ్రోత నెపమున బెదరించి పరిహసించుచున్నది. గుణ+ఉత్కర్షము, అనగా త్రాటితో నట్టేటు లాగుట. ఓడినశత్రువును బంధించి అట్టిట్టులాగుట ప్రసిద్ధమైన విషయము, కావున పవడమును గెల్చిన దేవిచరణము ఆ పవడములను దారమున గ్రుచ్చునెపమున బంధించి అవమానించుచున్నదనియు భావము.

జగద్రక్షాదక్షా నలినరుచిశిక్షా పటుతరా
సురైర్నమ్యా రమ్యా సతత మభిగమ్యా బుధజనైః
ద్వయీ లీలాలోలా శ్రుతిషు సురపాలాది ముకుటీ
తటీసీమా ధామా జయతి తవ కామాక్షి! పదయోః|| ౪౩

క్షితి సంరక్షణదక్ష మబ్జసుషమాశిక్షాకృతాపేక్ష మా
కృతిరమ్య మ్మభిగమ్య మార్యతతికిన్ గీర్వాణనమ్యమ్ము నున్
శ్రుతిలీలారసలోల మమ్మరో! భవ చ్చుంభ త్పదద్వంద్వ ము
న్నతిగాంచున్ సురరాజముఖ్య మకుటాంచత్ సుస్థితిం బార్వతీ!

నీ పాదయుగళి లోకరక్షణసమర్థమై పద్మముల కాంతిని శిక్షింపగల జాణయై సురలకు నమ్యమై జ్ఞానుల కభిగమ్యమై శ్రుతులయందు క్రీడింప వేడ్కగలదై ఇంద్రాదుల కిరీటములపై నిల్చునదై సర్వోన్నతమై విలసిల్లుచున్నది.

గిరాం దూరౌ చోరౌ జడిమతిమిరాణాం కృతజగ
త్పరిత్రాణౌ శోణౌ మునిహృదయలీలైకనిపుణౌ
నఖైః స్మేరౌ సారౌ నిగమవచసాం ఖండితభవ
గ్రహోన్మాదౌ పాదౌ తవ మనసి కామాక్షి కలయే|| ౪౪

అరుణమ్ముల్ కృతలోకరక్షణము లమ్మా! మౌనిచిత్తాబ్జ సం
చరణమ్ముల్ స్తుతిదూరముల్ శ్రుతివచస్సారమ్ము లుద్యన్నఖ
స్ఫురణమ్ముల్ హతజాడ్యగాఢతిమిరమ్ముల్ తల్లి నీ పాదముల్
ధరియింతున్ హృతసంసృతిగ్రహసమున్మాదంబులే నాత్మలోన్.

పలుకులకు (వేదములకును) అందనివి జాడ్యాంధకారమును హరించునవి జగమ్ముల పాలించునవి మునిహృదయములందు విలసించు నేరిమిగలవి నఖకాంతులచే నలరునవి వేదములకెల్ల సారభూతమయినవి సంసారగ్రహోన్మాదమును వదలించుననియునైన నీ పాదములను ధ్యానించెదను.

అవిశ్రాంతం పంకం యదపి కలయ న్యావకమయం
నిరస్య న్కామాక్షి ప్రణమనజుషాం పంక మఖిలమ్
తులాకోటీద్వంద్వం దధదపి చ గచ్ఛ న్నతులతాం
గిరాం మార్గం పాదో గిరివరసుతే లంఘయతి తే|| ౪౫

అనయ మ్మారనియట్లు యావకమయమ్మౌపంకముం బూనియున్
ప్రణమద్భక్తజనాళిపంకము హరింపంజాలు నీ పాదముల్;
గొనియున్ జారుఝణంఝణన్మణితులాకోటిద్వయమ్మున్ జగ
జ్జననీ! నిస్తులత న్వహించి స్తుతికిన్ శక్యంబుగాదయ్యెడిన్.

నిరంతరము లాక్షారాగపంకమును పారాణిగ పూసికొనియు తనదరిని వ్రాలు భక్త జనుల పంకమును (పాపమును) హరించుచు తులాకోటిద్వంద్వమును (అందెల జతను) దాల్చియు అతులమై=సాటిలేనిదై (శ్లేష.) తులా=తక్కెడ దానియొక్క కోటి ద్వంద్వము= చివరిభాగములను పూనియు, అతులమై=సరితూచరానిదై నీ పాదము స్తుతివచనసరణి కతీతమై యున్నది.

ప్రవాలం సవ్రీడం విపినవివరే వేపయతి యా
స్ఫుర ల్లీలం బాలాతప మధికబాలం వదతి యా
నవాం సంధ్యాం వంధ్యాం విరచయతి యా వర్ధయతు సా
శివాం మే కామాక్ష్యాః పదనలినపాటల్యలహరీ|| ౪౬

పవడంబు న్వణకించు నట్టడవిలో బల్ సిగ్గు పొందంగ, నిం
పవులేయెండను నిండు లేఁతయని రట్టాడున్, గడుం గ్రొత్తసాం
ఘవు సంధ్యాకళ వట్టిపోఁజలుపు నే యంబాపదాంభోజపై
భవపాట్యమహాప్రవాహ మది మద్భాగ్యోన్నతిం గూర్చుతన్.

కామాక్షి చరణారుణకాంతిప్రవాహము సవడము నడవులం దడగి మడగి సిగ్గుపడి వణకిపోఁజేయుచున్నది. నిండుశోభగల లేయెండ వట్టి లేత యనుచున్నది. నూతన సంధ్యను వంధ్య యనుచున్నది. అట్టి శ్రీచరణరక్తిమ నా కశేషశుభపరంపరలను బెంపొందించుఁగాక.

కిర న్జ్యోత్స్నారీతిం నఖముఖరుచా హంసమనసాం .
వితన్వానః ప్రీతిం వికచకరుణాంభోరుహరుచిః
ప్రకాశః శ్రీపాదస్తవ జనని కామాక్షి తనుతే
శరత్కాలప్రౌఢిం శశిశకలచూడప్రియతమే|| ౪౭

విచ్చిన సత్కృపాకమలవిశ్లధరోచి వహించి నీపద
మ్మచ్చపువెన్నెలల్ నినిచి అంబ నఖచ్ఛవి హంసమానసా
భ్యుచ్చయముం బొనర్చుచును బొల్పగు నా శరదాగమంపు బెం
పచ్చుపడంగఁ జేసెడిఁగదమ్మ లసచ్ఛశిశేఖరప్రియా!

కొనగోటితళుకులచే తరపివెన్నెలలం దరుముటచే హంసమానసముల కానందము నించుచు (హంస=రాజహంస, యతి) వికసించిన కొత్తతామరల కాంతిం గుల్కుచు కేవలమొక వెలుగై ప్రస్ఫుటమైన నీ పాదము శరదృతువైభవమును బ్రకటించుచున్నది.

నఖాంకూర స్మేరద్యుతివితతిగంగాంభసి సుఖం
కృతస్నానం జ్ఞానామృత మమల మాస్వాద్య నియతమ్.
ఉదంచ న్మంజీరస్ఫురణమణిదీపే మమ మనో
మనోజ్ఞే కామాక్ష్యా శ్చరణమణిహర్మ్యే విహరతామ్||

తానమ్మాడి నఖాంకురద్యుతిలసద్గంగాప్రవాహాన జ్ఞా
నానందామృత మాని తృప్తిఁ గని దీవ్యద్రత్నమంజీర దీ
పానూనప్రభఁ గుల్కు దేవిచరణోద్యద్దివ్యమాణిక్య సౌ
ధానం దా విహరించుగావుతను మత్స్వాంత మ్మనంతప్రభన్.

నఖప్రభలనెడి గంగాజలములందు సుఖముగ స్నానముచేసి జ్ఞానామృతమును దృప్తిగ గ్రోలి నా చిత్తము మంజీరమణీదీపముచే నందముగుల్కు శ్రీకామాక్షీచరణమణిసౌధమందు విహరించుగాక!

భవాంభోధౌ నౌకాం జడిమవిపినే పావకశిఖా
మమర్త్యేంద్రాదీనా మధిముకుట ముత్తంసకలికాం
జగత్తాపే జ్యోత్స్నా మకృతకవచః పంజరపుటే
శుకస్త్రీం కామాక్ష్యా మనసి కలయే పాదయుగలీమ్|| ౪౮

శ్రీకామాక్షిపదద్వయిన్ మనసులోఁ జేర్తున్ భవాంభోధికిన్
నౌకన్, జాడ్యముపేరి యయ్యడవికిం దావాగ్ని, దిక్పాలకా
నీకశ్రీమకుటాగ్రరత్నకళికన్ రేయెండ దాపాళి, క
స్తోకాకృత్రిమసూక్తిపంజరపుటిన్ శోభిల్లు రాచిల్కగన్.

సంసారసాగరముం దరింపజేయు నౌకను, జాడ్యమను నడవికి దావానలమును, ఇంద్రాదిదేవతల కిరీటాగ్రమందు పూమొగ్గను, లోకముల తాపమార్చు వెన్నెలను, అకృతకములైన పల్కులు (వేదములు) అనెడి పంజరమునందు రాచిలుకనుగా కామాక్షీచరణయుగళిం భావించెదను.

పరాత్మప్రాకాశ్యప్రతిఫలనచుఞ్చుః ప్రణమతాం
మనోజ్ఞ స్త్వత్పాదో మణిముకురముద్రాం కలయతే
యదీయాం కామాక్షి ప్రకృతిమసృణాః శోధకదశాం
విధాతుం చేష్టంతే వలరిపువధూటీ కచభరాః||

వినతులకున్ నిజాత్మకళ వే ప్రతిబింబితముం బొనర్చి చూ
పును మణిదర్పణంపునెఱిముద్రవహించి భవత్పదంబు దా
నిని దుడువంగఁ గుంచెయయి నీటులునించుచు నైజమార్దవం
బునఁ గడుగుల్కు నా బలరిపుప్రమదాకచభారసంతతుల్.

అమ్మా! నీ పాదము తనయెడ వినతులైనవారికి స్వరూపస్ఫూర్తిని ప్రతిఫలింపజేయజాలెడి మణిదర్పణంపుపొంపును వహించుచున్నది. ఆ అద్దమును నిర్మలమగునట్లు తుడుచుటకు స్వభావమృదులములైన శచీదేవి శిరోజములు కుంచెలవలె నుపయుక్తములగు చున్నవి. దేవేంద్రుని రాణి మా కామాక్షమ్మ చరణములపై దలవంచి నిరంతరము మ్రొక్కునని భావము.

అవిశ్రాంతం తిష్ఠ న్నకృతకవచఃకందరపుటీ
కుటీరాంతః ప్రౌఢాం నఖరుచిపటాలీం ప్రకటయన్
ప్రచండం ఖండత్వం నయతు మమ కామాక్షి తరసా
తమోవేదండేంద్రం తవ చరణకంఠీరవపతిః|| ౫౦

అకృతకసూక్తికందరపుటాంతకుటీరముల న్వసించుచున్
ప్రకటనఖప్రభాపటల ప్రౌఢిమఁజూపుచు, నీ పదమ్ము నా
నొక మృగరాజరా జిదె సముద్ధతమై హతముంబొనర్చుఁగా
క కలుష విక్రమస్ఫురణ మంది మదీయ తమోమదేభమున్.

వేదములనెడి గిరికందరాంతరకుటీరములం దెల్లప్పుడు వసించుచు నఖకాంతులనెడి (తెల్లని) జూలును విదల్చుచు నీ పాదమనెడి సింహము నా తమోరూపమైన మదగజమును ఖండించుగాక!

పురస్తా త్కామాక్షి ప్రచురరస మాఖండలపురీ
పురంధ్రీణాం లాస్యం తవ లలిత మాలోక్య శనకైః
నఖశ్రీభిః స్మేరా బహు వితనుతే నూపురరవై
శ్చమత్కృత్యా శంకే చరణయుగలీ చాటురచనాః|| ౫౧

నీ ముందొప్ప సుపర్వరాట్పురపురంధ్రీలాస్యసారస్యమున్
గామాక్షీ! కని నీ పదద్వయి నఖాగ్రశ్రీవిలాసమ్ము చే
నేమో నవ్వుచు నూపురంపురవలిన్ హేలాచమత్కారశో
భాముగ్ధమ్ముగ మేలమాడునని యంబా! నేను భావించెదన్.

నీముందట నానందవివశమై స్వర్గకాంతాజనము చేయు నాట్యముం గని నీ చరణ యుగళి నఖకాంతులచే వికాసమంది యందెలరవళిచే చమత్కారముగ పరిహాసోక్తులను నెఱపుచున్నదని భావించెదను.

సరోజం నిందంతీ నఖకిరణ కర్పూరశిశిరా
నిషిక్తా మారారే ర్ముకుటశశిరేఖా హిమజలైః
స్ఫురన్తీ కామాక్షి! స్ఫుటరుచిమయే పల్లవచయే
తవాదత్తే మైత్రీం పథికసుదృశా పాదయుగళీ|| ౫౩

సరసిజ మాడిపోసి నఖచారురుచిస్ఫురణంపు బచ్చక
ప్పురపుబొడిన్ గడున్ జలువపూని స్మరారికిరీటచంద్రమః
కర హిమవారిచేఁ దడిసి కాంతులు గుల్కెడు లేఁజివుళ్ళతోఁ
బొరసి భవత్పదద్వితయి ప్రోషితభర్తృక కీడుజోడగున్.

నీ పాదయుగళి పద్మమును నిందించునదై నఖకాంతులనెడి పచ్చకప్పురముచే చల్లదనము వడసినదై శివునికిరీటమగు చంద్రరేఖయందు దొఱగు మంచునీట దడసినదై చక్కనికాంతిగల లేజివుళ్ళయందు స్ఫురించుచున్నదై పాంథభామినితో చెలిమి సేయు చున్నది. భర్త గ్రామాంతరము వెళ్ళిన నాయికవలె నిట్టి విరహలక్షణములతో నొప్పుచున్నదని భావము.

నతానాం సంపత్తే రనవరతమాకర్షణజపః
ప్రరోహ త్సంసారప్రసరగరిమ స్తంభనజపః
త్వదీయః కామాక్షి స్మరహర మనోమోహన జపః
పటీయా న్నః పాయా త్పదనళిన మంజీరనినదః|| ౫౪

అది యాకర్షణకారణమ్మగు జప, మ్మైశ్వర్యసంపత్తిక
య్యది సంస్తంభనకారణమ్మగు జప మ్మోహో! భవౌఘాన క
య్యది యయ్యుగ్రమనోవిమోహన జప మ్మోనమ్మ! నిక్కమ్ము నీ
పదపంకేరుహ నూపురధ్వని మదంబా! మమ్ముఁ బాలించుతన్.

అమ్మా! నీ పాదమ్ములందలి యందెలరవళి వినతులగు భక్తజనుల కైశ్వర్య సమృద్ధినాకర్షించు జపము. మొలకలెత్తు సంసారభారమును స్తంభింపజేయు జపము. మదనారి యగు శివుని మనసును మోహింపజేయు జపమునై యున్నది. అట్టి పరమపటిష్ఠమైన మంజీరనాదము మమ్ము రక్షించుగాక!

వితన్వీథా నాథే మమ శిరసి కామాక్షి! కృపయా
పదాంభోజన్యాసం పశుపరిబృఢప్రాణదయితే!
పిబంతో యన్ముద్రాం ప్రకట ముపకంపా పరిసరం
దృశా నానద్యన్తే నలినభవ నారాయణముఖాః|| ౫౫

దాసుఁడ నా శిరమ్మున నుదారదయంగొని నీ పదాంబుజ
న్యాసము సేయుమమ్మ నయనమ్ములఁ గ్రోలి యదీయముద్ర కం
పాసరిదంతసీమలను బద్మజ విష్ణుముఖుల్ స్తవమ్ములన్
జేసెద రుల్లసిల్లి జననీ! నిజభక్తజదనార్తిభంజనీ.

బ్రహ్మ విష్ణు ప్రముఖులు కంపాతీర పరిసరములందు నీ పాదముల గుర్తును తనివార దర్శించి సంతసింతురో అట్టి నీ పాదకమలములను నా శిరమున దయతో నుంచుము.

ప్రణామోద్యద్బృందారకముకుటమన్దారకలికా
విలోలల్లోలమ్బప్రకరమయధూమప్రచురిమా
ప్రదీప్తః పాదాబ్జద్యుతివితతిపాటల్యలహరీ
కృశానుః కామాక్ష్యా మమ దహతు సంసారవిపినమ్|| ౫౬

నతబృందారకబృంద మౌళివిలస న్మందారమాలాకులా
సితరోలంబకదంబధూమతతియై శ్రీమాతృపాదాంబుజ
ద్యుతిపాటల్య మహాప్రవాహమను నయ్యుగ్రానలజ్వాల యే
ర్పుత నన్మ ద్భవమోహవిభ్రమ మహాక్షోభాటవీవాటికన్.

కామాక్షిచరణాంబుజ కాంతిపుంజముందలి ఎరుపనెడి అగ్ని తనదరిని వ్రాలు దేవతల కిరీటాగ్రములందలి మందారకుసుమమాలికలపై నెడనెడ మూగుతుమ్మెదల గుంపనెడి పొగ రాజుకొన సముజ్జ్వలించి మదీయ జననమరణప్రవాహరూప సంసారారణ్యమును దహింపఁజేయుగాక.

వలక్షశ్రీ ఋక్షాధిపశిశు సదృక్షా తవ న ఖై
ర్జిఘృక్షు ర్దక్షత్వం సరసిరుహ భిక్షుత్వకరణే
క్షణా న్మే కామాక్షి! క్షపిత భవసంక్షోభగరిమా
వచోవై చక్షణ్యం చరణయుగళీ పక్ష్మలయతామ్|| ౫౭

అమ్మ! భవత్పదద్వితయ మచ్చపు జాబిలి రేకఁబోలి ప
ద్మమ్ముల భిక్షకంపు నెఱిదక్షతకుం గుఱియౌచుఁ జాల యు
గ్రమ్మగు నా భవ మ్మణచి రమ్యవచస్స్వవిచక్షణత్వ మం
దమ్ముగఁ బక్ష్మలించెడివిధ మ్మొనరించునుగాక! తల్లిరో!

అమ్మా! నీ పాదయుగళి అచ్ఛమైన చంద్రరేఖతో సమానమై. స్వీయనఖప్రభచే. కమలములను భిక్షాటనమున కంపుటయందు సమర్థత వహింపగోరినదై నా సంసారక్షోభ లణచి నా వాక్సైపుణ్యమును పరిపుష్టమొనరించుగాక.

సమంతా త్కామాక్షి! క్షతతిమిరసంతాన సుభగా
ననంతాభి ర్భాభి ర్దిన మను దిగంతా న్విరచయన్
అహంతాయా హన్తా మమ జడిమదన్తావలరిపు
ర్విభిన్తాం సంతాపం తవ చరణచింతామణి రసౌ|| ౫౮

శ్రీమహితప్రభన్ దమముఁ జీల్చి దిగంతములెల్లఁ దెల్పి శో
భామధురమ్ములం జలిపి పాడునహంమమతాభిమానముల్
బ్రామి నితాంత జాడ్యగజవైరియునై భవదీయపాదచిం
తామణి చించి చెండుతను నా పరితాప మగాధిరాట్సుతా!

అహంకారము నణచి జడత్వరూపమైన మదగజముపాలిశత్రువై యీ నీ చరణమనెడి చింతామణి అంతులేని స్వీయకాంతులచే ననుదినము తమమంతయు నడచి ఎల్ల దిగంతములను చైతన్యవంతము లొనరించుచు నా సంతాపమునంతము సేయుగాక.

దధానో భాస్వత్తా మమృతనిలయో లోహితవపు
ర్వినమ్రాణాం సౌమ్యో గురురపి కవిత్వం చ కలయన్
గతౌ మందో గంగాధరమహిషి! కామాక్షి! భజతాం
తమఃకేతు ర్మాత స్తవ చరణపద్మో విజయతే|| ౫౯

తాల్చి విభాకరత్వ మమృతమ్మున కిమ్మయి లోహితాకృతిన్
దాల్చి వినమ్రసౌమ్యమయి తా గురువయ్యుఁ గవిత్వయుక్తిమైఁ
బొల్చి యమందమందగతిఁ బూని, తమ స్తతి కేతువై తనుం
గొల్చెడివారి కున్నతిగనున్ భవదీయపదాబ్జ మమ్మరో!

ప్రకాశించుస్వభావముగని (సూర్యుడై) అమృతమునకు నిలయమై (చంద్రుఁడై) ఎఱ్ఱనిమూర్తిగలదై (కుజుఁడై) వినతులయెడ సౌమ్యమై (బుధుఁడై) గురుమూర్తియై

(బృహస్పతియై) కవిత్వము నలవరించుచు (శుక్రుఁడై) మందగతినొంది ( శనియై) తమఃకేతువై=తమస్సుపాలిటికి, కేతువు=అగ్ని లేక కాంతియై రాహువు కేతువునునై, నీ చరణకమలము సర్వాతిశాయియై యొప్పుచున్నది. ఇచట సూర్యాదినవగ్రహరూప ముగ పరదేవతాదివ్యచరణము రూపింపఁబడినది. నవగ్రహానుగ్రహమున కీ శ్లోకము జపింపదగినది.

నయన్తీం దాసత్వం నలినభవముఖ్యా నసులభ
ప్రదానా ద్దీనానా మమరతరు దౌర్భాగ్యజననీమ్
జగజ్జన్మ క్షేమ క్షయ విధిషు కామాక్షి! పదయో
ర్ధురీణా మీష్టే కస్తవ భణితు మాహోపురుషికామ్|| ౬౦

నలినభవాదులం దనకు నమ్రుల దాసులఁ జేసికొంచుఁ బే
దల కొకపాట నందనికతమ్ముగ బీదలఁజేసి కల్పక
మ్ముల జగముల్ సృజింప మఱిప్రోవ హరింప సమర్థమైన నీ
యలఘు పదప్రభావ మిది యంచనఁజాలినవాఁ డెవం డుమా!

బ్రహ్మాదిదేవతలను దన దాసులుగా వినమ్రుల నొనరించుకొనుచు నిరుపేదల కందుబాటులోలేని కల్పవృక్షములను లేనివానిగనే జేసి ప్రపంచ సృష్టి స్థితి లయము లొనర్ప సమర్థతగన్న నీ చరణమహిమ నెవ్వఁడు నుతింపఁగలఁడు?

జనోఽయం సంతప్తో జనని! భవచండాంశుకిరణై
రలబ్ధ్వైకం శీతం కణమపి పరజ్ఞానపయసః
తమోమార్గే పాంథ స్తవ ఝటితి కామాక్షి! శిశిరాం
పదాంభోజచ్ఛాయాం పరమశివజాయే! మృగయతే|| ౬౧

జనని! తపించి వీఁడు భవచండకరచ్ఛటఁ జ్ఞానవారి చ
ల్లని చినుకైనఁ బొందక నలంఘ్యము చీఁకటిదారి బాటసా
రిని దులకించి కొండొకదరిన్ భవదంఘ్రిసరోరుహమ్ము నీ
డను వెదకంగఁ బోయెడి నటన్ గల చల్వల సేదఁదేరఁగన్.

పరమశివపత్నీ! ఈదీనుఁడు (నేననుట) సంసారమనెడి వేసవి వేడిమికి తపించి జ్ఞానరూపమైన చల్లని నీ రొక్కచినుకుగూడ కరవై దుర్గమతమోమయమార్గముంబట్టిన బాటసారివలె జనుచు నించుకసేదదేరుదమని అమ్మా! నీచరణకమలములనీడకై వెదకులాడుచున్నాఁడు.

జయ త్యంబ ! శ్రీమ న్నఖకిరణ చీనాంశుకమయం
వితానం బిభ్రాణో సురముకుట సంఘట్టమసృణే
నిజారుణ్య క్షౌమాస్తరణవతి కామాక్షి ! సులభా
బుధైః సంవిన్నారీ తవ చరణమాణిక్యభవనే|| ౬౨

చెలువై చాందినిగా నఖాంశుపటలీ చీనాంశుక మ్మాత్మకాం
తులు పట్టుంబఱపై నిలింపమకుట స్తోమంబు పెన్‌రాపిడిన్
లలి నున్నెక్కిన నీ పదాబ్జ మణిశాలన్ బొల్చి సంవిద్వధూ
తిలక మ్మమ్మరో ! జ్ఞానిలోకమున కెంతే నందుబాటయ్యెడిన్.

విద్వజ్జనసులభమైనజ్ఞానసుందరి చక్కని నఖకాంతిపుంజమనెడి చీనిచీనాంబరమ యమగు వితానము (చాందిని) పైపై గట్టినట్టియు, దేవతాకోటి కిరీటఘట్టనముచే నునుపుదేరినట్టియు, నాలోన గ్రమ్ము నరుణప్రభ యనెడి ఎఱ్ఱనిపట్టుదుప్పటి పఱచినట్టియు నీ చరణమనెడి రత్నభవనమునందు సర్వోన్నతిని రాణించుచున్నది.

ప్రతీమః కామాక్షి స్ఫురిత తరుణాదిత్యకిరణ
శ్రియో మూలద్రవ్యం తవ చరణ మద్రీంద్రతనయే !
సురేంద్రాశా మాపూరయతి యదసౌ ధ్వాన్త మఖిలం
ధునీతే దిగ్భాగా నపి చ మహసా పాటలయతే|| ౬౩

దివిషన్నాయకునాశ నిండగ వడిన్ దీపించి గాఢాంధకా
రవిశేషమ్ము విదిల్చి దిక్కుహరముల్ రంజింపఁగాఁజేయు స్ఫూ
ర్తివిలాసమ్మున బాలసూర్యకిరణశ్రీ కెల్ల నీ పాదప
ల్లవ మూహించెద మద్రిరాట్తనయ ! మూలద్రవ్యమందు న్మదిన్.

నీ పాదము సురేంద్రుని యాశను = తూర్పుదిశను. (శ్లేష) ఇంద్రుని తమోగుణ కోర్కెను నిండించును. సకల తమస్సును విదళించును. కాంతిచే దిక్కుల నెరుపెక్కించును. కావున నది బాలభాస్కరుని కిరణలక్ష్మికి మూలద్రవ్యమగునని మే మూహించుచున్నాము.

మహాభాష్య వ్యాఖ్యాపటు శయనమారోపయతి వా
స్మరవ్యాపా రేర్ష్యాపిశున నిటలం కారయతి వా
ద్విరేఫాణా మధ్యాసయతి సతతం వాధివసతిం
ప్రణమ్రా న్కామాక్ష్యాః పదనలిన మాహాత్మ్యగరిమా| ౬౪

జననీ ! నీ చరణారవింద మహిమాంచత్ప్రౌఢి యెక్కించు నా
య్యన నా వ్యాకరణ ప్రసిద్ధతరభాష్యవ్యాఖ్యలో నేరుముల్
గను శయ్యన్, స్మరుచేఁత నీసుగొను ఫాలమొప్పు నవ్వాని జే
యు, నధిష్ఠింపగజేయు నమ్రుల ద్విరేఫోద్యన్నివాసస్థలిన్.

కామాక్షీచరణకమలమహిమ తనదరిని వ్రాలువారిని మహాభాష్యవ్యాఖ్యాసమర్థమగు శయ్య నధిష్ఠింపజేయును. శబ్దశాస్త్రనిష్ణాతుని జేయుననుట (శ్లేష) శేషశయనుఁడైన విష్ణునంతవానింజేయును. మన్మథచేష్టలయెడ నీర్ష్యను సూచించు నిటలభాగము గలవానింజేయును. అనఁగా అంతశ్శత్రువర్గములో మొదటిదగు కామగుణమునెడ నేహ్యభావముచే మొగము చిట్లించుకొననంతటి విరక్తుని జేయుననుట (శ్లేష) శివునంత వానింజేయును. తుమ్మెదల నెలవు నధిష్ఠింపఁజేయును. అనగా యోగసమాధియందు పద్మాసనస్థుం జేయును. (శ్లేష) పద్మాసనుఁడైన బ్రహ్మయంతవానింజేయును. శ్రీ దేవీచరణ వరివస్యానిపుణుఁడైన సాధకుడు త్రిమూర్తులంతవాఁడగునని తాత్పర్యము.

వివేకాంభఃస్రోతః స్నపనపరిపాటీ శిశిరితే
సమీభూతే శాస్త్రస్మరణ హలసంకర్షణవశాత్
సతాం చేతఃక్షేత్రే వపతి తవ కామాక్షి చరణో
మహాసంవి త్సస్యప్రకర వరబీజం గిరిసుతే|| ౬౫

సరసోదార వివేకవారితడుపుల్ జల్వల్ వెలారింపగన్
వరశాస్త్రస్మృతిపేరి నాగలిని దున్నంగా సమమ్మైన స
త్పురుషానీకముచిత్తమన్ బొలమునందుం జల్లి నీ పాద మ
ప్పర సంవిన్మయ సస్యబీజవితతిం బండించెడిన్ దల్లిరో !

వివేకమను నీటివెల్లువచే తడిసి చలువయెక్కినట్టియు (కేవలసత్త్వవృత్తినందినది) శాస్త్రవిమర్శ యనెడి నాఁగటిచే దున్నుటవలన సమమైనట్టియు (భేదభావమువీడిన దనుట) నగు సాధువుల చిత్తక్షేత్రమునందు నీ పాదము పరమజ్ఞానరూప సస్యము బండ్లకొలది పండెడి విత్తనమును జల్లును.

దధానో మందారస్తబక పరిపాటీం నఖరుచా
వహా న్దీప్తాః శోణాంగులిపటలి చాంపేయకలికాః
అశోకోల్లాసం నః ప్రచురయతు కామాక్షి చరణో
వికాసీ వాసన్త స్సమయ ఇవ తే శర్వదయితే|| ౬౬

మందారస్తబకద్యుతిం దనరి శుంభచ్ఛ్రీనఖజ్యోతిచే
విందై కెంజిగినించు వ్రేళులను జాంపేయంపుఁబూమొగ్గచే
నందమ్మొప్ప వసంత వేళవలె నంబా ! నీపద మ్మొప్పెడిం
పొందన్ మా మది కించుగావుత నశోకోల్లాస మీశప్రియా !

ఓ శివవల్లభా ! నీ పాదము నఖప్రభచే మందారాఖ్య కల్పతరుకుసుమస్తబకశోభం దాల్చి యొప్పుగ విలసిల్లు నంగుళులనెడి సంపెంగపూమొగ్గలంబూని, వసంతఋతువువలె అశోక = శోకరహితమైన ఉల్లాసము = ఆనందమును బ్రహ్మానందము నన్నమాట. (శ్లేష) అశోకకుసుమవికాసమును ప్రచురము సేయుగాక ! వసంతకాలములో నశోకములు నిండుగబూయుట ప్రసిద్ధము.

నఖాంశుప్రాచుర్య ప్రసృమర మరాలాధిధవలః
స్ఫుర న్మంజీరోద్య న్మరకత మహః శైవలయుతః
భవత్యాః కామాక్షి స్ఫుటచరణపాటల్యకపటో
నదః శోణాభిఖ్యో నగపతితనూజే విజయతే|| ౬౭

అరయ నఖాంశుకాంతులను నంచలచే వెలవెల్లనౌచు, నూ
పురములపచ్చలందళుకుపొల్పున నాఁచు వహించి తల్లి ! నీ
చరణమురక్తి నీరను మిషంగొనఁ దాలిచి కావిచీరగా,
బిరుదువహించి శోణనదవిస్ఫురణ మ్మదియొప్ప నియ్యెడన్.

గోటితళుకులనెడి హంసలచే దెల్లనై, అందెలయందు బొదిగిన మరకత మాణిక్య కాంతులనెడి నాచు పట్టినదై, స్వకీయమైన యెరుపనెడి చీరగొని (లేక పాదారుణ ప్రభచే కపటమై = శబలితమైయనుట) నీ పాదమనెడి శోణనదము శోభిల్లుచున్నది.

ధునానం పఙ్కౌఘం పరమసులభం కణ్టకకులై
ర్వికాసవ్యాసఙ్గం విదధ దపరాధీన మనిశమ్
నఖేన్దుజ్యోత్స్నాభి ర్విశదరుచి కామాక్షి నితరా
మసామాన్యం మన్యే సరసిజమిదం తే పదయుగమ్|| ౬౮

ఘనపంకమ్ము విదిర్చి కంటకకులాగమ్యమ్మునై కూర్చుచున్
దినముం జారువికాస మౌర అపరాధీనప్రభన్ స్వచ్ఛతన్
గని శ్రీమ న్నఖరేందుచంద్రికలఁ జొక్కమ్మె యసామాన్యమై
కననౌ నీ చరణ మ్మదొక్కవిధమౌ కంజాతమేం చెంచెదన్.

పంకమును = పాపమును, విదిల్చి, కంటకకుల + అగమ్యము = దుష్ట కోటి కగుపడనిదై, దినమ్ = ప్రతిదినము, చారువికాసమును గూర్చుచు, అపర + అధీనమ్ = ఇతరాధీనమైన, వికాస వ్యాసంగమ్ = స్వయంప్రకాశమునుగూర్చు, నఖ + ఇందు + జ్యోత్స్నాభిః = గోళ్ళనెడి చంద్రునివెన్నెలచే, విశదరుచి = అచ్చపుతళుకుగలదై యున్న నీ చరణయుగమును, అసామాన్యమ్ = అసాధారణమైన, సరసిజమ్ = పద్మమునుగా, మన్యే = భావించుచున్నాను.

ఈ పద్యమునందలి అసాధారణత్వ మేమనగా ; శ్లేష -- సామాన్యపద్మము పంకమును = బురదను విదల్చదు. అది పంకమునుండియే పుట్టును. ఇది యట్లు గాదు. అది కంటకకుల + అగమ్యము = ముండ్లచే పొందరానిది. ఇది యట్లుగాదు. అది పరాధీనమైన వికాసవ్యాసంగము గలది. అనఁగా సూర్యునివలన వికాసముపొందు నది. ఇది స్వయంజ్యోతి. నఖ + ఇందుజ్యోత్స్నాభిః, విశదరుచి = ఇది గోళ్ళనెడి చంద్రునివెన్నెలచే స్వచ్ఛమగు కాంతిగలది. సామాన్యపద్మము వెన్నెలలో ముడుచు కొనిపోవునది. కావున శ్రీచరణ మొకవింత పద్మమై విలసిల్లుచున్నదని భావము.

కరీన్ద్రాయ ద్రుహ్య త్యలసగతిలీలా సువిమలైః
పయోజైర్మాత్సర్యం ప్రకటయతి కామం కలయతే
పదామ్భోజద్వన్ద్వం తవ తదపి కామాక్షి హృదయం
మునీనాం శాన్తానాం కథ మనిశ మస్మై స్పృహయతే|| ౬౯

అలస విలాస మందగతులందుఁ గరీంద్రుని మోసపుచ్చు ని
ర్మలమగు తమ్ములందుఁ గడు మచ్చరముంగొనుఁ గామ మొప్పఁగన్
జలుపును నీ పదద్వయము సత్యమయేనను శాంతులైన యో
గులు ననిశం బదే వలచి కొల్తు రదేమొ గిరీంద్రకన్యకా !

నీ పాదము మందగతివిలాసమం దేన్గునకు ద్రోహమాచరించును, ఏనుఁగునడక కంటె మందము, నందమైననడక గలదనుట, పద్మములయెడ మచ్చరము చాటును. పద్మసదృశమనుట. తమ్ములందు మాత్సర్యమును చాటునను తెనిగింపులో భ్రాతృవిరోధము పెట్టుకొనునను విశేషార్థము స్ఫురించినది. తమ్ములు = పద్మములు. కోరికల నీడేర్చును. (శ్లేష) కామగుణమునకు పోషకము. ఐనను, పరమశాంతులైన మునులు అదే కావలెనని వేడుకపడియెద రిది యేమమ్మా ! కామక్రోధాది జయశీలు రగువారు కామక్రోధాదిసమృద్ధమైన వస్తువునెడ నపేక్షచూపుట చిత్రమని చమత్కారము.

నిరస్తా శోణిమ్నా చరణకిరణానాం తవ శివే
సమిన్ధానా సన్ధ్యారుచి రచలరాజన్యతనయే
అసామర్థ్యా దేవం పరిభవితు మేత త్సమరుచాం
సరోజానాం జానే ముకులయతి శోభాం ప్రతిదినమ్|| ౭౦

నీ చరణాంబుజప్రభకు నీటుల గుల్కెడు సాంధ్యరోచి బెం
డైచని తాను దాని కిసుమంతయు వంచనసేయఁ జేతగా
కేచి తదీయసామ్య మొకయించుక దాల్చిన తమ్మిపూల సం
కోచ మొనర్చుచున్న దనుకొందు జగజ్జననీ ! దినమ్మునన్.

నీ పాదప్రభదగ్గఱ సాయంసంధ్యారాగ మెందుకు కొరగానిదై దానిని వంచించు టకు చేతగాక దానితో కొంచెము పోలికగొన్న తామరపువ్వుల శోభను మూసికొని పోజేయుచున్నదని యనుకొనుచున్నాను.

ఉపాదిక్ష ద్దాక్ష్యం తవ చరణనామా గురు రసౌ
మరాలానాం శంకే మసృణగతిలాలిత్యసరణౌ
అతస్తే నిస్తన్ద్రం నియత మమునా సఖ్యపదవీం
ప్రపన్నం పాథోజం ప్రతిదధతి కామాక్షి కుతుకమ్॥ ౭౦

నిరతి న్నీచరణంబు హంసములకున్ శిక్షించెఁగాఁబోలు మున్
గురువై మెల్లని చక్కనౌ నడకలందుం దక్షతన్ దాన నీ
చరణంబం దెనలేనిసఖ్యపదవిన్ సాధించికొన్నటి యా
యరవిందంబులపైని వేడుకపడున్ హంసావతంసంబులున్.

నీ పాదమనెడి గురువు హంసలకు సవిలాస మందగమనమును నేర్పునని భావించెదను. అందుచేతనే యా హంసలు అందెలు (శ్లేష) నీ పాదముతో చెలికారము వాటించు పద్మములయెడ నెంతయు వేడుకపడుచున్నవి.

దధానై స్సంసర్గం ప్రకృతిమలినైః షట్పదకులై
ర్ద్విజాధీశ శ్లాఘావిధిషు విదధద్భి ర్ముకులతామ్
రజోమిశ్రైః పద్మై ర్నియతమపి కామాక్షి పదయో
ర్విరోధస్తే యుక్తో విషమశరవైరి ప్రియతమే॥ ౭౧

నైజముచేత నిండ మలినమ్మగు తుమ్మెదగుంపుతోడ నౌ
రా ! జతగూడి యాడి ద్విజరాజనుతిన్ మొగమోడికూడి బల్
రాజసవృత్తిగొన్న కమలమ్ములపైఁ బగఁబూను టెంతయున్
సాజము నీ పదమ్ములకు న్యాయమదే యసమేక్షణప్రియా !

స్వభావముచే మలినములు = నల్లనివి (పాపులు) అగు తుమ్మెదల గుంపులతో జెలిమిజేసి ద్విజరాజుయొక్క = చంద్రుని; (బ్రాహ్మణోత్తముని) మాట యెత్తినంతనే మొగముముడిచికొనుచు రజోమిశ్రములగు పద్మములతో రజస్సు = రజోగుణము, (శ్లేష) పుప్పొడి ద్వేషముపూనుట నీ పాదముల కెంతయేని తగియున్నది. శ్రీచరణములు పద్మములను మించి రాణించుచున్నవని భావము.

కవిత్వశ్రీ మిశ్రీకరణ నిపుణౌ రక్షణచణౌ
విపన్నానాం శ్రీమ న్నలినమసృణౌ శోణకిరణౌ
మునీంద్రాణా మన్తఃకరణశరణౌ మన్దశరణౌ
మనోజ్ఞౌ కామాక్ష్యా దురితహరణౌ నౌమి చరణౌ|| ౭౩

చరణమ్ముల్ భవదీయముల్ సుకవితాసారస్యసంపత్సమా
హరణశ్రీనిపుణమ్ము లమ్మరో ! విపన్నానీకసంరక్షణ
స్ఫురణమ్ముల్ భజియింతు మందసరణమ్ముల్ మౌనిరాజన్య హృ
చ్ఛరణమ్ముల్ తరుణారవింద మసృణ చ్ఛాయారుణమ్ముల్ మదిన్.

నీ చరణములు ఉత్తమకవితాసారస్యసంపాదకములు. ఆపదనందినవారిని రక్షింప సమర్థములు, కమలములవలె మృదులములు, అరుణములు. ఎఱ్ఱనివి. మునిజనాంతరంగ నివాసములు, మందగమనవులు, మనోహరములును, దురితహరములును, అట్టివానికి మ్రొక్కెదను.

పరస్మా త్సర్వస్మా దపి చ పరయో ర్ముక్తికరయో
ర్నఖశ్రీభి ర్జ్యోత్స్నాకలిత తులయో స్తామ్రతలయోః
నిలీయే కామాక్ష్యా నిగమనుతయో ర్నాకినతయో
ర్నిరస్త ప్రోన్మీల న్నలినమదయో రేవ పదయోః|| ౭౪

అరుణతలంబు లంచితహిమాంశుమహఃకలితాత్మసామ్యముల్
సురనతముల్ చతుశ్శ్రుతివచో వినుతంబులు మోక్షసంపదన్
గర మొనగూర్ప నేర్పరు లనందగు తావుల లీనమౌదు సా
దరత నిరస్తనీరజమదంబుల నీదు పదంబులం దుమా !

ఉత్తమోత్తమవస్తుజాతమునకెల్ల నుత్తమమ్ములై నఖదీప్తిచే వెన్నెలకు సాటియై అరుణములై నిగమవినుతములై అమరనతములై కమలముల గర్వమెల్ల నిరసించు నీ పదములందు విలీనుండ నయ్యెదను.

స్వభావా దన్యోన్యం కిసలయ మపీదం తవ పదం
మ్రదిమ్నా శోణిమ్నా భగవతి దధాతే సదృశతామ్
వనే పూర్వస్యేచ్ఛా సతత మవనే కిం తు జగతాం
పర స్యేత్థం భేదః స్ఫురతి హృది కామాక్షి సుధియామ్|| ౭౫

అరుణిమచే మృదుత్వమున నా చిగురాకును నీ పదమ్మునున్
సరిబడెదుం బరస్పరము చక్కఁగ ; నా తొలిదాని కెప్పుఁడా
దరము వనమ్మునంద మఱిదానికినో యవనమ్మునంద యీ
ధరణి బుధాళికెల్లఁ నెదఁ దట్టెడి భేద మిదే సుమా ఉమా !

మృదుత్వముచే, నెఱుపుచే చిగురును, నీ పదమును పరస్పరము పోలిక గలవి. కాని ఇందు మొదటిదాని కెప్పుడును వనమునందు (తోటలు, అడవులందు), రెండవదానికి అవనమునందు = (వనేతరమునందు) రక్షించుటయందును ఇష్టము యను నీ భేదము బుద్ధిశాలురకు స్ఫురించుచున్నది.

కథం వాచాలోఽపి ప్రకట మణిమంజీరనినదైః
సదైవానందార్ద్రా న్విరచయతి వాచంయమజనాన్
ప్రకృత్యా తే శోణచ్ఛవిరపి చ కామాక్షి చరణో
మనీషానైర్మల్యం కథమివ నృణాం మాంసలయతే|| ౭౬

వరమంజీర ఝణంఝణధ్వనులచే వాచాలమయ్యున్ వసుం
ధర వాచంయములైన మౌనుల మహానందాబ్ధి నోలార్చు నీ
చరణాబ్జ మ్మరుణారుణస్ఫురణమై సాజమ్ముగన్ దా నెటుల్
నరులం దింపొనరించునో కదె మనోనైర్మల్యమున్ వింతగన్.

నీ పాదము అందెలరవళిచే నెల్లప్పుడు వాచాలమయ్యు మౌనధారులగు మునుల నానందరసభరితులను చేయునేమమ్మా ! అట్లే ఇది స్వభావముచే నెఱ్ఱనిదయ్యు మానవుల మనసులందు నిర్మలతను బెంపొందించు టేలనో !

చలత్తృష్ణావీచీ పరిచలన పర్యాకులతయా
ముహు ర్భ్రాన్తస్త్వాం తాన్తః పరమశివవామాక్షి పరవాన్
తితీర్షుః కామాక్షి ప్రచురతర కర్మాంబుధి మముం
కదాఽహం లప్స్యేతే చరణమణిసేతుం గిరిసుతే|| ౭౭

బహుతృష్ణారస వీచికాచలనతన్ బర్యాకులుండై ముహు
ర్ముహురాందోళనమంది బిట్టలసి యేమో పొంది వైవశ్యమున్
రహిఁ గర్మాబ్ధిఁ దరింప నాసపడియున్నా నింతకు న్నాకు శ్రీ
తుహినక్ష్మాధరకన్య కాంఘ్రిమణిసేతుప్రాప్తి యేనాటికో !

ఆశాతరంగములవలని కదలికలచే కలతచెంది అట్టిట్లు మునిగి తేలుచు నలసి వివశుడనై నేను ఈ కర్మరూపమహాసముద్రమును దాటనెంచినవాడనై నీ పరమోత్తమ చరణమనెడి సేతువును ఎన్నడు పొందుదునో కదా !

విశుష్యన్త్యాం ప్రజ్ఞాసరితి దురితగ్రీష్మసమయ
ప్రభావేణ క్షీణే సతి మమ మనః కేకిని శుచా
త్వదీయః కామాక్షిస్ఫురిత చరణామ్భోద మహిమా
నభోమాసాటోపం నగపతిసుతే కిం న కురుతే|| ౭౮

పాపపుగ్రీష్మతాపమున బ్రజ్ఞయనందగు నేఱు వట్టిపో
నేపుతొరంగి చిక్కి విలపింపఁగ నా మన సొక్క నెమ్మియై
నీ పదవారిద మ్మరిమి నిక్కము శ్రావణమాసవిభ్రమా
టోప మొనర్పకుండుట యెటో నగరాజకుమారి ! శాంకరీ !

పాపమను గ్రీష్మఋతుప్రభావముచే ఎఱుక (తెలివి) యను నది యెండిపోయి, నా మనస్సనెడి నెమలి శోకముచే జిక్కిపోగా నీ పాదమనెడి మేఘముయొక్క మహిమ శ్రావణమాసాడంబరము ప్రకటింప దేలనమ్మా !

వినమ్రాణాం చేతోభవనవలభీసీమ్ని చరణ
ప్రదీపే ప్రాకాశ్యం దధతి తవ నిర్ధూతతమసి
అసీమా కామాక్షి స్వయ మలఘు దుష్కర్మలహరీ
విఘూర్ణంతీ శాన్తిం శలభపరిపాటీవ భజతే|| ౭౯

అమ్మ ! వినమ్రలోకహృదయమ్మను మేల్భవనాన నీదు పా
దమ్మను జ్యోతి వెల్గుచు నదల్పఁ దమమ్మునుఁ దానియందు పా
పమ్ముల పిండు పేరి శలభంబుల దండు వడిన్ విఘూర్ణమా
నమ్మయి యేసరేగి తుది నాశనమైచనునమ్మ శాంభవీ !

నీ చరణవినతులగువారి మనోగృహముపై నీ పాదమనెడి దీపము చీకటి నదల్చి వెలుగునీయగా హద్దులేని పాపప్రవాహము విదుతలదండువలె తనంత నెగిరి యందుపడి నశించుచున్నది.

విరాజన్తీ శుక్తి ర్నఖకిరణముక్తామణితతే
ర్విపత్పాథోరాశౌ తరిరపి నరాణాం ప్రణమతామ్
త్వదీయః కామాక్షి ధ్రువ మలఘువహ్ని ర్భవవనే
మునీనాం జ్ఞానాగ్నే రరణి రయ మంఘ్రి ర్విజయతే॥ ౮౦

లలిత నఖాంశుమౌ క్తికములం దులకించెడి శుక్తిరూపమై
యల ప్రణమిల్లువారు విపదంబుధిదాటుట కొక్క యోడయై
అలఘుభవాటవిన్ గమచి యట్టె దహింప దవాగ్నియై చిద
గ్నుల కరణిస్వరూపము నగున్ మునుకోటికి నీ పద మ్మమా !

నీ పాదము గోళ్ళకాంతులనెడి ముత్యాలకు ముత్యపుచిప్పయట్లు విలసిల్లును. ఆపత్సముద్రము దాటుటకు విరక్తులకు ఓడ యగును. సంసారాటవికి దావాగ్ని యగును. మునుల జ్ఞానాగ్నిలాభమునకు అరణియు నగును. ఇట్లది సర్వోత్కృష్టమై యున్నది.

సమస్తైః సంసేవ్య స్సతతమపి కామాక్షి విబుధైః
స్తుతో గన్ధర్వస్త్రీ సులలిత విపంచీకలరవైః
భవత్యా భిందానో భవగిరికులం జృంభితతమో
బలద్రోహీ మాత శ్చరణపురుహూతో విజయతే॥ ౮౧

కలనానావిబుధాళిసేవ గొని శ్రీ కామాక్షి మిన్నంది భా
సిలు గంధర్వవరాంగనాకలవిపంచీనాదసంస్తుత్యుఁడై
బలవ త్సంసృతిశైల భంజనుడునై భాసిల్లు నుద్యత్తమో
బలవిద్రోహియునై మహోన్నతి భవత్పాదామరేంద్రుండిలన్.

కామాక్షి ! భవత్యాః = నీయొక్క, చరణపురుహూతః = పదమనెడి దేవేంద్రుఁడు, సమస్తైః, విబుధైః = పండితులెల్లరిచేత; (శ్లేష) దేవతలెల్లరిచేత సంసేవ్యః = సేవింపఁదగిన వాఁడై; గంధర్వస్త్రీలయొక్క, సులలిత = మిక్కిలి చక్కనైన; విపంచీకలరవైః = వీణాది గానములచేత; స్తుతః = స్తుతింపఁబడువాఁడై, భవగిరి కులమ్ = సంసారమను పర్వతకూటమును, భిందానః = భేదింపఁజేయువాఁడై, జృంభిత తమో బలద్రోహీ = విజృంభించు తమోగుణపాటవమును ఖండించువాడై, (శ్లేష)

తమోరూపమైన బలు ద్రోహముచేయువాఁడై, సర్వాతిశాయియై యొప్పుచున్నాడు. ఇందు ఇంద్రునకు పాదమునకు శ్లేషచే నౌపమ్యము సెప్పబడినది.

వసన్తం భక్తానామపి మనసి నిత్యం పరిలస
ద్ఘనచ్ఛాయాపూర్ణం శుచిమపి నృణాం తాపశమనమ్
నఖేన్దుజ్యోత్స్నాభిః శిశిరమపి పద్మోదయకరం
నమామః కామాక్ష్యా శ్చరణ మధికాశ్చర్యకరణమ్॥ ౮౨

సాధువతంసమానసవసంతము యయ్యు ఘనప్రభన్ సము
త్సేధతఁజెంది, తాపములఁజెండి కడున్ శుచియయ్యు నంబ ! బల్
సాధనచేసి యిందురుచిఁ జల్లనయై కమలోదయమ్ము ని
ర్బాధకతం బొనర్చెదు భవత్పద మాస్పద మెంతు వింతకున్.

భక్తానాం మనసి = భక్తుల మనస్సునందు, వసంతం = వసించునది =వసంతఋతువై ఉన్నదైనను, (శ్లేష.) నిత్యమ్ = నిత్యము, పరిలసత్ ఘనచ్ఛాయాపూర్ణమ్ = విలసించు మేఘచ్ఛాయతో నిండినది. శ్లేష = స్వచ్ఛమైన గొప్ప కాంతితో నిండినది. శుచిం = గ్రీష్మఋతువైనను (శ్లేష) = నిర్మలమైనదియు, తాపశమనమ్ = తాపమును శమింపఁజేయునది. (శ్లేష) = తాపత్రయమును హరించునది. నఖేందు జ్యోత్స్నాభిః = నఖచంద్రకాంతులచే, శిశిరమ్ = శిశిరఋతువయ్యును, (శ్లేష) = చల్లనిదై, పద్మ + ఉదయకరమ్ = పద్మవికాసమును గూర్చునది, అనఁగా శరదృతువు. శ్లేష = లక్ష్మీసమృద్ధిని జేకూర్చునదియై యొప్పుచు, అధికాశ్చర్యకరణమ్ = మిక్కిలి యాశ్చర్యమును కల్గించునట్టి, కామాక్ష్యా చరణమ్ = కామాక్షి చరణమును, నమామః = నమస్కరించుచున్నాము. ఇం దారు ఋతువులు శ్లేషచే పేర్కొనఁబడినవి.

కవీంద్రాణాం నానా భణితిగుణ చిత్రీకృతవచః
ప్రపంచవ్యాపార ప్రకటన కలాకౌశలనిధిః
అధః కుర్వ న్నబ్జం సనకభృగుముఖ్యై ర్మునిజనై
ర్నమస్యః కామాక్ష్యా శ్చరణపరమేష్ఠీ విజయతే॥ ౮3

కవివాగ్గుంభన సంభృతాద్భుతవచః కల్పప్రపంచక్రియా
సవిలాసస్ఫుట కౌశలంబుఁ గని అబ్జ మ్మల్లనన్ గ్రిందు సే
సి వెసన్ శ్రీసనకాది మౌనిజన సంసేవ్యుండునై వంద్యుడై
సువినోదస్థితి దేవిపాదచతురాస్యుం డున్నతిం బొల్చెడిన్.

వెక్కురీతులగు గుణములచే నద్భుతముగూర్చు కవుల వాక్ప్రపంచవ్యాపారమందు ప్రకటింపఁబడిన కళానైపుణ్యమునకు గనియై (శ్లేష) -- వాక్ప్రపంచమనఁగా వేద ప్రపంచము. తన్నిర్మిత ప్రపంచ వ్యాపారమందు నేర్పుగలవాఁడు. తామరపువ్వును క్రిందొనరించి = తామరపువ్వుకంటె జక్కని దనుట. (శ్లేష) = తామరపువ్వుపైఁ గూర్చున్నవాడు, సనకభృగుప్రముఖులగు మునులచే నమస్కరింపఁదగిన కామాక్షీదేవి చరణమనెడి బ్రహ్మ సర్వాతిశాయియై రాణించుచున్నాడు.

భవత్యాః కామాక్షి స్ఫురితపదపంకేరుహభువాం
పరాగాణాం పూరైః పరిహృతకలంకవ్యతికరైః
నతానా మామృష్టే హృదయముకురే నిర్మలరుచి
ప్రసన్నే నిశ్శేషం ప్రతిఫలతి విశ్వం గిరిసుతే|| ౮౪

అమ్మరో ! నీ పదాబ్జములయందునఁ గుల్కెడు నప్పరాగపుం
జమ్ములు నీ పదమ్ములను సారెకు వ్రాలెడి భక్తకోటి చి
త్తమ్ములనంగ నొప్పు మణిదర్పణముల్ దుడువంగ నెల్ల వి
శ్వ మ్మచటన్ గిరీంద్రసుత ! స్పష్టముగాఁ బ్రతిబింబితమ్ముగున్.

నీ పాదపరాగపుంజము నీ చరణములయందు వ్రాలెడి భక్తుల మనసులనెడి యద్దములను దుడువగా నవి నిగ్గుదేర సకల ప్రపంచమును నచ్చట స్పష్టముగా బ్రతిఫలించును.

తవ త్రస్తం పాదాత్కిసలయ మరణ్యాంతర మగా
త్పరం రేఖారూపం కమల మము మేవాశ్రిత మభూత్
జితానాం కామాక్షి ద్వితయ మపి యుక్తం పరిభవే
విదేశే వాసో వా శరణగమనం వా నిజరిపోః|| ౮౫

అడవులఁబట్టిపోయెఁ జివు, రంబుజమైనను గెల్వలేక నీ
యడుగుల నాశ్రయించెగద యల్లనఁ దా నొకరేకమాత్రమై
బడలి పరాయిదేశములఁ బట్టుకపోవుటొ శత్రునీడలో
నడఁగిమడంగి యుండుటయొ యర్హమ యోడినవారి కివ్విధిన్.

నీ పాదముల సొంపునకు జాలలేక చిగురు అడవులపాలై పోయినది. పద్మము రేఖామాత్రమై నీ యడుగుల నాశ్రయించినది. (పద్మరేఖ మహారాజ్ఞీలక్షణమని సాము ద్రికము) ఓడిపోయినవారు పరదేశముల పాలయిపోవుటో లేక శత్రువుల శరణందుటో ఉచితము కదమ్మ !

గృహీత్వా యాథార్థ్యం నిగమవచసాం దేశికకృపా
కటాక్షార్కజ్యోతిశ్శమితమమతాబన్ధతమసః
యతన్తే కామాక్షి ప్రతిదివస మన్తర్ద్రఢయితుం
త్వదీయం పాదాబ్జం సుకృతపరిపాకేన సుజనాః॥ ౮౬

గురుకరుణాకటాక్షరవి గుల్కరుచిన్ మమతాతమఃపరం
పర విడిపోవ నైగమసుభాషితతత్త్వరహస్య మంది స
త్పురుషులు నీ పదాబ్జములఁ బూని పురాకృతపుణ్యపాక వి
స్తరమున నంతరంగములఁ దాల్చి దృఢమ్మొనరింతు రెయ్యెడన్.

గురుకృపాకటాక్షమనెడి సూర్యకాంతిచే మమకారమను చీఁకటి మాసిపోఁగా వేదములలోని నిజమైనయర్థ మిది యని యెఱింగి నీ పాదకమలమును అంతరంగమునందు గట్టిగా నిల్పుకొనుట కనుదినము పురాకృతసుకృతపరిపాకముచే సుజనులు యత్నము సేయుదురు.

జడానామప్యంబ స్మరణసమయే త్వచ్చరణయో
ర్భ్రమన్మంథక్ష్మాభృద్ఘుమఘుమితసింధుప్రతిభటాః
ప్రసన్నాః కామాక్షి ప్రసభ మధరస్పందనకలా
విభాంతి స్వచ్ఛందం ప్రకృతిపరిపక్వా భణితయః॥ ౮౭

సముదంచన్మధురాధరస్ఫురణముల్ స్వచ్ఛందతన్ నైజప
క్వముల్లై వాక్పణుతుల్ ప్రసన్నరుచి జాల్వారున్ భ్రమద్భవ్య వి
భ్రమమంథక్షితిభృద్ఘుమంఘుమిత శుభ్రక్షీరసింధుప్రభన్
గ్రమతం ద్వచ్చరణస్మృతిన్ జడులకు న్గామాక్షి ! సాక్షాచ్ఛ్రుతుల్.

అమ్మా ! నీ పాదములను స్మరించిన క్షణములోనే మందమతులకుగూడ మందరగిరి కవ్వముసేసి తరువగా ఘుమఘుమలొలయ పరిమళించు పాల్కడలింబోలు ప్రసన్నములు స్వభావపరిపక్వములు మధురాధరస్పందన విలాసములు నగు వచోవిన్యాసములు హఠాత్సిద్ధములై విలసిల్లును.

వహన్న ప్యశ్రాంతం మధురనినదం హంసక మసౌ
తమేవాధఃకర్తుం కిమివ యతతే కేలిగమనే
భవస్యైవానందం విదధదపి కామాక్షి చరణో
భవత్యాస్తద్ద్రోహం భగవతి కిమేవం వితనుతే॥ ౮౮

అది మధురస్వరమ్మయిన హంసక మూనియు నీ పదమ్ము తా
నదిర ! విలాసపుంగతుల నయ్యది గ్రిందొనరింపఁ జూచు నే
మిది ? భవమోదలాభ మొనరించియు నిట్లిపు డేలసేయునో
కదె భవభేద మద్భుతముగాదె భవత్పదవర్తన మ్ముమా !

నీ పాదము నిరంతరము మధురతరముగ ధ్వనించు (కూయు) హంసకమును = అందెను ధరించియు, నా హంసనె (శ్లేష; రాజహంసనె) తన మొయ్యారము గుల్కు నడలచే గ్రిందొనరింపఁజూచుచున్నది. హంసనడకకంటె అందమైనది నీ నడక యనుట. భవ + ఆనందమును = శివుని కానందమును కూర్చునదయ్యు, భవ + ద్రోహము = సంసార ద్రోహము సేయుచున్నది. ఇది యేమి వింత యమ్మ !

యదత్యన్తం తామ్య త్యలసగతివార్తాస్వపి శివే
తదేతత్కామాక్షి ప్రకృతిమృదులం తే పదయుగమ్
కిరీటైః సంఘట్టం కథమివ సురౌఘస్య సహతే
మునీంద్రాణా మాస్తే మనసి చ కథం సూచినిశితే॥ ౮౯

ప్రకృతిమృదుత్వమును గనినత్వచ్చరణమ్ము గదున్ శ్రమించెడిన్
బ్రకటసుమందమందగతివర్తనమం దటువంటిపాద మెం
తకు మసలుం గుశాగ్రనిశితమ్మగు నమ్మునిచిత్తమంద యె
ట్లొకొ సహియించు వేలుపులయుద్ధతరత్నకిరీటఘట్టనన్.

మెలమెల్లన నడచుటచేతగూడ మిగుల శ్రమించు స్వభావమృదువైన నీ పాద యుగము దేవతలకిరీటసంఘట్టన మెట్లోర్చుచున్నదో గదా ! సూదిమొనకంటె సుతీక్ష్ణమైన మునుల మనసునం దెట్లు మసలుచున్నదో గదమ్మా !

మనోరంగే మత్కే విబుధజనసంమోదజననీ
సరాగవ్యాసంగా సరసమృదుసంచారసుభగా
మనోజ్ఞా కామాక్షి ప్రకటయతు లాస్య ప్రకరణం
రణన్మంజీరా తే చరణయుగలీనర్తకవధూః॥ ౯౦

సుమధురరాగమున్ సరసశోభనసంచరణమ్ము నొప్ప న
చ్చము విబుధాళికిన్ ముదమొసంగుచు నందెలు మ్రోయుచుండ లాస్యము
పొనరించుఁగావుత హిమాద్రికుమారి మదంతరంగ రం
గమున భవత్పదద్వయి యనందగు నర్తకి శంభునాయకీ !

విబుధజనులకు (దేవతలకు -- పండితులకును) ఆనందమునుదయింపఁజేయున దియు, రాగవ్యాసంగముకలదియు, ఎరుపుతో కూడినది. (శ్లేష) :-- సంగీతరాగము లను మేళవించునదియు సరసవృత్తులమైన సంచారముచే (సొంపైననడకచే) (శ్లేష):-- నాట్యగతసుందరపాదవిన్యాసభంగిచే నింపైనదియు నై అందెలు మ్రోయు నీ చరణ యుగళి అనెడి నాట్యకత్తె నా మనస్సనెడి రంగస్థలమందు నాట్యప్రకరణమును బ్రదర్శించునుగాక !

పరిష్కుర్వ న్మాతః పశుపతికపర్దం చ విషయే
పరాచాం ప్రాత్పద్మం పరమభణితీనాం చ మకుటీమ్
పరస్తే పాదోఽయం పరిహరతు కామాక్షి మమతా
పరాధీనత్వం మే పరిముషిత పాథోజమహిమా|| ౯౦

హరుని జటాకుటిన్ విషయమంటనివారి హృదబ్జవాటికన్
బరమవచఃకిరీటపరిపాటిని దాన యలంకరించు నీ
పరతరమైన పాద మిది పద్మము సౌరులఁ గొల్లలాడి లో
నరసి హరించుగాక మదహంమమతా పరతంత్రవృత్తులన్.

శివుని జటాకుటీరమును విషయపరాఙ్ముఖులైన మహాయోగుల హృదయపద్మ మును బరమోత్తమవాక్కులైన శ్రుతులమౌళిభాగమును అలంకరించుచుండు నీ పాదము పద్మములమహిమ కొల్లలాడి మదీయ మమకారపరమైన భావమును హరించుగాక !

ప్రసూనైః సంపర్కా దమరతరుణీకుంతలభవై
రభీష్టానాం దానా దనిశమపి కామాక్షి నమతామ్
స్వసంగా త్కంకేళిప్రసవజనకత్వేన చ తవ
త్రిధా ధత్తే వార్తాం సురభిరితి పాదో గిరిసుతే|| ౯౧

అమరవధూశిరోజములయందలి పువ్వులతోడిపొత్తుచే
నమదభివాంఛితార్థకలన మ్మొనరించుటచేత నాత్మయో
గమున నశోకసంతతిసుఖప్రసవ మ్మొనరించుటం ద్రిధా
క్రమమున రంజిలున్ సురభిగా యశమంది భవత్పద మ్మమా !

దేవతాస్త్రీల కుంతలములందలి పువ్వుల సంపర్కముచేత, తనకడ వ్రాలువారి అభిమతములను సమకూర్చుటచేత స్వీయసంగముచే నశోకసంతతిని సుఖప్రసవ మొనరిం చుటచేత (స్త్రీపాదస్పర్శచేత అశోకము పుష్పించును.) నీ చరణము మూడుతెఱంగుల సురభి = కామధేనువు (శ్లేష) :-- వసంతఋతువు అనెడి కీర్తిపొందుచున్నది.

మహామోహాస్త్రేన వ్యతికరభయా త్పాలయతి యో
వినిక్షిప్తం స్వస్మి న్నిజజనమనోరత్న మనిశమ్
స రాగస్యోద్రేకా త్సతతమపి కామాక్షి తరసా
కి మేవం పాదోఽసౌ కిసలయరుచిం రోచయతి తే॥ ౯౩

మునులు మనస్సనంబడు నమూల్యపురత్నము మోహమన్న ము
చ్చునకు భయంబుసెంది తనచోటున దాపరికంబుసేయ దా
నిని దగ రక్షసేయుటకొ నీ చరణ మ్మురురాగమూని చ
య్యన నొక చిన్ని లేఁతచిగురాకుపసం దులకించు నియ్యెడన్.

మునులు మోహమను ముచ్చునకు భయపడి తమ మనస్సనెడి అమూల్యరత్న మును తనకడ దాపరికము సేయగా దానిని రక్షించుటకు నీ పాదము దృఢరాగము గొని (రాగము = ఎరుపు, ప్రేమ) ఒక లేఁత చిగురాకువలె కన్పట్టుచున్నదా యేమి ? అనఁగా నిది చిగురాకు మాత్రమని యెంచి దొంగ రత్నమును హరింపఁడని అర్థము, ప్రకృతము శ్రీచరణలగ్నమైన మనసు మోహవశముకాదని భావము.

సదా స్వాదుంకారం విషయలహరీశాలికణికాం
సమాస్వాద్య శ్రాన్తం హృదయశుకపోతం జనని మే
కృపాజాలే ఫాలేక్షణమహిషి కామాక్షి రభసా
గృహీత్వా రున్ధీథా శ్చరణయుగలీపంజరపుటే॥ ౯౪

శ్రీనిటలాక్షుపట్టమహిషీ ! విషయమ్మను బియ్యపుంగణ
మ్మౌని యొకింత సొమ్మసిలె నద్దిర ! నా హృదయమ్ము చిల్కరా
కూనను నీదు జాలివలకున్ వడి దారిచి కట్టివేయు మం
బా ! నిజపాదపద్మమణిపంజరమధ్యమునం ధగాత్మజా !

నా హృదయమను చిలుక శబ్దాదివిషయభోగములైన తండులచూర్ణమును భక్షించి అలసి సొమ్మసిలియున్నది, దానిని నీ కరుణయను వలకు దిగిచి నీ చరణయుగమను పంజరమునందు గట్టివేయుము.

ధునానం కామాక్షి స్మరణలవమాత్రేణ జడిమ
జ్వరప్రౌఢిం గూఢస్థితి నిగమనైకుంజకుహరే
అలభ్యం సర్వేషాం కతిచన లభన్తే సుకృతిన
శ్చిరా దన్విష్యన్తస్తవ చరణసిద్ధౌషద మిదమ్॥ ౯౫

స్మరణము సేయుమాత్రమున జాడ్యపుఁబెన్జ్వరముం విదల్చు నీ
చరణముపేరి సిద్ధజన సంభృతమౌ నొక యౌషధంబు నం
దరికినినంద దందెదరు ధన్యులు కొందరె నైగమాంతసుం
దరతర గూఢ కుంజగహనమ్ములలోఁ బరికించి శాంకరీ !

స్మరణమాత్రమున జాడ్యజ్వరమును హరించు నీ చరణమను సిద్ధౌషధము అందఱికిని లభించునదికాదు. ఎవరో పుణ్యాత్ములు వేదకుంజగహనములలో నిగూఢమై యున్నదానిని వెదకి వెదకి చిరకాలమునకు బడయుగలరు.

రణన్మంజీరాభ్యాం లలితగమనాభ్యాం సుకృతినాం
మనోవాస్తవ్యాభ్యాం మథితతిమిరాభ్యాం నఖరుచా
విధేయాభ్యాం పత్యా నిజశిరసి కామాక్షి సతతం
నమస్తే పాదాభ్యాం నలినమృదులాభ్యాం గిరిసుతే|| ౯౬

కలమంజీర ఝుణంఝుణధ్వనులచే గంభీర యానమ్ముచే
నల పుణ్యాత్ముల చిత్తమం దునికిచే నంతస్తమోహారి దా
రులసచ్ఛ్రీనఖరోచిచేఁ బ్రియుడు నేఁ బ్రొద్దుం దలందాల్చు నీ
జలజశ్రీమృదు పాదయుగ్మములకున్ సాష్టాంగమై మ్రొక్కెదన్.

మంజీరకలస్వనమధురములు మధురగమనములు మాన్యజనమనోనిలయములు నఖచంద్రికలచే తమస్సును హరించునవి నళినమృదులములు అగు నీ స్వామి యే ప్రొద్దు తన తలందాల్చు నీ పాదములకు నమస్కారము.

సరాగే రాకేందు ప్రతినిధిముఖే పర్వతసుతే
చిరాల్లభ్యే భక్త్యా శమధనజనానాం పరిషదా
మనోభృంగో మత్కః పదకమలయుగ్మే జనని! తే
ప్రకామం కామాక్షి త్రిపురహరవామాక్షి రమతామ్|| ౯౭

సాక్షాత్పూర్ణశరన్నిశాకరనిభాస్యా ! శంభువామాక్షి ! కా
మాక్షీ ! అక్షయరక్తి మేల్ శమదమాద్యైశ్వర్యసంపన్ను ల
ప్రక్షీణమ్మగు భక్తినందుకొను నీ పాదారవిందద్వయిన్
విక్షేపమ్ము తొలంగి నాదగు మనోభృంగమ్ము క్రీడించుతన్.

ఓ రాకేందుముఖీ ! కామాక్షీ ! శమదమాద్యైశ్వర్యసంపన్నులగు భక్తసమాజముచే చిరకాలమునకు లభ్యమగు నీ పాదారవిందద్వంద్వమందు ఎట్టి విక్షేపము లేక నా చిత్తమను తుమ్మెద క్రీడించుగాక !

శివే సంవిత్పాశైః శశిశకలచూడాప్రియతమే
శనైర్గత్యాగత్యా జితసురవరేభే గిరిసుతే
యతన్తే సంతస్తే చరణనలినాలానయుగలే
సదా బద్ధుం చిత్తప్రమదకరియూథం దృఢతరమ్|| ౯౮

యానజితామరేంద్రగజయాన! శిరోభృతచంద్రమఃకళా
ధీన ! మహానుభావులు ధృతిం దమచిత్తమదేభయూథమున్
బూనిచి రాకపోక లనువుంగొన నీ చరణాంబుజద్వయా
లానమునందుఁ గట్టగఁ దలంతురు జ్ఞానపుపాశసంగతిన్.

మహానుభావులు తమ తమ చిత్తములనెడి మదగజయూథమును ధైర్యముతో నిగ్రహించి రాకపోక లనువుపడగా నీ చరణనళినములనెడి యాలానమునందు జ్ఞాన పాశములచే బంధింప యత్నింతురు.

యశః స్నూతే మాత ర్మధురకవితాం పక్ష్మలయతే
శ్రియం ధత్తే చిత్తే కమపి పరిపాకం ప్రథయతే
సతాం పాశగ్రంథిం శిథిలయతి కిం కిం న కురుతే
ప్రపన్నే కామాక్ష్యాః ప్రణతిపరిపాటీ చరణయోః॥ ౯౯

విమల యశస్సమృద్ధి ప్రసవించును, దియ్యని సత్కవిత్వ మం
దము నిడు, నిచ్చెడిన్ సిరి, మనఃపరిపాక మొకండు గూర్చు, బం
ధముముడి విప్పు, శాంభవి పదమ్ముల ప్రాలుక్రమ మ్మెమేమి లా
భము పొనరింపకుండును ? బ్రపన్నునియం దనువొంది చయ్యనన్.

శాంభవీచరణపద్మమునం దొనర్చు ప్రణామము యశమును గూర్చును. తియ్యని కవిత్వము నించును. సంపదల నిడును. ఒకానొక మనఃపరిపాకము నలవరించును. జీవపాశగ్రంథిని విప్పును. అది చేయని మంగళ మేమున్నది !

మనీషాం మాహేంద్రీం కకుభమివ తే కామపి దశాం
ప్రధత్తే కామాక్ష్యా శ్చరణ తరుణాదిత్యకిరణః
యదీయే సంపర్కే ధృతరస మరందా కవయతాం
పరీపాకం ధత్తే పరిమలవతీ సూక్తినలినీ॥ ౧౦౦

కామాక్షీచరణారుణార్కకిరణగ్రామంబు ప్రాగ్దిక్కున
ట్లేమో మేల్తెలివిన్ వెలార్చి సతత మ్మింపొందు; తత్సంగతిన్
శ్రీమ త్సత్కవిసూక్తి పద్మిని రసానీకమ్ములన్ దేనియల్
సామోదమ్మయి తాల్చి తాలుచు, బ్రశస్తశ్రీపరీపాకమున్.

కామాక్షీ చరణ మనెడి బాలభాస్కరకిరణము తూర్పుదెసనట్లు చైతన్యశోభను రాణింపఁజేయును. తత్సంపర్కముచే సుకవులసూక్తిరూపయగు పద్మిని పరిమళవతియై తీయని శృంగారాది రసమకరందము చిప్పిల పరిపాకదశ వహించును.

పురా మారారాతిః పుర మజయ దంబ స్తవశతైః
ప్రసన్నాయాం సత్యాం త్వయి తుహినశైలేంద్రతనయే

అతస్తే కామాక్షి స్ఫురతు తరసా కాలసమయే
సమాయాతే మాత ర్మమ మనసి పాదాబ్జయుగలీ|| ౧౦౦

మునుపు పురారి యా త్రిపురముల్ గెలిచెన్ దుహినాద్రికన్య ! నీ
ఘనతరసుప్రసన్నతను గాంచ నుతించి నతించి; దాన నా
మనసున సంస్ఫురించుతను మంజులమైన భవత్పదాబ్జముల్
జననిరో ! యీ యుపాధి కవసానదశన్ దయనించి నా దెసన్.

మున్ను స్మరారి నిన్ను స్తుతించి నీ యనుగ్రహమువడసి త్రిపురాసుర సంహార మొనరించెను. కావున అవసానసమయమున నా మనసులో మృత్యుభయనివారకమగు నీ చరణకమలయుగము స్ఫురించుగాక !

పదద్వంద్వం మందం గతిషు నివసన్తం హృది సతాం
గిరా మన్తే భ్రాంతం కృతకరహితానాం పరిబృఢే
జనానా మానందం జనని జనయన్తం ప్రణమతాం
త్వదీయం కామాక్షి ప్రతిదిన మహం నౌమి విమలమ్|| ౧౦౨

అకుహక సూక్తిసంచయములందుఁ దుదం దులకించి సాధుకో
టికి హృదయమ్ములందున నటించుచు మ్రొక్కెడునట్టి మానవా
ళికి నొక నిందువేడ్క హవళించుచు నెన్నడ మందగించు నీ
యకలుషపాదయుగ్మము నహర్నిశ మంబ ! నమస్కరించెదన్.

కపటములేని సూక్తులు అనగా వేదములు. అట్టి వేదముల అంతములందు (వేదాంతములయందు) అర్థమై సంచరించుచు సాధుకోటిహృదయముల న్నటించుచు చెంతవ్రాలెడి భక్తుల కొక నిందువేడ్క వెలయించుచు నుండెడి మృదుమధుర మంద గమనాభిరామమగు నీ పదద్వయమున కే నహర్నిశము నమస్కరించెదను.

ఇదం యః కామాక్ష్యా శ్చరణనలిన స్తోత్రశతకం
జపే న్నిత్యం భక్త్యా నిఖిల జగ దాహ్లాదజనకమ్
స విశ్వేషాం వన్ద్య స్సకల కవిలోకైకతిలక
శ్చిరం భుక్త్వా భోగా న్పరిణమతి చిద్రూపకలయా|| ౧౦౩

ఈ కామాక్షిపదాంబుజ స్తుతిచయ మ్మెవ్వాడు లోకాన క
స్తోకాహ్లాద నిదానమైనది జపించు న్నిత్య మాతండు లో
కైకారాధ్యుఁ డగుం గవీంద్రతిలకుం డౌ నెల్లభోగంబు లం
బా ! కాంచున్ బర చిత్స్వరూప పరిణామ బ్రహ్మముం దానగున్.

సకలలోకాహ్లాదజనకమైన ఈ కామాక్షీపాదారవిందస్తుతి శతకము నెవఁడు నిత్యము పారాయణముసేయునో యతఁడు విశ్వవంద్యుఁ డగును. సకలకవిలోకతిలకుఁ డగును. సర్వభోగభాగ్యసంపదనుభూతి చిరకాలము వడసి సచ్చిదానందాత్మకకళతో పరిణామము నెందును.

శ్రీ

# స్తుతిశతకమ్

పాండిత్యం పరమేశ్వరి స్తుతివిధౌ నైవాశ్రయంతే గిరాం
వైరించాన్యపి గుంఫనాని విగలద్గర్వాణి శర్వాణి తే
స్తోతుం త్వాం పరిఫుల్ల నీలనలిన శ్యామాక్షి కామాక్షి మాం
వాచాలీకురుతే తథాపి నితరాం త్వత్పాదసేవాదరః॥ ౧

అమ్మా ! ఓ పరిఫుల్ల నీలనలిన శ్యామాక్షి ! కామాక్షి ! గ
ర్వమ్మున్ డించి విరించివల్కులు నినున్ వర్ణింప శర్వాణి ! స్వీ
యమ్మౌ పాండితి నండగాఁగొనను లేదైనన్ ననుం ద్వత్పదా
బ్జమ్మున్ గొల్చెడు వేడ్క యీ స్తుతివిధిన్ వాచాలుఁ గావించెడిన్.

అమ్మా ! పరమేశ్వరీ ! వికసించిన నల్లకలువవంటి నల్లని కనులుగలదానా ! ఓ కామాక్షీ ! నిన్ను స్తుతించుటయందు బ్రహ్మయొక్క వాగ్గుంభనములు (వేదములు) తమ పాండిత్యము నాధారముచేసికొనజాలవు. అందుచే నవి గర్వముడిగియున్నవి. అయినను నీ పాదముల సేవించుటయందుగల యాదరము నిన్ను స్తుతించుటయందు నన్ను వాచాలునిం జేయుచున్నదమ్మా !

తాపింఛ స్తబకత్విషే తనుభృతాం దారిద్ర్యముద్రాద్విషే
సంసారాఖ్యతమోముషే పురరిపో ర్వామాంకసీమాజుషే
కంపాతీర ముపేయుషే కవయతాం జిహ్వాకుటీం జగ్ముషే
విశ్వత్రాణపుషే నమోఽస్తు సతతం తస్మై పరంజ్యోతిషే॥ ౨

తాపించస్తబకత్విషమ్ము తనుభృద్దారిద్ర్యముద్రాద్విష
మ్మాపన్మోలతమోముషమ్ము గిరిశాంకాంతర్జుష మ్మమ్మ కాం
చీపర్యంతసమేయుషమ్ము కవిరాడ్జిహ్వాకుటీజగ్ముష
మ్మై పాల్పొ నొక రీతికిన్ వినతుఁడే నౌదున్ బరంజ్యోతికిన్.

చీకటిమ్రానిపూగుత్తుల తళుకుగాంచి శరీరధారుల దారిద్ర్యముద్ర నెదిరించి సంసార మనెడి చీకటిని హరించి శంకరునంకపీఠిపై వసించి కవీశ్వరుల జిహ్వాగ్రమునందు జరించి కంపాతీరమున విహరించి లోకరక్షణము పెంపొనరించుచున్న పరంజ్యోతికి నీకు నా నమస్కారము.

యే సంధ్యారుణయన్తి శంకర జటాకాంతార చంద్రార్భకం
సిందూరన్తి చ యే పురందరవధూ సీమంత సీమాంతరే
పుణ్యం యే పరిపక్వయన్తి భజతాం కాంచీపురే మా మమీ
పాయాసుః పరమేశ్వరప్రణయనీ పాదోద్భవాః పాంసవః|| 3

హరుని జటాటవిం గులుకు నర్భకుఁ జందురు సాంధ్యరాగవి
స్ఫురితు నొనర్చు ; సిందురపుబొట్టగు నింద్రవధూటిపాపటన్
వరనిజభక్తపుణ్యపరిపాకము సేయును గాంచిలోన ; ఆ
పరశివవల్లభా చరణపాంశులవమ్మలు నన్ను బ్రోచుతన్.

శంకరుని జడలనెడి యడవిలో గులుకు బాలచంద్రుని సాంధ్యరాగముచే నెఱు పెక్కు వానిగ గావించి శచీదేవిపాపట సిందూరతిలకంపుసొంపు గని (దేవేంద్రునిరాణియగు శచి శిరమువంచి యీ యమ్మపాదములకు మ్రొక్కుచుండునన్నమాట. అప్పుడు చరణ పరాగము నుదుటనంటుకొని కుంకుమబొట్టువలె రాణించుచున్నది.) తనను గొల్చువారి పుణ్యములను బండించుచు మిగుల రాణించు పరమేశ్వరుని రాణియగు కామాక్షియొక్క చరణపరాగ పుంజము మమ్ము రక్షించుగాక.

కామాడంబరపూరయా శశిరుచా క్రమస్మితానాం త్విషా
కామారే రనురాగసిన్ధు మధికం కల్లోలితం తన్వతీ
కామాక్షీతి సమస్త సజ్జననుతా కల్యాణదాత్రీ నృణాం
కారుణ్యాకులమానసా భగవతీ కమ్పాతటే జృమ్భతే|| ౪

స్మరసంరంభము నించి లేనగవునాఁ జాల్కొన్న యవ్వెన్నెలన్
బరమేశానుమహానురాగజలధిన్ గల్లోలముల్ రేచుచున్
గరుణ న్మించి ఘటించి సర్వశుభముల్ గై సేసి కంపాతటాం
తరసీమం దులకించు సాధువినుతిన్ గైకొంచుఁ గామాక్షినాన్.

కాముని యాడంబరమును నిండించుచు, కలికి చిఱునవ్వువెన్నెలచే గామారియను రాగసాగరము నుత్తరంగితము సేయుచు సకలసాధుజనసంస్తుతయై కల్యాణముల నిచ్చుచు కారుణ్యాకులచిత్తయై కామాక్షియను పరదేవత కంపాతటమునందు విజృంభించియున్నది.

కామాక్షీణపరాక్రమ ప్రకటనం సంభావయంతీ దృశా
శ్యామా క్షీరసహోదర స్మితరుచి ప్రక్షాలితాశాన్తరా
వామాక్షీజన మౌళిభూషణమణి ర్వాచాం పరా దేవతా
కామాక్షీతి విభాతి కాపి కరుణా కంపాతటిన్యా స్తటే|| ౫

కామాక్షీణపరాక్రమప్రకటనం గావించుచున్ జూపులన్
శ్యామమ్మై తెలిపాలువో ల్నగవులన్ క్షాళించుచున్ దిక్కులన్
వామాక్షీమణి మౌళిరత్నమగుచున్ వాగ్దేవతారూపమై
కామాక్షమ్మ యనంగ నొక్క కృప యా కంపాతటిన్ గుల్కెడిన్.

కాముని నిర్వక్రపరాక్రమమును బ్రకటించుచు జూపులచే నల్లనై యచ్చపుపాలు వోలు లేనగవులచే దిక్కులను బ్రక్షాళించుచు సుందరీజన శిరోమణియై వాగధిష్ఠాన దేవతయై కామాక్షియనుపేర నొకానొక కరుణ కంపాతటమునం దుల్లసిల్లుచున్నది.

శ్యామా కాచన చంద్రికా త్రిభువనే పుణ్యాత్మనా మాననే
సీమాశూన్య కవిత్వవర్ష జననీ యా కాఽపి కాదమ్బినీ
మారారాతి మనో విమోహనవిధౌ కాచి త్తమఃకన్దలీ
కామాక్ష్యాః కరుణాకటాక్షలహరీ కామాయ మే కల్పతామ్|| ౬

శ్యామరుచిన్ వెలార్చు నొక చంద్రిక ధన్యులమోమునందు ని
స్సీమకవిత్వముం గురియుఁ జిత్రపు మబ్బులగుంపు శంకర
స్వామి మనోవిమోహనము సల్పెడిచీఁకటిమొల్కయొక్క డం
బామణి శ్రీకటాక్షరసవాహిని మా యభిలాష దీర్చుతన్.

శ్యామవర్ణము (నల్లనిది) అగు నొక వెన్నెల ముల్లోకములందు వ్యాపించి పుణ్యాత్ముల ముఖమునందు కవితావర్షమును గురిపించు నొకమేఘమాల, శివుని చిత్తమును మోహింపజేయు నొక మొలకచీకటియునై యొప్పు కామాక్షీకటాక్షలహరి మా కోరిక దీర్చుట కనువుపడుగాక !

ప్రౌఢధ్వాంతకదమ్బకే కుముదినీపుణ్యాంకురం దర్శయ
జ్జ్యోత్స్నాసంగమనేఽపి కోకమిథునం మిశ్రం సముద్భావయన్
కాలిన్దీలహరీదశాం ప్రకటయన్ కమ్రాం నభ స్యద్భుతాం
కశ్చిన్నేత్రమహోత్సవో విజయతే కాంచీపురే శూలినః|| ౭

నించెడి చీఁకటిన్ గుముదినీసుకృతాంకురదర్శనమ్ము సే
యించుచుఁ బండువెన్నెలల చేరికఁ గోకయుగమ్ము పొత్తు క
ల్పించుచు నింగి నయ్యమునయేటిప్రవాహపువింతచాటుచు
న్గాంచి దలిరు శంకరుల కన్నులపండు వొకం డపారమై.

కాఱుచీకటిలో గలువపువ్వుల పుణ్యం పుమొలకను బ్రదర్శించుచున్నది. నల్లని కొప్పుపై జంద్రరేఖను సంతరించుకొన్న దన్నమాట. వెన్నెలలోగూడ చక్రవాకమిథునమునకు పొత్తుగల్పించుచున్నది. చక్రవాకములు వెన్నెలలో నెడబాసియుండుట కవిప్రసిద్ధ విషయము. చిఱునవ్వు తళుకులలో గుచయుగము గులుకుచున్నదనుట. ఆకాశమున నాశ్చర్యకరముగ యమునానదీ ప్రవాహస్థితిని బ్రకటించుచున్నది. మధ్యమునందు నూగారు మెఱయుచున్నదనుట. ఇట్టి ఒకానొక పరమశివనేత్రోత్సవము (కామాక్షియన్నమాట) కాంచీపురమునందు సర్వాతిశాయియై రాణించుచున్నది.

తన్ద్రాహీన తమాలనీల సుషమై స్తారుణ్య లీలాగృహై
స్తారానాథకిశోర లాంఛితకచై స్తామ్రారవిన్దేక్షణైః
మాతః సత్క్రియతాం మనో మనసిజప్రాగల్భ్య నాడింధమైః
కంపాతీరచరై ర్ఘనస్తనభరైః పుణ్యాంకురై శ్శాంకరైః|| ౮

తరగల్వారు తమాలనీలసుమం దారుణ్యలీలాగృహ
స్ఫురణన్ జంద్రకిశోరలాంఛిత కచస్ఫూర్తిన్ స్మరప్రౌఢిమన్
గర ముద్యత్ స్తనకుంభవిభ్రమమునం గంపాతటిన్ గుల్కు శాం
కరపుణ్యాంకురపాళి నా మనసు సత్కారార్హమౌ గావుతన్.

నిస్తంద్రతమాలనీలప్రభలచే నవయౌవనములకు నెలవులగు విలాసములచే చంద్రరేఖాలంకృత లలితకుంతలములచే రక్తారవిందసుందరనయనములచే మన్మథాటోప సముజ్జృంభణమునకు గారణములయినవానిచే కరిసస్తన భారముచే గులుకువానిచే కంపాతీర సంచారులగు శంకరుల పున్నెంపు మొలకలచే (కామాక్షిచే ననుట) నా హృదయము సత్కరింపబడుగాక !

నిత్యం నిశ్చలతా ముపేత్య మరుతాం రక్షావిధిం పుష్ణతీ
తేజస్సంచయపాటవేన కిరణా నుష్ణద్యుతే ర్ముష్ణతీ
కాంచీమధ్యగతాఽపి దీప్తిజననీ విశ్వాంతరే జృంభతే
కాచి చ్చిత్ర మహో స్మృతాపి తమసాం నిర్వాపికా దీపికా|| ౯

సతమున్ నిశ్చలమై మరున్నిచయరక్షాదక్షతం జూపుచున్
ద్యుతిసంతానపటిష్ఠమై రవికరస్తోమమ్ముగా జేసి యం
చిత కాంచీవరమధ్యశోభగనియు న్విశ్వమ్మునన్ రెచ్చి సం
స్మృతిమాత్రమ్మున నొక్క దీవియ తమశ్శ్రేణిన్ విదారించెడిన్.

సహజముగ దాను నిశ్చలమయ్యు మరుత్తులకు రక్షణకల్పించునది. మరుత్తులు = దేవతలు, (శ్లేష) -- వాయువులు. తన కాంతిపుంజముయొక్క దార్ఢ్యముచే సూర్యునికిరణములను హరించునది. కాంచీమధ్యవర్తిని యయ్యు (నడుమున నొడ్డాణ ముగలదియని -- (శ్లేష) సకలవిశ్వాంతరమునందు తలచిన మాత్రమున తమంబును = చీకటిని (శ్లేష) అజ్ఞానమును ఆర్పెడి ఒకానొక చిత్రమైన దీపము విజృంభించుచున్నది.

కాంతైః కేశరుచాం చయై ర్భ్రమరితం మన్దస్మితైః పుష్పితం
కాంత్యా పల్లవితం పదామ్బురుహయో ర్నేత్రత్విషా పత్రితమ్
కమ్పాతీరవనాన్తరం విదధతీ కల్యాణజన్మస్థలీ
కాంచీమధ్యమహామణి ర్విజయతే కాచి త్కృపాకందలీ॥ ౧౦

భ్రమరితమై కచద్యుతులఁ బల్లవితమ్మయి పాదపద్మవి
భ్రమముల నేత్రకాంతులను బత్రితమై చిరునవ్వుచాయఁ బు
ష్పములను బూసి కంపదరి భద్రనిధానము పుట్టినిల్లుగా
నమరును గాంచిమధ్యమణియై యొక మేల్ కృప చిన్ని మొల్కయై.

నల్లని తలకట్టుచే భ్రమరితమై (తుమ్మెదలు ముసిరినదై) పాదకమల ప్రభలచే బల్లవితమై (చిగిర్చినదై) నేత్రకాంతులచే బత్రితయై (మారాకు వెట్టినదై) మందహాసద్యుతులచే పుష్పినందినదై సకలకల్యాణములకు నిధానమై కంపాతీరమునం దులకించు నొక కృపయను చిఱుమొలక సర్వోన్నతిం దనరుచున్నది.

రాకాచన్ద్రసమాన కాంతివదనా నాకాధిరాజస్తుతా
మూకానామపి కుర్వతీ సురధునీనీకాశ వాగ్వైభవమ్
శ్రీకాంచీనగరీ విహారరసికా శోకాపహన్త్రీ సతా
మేకా పుణ్యపరమ్పరా పశుపతే రాకారిణీ రాజతే॥ ౧౧

రాకేందుప్రతిమానకాంతిముఖియై రాజిల్లి నాకేశ్వర
శ్రీ కైవారము సేయ మూకులకునుం జేకూర్చుచున్ స్వర్ధునీ
నీకాశం బగు వాగ్విలాస మమరన్ విశ్వేశు పుణ్యక్రమ
మ్మేకామ్రేశపురీ విహారరసిక మ్మీగించుతన్ శోకమున్.

పున్నమచందురునివంటి ముద్దుమోము గలదై దేవేంద్రలక్ష్మి తన కూడిగము సేయ మూగవారికిగూడ మందాకినీప్రవాహమధురమగు కవితా విలాసస్ఫురణము నల వరించుచు నేకామ్రనాథుల భాగ్యమొకటి కాంచీపురమునందు సకలదుఃఖాపహారియై విహరించుచున్నది.

జాతా శీతలశైలత స్సుకృతినాం దృశ్యా పరం దేహినాం
లోకానాం క్షణమాత్రసంస్మరణత స్సంతాపవిచ్ఛేదినీ
ఆశ్చర్యం బహుఖేలనం వితనుతే నైశ్చల్య మాబిభ్రతీ
కమ్పాయాస్తటసీమ్ని కాపి తటినీ కారుణ్యపాథోమయీ॥ ౧౨

చలిమలఁ బుట్టి పుణ్యులకుఁ జక్కఁగఁ గోచరమై క్షణమ్మునన్
దలఁచినమాత్రఁ దాపము లదల్చుచు నిశ్చలమయ్యుఁ గంచిలో
లలిత విలాసఖేలనములం దులకించుచు గంపయొద్దులన్
జెలగి కృపా రసామృతధునీ తిలకమ్మొకఁ డుల్లసిల్లెడిన్.

హిమగిరికిం బుట్టి పుణ్యాత్ములకు మాత్ర మనుకొన్నక్షణములో దర్శన మిచ్చుచు తాపత్రయము నున్మూలించుచు గాంచీపురమునందు సుస్థిరస్థితింగనియు గంపాతీరము నందుల్లాసఖేలనము సేయుచు నొక దయారసామృత తరంగిణి జాల్వారుచున్నది.

ఐక్యం యేన విరచ్యతే హరతనౌ దమ్భావపుమ్భావకే
రేఖా యత్కచసీమ్ని శేఖరదశాం నైశాకరీ గాహతే
ఔన్నత్యం ముహురేతి యేన స మహా న్మేనాసఖ స్సానుమా
న్కమ్పాతీరవిహారిణా సశరణా స్తేనైవ ధామ్నా వయమ్॥ ౧౩

తరుణశ్రీ హరుమేన నైక్యమెనసెన్ దంభావపుంభావవి
స్ఫురణన్ జాబిలిరేఁక శేఖరదశన్ బొల్వారు నేవేనలిన్
బరమౌన్నత్యము దేనిచే వడసె మేనాభర్త కంపాతటాం
తర కేళీరుచి గొన్నయా సొగసుచేతన్ దిక్కుగన్నా మిలన్.

జాబిల్లిరేఖ శిరమునం దూగ మేనాభర్తయైన హిమగిరి సార్వభౌమునికి బర మోన్నతి గూర్చుచు కంపాతీరమందు నవయౌవనముతో విహరించు నొక సొగసుచేత మేము దిక్కుగలవార మైనారము.

అక్ష్ణోశ్చ స్తనయో శ్శ్రియా శ్రవణయో ర్బాహ్వోశ్చ మూలంస్పృశ
న్నుత్తంసేన ముఖేన చ ప్రతిదినం ద్రుహ్య న్పయోజన్మనే
మాధుర్యేణ గిరాం గతేన మృదునా హంసాంగనాం హ్రేపయ
న్కాంచీసీమ్ని [illegible]

సరవిన్ భాసిలుఁ గాంచి నొక్కకవితా సంతానబీజాంకుర
మ్మొరపై నేత్రకుచద్యుతుల్ శ్రవణబాహాద్వంద్వ మూలంబులం
దొరయన్ మోము కిరీట మబ్జరుచులన్ ద్రోనాడ వాజ్మాధురిన్
నిరతిన్ మందగతిన్ మరాళసుదతిన్ సిగ్గొందగాఁజేయుచున్.

కవితాకల్పవృక్షమునకు మూలమైన లేమొలకయై నేత్రప్రభ కర్ణమూలములను కుచద్యుతి బాహామూలములను నొరయగా మొగమును కిరీటమును (చంద్రుడ న్నమాట) పద్మకాంతులను ద్రోసిరాజనగా మాటల సొంపుచే నడకల యింపుచే రాజహంసికి సిగ్గు కల్పించుచు నొక పొలుపు కాంచీపురమున విలసిల్లుచున్నది.

ఖండం చాంద్రమసం వతంస మనిశం కాంచీపురే ఖేలనం
కాలాయశ్ఛవితస్కరీం తనురుచిం కర్ణేజపే లోచనే
తారుణ్యోష్మ నఖంపచస్తనభరం జంఘాస్పృశం కున్తలం
భాగ్యం దేశికసంచితం మమ కదా సంపాదయే దమ్బికే|| ౧౫

శిరమం దూఁగెడుచాంద్రఖండ మకుటశ్రీ, కాంచి నాటాడుమేల్
గరిమ మ్మాయసకాంతితస్కరము మేన్ గర్ణేజపమ్ముల్ కనుల్
తరుణత్వోష్మను గోరువెచ్చగు గుచద్వంద్వంబు జంఘాలముల్
కురు లౌచున్ గురులబ్ధభాగ్య మది నాకుం గూర్చు టేనాటికో.

శిరమునం జంద్రరేఖ తూగగా శరీరకాంతి ఇనుముయొక్క కాంతిని నిరసింపగా కనులు చెవిలో రహస్యము తెలుపగా (ఆకర్ణాంతములనుట) ఎలప్రాయంపువెచ్చదనమున గోరువెచ్చనయి పాలిండ్లు కులుకగా జంఘాలము (పిక్కలందాకునది) అయి తలకట్టు విలసిల్లగా ఆచార్యకృపాలబ్ధమయి యుండెడి యా భాగ్యము మాకుం బ్రీతి చేకూర్చు టెన్నడో కదా !

తన్వానం నిజకేలిసౌధసరణిం నైసర్గికీణాం గిరాం
కేదారం కవిమల్ల సూక్తిలహరీం సస్యశ్రియాం శాశ్వతమ్
అంహోవంచనచుంచు కించన భజే కాంచీపురీమండనం
పర్యాయచ్ఛవి పాకశాసనమణేః పౌష్పేషవం పౌరుషమ్|| ౧౬

శ్రుతికాంతామణి కేళిసౌధసరణిన్ శోభిల్లి శ్రీమత్కవి
స్తుతివాక్సస్యము పండు పంటపొలమై త్రోనాడి పాపమ్ము, లం
చిత పౌష్పేషవ పౌరుషమ్మయిన కాంచీభూషణ మొకు శా

శ్రుతికాంతారత్నములు కేళీవిహారముసేయు సౌధములందు (వేదాంతములందనుట) శోభిల్లి కవుల వాగ్రూపసస్యములు పండుటకు పంటపొలమై పాపహరమై పుష్పేషుని (మన్మథుని) మగతనమెల్ల రూపెత్తినదై కాంచీనగరాలంకారమై యింద్రనీలమణితున్కవంటి నెమ్మేనిచాయగల యొక శాశ్వతసౌందర్యము నారాధించెదను.

ఆలోకే ముఖపంకజే చ దధతీ సౌధాకరీం చాతురీం
చూడాలంక్రియమాణ పంకజవనీ వైరాకరప్రక్రియా
ముగ్ధస్మేరముఖీ ఘనస్తనతటీ మూర్ఛాలమధ్యాంచితా
కాంచీసీమని కామినీ విజయతే కాచి జ్జ [illegible] ౧౭

వరచూడాభరణాయితాంబుజననీ వైరాయిత ప్రక్రియన్
దరహాసాననయై ఘనస్తనభరానన్ స్రుక్కుమధ్యమ్మునన్
గరుణాదృష్టుల వెన్నెలల్ నినుచుచున్ సౌధాకరీచాతురిన్
హరువందున్ జగదేకసుందరి కర మ్మాశ్చర్యమై కంచిలోన్.

తామరపూలవనముతో తగవులాడుప్రక్రియ (చంద్రరేఖ) శిరోభూషణము కాగా దరహాస మింపుగుల్కు మోముతో స్తనభారముచే నడుము గిటగిటలాడ మూర్ఛపడు అనగా కృశించిన నడుముతో వాల్జూపుల నమృతమ్ముచాతురి నెఱపుచు గాంచీసీమం గడునచ్చెఱువు గొల్పుచు నొక జగన్మోహిని యొప్పుచున్నది.

యస్మి న్నంబ భవత్కటాక్షరజనీ మన్దేఽపి మన్దస్మిత
జ్యోత్స్నాసంస్నపితా భవ త్యభిముఖీ తం ప్ర త్యహో దేహినమ్
ద్రాక్షా మాక్షిక మాధురీ మదభర వ్రీడాకరీ వైఖరీ
కామాక్షి స్వయ మాతనో త్యభిసృతిం వామేక్షణేవ క్షణాత్|| ౧౮

నీ మందస్మిత చంద్రికన్ మునిఁగి యేనిన్ డాయునో సమ్ముఖ
మ్మై మా యమ్మ ! భవత్కటాక్షమను దివ్యత్పూర్ణిమారాత్రి య
చ్చో మందాత్మునివంకకే నభిసరించు న్నాయికారీతి మా
ధ్వీమారంద మరుద్ ఝరీ మదభర వ్రీడాకరు ల్వైఖరుల్.

ఎవరికి నీ కటాక్షమనెడి పూర్ణిమారాత్రి నీ చిఱునవ్వనెడి వెన్నెలయేట స్నానమాడి నిత్యాభిముఖియగునో ఎంత మందమతియైనను వానింగూర్చి ద్రాక్షారసము, తేనె యొక్కయు గర్వమునకు సిగ్గుగూర్చెడిరీతిని అభిసారికానాయికవోలె విచిత్రవాగ్వైఖరి యభిసరించును.

కాళిన్దీజలకాంతయః స్మితరుచి స్స్వర్వాహినీపాథసి
ప్రౌఢధ్వాన్తరుచః స్ఫుటాధరమహో లౌహిత్యసన్ధ్యోదయే
మాణిక్యోపలకుండలాంశుశిఖిని వ్యామిశ్రధూమశ్రియం
కల్యాణైకభువః కటాక్షసుషమాః కామాక్షి రాజన్తి తే|| ౧౯

ఎలనవ్వన్న సురాపగన్ యమున నీ రెక్కించిన ట్లాధరో
జ్జ్వలసంధ్యారుచిఁ గ్రమ్ము చీఁకటులశోభ న్నవ్యమాణిక్యకుం
డలతేజశ్శిఖ గ్రమ్ము ధూమలత రాణం బొల్చి కామాక్షి ! మేల్
కళలొల్కన్ ద్వదపాంగకాంతిచయముల్ గల్యాణసంతానముల్.

చిఱునవ్వనెడి దేవనదిలో (గంగలో) యమునాజలప్రభలయి, పెదవిపైగులుకు నెఱ్ఱనికాంతియనెడి సంధ్యారాగమందు కాఱుచీకటులయి మణికుండలములనెడి అగ్ని శిఖయందు నెలకొను ధూమరేఖలై నీ కాటుకకంటికొనకాంతులు కల్యాణకరంబు లగుచున్నవి.

కలకల రణత్కాంచీ కాంచీవిభూషణమాలికా
కచభర లసచ్చంద్రా చంద్రావతంస సధర్మిణీ
కవికులగిరః శ్రావం శ్రావం మిల త్పులకాంకురా
విరచితశిరఃకమ్పా కమ్పాతటే పరిశోభతే|| ౨౦

కలకలమ్రోయు కాంచియయి కాంచివిభూషణ మాలికారుచిన్
గులుకఁగఁ జందమామకళ కూకటిఁ గ్రమ్మకవీంద్ర వాక్చయ
మ్ములు వినిపించుకొంచు మెయిపుల్కలు నిండఁగఁ గంపయొడ్డునం
దొలయు నపూర్వశోభ తలయూచుచు నిందుకిరీటునింతియై.

గలగలమ్రోయు గజ్జెలయొడ్డాణముతో కాంచీనగరభూషణమైన మాలికవలె గులుకుచు చందమామకళ చక్కనికొప్పున బొలుపొందగా మేనుపులకరింపగా సుకవుల మధురతరభాషణము లవధరించుచు తలయూచి మెచ్చుచు కంపాతటంబున నెలకొను నొకశోభ చంద్రమౌళీశ్వరుని యనుంగుచెలియై రాజించుచున్నది.

సరసవచసాం వీచీ నీచీభవ న్మధుమాధురీ
భరితభువనా కీర్తి ర్మూర్తి ర్మనోభవజిత్వరీ
జనని మనసో యోగ్యం భోగ్యం నృణాం తవ జాయతే
కథమివ వినా కాంచీభూషే కటాక్షతరంగితమ్|| ౨౧

తేనియ యెంతపాటి యను తీయనిపల్కులకుల్కు, పూలవి
ల్కానిజయించు రూపము, జగమ్ముల మ్రోసినపేరు, బుద్ధి కెం
తేనియు గూర్చు భోగము లవెల్ల లభించుటయెట్లు తల్లి ! కాం
చీనగరైకభూషణమ! చిందక నీదు కటాక్షవీచికల్.

తేనెతేటల నేపాటి యనజాలు మాటలసొగసును, మన్మథునింగెలువజాలు చక్కందనమును, విశ్వవ్యాప్తమయినకీర్తితో మనసుకుంగూర్చు భోగములును నీ కటాక్షచంద్రిక ప్రసరింపక యెవ్వరికిం గలుగనేరవు.

భ్రమరితసరిత్కూలే నీలోత్పలప్రభయా భయా
నత జనతమఃఖండీ తుండీరసీమ్ని విజృంభతే
అచలతపసా మేకః పాకః ప్రసూనశరాసన
ప్రతిభటమనోహారీ నారీకులైకశిఖామణిః॥ ౨౨

అలుకున వ్రాలువారి యెద నల్లిన జీఁకటిఁ జెండి నల్లగ
ల్వలజిగిఁ దుమ్మెదల్ మునరివ్రాలు సరిత్తటి గంతువెట్టి యె
వ్వలనునఁ గొండసేసిన తపమ్ముల పాప మొకండు పువ్వుట
మ్ములదొరగెల్పుగానిమది ముచ్చిలు ముద్దులగుమ్మ కాంచిలోన్.

భయపడి తన యడుగులందు వ్రాలినవారి మనసులోని తమంబును (అజ్ఞానమును) హరించుచు, తుమ్మెదలు మూగు నల్లగల్వలచే నింపుగుల్కు కంపానదీతీరములో క్రీడించుచు పూవిలుతునిం గెల్చిన సొగసుగాని మనసును దొంగిలు నొకానొక పర్వతరాజతపఃపరిపాకము కాంచిలో మసలుచున్నది.

మధురవచసో మన్దస్మేరా మతంగజగామిన
స్తరుణిమజుష స్తాపింఛాభా స్తమఃపరిపంథినః
కుచభరనతాః కుర్యు ర్భద్రం కురంగవిలోచనాః
కలితకరుణాః కాంచిభాజః కపాలిమహోత్సవాః॥ ౨౩

ఒలసి కపాలిపాలిటి మహోత్సవముల్ శివకాంచిభద్రముల్
గొలుపును మందహాసము లకుంఠిత సూక్తులు సత్కృపారసా
కులిత మతుల్ తమాలరుచి కోమలముల్ కుచభారనమ్రముల్

శంకరునివాల పండుగలు కల్యాణనిలయములు మత్తేభగమనములు మధుభూ-
షణములు మంజులమందహాసములు ఎలప్రాయంపు సంపదలు కుచభారవినమ్రములు
దయాభరితములు లేడికన్నులుగలవి ఇఱుగుడుమ్రానివేని తళుకులు గలవి యగు
నౌకా నౌకవిలాసములు మాకు శుభములం గూర్చును.

కమలసుషమాక్ష్యారోహే విచక్షణవీక్షణాః
కుముదసుకృతక్రీడా చూడాలకున్తల బన్ధురాః
రుచిరరుచిభి స్తాపింఛశ్రీ ప్రపంచనచుంచవః
పురవిజయినః కమ్పాతీరే స్ఫురన్తి మనోరథాః|| ౧౪

కమలమునిగ్గులందు పయి కక్ష్యకు నెక్కు విచక్షణేక్షణ
క్రమమునఁ గల్వమేలుసిరి రంజిలు నొప్పగు కొప్పతోడ నం
దమగు తమాలకాంతి వితతమ్ముగ నిమ్మగు కంపయొడ్డునం
గొమరగు నప్పురాంతకు మనోరథముల్ సుమనోరథమ్ములై.

కమలములశోభ పైతరగతి కెక్కుటయందు విచక్షణతగన్న చూపులుగలవి. కలువల పుణ్యక్రీడ (చంద్రబింబమన్నమాట) శిరోభూషణముగాగల కురులుగలవి. నిజకాంతిచే తాపింఛకుసుమశోభను విస్తరింపజేయు నేర్పుగలవియు నగు పరమశివుని మనోరథములు (కామాక్షియనుట) కంపాతీరమునందు స్ఫురించుచున్నవి.

కలితరతయః కాంచీలీలావిధౌ కవిమండలీ
వచనలహరీ వాసన్తీనాం వసన్తవిభూతయః
కుశలవిధయే భూయాసు ర్మే కురంగవిలోచనాః
కుసుమవిశిఖారాతే ర్లక్ష్ణాం కుతూహలవిభ్రమాః|| ౧౫

వరకాంచీపురఖేలనప్రవణముల్, వాసంతలక్ష్మీకళా
భరణమ్ముల్, కవిరాజసూక్తిలహరీవాసంతికశ్రేణికిన్
హరిణీలోచనముల్ సుమాస్త్రరిపుదివ్యాలోక కౌతూహల
స్ఫురణమ్ముల్ విలసిల్లుఁగాక కుశలమ్ముల్ మాకుఁ జేకూర్పఁగన్.

కాంచీవిహార కుతూహలములు కవిశ్రేణివాక్ప్రవాహంబులనెడి వాసంతీ లతలకు (పూలగురివెందతీగ) వసంత సంపదలు, ఆడులేడిచూపులుగలవి, కామవైరికన్నులకు వేడుకలు గొలుపునవియు నగు విలాసములు నాకు క్షేమవిధాయకము లగుగాక !

కబలితతమస్కాండా స్తుండీరమండల మండనాః
సరసిజవనీ సంతానానా మరుంతుద శేఖరాః
నయనసరణే ర్నేదీయాంసః కదాను భవన్తి మే
తరుణజలదశ్యామా శ్శంభో స్తపఃఫల విభ్రమాః॥ ౨౬

కలితజ్యోతి మెసంగి యాంతరతమఃకాండంబుఁ దుండీరమం
డల సన్మండనముల్ సరోజవనపీడా శేఖరమ్ముల్ లస
జ్జలదశ్యామలముల్ మహేశ్వర తపస్సాఫల్యకృ ద్విభ్రమ
మ్ములు నా కన్నులచెంత నెప్పుడొ కదా పొల్పుల్ పచారించుటల్.

తుండీరమండలమండనములై తమస్సులను గబళించుచు పద్మినుల నొప్పించు కిరీటము గలవి (చంద్రశేఖరములనుట) మేఘమువలె నల్లనివి మహేశుని తపస్సును సఫలము సేయు విలాసములు నా కనుల చాయ కెన్నడు సన్నిహితము లగునో కదా !

అచరమ మిషుం దీనం మీనధ్వజస్య ముఖ్యశ్రియా
సరసిజభువో యానం మ్లానం గతేన చ మంజునా
త్రిదశసదసా మన్నం ఖిన్నం గిరా చ వితన్వతీ
తిలకయతి సా కమ్పాతీరం త్రిలోచనసున్దరీ॥ ౨౭

స్మరుతొలితూఁపు నాస్యరుచిసంపదఁ గించవడంగఁ జేయుచున్
సరసిజగర్భువాహనముఁ జక్కనినెన్నడఁ గానడించుచున్
సురసరసాన్నముం బలుకుసొంపున నీరసముం బొనర్చుచున్
బరశివుకల్కి కంపపులినమ్ము లదే కయిసేయుఁ గాంచిలోన్.

మన్మథుని మొదటిబాణమగు పద్మమును దన ముఖశోభచే గించపఱచుచు బ్రహ్మవాహనమగు హంసను దననడకచే నోడించుచు, వేలుపుబువ్వను (అమృతమును) తన పలుకుసొంపుచే నీరసపడజేయుచు బరమశివుని సుందరి కంపాతీరముల నలంకరించియున్నది.

జనని భువనే చంక్రమ్యేఽహం కియన్త మనేహసం
కుపురుషక రభ్రష్టై ర్దుష్టైర్ధనై రుదరంభరిః
తరుణకరుణే తన్ద్రాశూన్యే తరంగయ లోచనే
నమతి మయి తే కించి త్కాంచీపురీ మణిదీపికే॥ ౨౮

లోకమ్మందు నపాత్రులిచ్చు ధనముం గొంచుం జగన్మాత ! నే
నేకాల మ్ముదరంభరిత్వమున నెల్లేగించెదన్ గాల మో
శ్రీకాంచీపురరత్నదీపిక ! కృపారేఖన్ వితంద్రమ్ములా
లోకమ్ముల్ ప్రవహింపజేయు మొడి లోలో ప్రాలు నీ బిడ్డపై.

నేను గడుపునింపుకొనుట కపాత్రులనుండి పరిగ్రహము సేయుచు నెన్నాళ్లు లోకమున పరిభ్రమింతును దల్లీ ! ఓ కాంచీపురీ మణిదీపికా ! నూతన కృపాభరితములు నిర్నిద్రములునైన నీ చూపులను నీ దాపున వినతుడనైన నామీఁద కొంచె మొలయింపజేయుము.

మునిజనమనః పేటీరత్నం స్ఫురత్కరుణానటీ
విహరణకలాగేహం కాంచీపురీ మణిభూషణమ్
జగతి మహతో మోహవ్యాధే ర్నృణాం పరమౌషధం
పురహరదృశాం సాఫల్యం మే పురః పరిజృమ్భతామ్|| ౨౯

మునిజనచిత్తపేటి మణిపూస దయానటినాట్యమాడు న
ర్తనమణిశాల కాంచిపురిరత్నవిభూషణ ముత్తమౌషధ
మ్మనుపమమోహరోగమున కయ్యది నాయెదుటన్ నటించుఁగా
కనిశము శంభుదేవు నయనాంబుజభాగ్యవిపాక మియ్యెడన్.

మునిమనఃపేటికయందున్న రత్నము, కృపయను నాట్యకత్తె నటించు నర్తనశాల, కాంచీపురికి మణిభూషణము, మోహమహావ్యాధికి పరమౌషధము. పురహరుని చూపుల సాఫల్యము నా మ్రోలను విజృంభించుగాక !

మునిజనమనోధామ్నే ధామ్నే వచోమయజాహ్నవీ
హిమగిరితట ప్రాగ్భారా యాక్షరాయ పరాత్మనే
విహరణజుషే కాంచీదేశే మహేశ్వరలోచన
త్రితయ సరసక్రీడా సౌధాంగణాయ నమో నమః|| ౩౦

నిజనచిత్తధామమగు మోహనధామము వాఙ్మయాఖ్యపా
వన సురవేణి దూకు హిమవచ్ఛిఖర మ్మది యక్షరాత్మ శం
భుని నయనత్రయంబు ముదముం గొనియాడెడు సౌధసీమ కాం
చిని విహరించుచుండు నొకచెల్వున కియ్యవి నా నమస్కృతుల్.

మనమున నిలయమగుతళుకు కవితామందాకిని దూకు హిమగిరివర శిఖరము కాంచీదేశవిహారపరము మహేశ్వరనయనత్రయమ్ము విలాసకేళి నెఱపు సౌధాంగణము అక్షరమునైన కామాక్షీరూప పరమాత్మకు నమస్కారము.

మరకతరుచాం ప్రత్యాదేశం మహేశ్వరచక్షుషా
మమృతలహరీపూరం పారం భవాఖ్యపయోనిధేః
సుచరితఫలం కాంచీభాజో జనస్య పచేలిమం
హిమశిఖరిణో వంశ స్యైకం వతంస ముపాస్మహే|| 30

మరకతకాంతిచుక్కెదు రమందభవాంబుధియొడ్డు శ్రీమహే
శ్వరునయనమ్ములం దమృతసారణి కాంచి వసించువారికిన్
మురిపెము గూర్పఁగన్ మివులముగ్గిన పుణ్యఫలంబు నిండు సం
బరము హిమాద్రియింటిసిగబంతి యొకండు భజింతు మెప్పుడున్.

మరకతమణికాంతిని కాదనునది సంసారసింధువునకొడ్డు మహేశ్వరుని చూపుల కమృతప్రవాహంపుబుగ్గ కాంచీవాసుల పరిపక్వపుణ్యఫలము హిమగిరివంశమున కేకైక భూషణము నైనదాని నుపాసించెదము.

ప్రణమనదినారంభే కంపానదీసఖి తావకే
సరసకవితోన్మేషః పూషా సతాం సముదంచితః
ప్రతిభట మహాప్రౌఢప్రోద్య త్కవిత్వకుముద్వతీం
నయతి తరసా నిద్రాముద్రాం నగేశ్వరకన్యకే|| 31

సరసత నీదరిన్ వినతి సల్పిన యా తొలిసంజవేళనే
యురుకవితావిలాస మరుణోదయమై ప్రతిపక్షకోటిని
ర్భరతరవక్తృతన్ బొదలు ప్రౌఢకవిత్వకుముద్వతిన్ స్వతః
పరిణతభావవిస్ఫురణఁ బైకొని నిద్దురవోనొనర్చెడిన్.

ఆనందముతో నీ సన్నిధిని వ్రాలిన యా మొదటిసంధ్యాసమయమునందే కవితా విలాస మరుణోదయమైనట్లయి శత్రుకోటియొక్క వక్తృత్వముతో గూడిన కవిత్వ ప్రౌఢిరూపమైన కలువతీగ మోము ముడిచికొనునట్లు చేయగలదు.

శమితజడిమారంభా కంపాతటీనికటేచరీ
నిహతదురితస్తోమా సోమార్ధముద్రితకుంతలా
ఫలితసుమనోవాంఛా పాంచాయుధీ పరదేవతా
సఫలయతు మే నేత్రే గోత్రేశ్వరప్రియనందినీ||

జడిమ నడంచి కంపతటిఁ జక్కఁ జరించి హరించి పాపపుం
దుదుకును గౌండరాజుతొలినోము ఫలింపగఁజేసి యర్ధచం
ద్రుదు సిగపూవుగాగ సుమనోభిమతం బిడి పంచబాణమై
యడరెడు తల్లి నాదు నయనాబ్జములన్ సఫలమ్ము సేయుతన్.

మాంద్యమునణచి పాపపుదుడుకువాపి కంపాతీరమునందు వసించుచు చంద్రరేఖ సిగబంతిగా ధరించి వేల్పులకోరికల నీడేర్చుచు హిమగిరి సార్వభౌము పూర్వపుణ్యమును పండించుచుండెడి తల్లి నా నయనములను సఫలము సేయుగాక !

మమ తు ధిషణా పీడ్యా జాడ్యాతిరేక కథం త్వయా
కుముదసుషమామైత్రీవతంసితకుంతలామ్
జగతి శమిత స్తంభాం కంపానదీనిలయా మసౌ
శ్రయతి హి గలత్తంద్రా చంద్రావతంస సధర్మిణీ॥ 3౪

పొలుపగు కల్వపూలచెలుముల్ సిగపూవుగఁ జెర్వి తంద్రతన్
దొలఁగి తొలంచి స్తబ్ధతను తోఁచుచుఁ గంపనదీతటాన గం
తులనిదు చంద్రశేఖరువధూమణి నా మది యాశ్రయించె, ని
శ్చల మది చిత్త మింకఁ బెనుజాడ్యమ ! నీ తరమా కదల్పఁగన్.

చక్కని కల్వపూలచెలిమి (చంద్రుడన్నమాట) సిగపూవుగా గైసేసి, నిర్నిద్రమైస్తబ్ధతను హరించి, కంపతటమ్మునందు నటించు చంద్రశేఖరుని సహధర్మచారిణి నామనసునందు నిలిచినది. కాన, ఓ మాంద్యమా ! నీవు నా మనసును గదలింప జాలవు.

పరిమలపరీపాకోద్రేకం పయోముచి కాంచనే
శిఖరిణి పునర్ద్వైధీభావం శశి న్యరుణాతపమ్
అపి చ జనయ న్కంబో ర్లక్ష్మీ మనంబుని కోఽప్యసౌ
కుసుమధనుషః కాంచీదేశే చకాస్తి పరాక్రమః॥ 3౫

మబ్బులఁ గుందనమ్మనను మంచిసువాసనలన్ ఘటించి మేల్
గుబ్బలి ద్వైత మెండయునుగూరిచి చంద్రునియందు నందుపైందు
నబ్బఁగఁజేసి కంబురమ నంబువులేనియెడన్ జెలంగెడిన్
నిబ్బరమైన పూవిలుతు నిందుపరాక్రమ మొందు కాంచిలోన్.

మేఘమందు, మేలిమిబంగారమందును పరిమళమును సంఘటింపజేసి అనగా నల్లని జుట్టునందు పువ్వులు, మేనియందు సుగంధమును గూర్చి, మహాగిరియందు ద్వైతమును (జంటను) గూర్చి, అనగా గిరులంబోలు కుచములు రెండు ధరించి, చంద్రునం దరుణప్రభను సంతరించి అనగా ముఖమునం దెఱ్ఱని యధరమును, నిర్జలదేశమందు శంఖమును నలవరించి అనగా శంఖమువంటి కంఠమును పూని, మన్మథుని పూర్ణపరాక్రమ మొకటి కాంచిలో విలసిల్లుచున్నది.

పురదమయితు ర్వామోత్సంగస్థలేన రసజ్ఞయా
సరసకవితాభాజాం కాంచీపురోదరసీమయా
తటపరిసరై ర్నీహారాద్రే ర్వచోభి రకృత్రిమైః
కిమివ న తులా మస్మచ్చేతో మహేశ్వరి! గాహతే|| 36

హరువామాంకముతోడఁ గాంచిపురదివ్యద్గర్భదేశమ్ముతో
సరస శ్రీకవితారసజ్ఞమణితో శైలేశ్వరోద్యత్తటాం
తరసౌందర్యముతో నకృత్రిమవచస్తంత్రమ్ముతో నో మహే
శ్వరి! సారూప్యము పొందదేమె యిది అంబా! నాదు డెంద మ్ముమా!

అమ్మా! శివునివామాంకము గాంచీపురగర్భదేశము కవితారసజ్ఞశేఖరము పర్వతేశ్వరుని పరమసౌందర్యము వేదవాక్యార్థసారము నైన పదార్థమునగు నీతో నా మన సైక్యము పొందజాల దేమమ్మా !

నయనయుగళీ మాస్మాకీనాం కదాను ఫలేగ్రహీం
విదధతి గతౌ వ్యాకుర్వాణా గజేంద్రచమత్క్రియామ్
మరకతరుచో మాహేశానా ఘనస్తననమ్రితాః
సుకృత విభవాః ప్రాంచః కాచీవతంసధురంధరాః|| 38

నడకల నేన్గుగున్నగమనంబుచమత్క్రియ వ్యాఖ్యచేసి యె
ప్పుడు మఱి నా కనుల్ సఫలముల్ బొనరించునొ శాంకరమ్ములై
యడరెడు పుణ్యవైభవము లయ్యవి కాంచిపురీవతంసముల్
దడయ కనాదు లమ్మరకతప్రభ లా కుచభారనమ్రముల్.

మదగజముయొక్క గమననైపుణ్యమును దన నడకచే వ్యాఖ్యానించుచు కాంచీపుర శిరోభూషణములయి మరకతమణిప్రభగెల్చు శరీరముగలవై కుచభారముచే వినమ్రము లయి ఆద్యంతరహితములైన శివుని సుకృతవిశేషములు నా కన్నుల నెన్నడు సఫలము సేయునోకదా !

మనసిజయశఃపారంపర్యం మరందఝరీసువాం
కవికులగిరాం కందం కంపానదీతటమండనమ్
మధురలలితం మత్కం చక్షు ర్మనీషిమనోహరం
పురవిజయినః సర్వస్వం త త్స్పురస్కురుతే కదా| 38

మరుని యశఃపరంపర యమందమరందఝురుల్ దలిర్చు సుం
దర కవిసూక్తికందము బుధప్రకరమ్ములపాలి యంద మ
ప్పురహరురూపుగొన్న తొలిపున్నెము కంపనదీతటాంత సుం
దరమణిమండన మ్మొకటి నా కనులన్ నటియించు టెన్నఁడో.

మన్మథునికీర్తిపరంపర పచ్చితేనియలు వాకలుగట్టు మధురకవి సూక్తులు పల్లవించు మూలకందము విబుధజనమనోహరము మూర్తీభవించిన శివుని పూర్వపుణ్యము నైయున్న కంపానదీతీరమణిభూషణ మొకానొకటి నా కన్నుల నటించు టెన్నడో కదా!

శిథిలితతమోలీలాం నీలారవిందవిలోచనాం
దహనవిలసత్ఫాలాం శ్రీకామకోటి ముపాస్మహే
కరధృతలసచ్ఛూలాం కామారిచిత్తమనోహరాం
మనసిజకృపాలీలాం లోలాలకా మలికేక్షణామ్|| 39

తమము విదిల్చి ఫాలమునఁదాల్చి హుతాశను హస్తమందు శూ
లము గొని ముంగురుల్ సెదర లక్ష్యము సేసి మరున్ గటాక్ష వి
భ్రమములఁ దేల్చుచున్ మదనవైరి మనంబు హరించుచున్న యం
దము నసితారవిందనయనమ్ము భజించెదఁ గామకోటి నిన్.

నెన్నుదుట నగ్నిని చేతిలో శూలమును దాల్చి తమోగుణమును (అజ్ఞానమును) విదళించుచు అలకలు అల్లలాడగ నమ్మదనుని నిజకటాక్షవిలాసములచే నలరించుచు మదనవైరిమనమ్మును జూరలాడుచు నీలాంబుజముబోలు నయనములచే గులుకు నందమును భజించెదను.

కలాలీలాశాలా కవికులవచః కైరవవనీ
శరజ్జ్యోత్స్నాధారా శశిధరశిశుశ్లాఘ్య ముకుటీ
పునీతే నః కంపాపులినతట సౌహార్దతరలా
కదా చక్షుర్మార్గం కనకగిరిధానుష్క మహిషీ||

కళలవిహారశాల కవిక్రమవచో వరకైరవాళిపైఁ
బొలయు శరన్నిశేందురుచిపూరము క్రొన్నెలపాప మౌళిపై
గల పువుబోణి కంపదరి గంతిడు బంగరుకొండ విల్లుగన్
గల దొర రాణి నాదు నయనమ్ముల ధన్య మొనర్చు టెన్నఁడో.

సర్వకళలు విహరించునెలవు, కవులపలుకులనెడి కలువలపై వ్యాపించు వెన్నెల, జాలు లేతజాబిలి కిరీటముగ నలరు సొగసు, కంపాతీర విహారము సేయు మేరువు ధనుస్సుగాగల శివుని మహారాజ్ఞి నా కన్నులను ధన్యము నొనరించు టెన్నడో కదా!

నమః స్తాన్నమ్రేభ్యః స్తనగరిమగర్వేణ గురుణా
దధానేభ్య శ్చూడాభరణ మమృతస్యన్ది శిశిరమ్
సదా వాస్తవ్యేభ్య సవిధభువి కంపాఖ్యసరితో
యశోవ్యాపారేభ్య స్సుకృతవిభవేభ్యః పశుపతేః॥ ४८

ఉరుకుచభారగర్వమున నొప్పు వినమ్రత శీతలామృత
మ్మురలు శిరోవిభూషణము నొప్పిదముం గని కంపతీరపుం
బరిసరమం దెసంగెడి యభంగుర శాంకర పుణ్యవైభవో
త్కరములకున్ యశస్సముదితస్ఫుటచర్యలకున్ నమస్కృతుల్.

కుచభారగర్వముచే వినమ్రమైయె చల్లని అమృతము నించు శిరోభూషణముచే (చంద్రునిచే) నందముగని కంపాతీరముల నలరు శంకరుల భాగ్యసంపదలకు నా నమస్కారము.

అసూయన్తీ కాచి న్మరకతరుచో నాకిముకుటీ
కదంబం చుంబన్తీ చరణనఖచన్ద్రాంశుపటలైః
తమోముద్రాం విద్రాపయతు మమ కాంచీనిలయనా
హరోత్సంగ శ్రీమన్మణిగృహ మహాదీపకలికా॥ ४९

మరకతకాంతి నోరువదు మంజులపాద నఖైందవద్యుతిన్
సురముకుటీకదంబములఁ జుంబనముం బొనరించుఁ గాంచిలో
హరునొడియన్న యమ్మణిగృహమ్మున నెత్తినదివ్వె మామకాం
తరతమమున్ హరించుత నుదారనిజద్యుతి చిద్రసాకృతిన్.

మరకతమణికాంతిపై ననూయగొను మేనితళుకులతో చరణనఖకాంతియను వెన్నెలచే దేవకిరీటములను ముద్దిడుచు హరుని యొడి యనెడి మణిగృహమునం దెత్తిన యొకానొక దీపిక, నా అంతరంగమునందలి తామసముద్రను అజ్ఞాన మను గ్రంథిని విప్పుగాక !

అనాద్యన్తా కాచి త్సుజన నయనానన్దజననీ
నిరున్ధానా కాన్తిం నిజరుచివిలాసై ర్జలముచామ్
స్మరారే స్తారల్యం మనసి జనయన్తీ స్వయ మహో
గలత్కంపా శంపా పరిలసతి కంపాపరిసరే|| ౪౩

తుదమొదలేని లేని దొకదొడ్డది దొడ్డజనమ్ము కన్నులన్
ముదమొనరించు తల్లి తన పొల్పున మబ్బులచాయ లడ్డుచున్
మదనవిరోధిచిత్తమున మాటికి కంపము గూర్చు శంప కం
పదరిఁ గృతానుకంప యొక పాప నిరాకృతకంప యింపగున్.

ఆద్యంతములేనిది మహానుభావుల చూపులకు ఆనందమునించునది తన తళుకులచే మేఘములకాంతి నొంపుచు మదనవైరిమనమును గంపింపజేయు నొక శంప (మెఱుపుదీగ) అనుకంపతో (దయతో) మా కంపమును (ఆందోళనమును) హరించుగాక !

సుధాడిండీరశ్రీః స్మితరుచిషు తుండీరవిషయం
పరిష్కుర్వాణాసౌ పరిహసిత నీలోత్పలరుచిః
స్తనాభ్యా మానమ్రా స్తబకయతు మే కాఙ్క్షితతరుం
దృశా మైశానీనాం సుకృతఫలపాండిత్యగరిమా|| ౪౪

చారుదరస్మిత మ్మమృతసారము నుర్వులశోభఁ దేల్పఁ దుం
డీరముపేరి సీమల నటించి వినమ్రమునై కుచద్వయీ
భారముచేఁ ద్రిలోచనతపఃఫలపాండితి రూపుగొన్న యా
సౌరు మదీయకాఙ్క్షిత కుజప్రకరమ్ము సుమింపఁజేయుతన్.

అమృతప్రవాహముపైనుఱువన్నట్టి చిఱునవ్వు రాణింపగ తుండీర మండలమునందు (కాంచీమండలమన్నమాట) నటించుచు కుచభారవినతమై శంకరు తపఃపాండిత్యము మూర్తీభవించిన యా యందము నా కోరికయను వృక్షమును బుష్పింపజేయుగాక!

కృపాధారాద్రోణీ కృపణధిషణానాం ప్రణమతాం
నిహన్త్రీ సంతాపం నిగమముకుటోత్తంసకలికా
పరా కాంచీలీలాపరిచయవతీ పర్వతసుతా
గిరాం నీవీ దేవీ గిరిశపరతంత్రా విజయతే||

ధారాద్రోణిఁ గృపారసమ్మునకుఁ జెంతన్ వ్రాలు దీనాళి సం
సారక్షోభలడంచు తల్లి నిగమాంచన్మౌళి నుత్తంస రే
ఖారమ్యంబగు మొగ్గ కాంచిసొబగుల్ గైసేయు సైదోడు నై
తా రంజిల్లును దేవి శంభుపరతంత్రస్ఫూర్తి వాఙ్నివియై.

కృపారసము జాల్కొనునట్టి నీటిదొన తనచెంత వ్రాలు దీనుల సంసారతాపము నడంచునది వేదములనిగమీది పూమొగ్గ కాంచీపురవిలాస పరిచయముగలది వాక్కులకు పోకముడి సరసవాక్కృపాసారము ననుగ్రహించున దన్నమాట శివపరతంత్రయునగు పార్వతి సర్వోన్నతిం దనరుచున్నది.

కవిత్వశ్రీకంద స్సుకృతపరిపాటీ హిమగిరే
ర్విధాత్రీ విశ్వేషాం విషమశరవీర ధ్వజపటీ
సఖీ కంపానద్యాః పదహసితపాథోజయుగలీ
పురాణీ పాయా న్నః పురమథనసామ్రాజ్యపదవీ॥ ౪౬

కవితకు మూలకందము జగజ్జనయిత్రి పురారిరాజ్య వై
భవము హిమాద్రి పుణ్యపరిపాటి పురాణి సముల్లసత్సుమా
స్త్ర విజయసూచక ధ్వజపతాక నిజాంఘ్రినిరస్తపద్మ వై
భవ మొక రీవి కంపనదిపాలిటి నెచ్చెలి మమ్ము బ్రోచుతన్.

కవిత్వశోభకు మూలకందము హిమగిరిపూర్వపుణ్యపరిపాటి సర్వసృష్టికర్త్రి మన్మథయోధునిధ్వజపతాక కంపానదిచెలికత్తె మదనవైరి సామ్రాజ్యపదవియు నైన పురాణి మమ్ము బ్రోచుగాక !

దరిద్రాణాం మధ్యే దరదలితతాపింఛసుషమాః
స్తనాభోగక్లాంతా స్తరుణహరిణాంకాంకితకచాః
హరాధీనా నానావిబుధముకుటీచుంబితపదాః
కదా కంపాతీరే కథయ విహరామో గిరిసుతే॥ ౪౭

దరవికస త్తపింఛరుచిఁ దాల్చిని నిండుకుచద్వయంబు మేల్
బరువున నొల్లఁబోయి నెలబాలుఁదుగుల్కొఁడు వేనలిన్ మహే
శ్వరు మకుటాళి ముద్దలిడు చారుపదంబులు మధ్యమందుఁ బే
దరికముఁ దాల్చి కంపదరిఁ దాపుల మేము చరించు టెప్పుడో.

నడుమునందు లేమింగొని (సన్ననినడుము గలదనుట) ఇంచుకించుకగ వికసించు తపించకుసుమకాంతిం గుల్కుచు పాలిండ్లనిండుదనముచే వసినాళ్వాడునడుమును చంద మామగుర్తుగల వేనలియు సకల దేవతాకిరీటకోటి ముద్దుగొను పాదములను గల్గి కంపాతీరమున నెన్నడు విహరింతుమో కదమ్మా ! సాక్షాత్కామాక్షీసారూప్యము మా కెన్నటికి సిద్ధించునో యని తాత్పర్యము.

వరీవర్తు స్థేమా త్వయి మమ గిరాం దేవి మనసో
నరీనర్తు ప్రౌఢా వదనకమలే వాక్యలహరీ
చరీచర్తు ప్రజ్ఞాజనని ! జడిమా నః పరజనే
సరీసర్తు స్వైరం జనని మయి కామాక్షి కరుణా|| ४८

అమ్మరో ! నా మనస్సు నిసునంటి చరించుతఁ బల్కుగొమ్మ ! మా
యమ్మరో ! ప్రౌఢవాగ్లహరు లాస్యమునందు నటించుగావుతన్
గ్రమ్మనుగాక జాడ్యమది నా రిపుకోటుల, జ్ఞానదాత్రి ! మా
యమ్మరో ! నీ కృపాలహరు లాపయి జాల్కొనుగాకఁ నాపయిన్.

దేవీ ! నా మనస్సు నీయంద మిగుల నిలకడగొని వర్తించుగాక. నా ముఖకమల మందు ప్రౌఢకవితాప్రవాహములు నర్తించుగాక ! నా శత్రువునందు మాంద్యము క్రందుకొనుగాక ! నాయందు నీకరుణ తనంత నెంతయు ప్రసరించుగాక !

క్షణాత్తే కామాక్షి భ్రమరసుషమాశిక్షణగురుః
కటాక్షవ్యాక్షేపో మమ భవతు మోక్షాయ విపదామ్
నరీనర్తు స్వైరం వచనలహరీ నిర్జరపురీ
సరిద్వీచీ నీచీకరణపటు రాస్యే మమ సదా|| ४९

భ్రమరకులాన కింపయిన రంగును హంగును గూర్పఁగా గురు
త్వముఁగొను నీయపాంగములు వాపుత నాదు విపత్పరంపరన్ •
అమరసరిత్తరంగనివహమ్ము లభంగము సేయు వాగ్ఝరీ
సముదయముల్ నటించుతను సంతత మమ్మరో ! నా ముఖమ్మునన్.

తుమ్మెదగుంపును శిక్షింపగల నీ కటాక్షప్రసారము నే నాపదలనుండి విడివ డుట కనువగుగాక ! సురనదీతరంగభంగిని అదెంత యనజాలు కవితా ప్రవాహము స్వేచ్ఛగా నాయెడ నెడనెడ నటించుగాక !

పురస్తా న్మే భూయః ప్రశమనపరః స్తాన్మమ రుజాం
ప్రచారస్తే కంపాతటవిహృతిసంపాదిని దృశోః
ఇమాం యాచ్ఞా మూరీకురు సపది దూరీకురు తమః
పరీపాకం మత్కాం సపది బుధలోకం చ నయ మామ్|| ౫౦

కంపతటమ్మునన్ మసలు కల్కిరో ! నీవగు దృక్ప్రచారముల్
పెంపున నాదుముంద యగుపించి రుజల్ హరియించుఁగాక యా
లింపు మనుగ్రహింపుము హరింపుము నాదు తమోవిపాక మె
క్కింపుము నన్ వివేకిజన మెక్కి చరించుపదమ్ము నమ్మరో !

కంపాతటవిహారసంపన్నురాల ! నీ కటాక్షములు నా చూపులందు వర్తించి నా బాధలను బాపుగాక ! ఈ నా యాచనను గాదనకుము. నా తమోవిపాకమును హరింపుము. వివేకులలో నన్ను జేర్చుము.

ఉదంచంతీ కాంచీనగరనిలయే త్వత్కారుణయా
సమృద్ధా వాగ్ధాటీ పరిహసితమాధ్వీ కవయతాం
ఉపాదత్తే మారప్రతిభట జటాజూటముకుటీ
కుటీరోల్లాసిన్యాః శతమఖతటిన్యా జయపటీమ్|| ౫౧

నీ కారుణ్యమునన్ సమృద్ధము బుధానీకమ్ము వాగ్ధాటి మా
ధ్వీకప్రక్రియ హేళనం జలుపుచున్ విశ్వేశ్వరోద్యజ్జటా
శ్రీకోటీరకుటీరకోటితటినీరేఖార్భటిన్ గెల్చి తాఁ
జేకోనేరుచుఁ దజ్జయధ్వజపటీ శృంగార భాండారమున్.

తల్లి ! నీ కరుణచే కవులకు ద్రాక్షామాధుర్యమును బరిహసించెడి సమృద్ధమయిన వాగ్ధాటి యుల్లసిల్లి పూవిలుకాని గెలుపుకాడగు శివుని జటాజూటకిరీటాగ్రమున గులుకెడి వేల్పునదియొక్క జయపతాక శృంగారమును దాను గైవసముసేసికొనుచున్నది.

శ్రియం విద్యాం దద్యా జ్జనని నమతాం కీర్తి మమితాం
సుపుత్రం ప్రాదత్తే తవ ఝటితి కామాక్షి కరుణా
త్రిలోక్యా మాధిక్యం త్రిపురపరిపన్థిప్రణయిని !
ప్రణామ స్త్వత్పాదే శమితదురితే కిం న కురుతే|| ౫౨

వినతులకున్ సిరుల్ చదువు విస్తృతకీర్తుల నిచ్చి, యిచ్చి స
త్తనయుని, వేగ నీ కరుణ తల్లి ! పురారిమనోవిలాసినీ !
ఘనదురితాపనోదిని ! జగమ్ముల మూఁడిట నున్నతస్థితిన్
జనని ఘటింపకుండునటె చారుభవత్పదవందన మ్మమా !

తల్లీ ! నీ దయ నీదరిని వినతులైనవారికి వెంటవెంట విద్యను విమలమైన కీర్తిని సుపుత్రుని ప్రసాదించును. ఓ పురారిప్రేయసీ ! సకలపాపనోదమగు నీ పాదమునకు సేయు ప్రణామము త్రిలోకాధిక్యము నొదవింప జేయగలదు.

మనఃస్తంభం స్తంభం గమయ దుపకంపం ప్రణమతాం
సదాలోకం నీలం చికురజితరోలంబనికరమ్
గిరాం దూరం స్మేరం ధృతశశికిశోరం పశుపతే
ర్దృశాం భోగ్యం యోగ్యం తుహినగిరిభాగ్యం విజయతే|| ౫౩

సలుపున్ స్వానతభక్తలోకము మనఃస్తంభమ్ము సంస్తంభనన్
జెలువౌ వేనలిఁ బూపజాబిలికళన్ జేమంతి పూబంతిగన్
పొలుపౌ మేల్తలకట్టు తుమ్మెదలగుంపుం దోలు మేల్సొంపులన్
బొలుచున్ భూధరభాగ్య మీశ్వరదృశాభోగ్యమ్ము యోగ్యమ్ముగన్.

కంపాతీరమున మ్రొక్కెడివారి మనసనెడి స్తంభమును స్తంభింపజేయునది సజ్జనులకు దర్శనీయమైనది, తుమ్మెదలగుంపుసొంపును దలకట్టుచే ధిక్కరించెడియొప్పుగలది, నల్లనిమేనిచాయగలది, జాబిలిరేఖ తలదాల్చినది, పలుకులకందనిది, ఇందుమౌళి చూపులకుపభోగ్యమైనదియు నగు హిమగిరిభాగ్య మొకటి సర్వాతిశాయియై యున్నది.

ఘనశ్యామా న్కామాంతకమహిషి కామాక్షి మధురా
న్దృశాం పాతా నేతా నమృతజలశీతా ననుపమాన్
భవోత్పాతే భీతే మయి వితర నాథే దృఢభవ
న్మనఃశోకే మూకే హిమగిరిపితాకే కరుణయా|| ౫౪

భవ ముత్పాతముగా భయంపడెదు నాపై శోకవేగంబుచే
నవశుండౌ నొక మూగవానిపయి నంబా ! జాలిమై నింపు మిం
పవు నీ చూపులు మబ్బురంగు లమృతమ్మట్లల్లనం జల్లనై
నవి కామాంతకురాణి ! ఓ తుహినశైలాధీశకన్యామణీ !

సంసార మొకయుత్పాతమై బెదరిపోవుచున్న నాయందు తీవ్రశోకంబున వివశుడైయున్న యీ మూగవానియందు మేఘశ్యామలములు, అమృతశీతలములు, మధురములు నైన నీ చూపులను ప్రసరింపజేయుము.

నతానాం మందానాం భవనిగలబంధాకులధియాం
సదాన్ధ్యం రుంధానా మభిలషితసంతానలతికామ్
చరన్తీం కంపాయా స్తటభువి సవిత్రీం త్రిజగతాం
స్మరామ స్తాం నిత్యం స్మరమథనజీవాతుకలికామ్॥ ౫౫

ఆనతిసేతుఁ గొల్వ జడులై భవశృంఖలబంధనాకుల
మ్మైన మనంబు గల్గెడి జనాళి మహాంధ్యమువాపి దివ్యసం
తానలతాకృతిన్ నినిచి నచ్చినకోర్కులు నింప గంప తీ
రానఁ జరించు నా కళ స్మరప్రతినాయకజీవనౌషధిన్.

సంసారమను సంకెళ్ళం దవిలి మందమతులై చెదరినమనసుగల జనమ్ము నిజచరణమ్ములవ్రాలినంతనే వారి యజ్ఞానరూపమైన గ్రుడ్డితనమును బాపి కల్పలతవోలె వారి యభిలాష లొసంగుచు కంపాతీరమున మసలెడి శివసంజీవినీలతికను నిత్యము స్మరింతుము.

పరా విద్యా హృద్యా శ్రితమదనవిద్యా మరకత
ప్రభానీలా లీలా పరవశిత శూలాయుధమనాః
తమఃపూరం దూరం చరణనతపౌరందరపురీ
మృగాక్షీ కామాక్షీ కమలతరలాక్షీ నయతు మే॥ ౫౬

అది పరవిద్య హృద్యతర, యాశ్రితమన్మథవిద్య, నిక్క మ
య్యది స్వవిలాస సంవివశి తాబ్జకళాధరభావమూల, య
య్యది చరణానతామరమృగాక్షి, సరోజదళాక్షి, మత్తమో
విదళనముం బొనర్చుత మవేలకటాక్షనిరీక్షణప్రభన్.

పరమార్థవిద్యాస్వరూపిణి మనోహారిణి మన్మథవిద్యావిలాసిని మరకత మాణిక్య కాంతిభాసిని నిజచరణవినతసురవిలాసిని కమలదళలోచని నిజవిలాసనమ్మోహితసదాశివ మానసయునగు కామాక్షి నా యజ్ఞానమును నిజకటాక్ష వీక్షణముచే పారగొట్టుగాక!

అహంతాఖ్యా మత్కాం కబలయతి ఖ్యా హన్త హారిణీ
హతా త్వంవిద్రూపం హారమహిషి ! సస్యాంకురమసౌ
కటాక్షవ్యాక్షేప ప్రకటహరిపాషాణపటలై
రిమా ముచ్చై రుచ్చాటయ ఝటితి కామాక్షి ! కృపయా॥ ౫౭

హరుమహిషీ ! అహంత యనునట్టి యొకానొక లేడి దూకి చె
చ్చెర నిదె నాదు తెల్వియను చెంగలిమొల్కను నాకివేసెడిన్
గరుణను నీ కటాక్షములుగా విసరం జని యింద్రనీలపుం
గురుశిలలన్ వడిన్ దరిమికొట్టవె దాని మహేశవల్లభా !

అహంకారమనెడిలేడి దూకి హఠాత్తుగ నా జ్ఞానమనెడిమొలకను కబళించుచున్నది. దయతో నీ కటాక్షప్రసారములనెడి ఇంద్రనీలశిలాశకలములచే నా లేడిని తఱిమికొట్టుమమ్మా.

బుధే వా మూకే వా తవ పతతి యస్మిన్ క్షణ మసౌ
కటాక్షః కామాక్షి ప్రకటజడిమక్షోదపటిమా
కథంకారం నాస్మై కరముకులచూడాలముకుటా
నమోవాకం బ్రూయు ర్నముచిపరిపన్థిప్రభృతయః|| ౫౮

పండితుఁడౌను, వాఁడొక యపండితుఁడౌ, నొక మూగవాఁడయై
యుండును, నీ కటాక్ష మట నూర్జితజాడ్యహరంబు వ్రాలెనా
రెండుకరంబులున్ మొగిచి ప్రీతిఘటించి కిరీటపంక్తి ను
ద్దండులు దండవ్రాలి విబుధప్రభువుల్ నతి సేయకుందురే.

పండితుఁడుకాని మూగవాఁడుకాని ఎవనియందు ఒక క్షణమైనను మాంద్యమును హరించు నీ కటాక్షము ప్రసరించునో వానికి ఇంద్రాదిదేవతలు నిజకిరీటములువంచి కరములు మొగిచి నమస్కరించెదరు.

ప్రతీచీం పశ్యామః ప్రకటరుచినీవారకణిక
ప్రభాసధ్రీచీనాం ప్రదలితషడాధారకమలామ్
చరన్తీం సౌషుమ్నే పథి పరపదేన్దుప్రవిగల
త్సుధార్ద్రాం కామాక్షీం పరిణతపరజ్యోతిరుదయామ్|| ౫౯

దళనమ్మొం బొనరించి షట్కమలముద్రన్ చారుసౌషుమ్నవీ
థుల సంచారముసేయుచున్ బరపదేందుశ్రీసుధాధార శీ
తలమై నివ్వరివెన్నునాఁ బరిణతోద్యజ్జ్యోతిరున్మేషమై
వెలయం జూచెద మా నటు దేవిన్దల్లి ! కామాక్షి నిన్.

మూలాధారాదిషట్కమలముద్రలను భేదించుకొని సుషుమ్నామార్గమున సంచరించుచు పరమపదమైన చిచ్చంద్రమండలమునుండి జాల్కొను అమృతధారచే చల్లనిదై సుపరిణతమైన పరంజ్యోతియొక్క సమున్మేషమై నివ్వరిముల్లువన్నియతో సమమగు నెఱ్ఱని వర్ణముగలదై యొప్పు కామాక్షిని పడమటిదిశనుగా (నివృత్తికళగా) దర్శించుచున్నాను.

జంభారాతిప్రభృతిముకుటీః పాదయోః పీఠయన్తీ
గుంఫా న్వాచాం కవిజనకృతా న్స్వైర మారామయన్తీ
శంపాలక్ష్మీం మణిగణరుచాం పాటలైః ప్రాపయన్తీ
కంపాతీరే కవిపరిషదాం జృంభతే భాగ్యసీమా|| ౬౦

ఇంపగు పాదపీఠ మొనరించి సురేంద్రకిరీటకోటులన్
సొంపగు పుష్పవాటి యటు సొచ్చి కవీంద్రవచోవిలాసమున్
కెంపులకెంపులంగమిచి కేవల శంప యకంపితప్రభన్
గంపదరిన్ విజృంభణ మొనర్చుఁ గవీశ్వరభాగ్యసీమ దాన్.

ఇంద్రాదిదేవతాకిరీటకోటిని దనకు బాదపీఠ మొనరించుకొని సుకవివచోధాటిని తాను విహరించుపుష్పవాటి నొనరించుకొని నిజాభరణ మణిగణరుచులచే క్రొమ్మెరుగుల శోభ నదలించుచు కవివరుల అదృష్టసీమ యొకటి కంపాతీరమందు విజృంభించుచున్నది.

చంద్రాపీడాం చతురవదనాం చంచలాపాంగలీలాం
కున్దస్మేరాం కుచభరనతాం కుంతలోద్ధూతభృంగామ్
మారారాతే ర్మదనశిఖినం మాంసలం దీపయన్తీం
కామాక్షీం తాం కవికులగిరాం కల్పవల్లీ ముపాసే|| ౬౧

చలితాపాంగి గుచానతాంగి సుముఖిన్ జంద్రార్ధచూడాలఁ గుంతలనిర్ధూత మిళిందబృంద జితకుందస్మేర మందస్మితన్
గొలుతున్ మన్మథవైరి మన్మథశిఖన్ బ్రోదిన్ రగుల్కొల్పు న
క్కలికిన్ సత్కవిసూక్తి కల్పలతికన్ గామాక్షి ధీసాక్షిగన్.

ఇందుకిరీటము ఇంపులుగుల్కెడి నెమ్మొగము చంచలమగు నపాంగవిలాసము మొల్లలబోలు నెలనవ్వులుగలిగి కుచభారమున నానతయై కుంతలములచే దుమ్మెదలనదల్చుచు కామవైరికామాగ్నిని రగుల్చుచు గవులపలుకులకుఁ గల్పవల్లియై యలరు కామాక్షినుపాసింతురు.

కాలాంభోదప్రకరసుషమాం కాంతిభి స్తర్జయన్తీ
కల్యాణానా ముదయసరణిః కల్పవల్లీ కవీనామ్
కందర్పారేః ప్రియసహచరీ కల్మషాణాం నిహంత్రీ
కాంచీదేశం తిలకయతి సా కాపి కారుణ్యసీమా॥ ౬౨

కాంచీసీమ నలంకరించు నదిగో కాలుష్యముం జెండుచున్
జంచన్మేఘరుచిన్ నిజద్యుతితతిన్ దర్జించుచున్ సత్కవి
ప్రాంచత్కల్పలతాకృతిన్ సకలకల్యాణోదయ శ్రీతతిన్
పంచాస్త్రప్రతిపక్షసుందరి కృపాపారమ్యమై రమ్యమై.

నిజశరీరకాంతిచే గారుమేఘములకాంతిని జడిపించునదై సకలకల్యాణములకు ఉదయరేఖయై కవులపాలిటి కల్పవల్లియై కల్మషములహరించుచు కందర్పవైరి కెంతయు గూర్చు నిల్లాలై కరుణారసావధి యొకటి కాంచీదేశతిలకమై యొప్పుచున్నది.

ఊరీకుర్వ న్నురసిజతటే చాతురీం భూధరాణాం
పాథోజానాం నయనయుగలే పారిపంథ్యం వితన్వన్
కంపాతీరే విహరతి రుచా మోఘయ న్మేఘశైలీం
కోకద్వేషం శిరసి కలయ న్కోఽపి విద్యావిశేషః॥ ౬౩

సరసిజపాళితోడఁ బగజాటుచు నీటగు కన్నుదోయి భూ
ధరములమేటిచాతురిని దాల్చి చనుంగవ నిండుమేఘపుం
బిరుదును మేనిచాయఁ బిరువీకొనరించుచుఁ గోకవైరమున్
శిరమునఁ బూని వర్తిలు విచిత్ర మొకానొక విద్య కాంచిలోన్.

కుచతటమునందు పెనుగొండలచాతుర్యము నలరించుచు కనుదోయియందు కమలములతోడి వైరమును ప్రచురముసేయుచు తన మేనిచాయచే మేఘముల శైలిని మోఘమొనరించుచు చక్రవాకములతోడి వైరమును (చంద్రుని) తలదాల్చి యొకానొకవిద్య కంపాతీరమున విహరించుచున్నది.

కాంచీలీలాపరిచయవతీ కాపి తాపింఛలక్ష్మీ
ర్జాడ్యారణ్యే హుతవహశిఖా జన్మభూమిః కృపాయాః
మాకందశ్రీ ర్మధురకవితాచాతురీకోకిలానాం
మార్గే భూయా న్మమ నయనయో ర్మాన్మథీ కాపి విద్యా॥ ౬౪

కాంచివిలాసపుంజెలిమికత్తియ జాడ్యదవాగ్ని జాలి జ
న్మించిన భూమి తీయనయిమించు కవిత్వపికాళికెల్ల శో
భించెడి తీయమామిడి తపించసుమప్రభ మద్వృగంచలా
భ్యంచిత మౌనుగాత మొక యద్భుత మాన్మథవిద్య యిచ్చుటన్.

కాంచి యను విలాసవతికి నెచ్చెలియు ఇరుగుడుమ్రానికి ఈడగు మైచాయగ లదియై జాడ్యమను నడవిం దహించు దావాగ్నిశిఖయునై దయకు పుట్టినిల్లై మధుర కవికోకిలములకు మామిడిచివురునైయున్న యొకానొక కామకళ నా చూపుమేలుల దోచుగాక.

సేతు ర్మాత ర్మరకతమయో భక్తిభాజాం భవాబ్ధౌ
లీలాలోలా కువలయమయీ మాన్మథీ వైజయన్తీ
కాంచీభూషా పశుపతిదృశాం కాపి కాలాంజనాలీ
మత్కాం దుఃఖం శిథిలయతు తే మంజులాపాంగమాలా॥ ౬౫

మరకతరత్నసేతు వది మాకు భవాంబుధిదాటఁ గల్వపూల్
విరిసినచాయ మన్మధుని వింతగు టెక్కెము కాంచిభూషణ
మ్మురవగు నల్లకాటుక యహో శివుకన్నుల కట్టి నీ కటా
క్షరుచిరమాల నాదయిన గాటపుదుఃఖ మడంచుగావుతన్.

భక్తులు సంసారసాగరము దాటుటకు మరకతమణి సేతువై కలువపూలవిలసిల్లు సువిలాసచంచలమగు మన్మధుని టెక్కెమై కాంచీపురీభూషణమై పశుపతిచూపులకు నల్లని కాటుకరేకయై యొప్పెడి నీ కటాక్షమాల నా దుఃఖమును సడలించుగాక.

వ్యావృణ్వానాః కువలయదల ప్రక్రియావైరముద్రాం
వ్యాకుర్వాణా మనసిజమహారాజ సామ్రాజ్యలక్ష్మీమ్
కాంచీలీలావిహృతిరసికే కాఙ్క్షితం నః క్రియాసు
ర్బంధచ్ఛేదే తవ నియమినాం బద్ధదీక్షాః కటాక్షాః॥ ౬౬

కలువలరేకులం గలుగు కాంతిపయిన్ గొను వైరముద్ర ఆ
వలదొర నిండు రాచసిరివైభవ మెల్లను వ్యాకరించు ని
మ్ముల్లఁ దగఁ గంచిలో మసలు ముచ్చట గాంచిన నీ కటాక్షముల్
వలపుల నించుఁగాక మునిబంధవిభేదన బద్ధదీక్షముల్.

ఓ కాంచీవిలాసవిహారరసికావతంసమా ! కలువరేకులకాంతిపై వైరముద్ర ప్రకటించుచు మన్మథునిరాచరికంపువైభవమును విస్తరింపజేయుచు మునులబంధములను భేదింప దీక్షగొన్న నీ కటాక్షములు మా వలపులను సఫలము సేయుగాక.

కాలాంభోదే శశిరుచి దలం కైతకం దర్శయన్తీ
మధ్యేసౌదామిని మధులిహాం మాలికాం రాజయన్తీ
హంసారావం వికచకమలే మంజు ముల్లాసయన్తీ
కంపాతీరే విలసతి నవా కాపి కారుణ్యలక్ష్మీః॥ ౬౭

అలికులమాలికన్ నిలిపి యల్ల తటిల్లతమధ్యమందు వ
ర్తిలుశశిరేఖబోల్ మొగలిరేకును దారిచి కారుమబ్బులం
దలరిచి విచ్చుతమ్మిపువునందునఁ జక్కని హంసఘోషమున్
విలసిలు గంపయొడ్డునను వింతకృపారసలక్ష్మి క్రొత్తయై.

కారుమబ్బునందు చందమామతళుకుగల మొగలిరేకును జాపెట్టుచు (కొప్పున చంద్రరేఖదాల్చినదనుట) మెరుపుతీవనడుమ తుమ్మెదలగుంపును విలసిల్లజేయుచు (మందహాసములో చూపులసొంపు నించుననుట) వికసించిన తామరపువ్వునందు మంజులమగు హంసధ్వనిజేయుచు (ముఖమున మధుర భాషణములు గలదియనుట.) ఒకానొక నూతనకారుణ్య లక్ష్మి (కామాక్షి) కంపాతీరమున విలసిల్లుచున్నది.

చిత్రం చిత్రం నిజమృదుతయా భర్త్సయ న్పల్లవాలీం
పుంసాం కామా న్భువి చ నియతం పూరయ న్పుణ్యభాజామ్
జాతః శైలా న్నతు జలనిధేః స్వైరసంచారశీలః
కాంచీభూషా కలయతు శివం కోఽపి చింతామణి ర్మే॥ ౬౮

తన సుతిమెత్తనం జడుపు దార్చుచు లేఁజిగురాకుచాయ, నెం
చిన వలపుల్ఘటించుచు భజించిన పుణ్యుల, కుద్భవించి చ
ల్లని గిరి నబ్ధిగాక, మసలంజని గాంచి విభూషణమ్ముగన్
వినుతిని గాంచు వేల్పుమణి వేడినసంపద లిచ్చుగావుతన్.

తన మేనిమార్దవముచే లేజిపుళ్ళను బెదరించుచు పుణ్యాత్ముల కోరికల నెంతయు నిండించుచు సముద్రమునుండి కాదు శైలమునుండి పుట్టిన యొకానొక వింతచింతామణీ రత్నము కాంచీనగరభూషణమై స్వేచ్ఛాసంచారము సేయుచు మాకు మంగళము లలరించుగాక.

తాఽమ్రాంభోజం జలదనికటే తత్ర బంధూకపుష్పం
తస్మి న్మల్లీకుసుమసుషమాం తత్ర వీణానినాదమ్
వ్యావృణ్వానా సుకృతలహరీ కాపి కాంచీనగర్యా
మైశానీ సా కలయతితరా మైంద్రజాలం విలాసమ్॥ ౬౯

భళి ! కెందామర మబ్బుచాయ, అచటం బంధూకపుష్పంబు, రం
జిలు మల్లీసుమశోభ లందట విపంచీనాదముల్ నించుచున్
జలువున్ వింతల నైంద్రజాలికవిలాసమ్ముల్ వెలారించి యి
మ్ముల నక్కాంచిపురాన పుణ్యలహరుల్ పుంఖానుపుంఖంబులై.

మబ్బులలో నెఱ్ఱదామర అనగా నల్లని తలకట్టులో నెమ్మొగము, అందులో మంకెన పూవు (ఎఱ్ఱని పెదవి) ఆ పూవులో మల్లెపూశోభ (చిఱునవ్వు) అందులో వీణాధ్వనిని (పలుకుసొంపు) విస్తరింపజేయుచు కాంచీనగరమ్మున శంకరుని పుణ్యలహరియొకటి జాల్కొని ఇంద్రజాలవిలాసమును ప్రదర్శించుచున్నది.

ఆహారాంశం త్రిదశసదసా మాశ్రయే చాతకానా
మాకాశోపర్యపి చ కలయ న్నాలయం తుంగమేషాం
కంపాతీరే విహరతితరాం కామధేనుః కవీనాం
మందస్మేరో మదననిగమప్రక్రియా సంప్రదాయః॥ ౭౦

చాతకకోటియాశ్రయముచాయల వేల్పుల విందు నేసి సం
ప్రీతి నమర్చి వారలకు మింట సమున్నతసౌధవాసమున్
ఖ్యాతిగఁ గామధేనువనఁనై కవికోటికనంగ నైగమో
ద్యోతితసంప్రదాయ మొకఁడొప్పు దరస్మితశోభఁ గాంచిలోన్.

చాతకముల కాశ్రయమైన చాయను అనఁగా మేఘమండలమందు దేవతలకు విందు పెట్టుచు (నల్లనికుంతములచాయలో చంద్రబింబమువంటి మోము) ఈ యాకాశమధ్యమున (సన్ననినడుమునందు) ఉన్నతసౌధమును (కుచిమండలమును) సంఘటింపఁజేయుచు కవికుల కామధేనువై మన్మథవేదప్రక్రియా సంప్రదాయమొకటి మధురతరదరహాసరుచిరమై కంపాతీరమున విహరించుచున్నది.

ఆర్ద్రీభూతై రవిరలకృపై రాత్తలీలావిలాసై
రాస్థాపూర్ణై రధికచపలై రంచితాంభోజశిల్పైః
కాంతై ర్లక్ష్మీలలితభవనైః కాన్తి కైవల్యసారైః
కాశ్మల్యం నః కబలయతు సా కామకోటీ కటాక్షైః॥ ౭౧

కరుణార్ద్రమ్ములు చంచలమ్ములు దళత్కంజాతశిల్పమ్ము లా
దరపూర్ణమ్ములు చిద్విలాసపరసౌందర్యమ్ము లానంద మం
దిరముల్ దివ్యకటాక్షవీక్షణములన్ నిర్వ్యాజవాత్సల్య వి
స్ఫురణం గాంచిన కామకోటి కబళించున్గాక కాలుష్యమున్.

కరుణారసార్ద్రములు కవితావిలాసవైభవములు కడుంగడు చంచలములు కమలా కల్పశిల్పములు సాకాంక్షములు లక్ష్మీనివాసములు కాంతిరూపకైవల్యసారములు కాంతములు నగు కామకోటికటాక్షములు మా కాలుష్యమును కబళించుగాక.

అధున్వత్యై తరలనయనై రాంగజీం వైజయన్తీ
మానందిన్యై నిజపదజుషా మాత్తకాంచీపురాయై
అస్మాకీనం హృదయ మఖిలై రాగమానాం ప్రపంచై
రారాధ్యాయై స్పృహయతితరా మాదిమాయై జనన్యై|| 82

తనదు పదమ్ములం గొలుచు ధన్యుల నుల్లసిలంగఁ జేయుచున్
దన తరళేక్షణమ్ముల ననంగపతాకము నట్టె తూల్చుచున్
గని సకలాగమార్థభజనమ్మును దల్లుల కెల్లఁ దల్లినాఁ
జను నొక కాంచివేల్పుదొరసానికి నా మది వేడ్కఁ సెందెడిన్.

తరళములగు చూపులచే ననంగునిపతాకను (చేఁపను) తూలజేయుచు, నిజ చరణ భాజనుల నానందమున నోలలాడించుచు నుండు తల్లులకెల్ల తల్లియైన దేవతామతల్లియెడల మా హృదయము వేడుకపడుచున్నది.

దూరం వాచాం త్రిదశపదసాం దుఃఖసింధో స్తరిత్రం
మోహక్ష్వేల క్షితిరుహవనే తీక్ష్ణధారం కుఠారం
కంపాతీరే ప్రణయి కవిభి ర్వర్ణితోద్యచ్చరిత్రం
శాంత్యై సేవే సకలవిపదాం శాంకరం తత్కలత్రమ్|| 83

త్రిదశసదస్స్తుతుల్ గడచి దివ్యకవిస్తుతసచ్చరిత్రమై
పొదలుచుఁ గంపయొడ్డునను మోహవిషక్షితిజాటవిం గడున్
పదనగు గండ్రగొడ్డలిగ వర్తిలి దుఃఖమహోద్ధి కోడయౌ
నిది శశిభృత్కళత్రము భజించెద విశ్వ[illegible]

దేవతాస్తుతుల కందనిది, దుఃఖసాగరము దాటుటకు ఓడయైనది మోహమనెడి విషవృక్షముల అడవికి బద్దునైన గండ్రగొడ్డలియైనదియునై కవులచే స్తుతింపబడు చరిత్రగలదియై కంపాతీరమున విహరించు చంద్రశేఖరకళత్రమును సకలవిపత్పరిశాంతికై సేవించెదను.

ఖండీకృత్య ప్రకృతికుటిలం కల్మషం ప్రాతిభ శ్రీ
శుండీరత్వం నిజపదజుషాం శూన్యతంద్రం దిశన్తీ
తుండీరాఖ్యే మహతి విషయే స్వర్ణవృష్టిప్రదాత్రీ
చండీదేవి కలయతి రతిం చంద్రచూడాలచూలీ॥ ౭౪

ఖండింపంగని యెల్లవక్రదురితగ్రామంబు మేల్ శేముషీ
శౌండీర మ్మపతంద్రముం గొలుపుచున్ సద్భక్తసంఘంబులన్
దుండీరమ్మను పుణ్యభూమిఁ గురిపించున్ స్వర్ణవర్షంబులన్
జండీదేవి శిరమ్మునన్ గులుకగా జాబిల్లి కోటీరమై.

సహజకుటిలమైన పాపమును ఖండించి తన పాదములబట్టుకొన్నవారికి నిస్తంద్రమైన బుద్ధిసామర్థ్యము ననుగ్రహించుచు తుండీరనామక పుణ్యమండలమున స్వర్ణవర్షము గురిపించుచునుండు చంద్రశిరోభూషణయగు చండీదేవి మా కానందమును గూర్చుచున్నది.

యేన ఖ్యాతో భవతి సగృహీ పూరుషో మేరుధన్వా
యద్దృక్కోణే మదననిగమప్రాభవం బోభవీతి
యత్ప్రీత్యైవ త్రిజగదధిపో జృంభతే కింపచానః
కంపాతీరే స జయతి మహా న్కశ్చి దోజోవిశేషః॥ ౭౫

బంగరుకొండవిల్ గలుగు భవ్యుఁడు మేటిగృహస్థుఁడౌనొ యే
హంగున, నే యపాంగరుచి నంగజశాస్త్ర రహస్య మభ్యసిం
పంగను నే దయం భువనపాలకుఁడౌ నరిపేదకూడ చ
క్కం గనవచ్చు సత్త్వ మది కంపతటిన్ గరముల్లసిల్లెడిన్.

మేరుగిరి విల్లుగాగొన్న పురుషుఁడు దేనిచే గృహస్థుగా ప్రఖ్యాతి గాంచునో దేని దృక్కోణమునందు అతఁడు కామశాస్త్ర పాభవమును లెస్సగా నభ్యసింపగలఁడో దేని ప్రీతివలన నరిపేదకూడ త్రిజగదదినాథుడగునో యట్టి యొకానొక మహత్తరమగు నోజోగుణవిశేషము కంపాతీరమున సర్వోన్నతమైయున్నది. ఓజస్సు=సత్త్వవ.

ధన్యా ధన్యా గతిరిహ గిరాం దేవి కామాక్షి! కా మే
నిన్ద్యాం భింద్యా త్సపది జడతాం కల్మషా దున్మిషంతీవ్
సాధ్వీ మాధ్వీరస మధురతాభంజినీ మంజరీతి
ర్వాణీ వేణీ ఝటితి వృణుతాత్ స్వర్ధునీస్పర్ధినీ మామ్|| ౭౬

హరియించున్ దురితంబులం బొడము నా యంతర్జడత్వంబు సుం
దరవాగ్లక్ష్య మొకానొకం డిదె యనన్ ధన్యాతిధన్యంబు తత్
స్ఫురణన్ సత్కవితాప్రవాహము వరించు న్నన్ను మాధుర్యని
ర్భరమాధ్వీరుచి స్వర్ధునీరసపరిస్పర్ధాళువాగ్గుంభనన్.

వేదములకు సర్వవాక్కులకు గమ్యస్థానమైన యొకానొకశోభ (కామాక్షి) పాపము వలన బొడము నా మాంద్యమును ఖండించుఁగాక! తత్స్ఫురణచే నన్ను ద్రాక్షారస సదృక్షమై గంగానదితో దగవాడగల వాగ్గుంభనముతో కవితాతరంగిణి నన్ను వరించుగాక.

యస్యా వాటీ హృదయకమలం కౌసుమీ యోగభాజాం
యస్యాః పీఠీ సతతశిశిరా శీకరై ర్మాకరందైః
యస్యాః పేటీ శ్రుతిపరిచల న్మౌలిరత్నస్య కాంచీ
సా మే సోమాభరణమహిషీ సాధయే త్కాఙ్క్షితాని|| ౭౭

యోగిమనస్సరోజములు నొప్పనొ దేనికి పుష్పవాటియై
తోఁగెడితేనెలన్ జల్లువఁదూగునొ యే సతిదివ్యపీఠి యే
నైగమపాళిమౌళిరతనం బది డాచినపేటి కాంచి సం
యోగము సేయుగాక యదియున్ శశిభూషణురాణి వేడుకల్.

యోగీశ్వరుల హృదయకమల మే తల్లికి విహరించు పుష్పవాటి యగునో, తేనె చినుకులచే నెల్లప్పుడు చలువలునించు సహస్రారము ఏ తల్లికి పీఠమగునో, శ్రుతిమౌళి రత్నమగు నే తల్లికి కాంచీపురము రత్నపేటికయగునో ఆ చంద్రశేఖరుని పట్టమహిషి నా కోరికలను సమకూర్చుగాక.

ఏకా మాతా సకలజగతా మేయుషీ ధ్యానముద్రా
మేకామ్రాధీశ్వరచరణయో రేకతానా సమిన్ధే
తాటంకోద్య న్మణిగణరుచా తామ్రకర్ణప్రదేశా
తారుణ్యశ్రీస్తబకితరుచా తాపసీ కాపి బాలా|| ౭౮

ఏకామ్రేశపదారవిందములయం దేకాగ్రతన్ ధ్యానము
ద్రాకమ్మో యొక పాప తాపసియునన్ రంజిల్లు నందంపు .చె
వ్వాకుంగెంపుల నెఱ్ఱువారు చెవులొప్పన్ విశ్వమాతృత్వమున్
జేకొంచున్ నవయౌవన స్తబకితశ్రీరోచియై కాంచిలోన్.

సర్వజగజ్జననియై ఏకామ్రేశ్వరుని చరణములయందు ఏకాగ్రతగొని ధ్యానముద్ర దాల్చి తాటంకమణికాంతులచే నెఱ్ఱువారు కర్ణములుగలదియై నవయౌవనశోభాస్తబకిత ప్రభతో నొక బాలిక తాపసియై వర్తించుచున్నది.

దన్తాదన్తిప్రకటనకరీ దన్తిభి ర్మన్దయానై
ర్మందారాణాం మదపరిణతిం మథ్నతీ మందహాసైః
అంకూరాభ్యాం మనసిజతరో రంకితోరాః కుచాభ్యా
మంతఃకాంచి స్ఫురతి జగతా మాదిమా కాపి మాతా॥ ౭౯

మందంపున్నడ చాటు వైరముల దంతాదంతి నాగాళితో,
మందారమ్ముల గర్వపూర్ణత సడంపంజాలు లేనవ్వులన్,
గందర్పక్షితిజాంకురమ్ము లనఁగన్ భాసిల్లు పాలిండ్లతో
విందుల్ సేయును గాంచిలో నొకతె యీ విశ్వా(నకుం దల్లియై.

సుందరమందగమనంబున మదపుటేనుఁగులతో దంతాదంతి పోరాడునదై, మన్మథుడనెడి తరువున నంకురించిన మొలకలగు కుచములచే నంకితమగు వక్షఃస్థలముగలదియై జగములకెల్ల నాదిమజననియైన యొకతె కాంచిలో విలసిల్లుచున్నది.

త్రియంబకకుటుంబినీం త్రిపురసున్దరీ మిందిరాం
పులిందపతిసుందరీం త్రిపురభైరవీం భారతీమ్
మతంగకులనాయికాం మహిషమర్దినీం మాతృకాం
భణన్తి విబుధోత్తమా విహృతిమేవ కామాక్షి తే॥ ౮౦

ఎందరొ పండితుల్ పరిగణింతురు నీదు విహార మ(ద్రిరా
ణ్ణందన శ్రీమతంగకులనాయిక యిందిర నా పులిందరా
ట్సుందరి భైరవీ త్రిపురసుందరి భారతి కాంచికాపురీ
మందిర మాతృకా మహిషమర్దిని యంచు ననేకభంగులన్.

త్రిలోచనకుటుంబినియని త్రిపురసుందరియని ఇందిరయని పుళిందనాథసుందరి యని త్రిపురభైరవియని భారతియని మతంగకులనాయికయని (మాతంగి) మహిషాసుర మర్దినియని మాతృకయని ('అ' కారాది 'క్ష' కారాంత వర్ణమాలామంత్రరూపిణి అని) నీ విఖ్యాతినే యనఁగా నీ అవతారవిహారవిశేషములనే విబుధవరులు పలువిధములుగ బేర్కొనుచుందురు.

మహామునిమనోనటీ మహితరమ్య కమ్పాతటీ
కుటీరకవిహారిణీ కుటిలబోధసంహారిణీ
సదా భవతు కామినీ సకలదేహినాం స్వామినీ
కృపాతిశయకింకరీ మమ విభూతయే శాంకరీ|| ౮౧

మునుల మనమ్ముల న్నటనముం బొనరించును గంపయొడ్డునం
దెనయు కుటీరసీమ వసియించు హరించును వక్రబోధమున్
జనని శరీరధారులకు నాయిక గూర్చు నపూర్వమైన ఫ
క్కి్కని గరుణారసాతిశయకింకరి ! శాంకరి ! మాకు భద్రముల్.

మునుల మనోరంగములందు నటించు నర్తకి కంపాతటీకుటీరముల విహరించు నది కుటిలబోధమును (అజ్ఞానమును) హరించునది సకలశరీరులకు స్వామినియగు భామిని కృపావిశేషమునకు గింకరి కృపకు లోబడు తల్లియునగు శాంకరి మా సకలవిభూతులకు హేతువగుగాక.

జడాః ప్రకృతినిర్ధనా జనవిలోచనారుంతుదా
నరా జనని వీక్షణాం క్షణ మవాప్య కామాక్షి తే
వచస్సు మధుమాధురీం ప్రకటయన్తి పౌరన్దరీ
విభూతిషు విడంబనాం వపుషి మాన్మథీం ప్రక్రియామ్| ౮౨

జనని ! కురూపులున్ జడులు సాజముగా నిరుపేదలైనవా
రనువుగ నీ కృపారసకటాక్షమునన్ ననవిల్తుసోయగం
బును బుపుదేనియల్ గులుకు పల్కుల కుల్కులు భోగవైభవ
మ్మున నమరేంద్రురాచరికముం బ్రకటింతురు గాదె శాంభవీ !

అమ్మా ! నీ కటాక్షపాత్రులయిన జడులుకూడ తేనియలతీపి గల మాటలు గలవారయ్యెదరు. ఆగర్భదరిద్రులు దేవేంద్రైశ్వర్యసంపన్నులు కాగలరు. కురూపులు నవమన్మథ సుందరులయి విలసిల్లుదురు.

ఘనస్తనతట స్ఫుటస్ఫురిత కంచులీ చంచలీ
కృతత్రిపురశాసనా సుజనశీలితోపాసనా
దృశో స్సరణి మశ్నుతే మమ కదాను కాంచీపురే
పరా పరమయోగినాం మనసి చిత్కళా పుష్కలా॥ ౮౩

బిగిచనుదోయిఁ బిక్కటిలు వింతగు రైకఁ బురారి చిత్తపున్
బిగి సడలించు నొక్క మునివీరవిమర్శను యోగిచిత్త మిం
పుగ వసతింబొనర్చు నొక పుష్కలచిత్కళ చూపుమేర మా
కగపడ నెన్నడో కద సమంచిత కాంచిపురాగ్రవీథులన్.

బిగువైనచనుదోయిం బిక్కటిల్లి మెఱయు రవికచే బురారి మనసుబిగువు సడలించుచు యోగ్యులగు జనులచే పరిశీలింపబడునది (శ్రీవిద్యోపాసనారహస్య విమర్శరూపిణి యన్నమాట) పరమయోగుల మనసున పరాత్పరమై నిండియున్న యా చిత్కళ యెన్నడు కాంచీపురమునందు నా నయనసరణిం గోచరించునోకదా !

కవీంద్రహృదయే చరీ పరిగృహీతకాంచీపురీ
నిరూఢకరుణాఝరీ నిఖిలలోకరక్షాకరీ
మనఃపథదవీయసీ మదనశాసన ప్రేయసీ
మహాగుణగరీయసీ మమ దృశోఽస్తు నేదీయసీ॥ ౮౪

ఏయెడ సత్కృపాఝరి మునీశ్వరభావచరిన్ బ్రపంచర
క్షాయతకార్యచాతురి నిరంతరమాధురి నెంతు శాంకర
ప్రేయసి నాత్తసద్గుణగరీయసి బుద్ధిదవీయసిన్ స్వనే
దీయసి యౌను గావుత మదీయదృగంచలచంచలప్రభన్.

కవీంద్రులహృదయమందు జరించునది కాంచీపురిం జేరియుండునది ప్రఖ్యాత కరుణారసనిర్ఝరియై సర్వలోకరక్షణమాచరించునది మహాగుణగరీయసియు మదనవైరి ప్రేయసియు మనోమార్గమునకు దవ్వయినదియు నగు తల్లి నా చూపులకు దారసిల్లుగాక.

ధనేన న రమామహే ఖలజనా న్న సేవామహే
న చాపలమయామహే భవభయా న్న దూయామహే
స్థిరాం తనుమహేతరాం మనసి కించ కాంచీరత
స్మరాంతకకుటుంబినీ చరణపల్లవోపాసనామ్॥ ౮౫

సిరులకుఁ బొంగిపో మధమసేవ లొనర్పము చాపలమ్మునన్
బొరయము వేదనంబడము పో భవభీతినిఁ గాంచిలో నిరం
తరమును ముచ్చటంగొలుపు దర్పకవైరికుటుంబినీమణీ
చరణసమర్చనమ్మున నచంచలనిష్ఠఁ జరింతు మెప్పుడున్.

ధనమునకు పొంగము, దుష్టులసేవింపము, తొందరపాటు నొందము, భవభయమునం బరితపింపము, మఱి కాంచీవిహారకుతూహలినియైన పురవైరి యిల్లాలి చరణపల్లవముల యుపాసనను మనసునందు సుస్థిర మొనరించుకొందుము.

సురాః పరిజనా వపు ర్మనసిజాయ వైరాయతే
త్రివిష్టపనితంబినీకుచతటీ చ కేలీగిరిః
గిర స్సురభయో వయ స్తరుణిమా దరిద్రస్య వా
కటాక్షసరణౌ క్షణం నిపతితస్య కామాక్షి ! తే|| ౮౬

పరిజనమా సురల్ కుసుమబాణునితోఁ దగవాడు మేను న
ప్సరసలగబ్బిగుబ్బ లటుపైని విహారగిరుల్, వచస్తతుల్
వరసురధేనుకోటి యెలప్రాయము ప్రాయము గల్గు నమ్మరో !
అరనిముసమ్ము నీదగు కటాక్షము నందిన పుట్టుఁబేదకున్.

దేవతలు పరివారము, మేనిసొంపు మన్మథునితో తగవునెఱపును. స్వర్గసుందరీ కుచతటి కేళీగిరి. వాక్కులు కామధేనువులు. ప్రాయము జవ్వనము కలవాడై క్షణమాత్రము నీ కటాక్షసరణి పడిన పేదవాడుగూడ మిక్కిలి రాణించును.

పవిత్రయ జగత్త్రయీ విబుధబోధజీవాతుభిః
పురత్రయవిమర్దినః పులకకంచులీదాయిభిః
భవక్షయవిచక్షణై ర్వ్యసనమోక్షణై ర్వీక్షణై
ర్నిరక్షరశిరోమణిం కరుణయైవ కామాక్షి మామ్|| ౮౭

ఎలమిఁ బురారిమే న్పులకరింపనొనర్చి జగత్త్రయంబునన్
గల విబుధాళిబోధలతికం బ్రతికించెడి జీవనౌషధం
బులు కొనచూపులెల్ల భవమున్ వ్యసనమ్ము హరింప నిందునే
ర్పులఁగొని నన్ నిరక్షరశిరోమణి భాగ్యనిధిం బొనర్పుమా !

త్రిలోకమందలి పండితుల జ్ఞానమునకు జీవనౌషధములు పరమశివు నెమ్మేను పులకరింపజేయునవి సంసారమును క్షయింపజేయు విచక్షణగలవి వ్యసనములను విడిపింపజేయునవియు నగు చూపులచే దయతో నిరక్షరశిరోమణినైన నన్ను బవిత్రుని జేయుము.

కదా కలితఖేలనాః కరుణయైవ కాంచీపురే
కలాయముకులత్విషః శుభకదంబపూర్ణాంకురాః
పయోధరభరాలసాః కవిజనేషు తే బంధురాః
పచేలిమకృపారసాః పరిపతన్తి మార్గే దృశోః|| ౮౮

లలితకృపన్ గలాయముకులద్యుతులై కుచభారవిభ్రమ
మ్మలసత, గూర్చి, గంచిపురమందట భద్రకదంబకాంకురా
వలి యననై పచేళిమకృపారసముల్ కవులందు బంధుర
మ్ములు కనుచూపుమేరఁబడి పొల్పుఘటించు టదెన్నడో కదా !

కాంచీపురమున గరుణతో క్రీడించునవి కలాయకుసుమ (ఇటుగుడుపువ్వుచే) కాంతి నింపైనవి శుభములనెడి కడిమితరువులచిరుమొలకలయినవి కుచభరముచే నలసములైనవి కవిజనులయందు పరిపూర్ణములైనవియునగు పరిపక్వకృపారసములు నా చూపుమేరలం దెపుడు గురియునో కదా !

అశోధ్య మచలోద్భవం హృదయనన్దనం దేహినా
మనర్ఘ మధికాంచి త త్కిమపి రత్న ముద్యోతతే
అనేన సమలంకృతా జయతి శంకరాంకస్థలీ
కదాఽస్య మమ మానసం వ్రజతి పేటికావిభ్రమమ్|| ౮౯

నలి తొలిలేని జాతిరతన మ్మొక డద్రి జనించి కంచి రం
జిలి వెలగట్టరా కిఖిలజీవి మనోనయనాభిరామమై
వెలయును శంకరాంకమణిపీఠిక దానికి రత్న పేటికా
విలసనమూను భాగ్యమున వేమరు నా మది గుల్కు టెన్నడో!

జీవుల హృదయముల నానందింపఁజేయునది అమూల్యమైనది పర్వతమునందు జనించునదియు నగు వెలలేని యొక రత్నము కాంచీమధ్యమున మెరయుచున్నది. ఈ రత్నముచే శంకరుని యంకతలము భూషింపఁబడి సర్వోన్నతమై యలరుచున్నది. దానికి నా మనసు రత్నపేటిక యెప్పు డగునో కదా !

పరామృతఝరీప్లుతా జగతి నిత్యమంతశ్చరీ
నృణామపి బహిశ్చరీ పరమసంవిదేకాత్మికా
మహద్భి రపరోక్షితా సతతమేవ కాంచీపురే
మమాన్వహ మహంమతి ర్మనసి భాతు మాహేశ్వరీ|| ౯౮

పరసంవిత్స్ఫురణైకరూప మగుచున్ బాహ్యమ్ముగా నిత్య మాం
తరముంగాఁ జరియించి కంచిపురిలోనన్ యోగిరాడ్దృష్టిగో
చరమై తోఁగుచు నప్పరామృతఝరీసందోహమం దొప్పఁ న
ప్పరమాహంమతి యెల్లవేళలను నా భావమ్మునం దాడుతన్.

పరమజ్ఞానైకరూపిణియై పరమానందామృత ప్రవాహపరిప్లుతయై జీవుల లోపలను వెలుపలను జరించునదై కాంచీపురమునం దేవేళ మహానుభావులచే దర్శింపఁబడునదై యలరు పూర్ణాహంభావ స్వరూపిణియైన మహేశ్వరి నా మనసునం దెపుడును భాసించుగాక !

తమోవిపినధావినం సతతమేవ కాంచీపురే
విహారరసికా పరా పరమ సంవిదుర్వీరుహే
కటాక్షనిగళైర్దృఢం హృదయదుష్టదంతావలం
చిరం నయతు మామకం త్రిపురవైరిసీమన్తినీ|| ౯౯

పదరి తమోఽటవిం బరుగువారెడి నా హృదయమ్ము వేరి దు
ర్మదకరి నల్లనన్ దిగిచి మచ్చిక స్వీయకటాక్ష శృంఖలన్
గదలగ నీక కట్టుతను గట్టిగ కాంచివిహారకౌతుక
మ్మది త్రిపురారియింతిపుర మప్పరసంవిదనోకహంబునన్.

తమోగుణరూపమైన యడవిలో నురుకుచు బరుగులెత్తెడి నా హృదయమనెడి మదపుటేనుగును సాధనతో మళ్ళించి మచ్చికచేసి కాంచీవిహారకౌతుకముగొన్న పరమశివుని రాణివాసము (కామాక్షి) పరమార్థజ్ఞానరూపమైన చెట్టునకు తన కటాక్షము లనెడి గొలుసులచే నంటుగట్టుగాక !

త్వమేవ సతి చణ్డికా త్వమిహ దేవి చాముణ్డికా
త్వమేవ పరమాతృకా త్వమసి యోగినీరూపిణీ
త్వమేవ కిల శాంభవీ త్వమసి కామకోటీ జయా
త్వమేవ విజయా త్వయి త్రిజగదంబ కిం బ్రూమహే|| ౧౦౦

చండిక వీవ యో జనని ! శాంభవి వీవ మహేశి వీవ చా
ముండివి నీవ యోగినివి ముజ్జగముల్ గను నవ్వవీవ మా
యండయు నీవ యీవ జయవున్ విజయాఖ్యయు నీవ కాంచిలో
నుండెడు కామకోటివగుదో యుమ ! యేమని ని న్నుతించెదన్.

ఓ తల్లీ ! నీవు చండివి, శాంభవివి మహేశివి ఛాముండివి యోగినివి త్రిజగజ్జననివి. జయము విజయము నీవు. కామకోటివి నీవు. మా దిక్కును నీవే, ఇట్టి నిన్నెవరని నిర్ణయించి నుతింపగలనమ్మా !

పరే జనని పార్వతి ప్రణతపాలిని ప్రాతిభ
ప్రదాత్రి పరమేశ్వరి త్రిజగదాశ్రితే శాశ్వతే
త్రియంబకకుటుంబిని త్రిపదసంగిని త్రీక్షణే
శక్తిమయి వీక్షణం మయి నిధేహి కామాక్షి తే| ౯౩

పరశివా ! పార్వతీ ! ప్రణతపాలిని ! ప్రాతిభదాత్రి ! శ్రీమహే
శ్వరి ! జగదాశ్రితా ! త్రిపదసంగిని ! త్రీక్షణి ! యో త్రియంబకే
శ్వరుని కుటుంబినీమణి ! త్రిశక్తిమయీ ! ప్రసరింపఁజేయు మ
మ్మరో ! కరుణాకటాక్షముల మాపయి నీపయిఁ గామలోచనీ !

పరశివా ఓ పార్వతీ ప్రతిభాప్రదాత్రి ప్రణతజనపాలిని త్రిపదసంచారిణి త్రిలోచని త్ర్యంబకేశ్వరునికుటుంబిని శక్తిత్రయస్వరూపిణి కామాక్షీ నీ కటాక్షములను నాపైని బ్రసరింపజేయుగదమ్మ.

మనోమధుకరోత్సవం విదధతీ మనీషాజుషాం
స్వయంప్రభవవైఖరీ విపినవేదికాలమ్బినీ
సదాశిశిరితా కృపామధురసేన కమ్పాతటే
చరాచరవిధాయినీ చరతి కాపి చిన్మంజరీ|| ౯౪

రంజిలు సన్మనోమధుకరమ్ముల కుత్సవముం బొనర్చి చి
న్మంజరి చల్వల న్నినిచి మాన్యకృపం జతురానన ప్రవృ
త్తిం జను వైఖరీ వనతతి న్విలసించి, చరాచరమ్ముఁ జ
క్కంజెలువొందఁ జేయు ననుకంపముగం గల దేవభూములన్.

సజ్జనుల మనసులనెడి తుమ్మెదల కానందము నించు నొక చిన్మయ పుష్పమం జరి కృపామధురిమచే జలువలనించుచు బ్రహ్మనుండి ప్రవృత్తములయిన వేదములనెడి వైఖరీ రూపమైన వేదికపై నిలిచి యీ చరాచరసృష్టికి ర్త్రియై చరించుచున్నది.

కలావతి కలాభృతో ముకుటసీమ్ని లీలావతి
స్పృహావతి మహేశ్వరే భువనమోహనే భాస్వతి
ప్రభావతి రమే సదా మహితరూపశోభావతి
త్వరావతి పరే సతాం గురుకృపామ్బుధారావతి|| ౯౫

లలితకిరీటకోటిని గళాధరచారుకళం ధరించి మే
ల్వాలువుల కుల్కులన్ భువనమోహనుపై వలపుల్ వెలార్చు చి
త్కళపయి నొక్క తళ్కుపయి కళ్కుహొయల్ నెఱ చాకచక్యముల్
గల గురుసత్కృపాలహరి లక్ష్యము నిల్పి వినోద మందెదన్.

కిరీటమున జంద్రకళ దాల్చినది. విలాసవతి భువనమోహనుడైన శంకరునిపై వలపుగలది ప్రభావతి పరమపావని శోభావతి గురుకృపారసధారామూర్తి భక్తరక్షణమందు త్వరగలదియునగు నా పరతత్త్వమందు వేడుక పడెదను.

త్వయైవ జగదంబయా భువనమండలం సూయతే
త్వయైవ కరుణార్ద్రయా తదపి రక్షణం నీయతే
త్వయైవ ఖరకోపయా నయనపావకే హూయతే
త్వయైవ కిల నిత్యయా జగతి సంతతం స్థీయతే|| ౯౬

నీచేతన్ జగదంబచేత భువనానీకమ్ము రూపొందెడిన్
నీచేతన్ గరుణారసార్ద్రికతనన్ క్షేమోన్నతిం జెందెడిన్
నీచేతం బటుకోపచేత నయనాగ్నిన్ వేలిమిం గాంచెడిన్
నీచే శాశ్వత సత్యమైన కళచే నిత్యాకృతి న్మించెడిన్.

జగదంబవైన నీచే భువనము లుదయించుచున్నవి. కరుణారసార్ద్రవైన నీచేత నవి పాలింపబడుచున్నవి. తీవ్రకోపవైన నీచేత (మహాకాళిచేత) నయనాగ్నిలో హోమము చేయబడుచున్నవి. నిత్యసత్యవైన నీచేతనే యని నిత్యస్థితి నందుచున్నవి.

చరాచరవిచిన్మయీం సకలహ్రాన్మయీం చిన్మయీం
గుణత్రయమయీం జగత్త్రియమయీం త్రిధామామయీం
పరాపరమయీం సదా దశదిశాం నిశాహర్మయీం
పరాం సతతసన్మయీం పరమచిన్మయీం శీలయే|| ౯౭

మహిత చరాచరాద్భుత విమర్శనమై పరచిత్ప్రకాశమై
యహమును రాత్రియై దెసలునై త్రిగుణమ్ము త్రిధామమౌచుఁ దా
నిహము పరమ్మునై తెలివియే యయి యంతట నున్కియై మహా
మహము జగత్త్రియమ్మయిన మాతను నిన్ను విమర్శసేసెదన్.

చరాచరవిచిత్రసృష్టియయి సకలహ్లాదమయి గుణరూపమయి జగత్త్రియమయి త్రిధామమయి పరాపరమయి దశదిశామయి అహోరాత్రమయి నిరంతరసన్మయి సద్రూపిణియైన పరమచిన్మయిని పరావాఙ్మయిని జ్ఞానరూపిణిని నిగమవచనరూపిణియగు నిన్ను అన్వేషించెదను. (విమర్శించెదను)

జయ జగదంబికే హరకుటుమ్బిని నేత్రరుచా
జితశరదంబుజే ఘనవిడంబిని కేశరుచా
పర మవలంబనం కురు సదా పరరూపధరే
మమ గతసంవిదో జడిమడంబరతాండవినః|| ౯౮

ఓ జగదంబ ! నీకు జయమో శివభామిని ! నేత్రకాంతి నం
భోజములన్ జయించి మెయిపొల్పున మబ్బుల యు బ్బడంచుచున్
రాజిలు నో పరాకృతి ! కరమ్మొకయించుక యూత యీ గద
మ్మా ! జడిమాతిరేకమున నాడెడు నాకు ననాత్మవేత్తకున్.

జ్ఞానములేక మందమతితో నిట్టట్టు తిరుగు నాకు ఒక అవలంబనమై ఓపర దేవత! నిజనయనకాంతులచే నరవిందములం గెలిచి సర్వోన్నతురాలవై వర్తింపుము. జడుడనై ఆత్మస్వరూప మెఱుగని నా కించుక చేయూత నిచ్చి ఉద్ధరింపగదమ్మా !

భువనజనని భూషాభూతచంద్రే నమస్తే
కలుషశమని కంపాతీరగేహే నమస్తే
నిఖిలనిగమవేద్యే నిత్యరూపే నమస్తే
పరశివమయి పాశచ్ఛేదహస్తే నమస్తే|| ౯౯

భువనము సాకు తల్లి శశిభూషణి ! నీ కివె నా నమస్కృతుల్
దవిలి చరించి కంపదరిదాపులఁ బాపములన్ హరించు ని
త్యవు నిగమాంతవేద్య వగు నమ్మకు వే వినతుల్ కరమ్ములన్
భవమయ పాశఖండన మొనర్చెడు చండిక ! నీకివే నతుల్.

ఓ భువనమాత ! చంద్రచూడా ! నీకు నమస్కారము, పాపశమని ! కంపా తీరగేహినీ ! నీకు వందనము. సకల వేదవేద్య నిత్యరూపా ! నీకు అంజలి. ఓ చండిక ! పాశముల చించి చెండాడుము. భవ్యహస్తప్రశస్తా ! నీకు కైమోడ్పు.

క్వణత్కాంచీ కాంచీపురమణివిపంచీలయఝరీ
శిరఃకంపా కంపావసతి రనుకంపాజలనిధిః
ఘనశ్యామా శ్యామా కఠినకుచసీమా మనసి మే
మృగాక్షీ కామాక్షీ హరనటనసాక్షీ విహరతామ్॥ ౧౦౦

కాంచిక్రమోయఁ గాంచిపుర కల్పితరత్నవిపంచి గాన మా
లించి శిరఃప్రకంప మొనరించుచుఁ గంప మహానుకంప వ
ర్తించు మృగాక్షి మబ్బురుచి నించెడి జవ్వని శంభునాట్య మీ
క్షించెడి సాక్షి మించి విహరించు ఘనస్తని నా మనమ్మునన్.

కాంచీమణికింకిణులు మ్రోయ కాంచీపురమనెడి రత్నవీణ పలుకు స్వరము లాలించి పారవశ్యమున దలయూచుచు ననుకంపాసింధువై కంపదరిం జరించుచు నీలమేఘచ్ఛాయగని మెలజవ్వనమునఁ గులుకుచు కఠినకుచయుగ మలర హరుని సంధ్యానటనముం దిలకించు మృగాక్షి కామాక్షి నా మనసునందు విహరించుగాక.

సమరవిజయకోటీ సాధకానన్దధాటీ
మృదు గుణగణ మణీపేటీ ముఖ్యాకాదమ్బవాటీ
మునినుతపరిపాటీ మోహితాజాండకోటీ
పరమశివవధూటీ పాతు మాం కామకోటీ॥ ౧౦౧

అని జయకోటి చేకొని నిరంతర సాధక హర్షధాటియై
ఘనగుణ రత్నపేటియయి కాపురముండి కదంబవాటిలో
మునిచి యజాండకోటి నెఱమోహమునన్ మునికోటినన్నుతిం
గొను పరిపాటి యేలుత ననున్ శివుబోటియె కామకోటినాన్.

అనేక యుద్ధవిజయములందినది సాధకుల యానందోద్రేక స్వరూపమయినది మృదులగుణమణులకు పేటికయైనది మునివినుతపరిపాటి (చరిత్ర క్రమము) గలది బ్రహ్మాండ కోటులను సమ్మోహింపజేయునది పరమశివుని వధూటియు నగు కామ కోటి నన్ను రక్షించుగాక.

**ఇమాం పరవరప్రదాం ప్రకృతిపేశలాం పావనీం**
**పరాపరచిదాకృతి ప్రకటన ప్రదీపాయితామ్**
**స్తుతిం పఠతి నిత్యదా మనసి భావయ న్నంబికాం**
**జపై రలమలం మఖై రధికదేహసంశోషణైః||** ౧౦౨

ఈ లీల న్వరము ల్వరంబొసఁగు నెంతే పావనమ్మున్ స్వత
స్సౌలభ్యమ్ము పరాపరాత్మక చిదంశస్ఫూర్తికిన్ దీప మా
మూల మ్మమ్మఁదలంచి యీ తెలుఁగుసొంపు ల్పండగీర్తించినన్
జాలుంజాలును జాలుఁజాలు జపయజ్ఞమ్ముల్ మహాయాసముల్.

ఉత్తమవరమును అనగా మోక్షానందమును అనుగ్రహించునది సహజమృదువైనది పవిత్రమైనది పరాపరాత్మకచిత్స్వరూపమును ప్రకాశింపజేయుటలో దీపమైనదియునగు నీ స్తుతిని జగన్మాతయగు కామాక్షిం దలచుచు పఠించిన జాలును. శరీరమును గృశింపజేసెడి జపములు యజ్ఞములును నెందులకు ?

స్తుతిశతకము సంపూర్ణము

శ్రీ

# కటాక్షశతకము

మోహాన్ధకారనివహం వినిహన్తు మీడే
మూకాత్మనామపి మహాకవితావదాన్యాన్
శ్రీకాంచిదేశ శిశిరీకృతి జాగరూకా
నేకామ్రనాథతరుణీ కరుణావలోకాన్|| ౧

మోహముపేరి గాఢతమమున్ విదళింప నుతింతు శంభు స
మ్మోహిని శ్రీకటాక్షముల మూగలకుం గవితావదాన్యముల్
మోహనమైన కాంచిపురపుణ్యనివాసముఁ జల్లసేయు స
న్నాహమునందు మెల్కువగొనంగలవాని నభీష్టసిద్ధికిన్.

మోహమనెడి యంధకారమును హరించుటకు మూగవారికిగూడ మహాకవితాసంపద నిచ్చుటలో నెఱదాతయై కాంచీమండలమును జల్లంసేయుటలో మెలకువగానినట్టి ఏకామ్రేశ్వర తరుణీమణి కరుణారసపూరిత కటాక్షములను స్తుతించుచున్నాను.

మాత ర్జయన్తి మమతాగ్రహమోక్షణాని
మాహేన్ద్రనీలరుచిశిక్షణదక్షిణాని
కామాక్షి కల్పితజగత్త్రయరక్షణాని
త్వద్వీక్షణాని వరదానవిచక్షణాని|| ౨

మమతారూప మహాగ్రహమ్ము విడిపింపం జాణలై యింద్రనీ
లములన్ మేల్కొళనేర్పు నేర్పరులునై లక్షింప నీ యెల్ల లో
కములన్ రక్షణసేయ దక్షములునై కామాక్షిరో నీ కటా
క్షము లింపొందు నభీష్టదాన పటువైచక్షణ్యదాక్షిణ్యముల్.

మమకారరూపమైన గ్రహమును వదలించునట్టియు ఇంద్రనీల మాణిక్యముల తళుకులను శిక్షింప సమర్థమైనట్టియు ముల్లోకములకు రక్షకములై అభీష్టముల నిచ్చుటలో విచక్షణములైనట్టియు నీ యీక్షణములు సర్వోన్నతములై యలరుచున్నవి.

అనంగతన్త్రవిధి దర్శితకౌశలానా
మానన్ద మన్దపరిఘూర్ణితమన్థరాణామ్
తారల్య మమ్బ తవ తాడితకర్ణసీమ్నాం
కామాక్షి ఖేలతి కటాక్షనిరీక్షణానామ్|| 3

ఆనంగాగమకార్యకౌశలముతై యానంద ముప్పొంగి లో
లోనన్ ఘూర్ణిల మందమందగతి నాలో వీనులం దాఁకి యిం
పౌ నీ దివ్యకటాక్ష వీక్షణములం దౌనైగనిగ్యంపు శో
భానైర్మల్యము గాంచిమండలమునం బాఱాడెడిన్ దల్లిరో !

కామతంత్రమునందు కడునేరిమిచూపునట్టియు ఆనందముచే నుప్పొంగి లోలోన సుడివడి యల్లల్లన వీనులందాకు నీ కటాక్షవీక్షణములయొక్క తళతళ యీ కాంచీ మండలమున జిందులాడుచున్నది.

కల్లోలితేన కరుణారసవేల్లితేన
కల్మాషితేన కమనీయమృదుస్మితేన
మా మంచితేన తవ కించన కుంచితేన
కామాక్షి తేన శిశిరీకురు వీక్షితేన||

కరుణరసంబువారి తరగల్గొనఁ గాటుకరేక నల్లనై
కరమరుదైన లేనగవుకాంతులు వెన్నెలలీన నీదు సుం
దరతరవీక్షణప్రభ నుదారగతిన్ నను జల్లసేయు మ
మ్మరా ! గిరిరాజరాజమణిమందిరఖేలిని ! కామలోచనీ !

కరుణారసతరంగితమై కాటుకరేకచే నల్లనై చక్కని లేనగవుకాంతిచే వన్నెలు గుల్కుచునుండు నీ సుందరకటాక్షవీక్షణములచే నన్ను చల్లబరుపుము.

సాహాయ్యకం గతవతీ ముహు రర్జునస్య
మన్దస్మితస్య పరితోషితభీమచేతాః
కామాక్షి పాండవచమూ రివ తావకీన
కర్ణాన్తికం చలతి హన్త కటాక్షలక్ష్మీః||

ఎంతయుగూర్చి భీముమది కింపగు నర్జునమందహాస వి
క్రాంతికి సాయమౌచు నొడికమ్మున నీదు కటాక్షలక్ష్మి క
ర్ణాంతిక మేగుదెంచెడుఁగదమ్మ జగజ్జనయిత్రి ! యద్భుతో
దంతము పాండవేయులయుదారచమూతతి పోలికన్ శివా !

భీమ = శివునికి శ్లేష--భీమునికి ఎంతయుగూర్చి అర్జున = తెల్లని. శ్లేష-- అర్జునునియొక్క మందహాసమునకు సాయపడి నీ కటాక్షలక్ష్మి పాండవసేనవలె కర్ణాంతికమును కర్ణ = చెవియొక్క శ్లేష--కర్ణునియొక్క అంతికం = సామీప్యమునుగూర్చి దూకుచున్నది.

అస్తం క్షణా న్నయతు మే పరితాపసూర్య
మానన్దచన్ద్రమస మానయతాం ప్రకాశమ్
కాలాన్ధకారసుషమాం కలయ న్దిగన్తే
కామాక్షి కోమలకటాక్షనిశాగమ స్తే|| ౬

అమ్మరో ! నీ కటాక్షము నిశాగమరేఖ వహించి నాదు తా
పమ్మను భాను నస్తమయభాజను జేసి తనంతటన్ దిగం
తమ్ముల నంధకారరుచి దాలిచి యంతటిలోనె నిండు మో
దమ్మను చంద్రబింబమును దా నుదయింపగఁ జేయుఁగావుతన్.

అమ్మా ! నీ కటాక్షము రాత్రిసొంపు వహించి దిశలయం దంధకారరుచి నించుచు క్షణములో నా పరితాపసూర్యుని అస్తమింపఁజేసి ఆనందచంద్రోదయమును సమకూర్చుగాక !

తాటంకమౌక్తికరుచాంకురదన్తకాన్తిః
కారుణ్యహస్తిపశిఖామణి నాధిరూఢః
ఉన్మూలయ త్వశుభపాదప మస్మదీయం
కామాక్షి తావకకటాక్షమతఙ్గజేన్ద్రః|| ౭

తల్లిరో ! నీ యపాంగము మతంగజమై వడిఁ బెల్లగించుతన్
బెల్లున నా యమంగళము పేరి మహాతరు వందుమీఁద శో
భిల్లఁగ మావటీఁ డటుల, వింతగు జాలి చెవాకుముత్తెపుం
జల్లుల నుల్లసిల్లు తెలిచాయలు దంతపుసొంపు నూపఁగన్.

నీ కటాక్ష మొక మదగజమై తన మెడ కరుణ యనెడి మావటీఁ డధిష్ఠింపగ చెవ్వాకులందలి ముత్యములకాంతి దంతకాంతియై విలసిల్లగా నా యశుభము లనెడి తరువులను బెల్లగించుగాక !

ఛాయాభరేణ జగతాం పరితాపహారీ
తాటంకరత్నమణితల్లజపల్లవశ్రీః
కారుణ్యనామ వికిర న్మకరన్దజాలం
కామాక్షి రాజతి కటాక్షసురద్రుమ స్తే|

రంజిలు నీ కటాక్ష మమరద్రుమమై కరుణారసంబు ధా
రం జిలికించి తేనియల రత్నమయుంబగు కర్ణపత్రమం
దుం జెలువొందు రత్నరుచి తూగఁగ లేఁజిగురాకు నిండు చా
యుం జగతీజనంబుల మహత్తరతాపములన్ హరించుచున్.

నీ కటాక్ష మొక కల్పవృక్షమై కరుణారసధారారూపమున మకరందధార చిలికించుచు కర్ణపత్రములందలి రత్నరుచి యనెడి లేఁజిగురాకుశోభ విలసిల్లగ స్వీయచ్ఛాయచే జగముల పరితాపము పరిహరించుచున్నది.

సూర్యాశ్రయప్రణయినీ మణికుండలాంశు
లౌహిత్యకోకనదకానన మాననీయా
యాన్తీ తవ స్మరహరాననకాన్తిసిన్ధుం
కామాక్షి రాజతి కటాక్షకలిన్దకన్యా॥ ౯

కామాక్షమ్మ ! భవత్కటాక్ష మను నక్కాళింది జెల్వొందెడిన్
శ్రీమచ్చంద్రకళాధరాననరుచి శ్రీసింధుసంగంబునం
దామోదించుచు రత్నకుండలరుచివ్యాలోలరక్తోత్పల
శ్రీమాన్యమ్మయి సూర్యపాశ్రయసముల్లాసమ్ము దీపింపఁగన్.

నీ కటాక్షమనెడి కాళింది పరమశివుని ముఖశోభయనెడి సాగరమున సంగమించి రత్నకుండల కాంతు లనెడి యెఱ్ఱతామరపూలచే ప్రకాశించుచు సూర్యపాశ్రయపరమై యొప్పుచున్నది. (సూరి = సూర్యుడు; శ్లేష, జ్ఞాని.)

ప్రాప్నోతి యం సుకృతినం తవ పక్షపాతా
త్కామాక్షి వీక్షణవిలాస కలాపురంధ్రీ
సద్య స్తమేవ కిల ముక్తివధూ ర్వృణీతే
తస్మా న్నితాన్త మనయో రిద మైకమత్యమ్॥ ౧౦

అమ్మరో ! పొందు నీదగు కటాక్షవిలాసకళాపురంధ్రి పు
ణ్యామ్మలుగన్న యే మనుజు నంచితధన్యు ననంతపక్షపా
[illegible] ‍న వాని ముక్తిసతి తాన వరించును దానిచేత గా
[illegible] నెక్య ముభయమ్మునకున్ గిరిరాజనందనా !

నీ కటాక్షవిలాసకళయనెడి పతివ్రత యే పుణ్యాత్ముని పక్షపాతముగొని వరించునో వానిని ముక్తికాంత స్వయముగ నావెంటనే వరించును. అందుచేతనే నీ కటాక్షకళకు ముక్తికి నన్యోన్యమైత్రి యేర్పడియున్నది.

యాన్తీ సదైవ మరుతా మనుకూలభావం
భ్రూవల్లిశక్రధను రుల్లసితా రసార్ద్రా
కామాక్షి కౌతుకతరంగితనీలకంఠా
కాదమ్బినీవ తవ భాతి కటాక్షమాలా|| ౧౧

మరుదనుకూలభావమున మాటికి భ్రూలత యింద్రచాప వి
స్ఫురణ వహింపఁ గౌతుకవిముగ్ధవిమోహన నీలకంఠతన్
బరఁగి భవత్కటాక్షరుచిమాల పయోధరమాలపోలికన్
బరమరసార్ద్రభావమున భాసిలునమ్మ హిమాద్రికన్యకా!

భ్రూలతయను నింద్రధనస్సుచే భాసిలుచు రసార్ద్రమై నీలకంఠుని (శివుని-- శ్లేష నెమలిని) కుతూహలతరంగితుని యొనర్చుచు నీ కటాక్షము మేఘమాలవలె విలసిల్లుచున్నది.

గంగామ్భసి స్మితమయే తపనాత్మజేవ
గంగాధరోరసి నవోత్పలమాలికేవ
వక్త్రప్రభాసరసి శైవలమండలీవ
కామాక్షి రాజతి కటాక్షరుచిచ్ఛటా తే|| ౧౨

స్మిత మను గాంగవారి విలసిల్లుచు సూర్యకుమారిపోలికన్
సతము గిరీశువక్షమున నల్లని కల్వలమాలనాగ నం
చితముఖకాంతియన్న సరసిం జెలువొందెడి నాఁచురీతి న
ద్భుతము భవత్కటాక్షరుచిపుంజము రంజిలు నద్రినందనా !

నీ కటాక్షరుచిపుంజము చిరునవ్వనెడి గంగాజలములందు యమునానది యట్లు కలిసి శివుని వక్షఃస్థలమునందు నల్లకలువమాలవలె నొప్పుచు ముఖప్రభ యను సరస్సున నాచువలె జెలువొంది యెంతయు రంజిల్లుచున్నది.

సంస్కారతః కిమసి కన్దలితా ప్రసజ్జ
కేదారసీమ్ని సుధియా ముపభోగయోగ్యాన్
కల్యాణసూక్తిలహరీ కలమాంకురా న్నః
కామాక్షి కన్దలయతు త్వదపాంగమేఘః|| ౧౩

హారివచఃప్రవాహకలమాంకురముల్ మొలపించుగాక నీ
చారు కటాక్షమేఘ మది చక్కని బ్రోదియొనర్ప భవ్యసం
స్కారముచే నొనర్చి రసికప్రకర మ్మనునట్టి దివ్యకే
దారమునన్ వివేకులగు ధన్యులయుం దుపభోగయోగ్యమై.

నీ కటాక్షమను మేఘము రసికజనప్రకర మనెడి పంటపొలమునందు సంస్కార వశమున నంకురించి కల్యాణకరములైనట్టియు బుద్ధిమంతుల కుపభోగయోగ్యములగ నట్టియు మనోహరవాక్ప్రవాహరూపమైన వరిమొలకలను మొలపించుగాక.

చాంచల్యమేవ నియతం కలయ న్ప్రకృత్యా
మాలిన్యభూ శ్శ్రుతిపథాక్రమజాగరూకః
కైవల్యమేవ కిము కల్పయతే నతానాం
కామాక్షి చిత్రమపి తే కరుణాకటాక్షః॥ ౮౪

చంచలమై స్వభావమున సాంజనతన్ మలినైకవృత్తియై
యుంచితరీతిఁ దా శ్రుతిపథాక్రమణమ్మున జాగరూకతన్
గాంచి విచిత్ర మానతజనంబుల కిచ్చుఁగదమ్మ కేవల
త్వాంచితముక్తి నీదగు కటాక్షము శ్రీశివలోచనప్రియా!

స్వభావచంచలమై అంజనసంపర్కమున మలినవృత్తియై శ్రుతిపథాక్రమణమున కువగొన్న (శ్రుతి=చెవి--వేదము) నీ కటాక్షము తనదరిని ప్రణతులగు జనః కైవల్యమునే యొసఁగుచుండుట చిత్రము గదా !

సంజీవనే జనని చూతశిలీముఖస్య
సంమోహనే శశికిశోరకశేఖరస్య
సంస్తమ్భనే చ మమతాగ్రహచేష్టితస్య
కామాక్షి వీక్షణకలా పరమౌషధం తే॥

చెలఁగి సహకారశరుని సంజీవనమునఁ
బొలిచి బాలేందుమౌళి సమ్మోహనమునఁ
దనరి మమతాగ్రహైక సంస్తంభనమున
నలరు నీ చూపు పరమసిద్ధౌషధముగ.

మన్మధసంజీవనమునందు బాలేందుమౌళి సమ్మోహనమునందు, మమతాగ్రహ సంస్తంభనమునందు నీ కటాక్షకళ సిద్ధౌషధమై యొప్పుచున్నది.

కామద్రుహో హృదయ యన్త్రణజాగరూకా
కామాక్షి చంచల దృగంచలమేఖలా తే
ఆశ్చర్య మమ్బ భజతాం ఝటితి స్వకీయ
సంపర్క ఏవ విధునోతి సమస్తబన్ధాన్|| ౧౮

అంబ ! త్వదీయ చంచలదృగంచలమేఖల కామవైరిభా
వంబును గట్టఁగా మెళుకువం గనియున్ దను గొల్చువారి బం
ధంబుల విప్పనేర్చెడుఁగదా యిది యేమి విచిత్రమొ స్వకీ
యంబగు స్పర్శ యైన క్షణమంద హిమాద్రికుమారి ! శాంకరీ !

నీ చంచలకటాక్షమేఖల (మొలనూలు) కామవైరిభావమును (హృదయమును) బంధించుటలో మెళకువగోనియును, తనను సేవించువారి సర్వబంధములను సంపర్క మాత్రముచే నప్పుడ విప్పివేయుచున్నది. ఇది యేమి చిత్రమమ్మా !

నీలోఽపి రాగ మధికం జనయ న్పురారే
ర్లోలోఽపి భక్తి మధికాం ద్రఢయ న్నరాణామ్
వక్రోఽపి దేవి నమతాం సమతాం వితన్వ
న్కామాక్షి నృత్యతు మయి త్వదపాంగపాతః|| ౧౯

నల్లనిదయ్యు రాగము ఘన మ్మొనరించెడు నప్పురారియం
దెల్లర భక్తినిశ్చలత నించెడిఁ దా నతిచంచలంబునై
తల్లిరో ! వక్రమై తనకుఁదా సమత న్నతులైనవారికే
నుల్లసిలున్, నటించు తదియున్ భవదీక్షణ మంబ ! నాపయిన్

స్వభావముచే దాను నల్లనిదయ్యు పరమశివుని రాగమును బెంపొందించుచున్నది. తాను సహజచంచలమై యెల్లరయందు భక్తినిశ్చలతను సంపాదించుచున్నది. నైజముగ తాను వక్రమయ్యు వినతులకు సర్వసమతను విస్తరింపజేయుచున్నది. అట్టి విచిత్రమైన నీ కటాక్షపాతము నాయందు నటించుగాక.

కుంఠీకరోతు విపదం మమ కుంచితభ్రూ
చాపాంచితః శ్రితవిదేహభవానురాగః
రక్షోపకార మనిశం జనయ న్జగత్యాం
కామాక్షి రామ ఇవ తే కరుణాకటాక్షః॥ ౧౮

భువి రక్షోపకృతిం బొనర్చుచు నతభ్రూచాపమై నీ కటా
క్ష విలాసమ్ము విదేహజానుభవరాగస్ఫూర్తిఁ గోదండరా
ముపలెన్ నాదగు నాపదల్ సకలమున్ బోనాడుతం దల్లి ! శాం
భవి ! కామాక్షి ! సత మ్మకారణకృపామాధుర్యధుర్యద్యుతిన్.

నీ కరుణాకటాక్షము కోదండరామునివలె జగమునందు రక్షోపకృతి రక్షించుట యను నుపకారము శ్లేష--రక్షః + అపకృతి రాక్షసుల కపకారమును సేయుచు భ్రూవల్లీ రూపమైన చాపము వంచి విదేహభవానురాగము కలది (విదేహభవా + అనురాగము =సీతయం దనురాగముగలవాడు) --- శ్లేష. విదేహముక్తివడసినవారియం దనురాగము కలదియై యుండి నా యాపదలను ఖండించుగాక. రాముని పరముగ కటాక్షపరముగ శ్లేష.

శ్రీకామకోటి శివలోచనశోషితస్య
శృంగారబీజవిభవస్య పునః ప్రరోహే
ప్రేమామ్భసార్ద్ర మచిరా త్ప్రచురేణ శంకే
కేదార మమ్బ తవ కేవలదృష్టిపాతమ్॥ ౧౯

అరయఁ గామకోటి ! నిటలాక్షుని చూపున నెండినట్టి శృం
గారరసైకబీజము తగన్ మరలన్ మొలువంగ నొప్పఁ కే
దార మటంచు నెంచెద నుదారదయారససంతతార్ద్ర మం
బా ! రమణీయతావకకటాక్ష మగాధిపభాగ్యదేవతా !

త్రినేత్రుని చూపుచే నెండిన శృంగారరసబీజము (మన్మధుఁడు) తిరిగి మొలచుటకు నిరంతరదయార్ద్రరసభరితమగు నీ కటాక్షమొక వరిమడియైయున్న దని నేను భావించుచున్నాను.

మాహాత్మ్యశేవధి రసౌ తవ దుర్విలంఘ్య
సంసారవిన్ధ్యగిరికుంఠనకేలిచుంచుః
ధైర్యామ్బుధిం పశుపతే శ్చులకీకరోతి
కామాక్షి వీక్షణవిజృమ్భణకుంభజన్మా॥ ౨౦

స్థిరగతి నీదువీక్షణవిజృంభణమన్న అగస్త్యమూర్తి వి
స్తరతరసుప్రభావనిధి సంసృతియన్న యవంధ్యవింధ్య భూ
ధర మది యడ్డి శంకరుని ధైర్యమహాంబుధియెల్ల నద్భుతం
బిరవుకొనంగఁ దాఁ బుడిసిలించుగదే జగదేకసుందరీ !

నీ కటాక్షవీక్షణవిజృంభణము అనుపమప్రభావనిధియగు అగస్త్యమహర్షి స్వరూపమై సంసారరూపమైన వింధ్యపర్వతమును స్తంభింపజేసి శంకరుని ధైర్యమహాంబుధిని ఆపోశనము పట్టుచున్నది !

పీయూషవర్షశిశిరా స్ఫుటదుత్పలశ్రీ
మైత్రీనిసర్గమధురా కృతతారకాప్తిః
కామాక్షి సంశ్రితవతీ వపు రష్టమూర్తే
ర్జ్యోత్స్నాయతే భగవతి త్వదపాంగమాలా॥ ౨౧

అమృతపుజల్లునన్ జలువయై వికసించెడికల్వపూల స్నే
హమున నిసర్గసుందరమునై శివమూర్తి భజించి తారకా
సముదయ మంది వెన్నెలగఁ జాల్కొను నీదు కటాక్షమాల ని
త్యము భవదాస్యబింబము సుధాకరబింబవిడంబనమ్ముగన్.

అమృతవర్షముచే జల్లనై వికసించెడి కల్వపూలస్నేహముచే సహజసుందరమై తారకాసముదయమంది (తారకా=కనుపాపల సముదయమును=సొంపును, శ్లేష-- నక్షత్రముల యుదయమును బొంది) అష్టమూర్తియగు శివుని భజించి నీ యపాంగమాల త్వదీయ ముఖచంద్రబింబమందు జాల్కొను వెన్నెలయై విలసిల్లుచున్నది.

అమ్బ స్మరప్రతిభటస్య వపు ర్మనోజ్ఞ
మమ్భోజకానన మివాంచితకంటకాభమ్
భృంగీవ చుమ్బతి సదైవ సపక్షపాతా
కామాక్షి కోమలరుచి స్త్వదపాంగమాలా॥ ౨౨

అంబ స్మరారిచక్కనగునట్టి శరీరము కంటకాంచిత
మ్మంబుజకాననమ్మటుల, నక్కతనన్ గృతపక్షపాతమై
చుంబనముం బొనర్చెడును జూచితె నీదు నపాంగమాల యం
దంబగు నాడుతుమ్మెదవిధమ్మున నాడుచు నచ్చపుం జిగిన్.

శివుని శరీరము కంటకయుతము. పులకలతో గూడినదై, శ్లేష--ముండ్లతోగూడిన పద్మవనమట్లు రాణించుచున్నది. అందుచేతనే నీ కటాక్షమాల అడుతుమ్మెదవలె పక్షపాతము గొని ఆ మూర్తిని ముద్దుపెట్టుకొనుచున్నది.

కేశప్రభాపటలనీలవితానజాలే
కామాక్షి కుండలమణిచ్ఛవిదీపశోభే
శంకే కటాక్షరుచిరంగతలే కృపాఖ్యా
శైలూషికా నటతి శంకరవల్లభే తే|| ౨౩

అమ్మరో ! నీదు కుంతలచయప్రభ నీలవితానజాలమై
గ్రమ్మఁగఁ గుండలంపుమణికాంతులు దీపముశోభగా నపాం
గమ్ములకాంతి రంగముగఁ గైకొని నీకృప నాట్యకత్తె యుం
దమ్మనఁ గాంచి నర్తనమొనర్చుట లెంచెద శంకరప్రియా

నీ తలకట్టుయొక్క కాంతి నల్లనిమేల్కట్టుగ (చాందినిగ) రాణింపఁగ. కుండల రత్న కాంతులు దీపశోభ నింపగ, నీ యపాంగకాంతి రంగస్థలముగ గైకొని నీ కృప యొక నాట్యకత్తెయై యందంబుగ నృత్యముసేయుచున్నదని భావించుచున్నాను.

అత్యన్తశీతల మతన్ద్రియతు క్షణార్ధ
మస్తోకవిభ్రమ మనంగవిలాసకన్దమ్
అల్పస్మితాదృత మపారకృపాప్రవాహ
మక్షిప్రరోహ మచిరా న్మయి కామకోటి|| ౨౪

చలువలనించుచున్ క్షణముజాల్కొనఁగన్ గరుణాప్రవాహ మి
మ్ముల౯ జిఱునవ్వులన్ మురిపెముల్ గని పూవిలుకాని సోయగ
మ్ముల కొక మూలకందమయి పూనియనల్పవిలాసముల్ గడున్
దలిరుచు నీ కటాక్షము లతంద్రత వర్తిలుఁగాక నాపయిన్.

నీ కటాక్షపుమొలక మిగుల చలువనించుచు అపార కృపారసప్రవాహమై చిరునవ్వులచే ముద్దుగొల్పుచు మన్మథ సౌందర్యమునకు మూలకందమై యనల్పవిలాసములచే నిస్తంద్రమై నాయందు అరనిముసమైన వర్తించుగాక

మందాక్షరాగతరలీకృతిపారతన్త్ర్యా
త్కామాక్షి మన్థరతరాం త్వదపాంగదోలామ్
ఆరుహ్య మన్ద మతికౌతుకశాలి చక్షు
రానన్ద మేత ముహు రర్ధశశాంకమౌళేః॥ ౨౫

తల్లిరో ! సిగ్గునున్ వలపు తబ్బిబుసేయ వశంబుతప్పి య
ల్లల్లనఁ దూగు నీదగు నపాంగపుటుయ్యేలమీఁద నెక్కి తా
మెల్లన నిండు వేడ్కగని మించెడి నర్ధశశాంకమౌళి శో
భిల్లెడిచూ పమందమగు నింపునుసొంపు వహించి నిచ్చలున్.

సిగ్గును అనురాగమును తబ్బిబ్బుసేయ వివశమై అల్లల్లననూగు నీ కటాక్ష మను నుయ్యేలమీఁదనెక్కి చంద్రశేఖరుని చూపు నిండువేడుకతో నూగుచు నమందానంద మును బడయుచున్నది.

త్రైయమ్బకం త్రిపురసున్దరి హర్మ్యభూమి
రంగం విహారసరసీ కరుణాప్రవాహః
దాసాశ్చ వాసవముఖాః పరిపాలనీయం
కామాక్షి విశ్వమపి వీక్షణభూభృత స్తే॥ ౨౬

అమ్మరో ! నీ కటాక్షమను నయ్యవనీపతి కిందుమౌళికా
యమ్ము విహారసౌధము, విహారసరస్సు కృపాప్రవాహ, మా
ప్తమ్మగు నింద్రముఖ్యసురవర్గము దాసజనమ్ము, రాజ్యమౌ
జమ్ము ప్రపంచమున్ ద్రిపురసుందరి ! సుందరసూక్తిమాధురీ.

నీ కటాక్షమనెడి సార్వభౌమునకు చంద్రశేఖరుని శరీరము విహారసౌధము. అందరి దయాప్రవాహము కేళీసరోవరము. ఆప్తమగు నింద్రాది దేవతావర్గము దాసజనము. సకల ప్రపంచము సామ్రాజ్యము.

వాగీశ్వరీ సహచరీ నియమేన లక్ష్మీః
భ్రూవల్లరీ వశకరీ భువనాని గేహమ్
రూపం త్రిలోకనయనామృత మమ్బ తేషాం
కామాక్షి యేషు తవ వీక్షణపారతన్త్రీ॥ ౨౭

తల్లిరా ! నీదు చూపు పరతంత్రమొ యెవ్వరియందు వారికీ
యెల్లజగంబు నిల్లు పరమేశ్వరి లక్ష్మియునున్ వశమ్ము భ్రూ
పల్లరి వాగధీశ్వరియు వారికి నెచ్చెలి వారిచూపు సొం
పల్లుకొనుం ద్రిలోకనయనామృతమై విలసిల్లి చల్లనన్.

నీ కటాక్ష మెవరియందు స్వాధీనమై ప్రసరించునో వారి కీ ప్రపంచమంతయు నివాసగృహము. పరమేశ్వరియైన మహాలక్ష్మి వారి కనుసైగలో మెలగును. వాగధీశ్వరివారికి నెచ్చెలి. వారి రూపము త్రిలోకనయనామృతమై విలసిల్లును.

మాహేశ్వరం ఝటితి మానసమీన మమ్బ
కామాక్షి ధైర్యజలధౌ నితరాం నిమగ్నమ్
జాలేన శృంఖలయతి త్వదపాంగనామ్నా
విస్తారితేన విషమాయుధ దాశకోఽసౌ|| ౨౮

అసమశరుండు జాలరిగనై త్వదపాంగముపేరి యవ్వలన్
దులకిలకుండఁ బట్టుకొనఁ దోఁచెఁడు నమ్మరో ధైర్యవార్ధిలో
మసలెడు నమ్మహేశ్వరుని మానసమీన మదే జయాంకమై
కుసుమశరధ్వజాగ్రమునఁ గుల్కెడు నాతనికీర్తిఁ జాటుచున్.

మన్మథుడొక జాలరియై నీ కటాక్షమను వలలో ధైర్యమను సముద్రములో మసలెడి యాపరమేశ్వరుని మానసమనెడి చేపను దుసికిలకుండ పట్టుకొనుచున్నాఁడని తోఁచుచున్నది. (అందుచేతనే మన్మథుని ధ్వజాగ్రమున తద్విజయకీర్తిప్రకటనమునకు జిహ్నముగ నాచేఁపగుర్తు విలసిల్లుచున్నది. ఇది మూలములో లేక తెనుఁగు అనువాదములో బెంచిన భావ విశేషము.)

ఉన్మథ్య బోధకమలాకర మమ్బ జాడ్య
స్తమ్బేరమం మమ మనోవిపినే భ్రమన్తమ్
కుంఠీకురుష్వ తరసా కుటిలాగ్రసీమ్నా
కామాక్షి తావకకటాక్షమహాంకుశేన|| ౨౯

అమ్మరొ ! జ్ఞానమన్న కమలాకరమున్ గలగించి నాదు డెం
దమ్మను కాననాంతరమునన్ భ్రమియించెడి జాడ్యమన్న నా
గమ్మును లొంగదీయుము జగజ్జననీ ! కుటిలాగ్ర మెంతో తీ
క్ష్ణమ్మగు నీ కటాక్షమనఁగాఁదగు నంకుశ మూని శాంకరీ !

జ్ఞానమనెడి తామరకొలనిని గలగించి నా మనస్సనెడి యరణ్యమున దిరుగు జాడ్యమనెడి మదగజమును కుటిలాగ్రమై సుతీక్ష్ణమైయున్న నీ కటాక్షమను నంకుశముచే స్వాధీనమొనరింపు మమ్మా !

ఉద్వేల్లితస్తబకితై ర్లలితై ర్విలాసై
రుత్థాయ దేవి తవ గాఢకటాక్షకుంజాత్
దూరం పలాయయతు మోహమృగీకులం మే
కామాక్షి సత్వర మనుగ్రహ కేసరీన్ద్రః|| 30

లలితవిలాసవల్గనములం బొనరించుచు దూకి తల్లి ! నీ
యలఘుకటాక్షవీక్షణమటన్న నికుంజమునుండి లేచి మి
క్కిలిత్వర నీ యనుగ్రహము కేసరినాఁ దరుమంగ నేర్చుతన్
బలసిన నాదు మోహము లనం దుడుకుల్ గొను లేళ్ళమందలన్.

నీ యనుగ్రహమనెడి సింహము భవదమందకటాక్షవీక్షణమనెడి పొదరింటినుండి లేచి విచిత్రవిలాసవల్గనము లొనరించుచు దూకి సత్వరమ మదీయ మోహరూపమున దుందుడుకుగొను లేళ్ళమందలను దూరముగ తరిమికొట్టుగాక.

స్నేహార్ద్రితాం విదలితోత్పలకాన్తిచోరాం
జేతారమేవ జగదీశ్వరి జేతుకామః
మానోద్ధతో మకరకేతు రసౌ ధునీతే
కామాక్షి తావకకటాక్షకృపాణవల్లీమ్|| 30

స్మరుఁ డిదె చూడుమా దురభిమానసముద్ధతుఁడౌచు నీశ్వరీ !
విరిసిన కల్వపూలరుచి పెంపును దొంగిలి స్నేహసంగతిన్
బరగెడు నీ యపాంగపుఁ గృపాణ మిదే ఝళిపించుచున్నవాఁ
డరరె ! తనుం జయించిన మహేశుహుఁ దాన జయించుకోరికన్.

మన్మథుఁడు దురభిమానసముద్ధతుఁడై కల్వపూవులకాంతిం దొంగిలునట్టియు (నల్లనిది అని అర్థము) స్నేహార్ద్రము స్నేహ = అనురాగముచే ఆర్ద్రము = తడిసినది. శ్లేష--చమురుచే దడిసినది (తుప్పుపట్టకుండుటకు) అగు నీ యపాంగమను కృపాణమును ఇంతకుమున్న తన్నుజయించినవాని శివుని జయింపవలెనన్నకోరికచే ఝళిపించుచున్నాడు.

శ్రౌతీం వ్రజన్నపి సదా సరణీం మునీనాం
కామాక్షి సంతతమపి స్మృతిమార్గగామీ
కౌటిల్య మంబ కథ మస్థిరతాం చ ధత్తే
చౌర్యం చ పంకజరుచాం త్వదపాంగపాతః|| 32

చక్కని సన్మునీశ్వరుల శ్రౌతపథమ్మున నాడనేర్చి బల్
మక్కువ నెల్లవేళ స్మృతిమార్గమునన్ జరియింపనేర్చి యే
మక్క ! భవత్కటాక్ష మిది యస్థిరమున్ గుటిలమ్మె కాక యా
ప్రక్కన తమ్ములన్ సిరులఁ బట్టపగల్ వడిఁ దోఁచెడింగదే !

మునీశ్వరుల శ్రౌతమార్గమును బొంది (శ్రుతివిహితమైన మార్గము --శ్లే--కర్ణమార్గమును - వినికిడినిపొంది) స్మృతిమార్గమున నెల్లప్పుడు సంచరింప నేర్చియు స్మృతి = మన్వాదిస్మృతి--శ్లేష జ్ఞప్తి. నీ కటాక్ష మస్థిరము (చంచలము) వక్రమునగుట యేగాక పట్టపగలు తమ్ముల = పద్మముల సిరులను దోచుకొనుచున్నది. ఇది యేమి యన్యాయమమ్మా !

నిత్యం శ్రుతేః పరిచితౌ యతమానమేవ
నీలోత్పలం నిజసమీపనివాసలోలమ్
ప్రీత్యేవ పాఠయతి వీక్షణదేశికేంద్రః
కామాక్షి కిం ను తవ కాలిమసంప్రదాయమ్|| 33

అనయము నా శ్రుతిన్ బరిచయమ్మొనయం దనచెంతనే వసిం
పను దమిగొన్న నల్లగలువంగని కాళిమసంప్రదాయ మం
తను జదివింపఁ బ్రీతిగొనునా యిది నీదు కటాక్షమన్న చ
క్కని గురుచక్రవర్తి త్రిజగజ్జననీ ! జనతార్తిభంజనీ !

ఎల్లప్పుడు శ్రుతిపరిచయమునకు యత్నించుచు వేదవిజ్ఞానమును బడయ ప్రయత్నము సేయుచు, శ్లేష--కర్ణభూషణమై వర్తించుచు, తనచెంతన వసింప గుతూహలపడు నల్లకలువను నీ కటాక్షమును నాచార్యచక్రవర్తి ప్రీతితో కాళిమసంప్రదాయమును (నలుపుయొక్క రీతిని) చదివించుచున్నదా యేమి ? నీ కటాక్షము నల్లగలువను మించి నున్నదని భావము.

భ్రాంత్వా ముహుః స్తబకిత స్మితఫేనరాశౌ
కామాక్షి వక్త్రరుచిసంచయవారిరాశౌ
ఆనన్దతి త్రిపురమర్దన నేత్రలక్ష్మీ
రాలభ్య దేవి తవ మన్ద మపాంగసేతుమ్|| 34

ప్రోవులుగొన్న లేఁతనగవుం దెలినుర్వులు తూఁగు నీ ముఖ
శ్రీవనరాశిలోఁ దిరిగి సేతువుగాఁగొని నీ కటాక్షమున్
దేవి ! పురారినేత్రరమ తేలు నమందముదంబులోన సం
ప్లావితసాధుభక్తకవిపావనవాగ్లహరీ ! సుధాకరీ !

ప్రోవులు ప్రోవులై పొలయు చిఱునవ్వులను తెల్లనిసురుగులతోడూగు నీ ముఖ కాంతిసముద్రములో నీ కటాక్ష మను సేతువు నాధారముగాఁగొని త్రిపురారి నేత్రలక్ష్మి యమందానందమున నోలలాడుచున్నది.

**శ్యామా తవ త్రిపురసుందరి లోచనశ్రీః**
**కామాక్షి కందలితమేదురతారకాన్తిః**
**జ్యోత్స్నావతీ స్మితరుచాపి కథం తనోతి**
**స్పర్ధా మహో కువలయైశ్చ తథా చకోరైః॥** 38

సొంపుగశ్యామయై త్రిపురసుందరి నీదగు చూపు ద్యాత్రి రా
ణింపు వహించి తారరుచి నింపులు గుల్కుచు పిన్ననవ్వుగ
ల్పింపగ వెన్నెలల్ గడకు వెన్నెలపుల్గులతోడఁ గల్వపూ
గుంపులతో విరోధమునకున్ దిగునేలనె శైలబాలికా !

నీ నయనశోభ (శ్యామ = నల్లనిదై శ్లేష-యౌవనమధ్యస్థురాలై) తారరుచిచే సొంపుగుల్కుచు (తారరుచి = కనుపాపలతళుకుచే నక్షత్రములకాంతిచే) చిఱునవ్వుల వెన్నెలలుగాయ వర్తించియు వెన్నెలతో వెన్నెలపులుగులతో (చకోరములతో) కల్వపూవులతో దగవులకు దిగనేలమ్మా !

**కాలాంజనం చ తవ దేవి నిరీక్షణం చ**
**కామాక్షి సామ్యసరణిం సముపైతి కాన్త్యా**
**నిశ్శేషనేత్రసులభం జగతీషు పూర్వ**
**మన్యత్త్రినేత్రసులభం తుహినాద్రికన్యే॥** 39

నల్లనికాటుకల్ భువననాయకి నీదగు చూపు లొక్కటై
యుల్లసిలున్ వినీలరుచియొప్పున సామ్యము పూని; అందునున్
దొల్లిఁటి దెల్లనేత్రములనున్ సులభంబగు ! దేవదేవధీ
వల్లభ ! యా త్రినేత్రసులభంబగు నమ్మ! శివస్తు వమ్మరో !

దేవీ ! నల్లనికాటుకయు నీ చూపును కాంతిచేత పరస్పరము సామ్యము పొందుచున్నవి. కాని అందు మొదటిది సర్వనేత్ర సులభము. రెండవది త్రినేత్రమాత్రసులభము. అనగా నీ కటాక్షమునకు పరమశివుడొక్కడే పాత్రుడని భావము.

ధూమాంకురో మకరకేతనపావకస్య
కామాక్షి నేత్రరుచినీలిమచాతురీ తే
అత్యంత మద్భుత మిదం నయనత్రయస్య
హర్షోదయం జనయతే హరిణాంకమౌళేః|| ౩౭

అది మకరధ్వజుండనెడి యగ్నిఁ దలంకొను ధూమరేఖ నీ
సదమలనీలనేత్రరుచి చాతురి వింతలకెల్ల వింత య
య్యది హరిణాంకమౌళి నయనాంకితమై తమి నింపజాలి న
ట్టిది యగు టెందునేని ముకుటీతటసంఘటితైందవార్భటీ !

మన్మథుడను నగ్నిం గ్రమ్మిన పొగ నీ కనులయందలి నీలిమశోభ. ఐనను చంద్రశేఖరుని చూడ్కులు మూడింటికి నది ఆనందజనకమగుచున్నది. ఇది అత్యద్భుతవిషయము.

ఆరంభలేశసమయే తవ వీక్షణస్య
కామాక్షి మూకమపి వీక్షణమాత్రనమ్రమ్
సర్వజ్ఞతా సకలలోకసమక్ష మేవ
కీర్తిస్స్వయంవరణమాల్యవతీ వృణీతే|| ౩౮

తొలికడకంటిచూపుచిరుతున్కఁ దొలంకక్షణాన వీక్షణ
మ్మొలసినయంత నీదుదరి నొయ్యన వ్రాలెడునట్టి మూకునిన్
లలి వరియించునమ్మ సకలజ్ఞత కీర్తియున్ స్వయంవరో
జ్జ్వలమగు పూలమాలఁ గొని సర్వజగమ్ముసమక్షమం దుమా !

నీ కటాక్షలేశము ప్రసరించుట ఆరంభమైనసమయముననే నీ దర్శన మాత్రముచే నీ దరినివ్రాలిన మూగవానినికూడ సర్వజ్ఞత (ఒకానొకనాయిక) కీర్తియను స్వయంవర మాలికను గొనివచ్చి అలంకరించి సర్వలోకసమక్షమున వరించును.

కాలాంబువాహా ఇవ తే పరితాపహారీ
కామాక్షి పుష్కర మథఃకురుతే కటాక్షః
పూర్వః పరం క్షణరుచా సముపైతి మైత్రీ
మన్యస్తు సంతతరుచిం ప్రకటీకరోతి|| ౩౯

తరుణపయోదమట్లు పరితాపము నార్పు భవత్కటాక్ష వి
స్ఫురణము పుష్కర మ్మొరిగిపో నొనరించెడునమ్మ యందు ముం
దరిది క్షణప్రభం జెలిమిదాల్చెడు నవ్వలి దందులోన ని
బ్బరముగ తెంపులేని రుచిపాకము వెల్లడిసేయు

నీ కటాక్షము వర్షాకాలమేఘమువలె తాపము హరించునదై తల వంచుచున్నది. కాని యీ రెండింటిలో మొదటిదగు మేఘము క్షణప్రభతో = మెరుపుతో చెలికారము వాటించుచున్నది. రెండవదియగు నీ కటాక్షము సంతతప్రభను = నిరంతర కాంతిని వెలువరించుచున్నది.

సూక్ష్మేఽపి దుర్గమతరేఽపి గురుప్రసాద
సాహాయ్యకేన విచర న్నపవర్గమార్గే
సంసారపంకనిచయే న పతత్యమూం తే
కామాక్షి గాఢ మవలంబ్య కటాక్షయష్టిమ్|| ౪౦

దుర్గమ మెంతొ సూక్ష్మమగు త్రోవగదా అపవర్గమన్న య
మ్మార్గము, దానిలోనఁ జను మానిసి యొజ్జయనుగ్రహమ్ము సం
సర్గము తోడుజేసికొని సంసృతిపంకమునందుఁ గూలఁ డో
దుర ! భవత్కటాక్షమను తోరపుయష్టి గ్రహించి యూతగన్.

అపవర్గమార్గము (మోక్షమార్గము) మిక్కిలి సూక్ష్మము. ఎంతో దుర్గమము. అట్టి దారివెంటనే ఆచార్యానుగ్రహమును తోడుసేసికొని యేగు మనుజుడు నీ కటాక్షమనెడి చేతి కఱ్ఱ నూతజేసికొని సంసారమనెడి బురదలో బడిపోక గమ్యస్థానము సేరును.

కామాక్షి సంతత మసౌ హరినీలరత్న
స్తంభే కటాక్షరుచిపుంజమయే భవత్యాః
బద్ధోఽపి భక్తినిగళై ర్మమ చిత్తహస్తి
స్తంభం చ బంధమపి ముంచతి హంత చిత్రమ్|| ౪౧

పొలుపగు నీ కటాక్షరుచిపుంజమునాఁ జను నింద్రనీల మం
జులమగు కంబమందుఁ దగఁ జొన్పియు గట్టిగఁగట్ట భక్తిశృం
ఖలముల నాదు చిత్తమను గంధగజం బిది యేమి చిత్రమో
తలఁగుఁగదమ్మ బంధమును స్తంభముఁగూఢ నగేంద్రనందనా !

నీ కటాక్షకాంతిపుంజమయమైన ఇంద్రనీలస్తంభమునందు చేర్చి భక్తి యనెడి గొలుసులచే నా చిత్తమను మదగజము దృఢముగ కట్టబడినదైకూడ స్తంభమును = కట్టు కొయ్యను స్తబ్ధ భావమును, బంధమును = కట్టుగొలుసులను సంసార బంధమును కూడ త్రెంచుకొని పోవుచున్నది. ఇదియేమి చిత్రమమ్మా ! శ్లేష.

కామాక్షి కార్ష్ణ్యమపి సంతత మంజనం చ
బిభ్ర న్నిసర్గతరలోఽపి భవత్కటాక్షః
వైమల్య మన్వహ మనంజనతాం చ భూయః
స్థైర్యం చ భక్తహృదయాయ కథం దదాతి|| ८२

నలుపు ధరించి కాటుగ ఘనంబుగ దాలిచి సాజమైన చం
చలతను బూనియున్ జనని ! చక్కని నీదు కటాక్ష మెట్లొకో
సలుపు ననంజనత్వమును స్వచ్ఛతయున్ మఱి నిశ్చలత్వ మిం
పలవడ నాప్తభక్తహృదయమ్ములయం దనయమ్ము శాంకరీ !

నల్లదనము కాటుకను నెడతెగక ధరించెడి చక్కని నీ కటాక్షము సహజ చంచలమయ్యు భక్తహృదయమునకు స్వచ్ఛతను అనంజనభావమును (సుఖదుఖాది ద్వంద్వమాలిన్య సంపర్కములేమిని) నిశ్చలత్వమును సమకూర్చుచున్నది. ఇది యెట్లో యమ్మా !

మన్దస్మిత స్తబకితం మణికుణ్డలాంశు
స్తోమప్రవాలరుచిరం శిశిరీకృతాశమ్
కామాక్షి రాజతి కటాక్షరుచేః కదమ్బ
ముద్యానవ మమ్బ కరుణాహరిణేక్షణాయాః|| ८३

దరహాసమ్ములు పూవుగుత్తులుగ నుద్యత్కుండలాంతర్మణి
స్ఫురణమ్ముల్ చిగురాకుశోభగ దెసల్ పూరించుచున్ జల్వలన్
వరలున్ నీదు కటాక్షపుం ద్యుతికదంబం బంబ ! సాక్షాత్కృపా
హరిణాక్షీ సువిహారహారి వరమోద్యానమ్ముగన్ బార్వతీ !

చిఱునవ్వులచే పూగుత్తులు తొడిగి రత్నకుండల కాంతులచే చిగిరించి దిక్కుల యందు చలువలను జిమ్ముచు నీ కటాక్షకాంతి కదంబము (కడిమిచెట్లతోపు) కరుణ యను సుందరి విహరించు నుద్యానమై విలసిల్లుచున్నది.

కామాక్షి తావకకటాక్షమహేంద్రనీల
సింహాసనం శ్రితవతో మకరధ్వజస్య
సామ్రాజ్యమంగలవిధౌ మణికుణ్డలశ్రీ
ర్నీరాజనోత్సవతరంగితదీపమాలా॥ ౪౪

భాసిలునమ్మ నీదగు నపాంగముపేరి మహేంద్రనీలసిం
హాసన మెక్కినట్టి మకరాంకుని రాచరికంపు మంగళో
ల్లాసనిమిత్తతన్ బడసి లాలితసన్మణికుండలప్రభల్
డాసి నివాళియుత్సవములన్ దరగల్గొను దీపమాలలై.

అమ్మా ! నీ కటాక్షమను నింద్రనీలమాణిక్య సింహాసనము నధిష్ఠించిన మన్మధునకు సామ్రాజ్యలక్షణముగ నిచ్చు మంగళనీరాజనోత్సవమందు నీ మణికుండలప్రభ దీపమాలికయై రాజిల్లుచున్నది.

మాతః క్షణం స్నపయ మాం తవ వీక్షితేన
మన్దాక్షి తేన సుజనై రపరోక్షితేన
కామాక్షి కర్మతిమిరోత్కరభాస్కరేణ
శ్రేయస్కరేణ మధుపద్యుతితస్కరేణ॥ ౪౫

రంపిలు కర్మమన్ దిమిరరాశికి భాస్కరుఁడౌచుఁ దేటిగుం
పింపు హరించి సిగ్గు తులకింప మనీషిసమక్షమందునన్
సొంపగు నీక్షణమ్మున నసుక్షణమున్ వను దల్లి స్నాన మా
డింపు మశేషమంగళసమీక్షణరక్షణదక్షిణమ్మునన్.

అమ్మా ! జ్ఞానులచే ప్రత్యక్షీకరింపబడునదై సిగ్గు తులకించునట్టియు, కర్మరూపమైన తమస్సుపాలిటికి సూర్యుఁడైనట్టియు, తుమ్మెదల కాంతిని దస్కరించునట్టియు, శ్రేయస్కరమైనట్టియు, సుజనులకు సాక్షాత్కరించు నీ కటాక్షముచే నొక క్షణము నన్ను స్నానమాడింపుము.

ప్రేమాపగాపయసి మజ్జన మారచయ్య
యుక్తః స్మితాంశుకృతభస్మవిలేపనశ్రీః
కామాక్షి కుణ్డలమణిద్యుతిభి ర్జటాలః
శ్రీకంఠమేవ భజతే తవ దృష్టిపాతః॥ ౪౬

సరసప్రేమమహాపగాజలములన్ స్నానంబు గావించి నీ
దరహాసాంశువులన్న భూతి యదియున్ బైఁబూసి శ్రీకుండలాం
తరమాణిక్యరుచిన్ జటాలమగుచున్ దృద్వీక్షణ మ్మో మహే
శ్వరి ! గావించు శివార్చనమ్ము త్రిజగద్వాల్లభ్య సౌలభ్యమై.

నీ కటాక్ష మొక శైవదీక్షితునట్లు ప్రేమ యను నదిలో స్నానముచేసి చిరునవ్వు తళుకనెడి వెలిబూది పూసికొని కుండలమణికాంతులనెడి జడలు దాల్చి శ్రీకంఠునే భజించుచున్నది.

కైవల్యదాయ కరుణారసకింకరాయ
కామాక్షి కన్దలితవిభ్రమశంకరాయ
ఆలోకనాయ తవ భక్తశివంకరాయ
మాత ర్నమోఽస్తు పరతన్త్రితశంకరాయ|| ౪౭

కరుణరసైకకింకరము కందళితాద్భుతవిభ్రమాత్తశం
కరము విముక్తికిం గరము గారణముం బరతంత్ర మాత్మశం
కరము భవత్కటాక్షతిలకమ్మన కంచితభక్తిమచ్ఛివం
కరమునకున్ నమస్కృతి జగజ్జననీ ! జనిమృత్యుభంజనీ !

కైవల్యానందకరము కరుణారసకింకరము కందళితవిలాసశంకరము భక్తశివంకరమును నైశంకరుని వశీకరించుకొనిన నీ కటాక్షమునకు నమస్కారమమ్మా !

సామ్రాజ్యమంగలవిధౌ మకరధ్వజస్య
లోలాలకాలికృత తోరణమాల్యశోభే
కామేశ్వరి ! ప్రచలదుత్పలవైజయన్తీ
చాతుర్య మేతి తవ చంచలదృష్టిపాతః|| ౪౮

కీరితిగన్న య మ్మకరకేతను రాచరికంపు మంగళా
చారమనంగ ముంగురులఁ జక్కని తోరణమాల్యశోభ చే
కూరగ నీదు చూపుబెళుకుల్ చలదుత్పలవైజయంతి శృం
గారచమత్క్రియం బడయుఁగాదె నగాధిపభాగ్యదేవతా !

ఓకామేశ్వరీ ! ఆ కాముని సామ్రాజ్యమంగళాచారనిర్వహణమున కన్నట్లు అల్లన కదలు ముంగురులచే నలవరింపబడిన తోరణమాల శోభయందు నీ చంచలమైన కటాక్షము చక్కగా నాగు కలువపూమాలచే ఘటించిన వైజయంతి (పతాక) యొక్క చమత్కారము బడయుచున్నది.

మార్గేణ మంజుకచకాన్తితమోవృతేన
మన్దాయమానగమనా మదనాతురాఽసౌ
కామాక్షి దృష్టి రయతే తవ శంకరాయ
సంకేతభూమి మచిరా దభిసారికేవ|| ౪౯

బ్రాతిగఁ గుంతలప్రభలునాఁ దగు చీఁకటిగ్రమ్ముదారి నీ
రీతిని శంకరుంగుఱిచి ప్రీతిమెయిం జను నీదు దృష్టి యో
మాత మనోజ్ఞమందగతి మాటికి న మ్మరుబారి వేగి సం
కేతపదమ్ముఁ జేరఁ దమకించుగదే యభిసారికాకృతిన్.

నల్లని నీ కుంతలములకాంతి యనెడి చీకటులు గ్రమ్మిన దారివెంట మందమందగమనమున మరుబారికి జిక్కి నీ చూపు సంకేతస్థలమునకేగు తమోఽభిసారికవలె శంకరుని గూర్చి చనుచున్నది.

వ్రీడానువృత్తిరమణీకృతసాహచర్యా
శైవాలితాం గలరుచా శశిశేఖరస్య
కామాక్షి కాన్తిసరసీం త్వదపాంగలక్ష్మీ
ర్మన్దం సమాశ్రయతి మజ్జనఖేలనాయ|| ౫౦

అనువృత్తింగొను లజ్జయన్న చెలితోడై రాగ బాలేందుచూ
డుని కంఠప్రభచేత శైవలితమట్లుం బొల్చు నక్కాంతినాఁ
జను నచ్ఛంపుసరస్సులోనికి దిగున్ సర్వేశి ! యల్లల్ల మ
జ్జన కేళీకుతుకాన నీదగు కటాక్షశ్రీ పురారిప్రియా !

నీ కటాక్షలక్ష్మి లజ్జయను చెలికత్తె తోడై వెంబడింప శశిశేఖరుని కంఠప్రభచేత నాచుపట్టినట్లున్న కాంతియను సరస్సునందు మజ్జనక్రీడ చేయుటకొఱకు మెల్లమెల్లన జనుచున్నది.

కాషాయ మంశుకమివ ప్రకటం దధానో
మాణిక్యకుండలరుచిం మమతావిరోధీ
శ్రుత్యంతసీమని రతః సుతరాం చకాస్తి
కామాక్షి తావక కటాక్షయతీశ్వరోఽసౌ|| ౯౧

కోమలపద్మరాగమణికుండల కాంతులు కావిచీరగా
నేమమునం ధరించి కదు నేర్పున దుర్మమతన్ హరించి యా
హా ! మసలంగనేర్చె శ్రుతియంతిమసీమల నుల్లసిల్లు శో
భామృదువౌచు నీదగు నపాంగయతీశ్వరమూర్తి నిచ్చలున్.

మమకారమునకు విరోధియై మాణిక్యకుండలకాంతిని కాషాయాంబరమునట్లు ధరించి నీ కటాక్షమును నీ యతీశ్వరుదు శ్రుత్యంతసీమల = వేదాంతవీధులందు (శ్రుతి + అంత సీమలు = కర్ణాంతిక ప్రాంతమున) మసలం గుతూహలముగొని రాణించుచున్నాడు.

పాషాణ ఏవ హరినీలమణి ర్దినేషు
ప్రమ్లానతాం కువలయం ప్రకటీకరోతి
నైమిత్తికో జలదమేచకిమా తతస్తే
కామాక్షి శూన్య ముపమాన మపాంగలక్ష్మ్యాః|| ౯౨

పవలున నల్లగల్వపువు వాడునుబో, హరినీలరత్నమా
అపునొక నల్లరాయి, జలదావళిరంగు నిమిత్తలబ్ధ మి
ట్లవుటను దల్లి నీదగు కటాక్షపుసొంపున కీడు సున్న శాం
భవి ! నిజభక్తలోకకృతవైభవి ! శాత్రవచండభైరవీ !

ఇంద్రనీల మదియొక పాషాణము. నల్లకలువపువ్వు వాడిపోవునదే. మేఘము నలుపు నైమిత్తికము. (వర్షాకాలనిమిత్తముగా నేర్పడునది) అందువలన నీ కటాక్షంపు సొంపునకు సామ్యము శూన్యము. ఇంద్రనీలమణిలో లేని మార్దవము, కలువలో లేని అనిమిత్తమైన నైల్యము, కామాక్షీకటాక్షమందు విశిష్టలక్షణములై యున్నవని భావము.

శృంగారవిభ్రమవతీ సుతరాం సలజ్జా
నాసాగ్రమౌక్తికరుచా కృతమన్దహాసా
శ్యామా కటాక్షసుషమా తవ యుక్తమేత
త్కామాక్షి చుంబతి దిగంబరవక్త్రబిమ్బమ్|| ౯౩

అద్దిర అడ్డబాసజిగి నచ్చము నించుచు మందహాసమున్
ముద్దులుగుల్కు నెంతయును మోహనలజ్జను నీ కటాక్షమం
దొద్దికగన్న కాంతి యది యొక్క దిగంబరు వక్త్రబింబమున్
ముద్దిడు శ్యామయౌట నది పోలునుగాదె చిదంబరేశ్వరీ !

కామాక్షీ ! నీ కటాక్షశోభ శ్యామయై నల్లనిదై (శ్లేష -- యౌవనమధ్యస్థురాలై -- ప్రౌఢయన్నమాట) శృంగారవిలాసవతియై లజ్జావతియై అడ్డబాస ముత్తియమునందు గులుకు తళుకుచే చిరునవ్వు నవ్వుచు నొకానొక దిగంబరుని ముఖబింబమును ముద్దాడుచున్నది. ఇది యుక్తమేగదమ్మా ! ప్రౌఢయగు నాయికకు ఇట్లు తనకు దా విశృంఖలప్రవృత్తి వహించుట యుచితమే యని తాత్పర్యము.

**నీలోత్పలేన మధుపేన చ దృష్టిపాతః**
**కామాక్షి తుల్య ఇతి తే కథ మామనన్తి**
**శైత్యేన నిన్దతి యదన్వహ మిన్దుపాదా**
**న్పాథోరుహేణ యదసౌ కలహాయతే చ||** ౧౪

అమ్మరో ! నీదు చూపు సమ మందు రదెట్టులె నల్లగల్వతో
నమ్మధుపమ్ముతోడ నిది యచ్చపుశైత్యముచేత నిందుపా
దమ్ముల నాడిపోసి మఱి తా జలజమ్ములతోడ గాఢపై
ర మ్మొనరించుచుండుఁగద రాజతశైలవిహారివల్లభా !

నీ కటాక్షము నల్లగలువతో, తుమ్మెదతో సమానమని పండితులు ఎట్లు చెప్పుచున్నారో ! ఇది చలువదనముచే చంద్రకిరణములను నిరంతరము నిందించుచున్నది కలువలతో కలహమాడుచున్నది.

**ఓష్ఠప్రభాపటలవిద్రుమముద్రితే తే**
**భ్రూవల్లివీచిసుభగే ముఖకాన్తిసిన్ధౌ**
**కామాక్షి వారిభరపూరణలమ్బమాన**
**కాలామ్బువాహసరణిం లభతే కటాక్షః||** ౧౫

అరుణతరాధరప్రభలె యన్ పవడంబుల డంబుమీరి సుం
దరమగు భ్రూలతోర్ములఁ దనర్చెడు నీ ముఖకాంతిసింధువన్
దొరగి రసంబుల న్నినుచు నొక్క నవాంబుదవిభ్రమప్రభా
సరణి గడించికొన్నది నిజమ్ముగ నీదు కటాక్ష మంబికా !

నీ కటాక్షము ఎఱ్ఱని పెదవియందలి తళుకనెడి పవడములతో నలరుచు నంద మైన కనుబొమల విలాసములనెడి కెరటములచే నొప్పెడి నీ ముఖకాంతి యనెడి సింధువునందు నీటిని పూరింప (వ్రేలు (క్రొక్కారు మేఘముయొక్క పోలికను బడ యుచున్నది.

మన్దస్మితై ర్ధవలితా మణికుణ్డలాంశు
సంపర్కలోహితరుచి స్త్వదపాంగధారా
కామాక్షి మల్లికుసుమై ర్నవపల్లవైశ్చ
నీలోత్పలైశ్చ రచితేవ విభాతి మాలా||

తెలుపయి మందహాసముల దేవి ! లసన్మణికుండలప్రభల్
గలియగ నెఱ్ఱనౌ తళుకు గ్రమ్మిన నీదు నపాంగధార మ
ల్లెలు మఱి లేఁజివుళ్ళు మఱి లెక్కకు మిక్కిలి నల్లగల్వలున్
గలియగ గ్రుచ్చు మాలికరకమ్మున నింపులు నింపు నమ్మరో !

చిరునవ్వులచే దెలుపెక్కి మణికుండలప్రభలచే నెరుపుగొని కులుకు నీ యపాం గధార మల్లెలు, చివుళ్ళు, అటుమీద నల్లగలువలు కలిపి గ్రుచ్చిన మాలికవిధంబున సొంపు నింపుచున్నది.

కామాక్షి శీతలకృపారసనిర్ఝరాంభ
స్సంపర్కపక్ష్మలరుచి స్త్వదపాంగమాలా
గోభి స్సదా పురరిపో రభిలక్ష్యమాణా
దూర్వాకదంబకవిడంబన మాతనోతి|| ౫౬

నిరతము నీ కృపారస వినిర్మల శీతల నిర్ఝరోదక
మ్మొరయఁగఁ బక్ష్మలించు తళుకొంది త్వదీయకటాక్షమాలికల్
దొరయుఁగదమ్మ యగ్గరికదుబ్బుల నుబ్బున నంగవించి యు
ప్పరరిపుగోకదంబ మటఁ బూనిన వేడుకఁ జెంగలింపఁగన్.

ఎల్లప్పుడు నీ చల్లని కృపారసమను సెలయేట నొరసి వికసించు కాంతితో గూడి: నీ కటాక్షమాల పరమశివుని గోవులచే (గోవులు -- ఆవులు. శ్లేష -- కన్నులు నభిలషింపబడుచు దూర్వాకదంబమును (గరికదుబ్బులను) నలుపుచే పోలుచున్నది.

హృత్పంకజం మమ వికాసయతు ప్రముష్ణ
న్నుల్లాస ముత్పలరుచే స్తమసాం నిరోద్ధా
దోషానుషంగజడతాం జగతాం ధునానః
కామాక్షి వీక్షణవిలాసదినోదయ స్తే॥ ౫౮

పూని హరించి యా కలువపూలరుచిన్ దమ ముక్కడంచి దో
షానుగమైన జాడ్య మది సర్వజగంబులలో విదల్చి య
మ్లానభవత్కటాక్షసువిలాస దినోదయ రేఖ వొల్చి నా
మానసపంకజమ్మున కమందవిలాసము గూర్పుగావుతన్.

కలువపూవుల కలికితనము దొంగిలి తమస్సులను హరించి జగత్తులయొక్క దోషానుషక్తమైన జాడ్యమును (రాత్రినిమిత్తముగా నేర్పడిన మాంద్యమును) విదళించునదై యున్న నీ కటాక్షవిలాస మను దినోదయరేఖ (పగటికాలపుసొగసు) నా మనఃపద్మమును వికసింపఁజేయుగాక.

చక్షు ర్విమోహయతి చన్ద్రవిభూషణస్య
కామాక్షి తావకకటాక్షతమఃప్రరోహః
ప్రత్యఙ్ముఖం తు నయనం స్థిమితం మునీనాం
ప్రాకాశ్యమేవ నయతీతి పరం విచిత్రమ్॥ ౫౯

ఐందవబింబమౌళి కను లద్దిర మోహమునంద ముంచి నిన్
జెందు కటాక్షమన్ మొలకచీఁకటి లోమొగమైన మౌనిరా
డ్బృందముకన్ను సుస్థిమితరీతి నొనర్చుచు సుప్రకాశతన్
బొందఁగఁజేయుచున్నది యభూత విచిత్రమిదెంతయో సుమా !

చంద్రశేఖరుని చూపులను మోహింపజేయుచునుందు వీకటాక్ష మను చీఁకటి మొలక మునుల అంతర్ముఖమై సుస్థిమితమైన నేత్రమును సుప్రకాశ మొనరించుచున్నది. విచిత్రము కదా! మోహకారణమైన వస్తువు ప్రసన్నతను గూర్చుట విరుద్ధమని భావము.

కామాక్షి వీక్షణరుచా యుధి నిర్జితం తే
నీలోత్పలం నిరవశేషగతాభిమానమ్
ఆగత్య తత్పరిసరం శ్రవణావతంస.
వ్యాజేన నూన మభయార్థన మాతనోతి॥ ౬౦

నీ నెఱిచూపుతళ్కు్కల వినిర్జితమై యని నల్లకల్వ సుం
తే నభిమానముల్ మిగుల కేఁగి తదంతిక మూని నిల్చి య
వ్వీనులయాకు రేఖ మిషవెట్టి నిజ మ్మభయమ్ము వేడుచు
న్నా ననుచున్న దమ్మరొ ! కన చ్ఛ్రుతిపూరముతళ్కు్కనన్ నగన్.

నీ చూపుల తళుకుతోడి యుద్ధమున నోడి నల్లకలువ అభిమానము విడిచి చెవ్వాకు నెపమున (చెవికి పెట్టుకొను ఆభరణము) నీ కటాక్షపరిసరమున కేగి అభయము వేడుకొనుచున్నట్లున్నది.

**ఆశ్చర్య మంబ మదనాభ్యుదయావలమ్బః**
**కామాక్షి చంచలనిరీక్షణవిభ్రమ స్తే**
**ధైర్యం విధాయ తనుతే హృది రాగబన్ధమ్**
**శంభోస్తదేవ విపరీతతయా మునీనామ్||** ౬౧

అచ్చెరు వంబ పూని మదనాభ్యుదయం బవలంబనంబుగా
నుచ్చలితమ్ము నీ కనులయొప్పిద మమ్మరొ ! శంభుదేవు ధై
ర్యోచ్చయమెల్లఁ జిమ్మి మదినుంచుచునున్నది రాగబంధ మీ
మచ్చన కన్యథావిధి యమర్చుచునున్నది మౌనిపాళికిన్.

మన్మథుని అభ్యుదయమెల్ల నవలంబముగా గొని నీ చంచలకటాక్షవిలాసము శంకరుని ధైర్యాతిశయమెల్ల విదళించి ఆతని హృదయమున నెనలేని రాగబంధమును కూర్చుచున్నది. మునుల హృదయమునమాత్ర మిందులకు వ్యతిరేకము సేయుచున్నది. అనగా వారికి ఎనలేని ధీరత్వమును -- విరాగమును కలిగించుచున్నదని భావము.

**జన్తోః స్వకృత్యగణమతో జగదిద్యతాం చ**
**తేజస్వితాం చ నిశితాం చ మతిం సభాయాం**
**కామాక్షి మాక్షికఝరీమివ వైఖరీం చ**
**లక్ష్మీం చ పక్ష్మలయతి క్షణ మీక్షణం తే||** ౬౨

నిముసము దృష్టిమేష మిది నీయది నీకడ ప్రాలు జీవియుం
దమలయశస్వితన్ మఱి మహస్వితయున్ మతిసూక్ష్మతన్ సభా
గ్రముల నమందవైఖరి మరందఝరీకృతమాధురీసమ
క్రమత నఖండలక్ష్మియు విరక్తియుఁ బక్ష్మలిత మ్మొనర్చెడిన్.

నీ కటాక్షము నిమిషమాత్రము నీదరిని వ్రాలి యొక్కమారైన నమస్కరించు జీవికి తేజస్సును, సభారంగములయందు నిశితమైనబుద్ధిని, తేనెవాక కెనయైన వైఖరిని (వాక్సరియన్నమాట) అఖండలక్ష్మిని, సకలజగత్ప్రశస్తిని పెంపొందింపఁ జేయుచున్నది.

కాదంబినీ కి మయతే న జలానుషంగం
భృంగావళీ కి మురరీకురుతే న పద్మమ్
కింవా కలిన్దతనయా సహతే న గంగామ్
కామాక్షి నిశ్చయపదం న తవాక్షిలక్ష్మీః|| ౭౩

అది కార్మబ్బుల గుంపె యందుమ జడాసంగమ్మునుంబొంద ద
య్యది భృంగావళియౌన కైకొనదుపో ఆ పద్మసౌందర్య మ
య్యది కాళిందియ నీ కటాక్షరమ యౌనా గంగ నొక్కింతనై
పద రాకున్నది నిశ్చయమ్మునకు నంబా ! తచ్చరిత్ర మ్ముమా.

నీ కటాక్షశోభ కాదంబిని (మేఘపంక్తి) అగునా యని భావించినచో మేఘ పంక్తి జడ+ ఆసంగము = నీటితోడి చేరిక పొందునది. నీ కటాక్షము జడులతో కలయికపొందనిది. నీ చూపు తుమ్మెదలపంక్తి యగునందుమా యది పద్మమును ఆమోదించును. నీ చూపు పద్మమును నిరసించును. ఇఁక నీ అపాంగము కాళింది యనుకొందుమా యది గంగ యెడ సహనము చూపును. నీ చూపు స్వచ్ఛత్వ ములో నా గంగను సహింపదు. ఈ విధముగా నీ కటాక్షసౌందర్యము పోలిక ఒక నిశ్చయమునకు అవకాశము లేనిదై యున్నది.

కాకోలపావకతృణీకరణేఽపి దక్షమ్
కామాక్షి బాలకసుధాకరశేఖరస్య
అత్యన్తశీతలతమోఽ ప్యనుపారతం తే
చిత్తం విమోహయతి చిత్రమయం కటాక్షః|| ౭౪

నిరుపమ దుర్విషానలతృణీకరణంబున దక్షుడౌ సుధా
కరశిశుమౌళి మానస మకంప్యము దానినిగూడ మోహని
ర్భరదశ ముంచుచున్నది స్వభావ సుశీతలచారుభావ వి
స్ఫురణము నీ కటాక్షమిది చూడ విచిత్రముగాదె శాంభవీ !

మిక్కిలిచల్లనగు నీ కటాక్షము ఘోరవిషాగ్నిని దృణీకరించుటలో కడుదిట్టమగు చంద్రరేఖావతంసుని మనస్సునుగూడ మోహపడునట్లు (తబ్బిబ్బుపడునట్లు) చేయు చున్నది. ఇది చాల యాశ్చర్యము గూర్చు విషయము.

కార్పణ్యపూరరసవర్ధిత మమ్బు మోహ
కన్దోద్గతం భవమయం విషపాదపం మే
తుంగం ఛినత్తు తుహినాద్రిసుతే భవత్యాః
కాఞ్చీపురేశ్వరి కటాక్షకుఠారధారా॥ ౬౫

ఈశ్వరి చెండుఁగావుతఁ ద్వదీయకటాక్షకుఠారధార కాం
చీశ్వరి మా భవాఖ్య విషవృక్షము నంచితమోహకందమున్
శశ్వదభిప్రవృద్ధము నిసర్గమహాగ్రహవారిచేత నో
విశ్వహితైకతోషిణి ! పవిత్ర హిమాద్రికులైకభూషిణీ !

నీ కటాక్షమనెడి గండ్రగొడ్డలియంచు మోహమను దుంపనుండి మొలచి, అహం కార రససేకముచే శాఖోపశాఖలుగ పెఱిగిన నా సంసారమనెడి విషవృక్షమును వెంటనే ఖండించుగాక !

కామాక్షి ఘోరభవరోగచికిత్సనార్థ
మభ్యర్థ్య దేశికకటాక్షభిషక్ప్రసాదాత్
తత్రాపి దేవి లభతే సుకృతీ కదాచి
దత్యన్తదుర్లభ మపాంగమహౌషధం తే॥ ౬౬

గురుకరుణాకటాక్షమను గొప్పభిషగ్వరు సుప్రసాదవి
స్ఫురణను గోరి ఘోరభవమూర్ఛచికిత్సను బుణ్యుఁడేఁడొ యొ
క్కరుఁడు లభింపఁ జేసికొనఁగల్గును దుర్లభమైనదాని నీ
శ్వరి తుద కెప్పుడో భవదపాంగమహౌషధమున్ నగాత్మజా !

గురుకటాక్షమనెడి వైద్యుని యనుగ్రహము నొంది ఘోరసంసారరోగ చికిత్సకు డెవడో యొక పుణ్యుడు ఎప్పటికో యొకప్పటికి అత్యంత దుర్లభమైన నీ కటాక్ష మహౌషధము నడిగి పడయగలడు.

కామాక్షి దేశికకృపాంకురమాశ్రయన్తో
నానాతపోనియమనాశితపాశబన్ధాః
వాసాలయం తవ కటాక్ష మముం మహాన్తో
లబ్ధ్వా సుఖం సమధియో విచరన్తి లోకే॥

గురుకరుణాంకురమ్ము తమకుం గల దిక్కని యెంచి పల్లవ
స్ఫిర నియమాళిఁ బాశములు ద్రెంచి వడిన్ సమబుద్ధులై భవత్
పరమకటాక్ష మంచితనివాసగృహంబుగ గాంచిఁ గాంచి య
న్నరవరు లీ యశేషభువనాన సుఖానఁ జరింతు రమ్మరో !

గురుకరుణాంకురమును తమకు దిక్కుగా గొని బహువిధ తపోనియమములచే సంసారపాశములను ద్రెంచుకొని నీ కటాక్షమనెడి వాసగృహమును బడసి మహానుభవులు సమబుద్ధులై (బ్రహ్మానుసంధానపరులై) లోకమున సుఖముగ సంచరింతురు.

సాకూతసంలపితసంభృతముగ్ధహాసం
వ్రీడానురాగసహచారి విలోకనం తే
కామాక్షి కామపరిపన్థిని మారవీర
సామ్రాజ్యవిభ్రమదశాం ప్రకటీకరోతి||

మాత ! భవత్కటాక్షము సమమ్ముగ సిగ్గును రాగ మూని సా
కూతములైన పల్కులకు కుల్కుల కెత్తిన ముగ్ధహాస మిం
పై తులకింపఁ గామరిపునం దసమాయుధవీరరాజ్య సం
జాత మదభ్రవిభ్రమదశాపరిపాకము చాటు నీయెడన్.

సాభిప్రాయములైన పలుకులతో కూడిన మృదుమధురమైన మందహాసముతో దులకించుచు సిగ్గుతో ననురాగముతో గులికెడు నీ చూపు మన్మథవీరసామ్రాజ్యవిలాసదశను చాటుచున్నది.

కామాక్షి విభ్రమబలైకనిధి ర్విధాయ
భ్రూవల్లిచాపకుటిలీకృతమేవ చిత్రమ్
స్వాధీనతాం తవ నినాయ శశాంకమౌలే
రఙ్గార్ధరాజ్యసుఖలాభ మపాంగవీరః||

భ్రూలతయన్నదివ్యధనువున్ వడి వంచి భవత్కటాక్షమన్
మేలిభటుండు చిత్ర మిదె మేకొని చారువిలాససైనిక
శ్రీలను నీ వశమ్ము పొనరించెడు నర్ధశశాంకమౌళి సా
బాలగు నంగరాజ్యసుఖపాక మపూర్వపరాక్రమంబునన్.

నీ కటాక్షమనెడి యోధుఁడు కనుబొమలనెడి దివ్యధనువును వంచి విలాసబలసంపన్నుడై చంద్రశేఖరుని అర్ధాంగరాజ్యసుఖలాభమును నీ కైవసము చేయుచున్నాడు. ఇది యత్యద్భుతము.

కామాంకురైకనిలయ స్తవ దృష్టిపాతః
కామాక్షి భక్తమనసాం ప్రదదాతి కామాన్
రాగాన్విత స్స్వయమపి ప్రకటీకరోతి
వైరాగ్యమేవ కథ మేష మహామునీనామ్|| ౭౦

వలపులు మొల్క లెత్తు త్వదపాంగము భక్తమనోగతంబులౌ
వలపులనెల్లఁ గూర్చు శివభామిని రాగముఁ దాను బూనియున్
గొలువు విరాగమున్ మునులకున్ గతమేమొకొ యద్భుతాద్భుత
మ్ముల భవదీయవృత్తములు భూధరరాజకుమారి ! శాంకరీ ?

నీ కటాక్షము కామాంకురమునకు (మన్మథుడను మొలకకు) ఆశ్రయమైనకతన భక్తచిత్తములకు సకలకామముల నొసంగుచున్నది. తాను రాగముతో గూడియు మహామునులకు వైరాగ్యమును ఎట్లు ప్రకటించుచున్నదో !

కాలాంబువాహనివహైః కలహాయతే తే
కామాక్షి కాలిమమదేన సదా కటాక్షః
చిత్రం తథాపి నితరా మముమేవ దృష్ట్వా
సోత్కంఠ ఏవ రమతే కిల నీలకణ్ఠః|| ౭౧

తొలకరి కారుమబ్బుగమితో భవదీయకటాక్ష మెప్పుడున్
గలహములాడుఁ గార్నలుపునన్ మదమెక్కి; యటైన నృత్యమిం
పెలయ నొనర్చు దీని బరికించి యెదం దమకించి యొంతయున్
జెలగుచు నీలకంఠనటశేఖరు డంచితచాంద్రకద్యుతిన్.

కామాక్షీ ! నీ కటాక్షము నలుపువలన గర్వముచే నెల్లప్పుడు కాఱుమేఘములతో కయ్యములాడుచున్నది. అయినను దీనిని చూచి వేడుకగొని నీలకంఠమూర్తి (నెమలి) పురివిచ్చి యాడుచు ఉల్లాసపడుచుండును. (చంద్రరేఖ కాంతితో గుల్కుచు శ్లేష) ఇది యాశ్చర్యము !

కామాక్షి మన్మథరిపుం ప్రతి మారతాప
మోహాన్ధకారజలదాగమనేన నృత్యన్
దుష్కర్మకంచుకికులం కబలీకరోతు
వ్యామిశ్రమేచకరుచి స్త్వదపాంగకేకీ||

స్మరరిపుఁగూర్చి క్రమ్ముకొను మన్మథతాపవిమోహరూపమ
బ్బురమగు మబ్బునన్ నటనముం బొనరించుచు జారుమేచక
స్ఫురణము గన్న నీదుకొనచూపనునట్టి మయూరరాజ మ
మ్మరా ! కబళించుఁగావుత మమందమహాదురితోరగావళిన్.

నలుపురంగుతో గూడిన నీ కటాక్షమను నెమలి అనంగవైరింగూర్చి మన్మథ తాప మోహాంధకారమనెడి మబ్బు గ్రమ్మినవేళ నృత్యముసేయుచు పాపకర్మమను సర్పకులమును కబళించుగాక !

**కామాక్షి మన్మథరిపో రవలోకనేషు**
**కాన్తం పయోజమివ తావక మక్షిపాతమ్**
**ప్రేమాగమో దివసవ ద్వికచీకరోతి**
**లజ్జాభరో రజనివ న్ముకులీకరోతి॥** 83

స్మరహరుచూపులందుఁగడుసొంపులుగుల్కెడు నీదు చూపు నా
సరసిజముల్ పవల్వలెను జక్కని యయ్యనురాగయోగ మ
చ్చెరువొనరించి మించి వికసింపఁగఁజేసెదు; నంతమీఁద రా
తిరివలె సిగ్గుపెం పదియు దేవి ! వడిన్ ముకుళింపఁజేసెడిన్.

స్మరవైరి చూపులందు మిక్కిలి సొంపుగుల్కెడు నీ చూపు పరమ శివుని యనురాగమను చక్కని పద్మమును బగటివేళవలె వికసింపజేయుచున్నది. అటుపైని సిగ్గు రాత్రివలె దానిని ముకుళింపఁజేయుచున్నది.

**మూకో విరించతి పరం పురుషః కురూపః**
**కందర్పతి త్రిదశరాజతి కింపచానః**
**కామాక్షి కేవల ముపక్రమకాల ఏవ**
**లీలాతరంగితకటాక్షరుచః క్షణం తే॥** 84

సరసవిలాసభాసుర నిసర్గ కృపారసవీచికా పరం
పరితభవత్కటాక్షరుచి పైకొనినట్టి క్షణమ్ములోననే
యరయఁగ మూఁగవాఁడు చతురాననుఁడౌ నవమన్మథుండగున్
బరమకురూపియేని సురనాథుఁ డగుంగదె పుట్టులోభియున్.

అమ్మ ! నీ విలాసతరంగిత కటాక్షప్రభలు క్రమ్మికొనుటకు ఉపక్రమించిన క్షణములోనే మూఁగవాఁడుగూడ చతురాస్యుడు (బ్రహ్మయంతవాఁడు) కవితాచాతుర్యము విలసిల్లు ముఖముగలవాఁడగును. పరమకురూపిగూడ నవమన్మథుఁడగును. పేసిని గొట్టు గూడ దేవేంద్రుడగును.

నీలాలకా మధుకరన్తి మనోజ్ఞనాసా
ముక్తారుచః ప్రకటకన్దబిసాంకురన్తి
కారుణ్య మంబ మకరన్దతి కామకోటి
మన్యే తతః కమలమేవ విలోచనం తే|| ౭౫

మురిపెపు నడ్డబాస తెలిముత్తెపు కాంతులు తమ్మిదుంపయం
దొరయు బిసాంకురమ్ము లగుచున్నవి, యాపయి నల్లనైన ముం
గురులుమిళిందబృందములగున్, దయయున్ మకరందమయ్యెడిన్
సరసిజమున్ ద్వదీయనయన మ్మనుకొందును దల్లి ! యందుచేన్.

అడ్డబాస ముత్యపుకాంతులు తామరదుంపనుండి వెడలు లేదూండ్లగుచున్నవి. కరుణ తేనె యగుచున్నది. నల్లనిముంగురులు తుమ్మెదలగుచున్నవి. కాఁబట్టి నీ చూపు కమలమే యని భావించుచున్నాను.

అకాఙ్క్ష్యమాణఫలదానవిచక్షణాయాః
కామాక్షి తావకకటాక్షకకామధేనోః
సంపర్క ఏవ కథ మమ్బ విముక్తపాశ
బన్ధాః స్ఫుటం తనుభృతః పశుతాం త్యజన్తి|| ౭౬

కోరుఫలమ్ము లెల్ల యొసఁగూర్ప విచక్షణమైన నీదు శృం
గార కటాక్షవీక్షణము నాఁజను చక్కని కామధేనువుం
జేరినమాత్ర జీవులు విచిత్రమిదేమొకొ ! పాశబంధ మ
వ్వారిగ నీగి పైని పశుభావము బాయుచునున్నవా రుమా !

కోరినఫలములెల్ల నీయఁగలిగిన నేర్పుగన్న నీ కటాక్షమను కామధేనువుయొక్క సంపర్కమాత్రమున శరీరధారులు పాశబంధరములనుండి విడివడి పశుత్వమును వీడుచున్నారు. ఇది యెందుచేతనో ! కామధేనురూపమైన పశువుతోడి సంబంధమున బంధమునఁ గట్టుపడుటయు పశుత్వమును గలుగవలసియుండగా నిచ్చట తద్విరుద్ధము జరుగుట చిత్రమని భావము.

సంసారఘర్మపరితాపజుషాం నరాణాం
కామాక్షి శీతలతరాణి తవేక్షితాని
చన్ద్రాతపన్తి ఘనచన్దనకర్దమన్తి
ముక్తాగుణన్తి హిమవారినిషేచనన్తి॥ ౭౭

తల్లి ! భవమ్ము పేరిటి నిదాఘముచే నుడికిల్లువారికిన్
జల్లని పండువెన్నెలల జాలగు గందపుముద్ద యౌను బై
నల్లిన ముత్తియంపు సరు లయ్యెడు నించిన మంచునీటి పె
న్వెల్లువ లయ్యెడిం గదవె నీ కొనచూపు లగాధిరాట్సుతా !

చల్లని నీ కటాక్షములు సంసారమను వేసవిచే నుడుకెత్తినవానియందు వెన్నెలలగుచున్నవి. చందనసాంద్రకర్దమములగుచున్నవి. ముత్యాలదండలగుచున్నవి. పన్నీటి జల్లులగుచున్నవి.

ప్రేమామ్బురాశిసతతస్నపితాని చిత్రం
కామాక్షి తావకకటాక్షనిరీక్షణాని
సన్ధుక్షయన్తి ముహు రిన్ధనరాశిరీత్యా
మారద్రుహో మనసి మన్మథచిత్రభానుమ్॥ ౭౮

జలకములాడి రాగమను సాదరవీచికలందునన్ రగు
ల్గొలుపు స్మరారి చిత్తమునఁ గొండొక మన్మథవహ్ని నింధనం
బులవెనుమోపులట్టులయి పొల్పగు నీ గడగంటివాలుఁ జూ
పులు బహుచిత్రమమ్మ యిది భూధరరాజకుమారి ! శాంకరీ !

ప్రేమయను సముద్రమున నెడతెగక తోఁగిన నీ కటాక్షములు కామవైరి మనసులో మదనాగ్నిని పెనుకట్టెమోపులవలె మాటిమాటికి రగుల్కొల్పుచున్నవి. ఇది యత్యాశ్చర్యము.

కాలాఞ్జనప్రతిభటం కమనీయకాన్త్యా
కన్దర్పతన్త్రకలయా కలితానుభావమ్
కాఞ్చీవిహారరసికే కలుషార్తిచోరం
కల్లోలయస్వ మయి తే కరుణాకటాక్షమ్॥ ౭౯

పగయయి నల్లకాటుకను భాసిలుకాంతికిఁ గామశాస్త్ర మం
దగు కళలో విలాస మెనయుంగవి పాపవికారచోరమై
తగు కరుణాకటాక్షమును దల్లిరో ! నాపయి నుత్తరంగితం
మ్మగు నటు సేయుఁ గాంచినగరాగ్ర విహారరసైక చాతురీ !

చక్కని కాంతిచే నల్లకాటుకకు ప్రతిభటమై కామశాస్త్రకళచే నాకలితమొనరించుకొన్న విలాసములు కలదియై పాపమును హరించునదై యొప్పు నీ కరుణాకటాక్షము నాపై తరంగితమగునట్లు ఓ కాంచీనగరవిహార రసజ్ఞా ! యొనరింపుము.

క్రాంతేన మన్మథమదేన విమోహ్యమాన
స్వాంతేన చూతతరుమూలగతస్య పుంసః
కాంతేన కించి దవలోకయ లోచనస్య
ప్రాంతేన మాం జనని కాఞ్చీపురీవిభూషే॥ ౮౦

కాంత మహో ! లతాంతశరగర్వనిరంతరమైనలోచన
ప్రాంతముచేతఁ జూతపతి స్వాంతము సంతత మోహవిభ్రమా
క్రాంతమొనర్చు వట్టికడగన్నున నన్నుపఁ గాంచు తల్లి ! కం
పాంతరవర్తి కాంచినగరైకవిభూష ! హిమాద్రికన్యకా !

మిగుల మనోహరమైన మన్మధమదముచే ఏకామ్రతరుమూలమున వసించు పురుషునకు సమ్మోహనమై యలరు నీ లోచనప్రాంతముచే నో కాంచీపుర విభూషణమా ! నీ బిడ్డను నన్నొకింత దయతో నాలోకింపుము.

కామాక్షి కేఽపి సుజనా స్త్వదపాఙ్గసంగే
కంఠేన కన్దలితకాలిమసంప్రదాయాః
ఉత్తంసకల్పితచకోరకుటుమ్బపోషా
నక్తందివప్రసవభూానయనా భవన్తి॥ ౮౧

సరసులు నీ యపాంగరుచి సంగతి నుందురు కంఠసీమ న
బ్బురముగ కందళించు నలుపుందన మందలి సంప్రదాయమున్
దరిసి కిరీటమట్లు తలదాల్చి చకోరకుటుంబపోషణ
స్ఫురణము రేఁబవళ్ళ తొలిపుట్టువులౌ కనులూని యెవ్వరో.

ఒకానొక పుణ్యశీలు రెవరో నీ కటాక్షసంగముచేత కంఠమునందు కందళించు నలుపుందనమందలి సంప్రదాయమును బడసి చకోరకుటుంబపోషణమును (చంద్రబింబమును) కిరీటముగ దలదాల్చి రాత్రింబవళ్ళకు పుట్టిండ్లను (సూర్యచంద్రబింబములను) చూపులుగగొని విలసింతురు. అనగా శివసారూప్య సిద్ధినందుదురని భావము.

నీలోత్పలప్రసవ కాన్తినిదర్శనేన
కారుణ్యవిభ్రమజుషా తవ వీక్షణేన
కామాక్షి కర్మజలధేః కలశీసుతేన
పాశత్రయా ద్వయ మమీ పరిమోచనీయాః|| ౮౨

తల్లిరో ! కల్వపూలనగు తళ్కుల కొక్క నిదర్శనంబు, ఉ
త్ఫుల్ల కృపావిలాసమయి పొల్చుచు కర్మమహోబ్ధిపాల శో
భిల్లు నగస్త్యమూర్తి యయి వెల్గెడు నీదగు చూపుచేత మ
మ్మెల్లర ముక్తులం జలుపవే విదళించుచు మూడుపాశముల్.

కల్వపూవులకాంతి కొక యుదాహరణమై కరుణావిలాసభరితమై కర్మమను సముద్రముపాలిటికి నగస్త్యమూర్తియై యలరెడు నీ చూపుచేత మమ్ము పాశత్రయ విముక్తులం గావింపుము.

అత్యన్తచఞ్చల మకృత్రిమ మఞ్జనం కిం
ఝంకారభంగిరహితా కిము భృఙ్గమాలా
ధూమాఙ్కురః కిము హుతాశనసఙ్గహీనః
కామాక్షి నేత్రరుచినీలిమకన్దలీ తే|| ౮3

ఎంతయుఁ జంచలమ్మది యకృత్రిమ మంజనమౌనొ ? లేక య
త్యంతము ఝుంకృతుల్ దొలఁగి యల్లన మూఁగెడు తేంట్లగుంపులా ?
సుంతయు నిప్పులేని పొగసొంపును గాదుగదమ్మ ! సంశయా
క్రాంతము త్వద్దృగంతరుచికందళి యో శివకాంత ! చెప్పవే.

నీ మనోహరకటాక్షమందలి నలుపుమొలక మిక్కిలి చంచలమైన అకృత్రిమమైన కాటుకయా ? లేక ఝుంకారములు సేయక మూగెడి తుమ్మెద పంక్తియా ? అదియుగాక నిప్పులేని వట్టి పొగకాదు గదా ? అనుమానమగుచున్నది.

కామాక్షి నిత్య మయ మఞ్జలి రస్తు ముక్తి
బీజాయ విభ్రమమదోదయఘూర్ణితాయ
కందర్పదర్ప పునరుద్భవసిద్ధిదాయ
కల్యాణదాయ తవ దేవి దృగఞ్చలాయ||

నిచ్చలు నంజలింౘెదను నీ నయనాంచలవీథి కంబ ! య
త్యుచ్చయకామగర్వ పునరుద్భవసిద్ధిదమైనదానికిన్
రెచ్చిన విభ్రమమ్ము మదరీతిని ఘూర్ణిలునట్టిదానికిన్
ముచ్చట నచ్చపుం గరుణపొంగున మంగళ మిచ్చుదానికిన్.

కాముని గర్వమునకు పునర్జన్మసిద్ధిని అనుగ్రహించునట్టి విలాసమదసమృద్ధిచే ఘూర్ణిల్లునట్టిది, కరుణారసముప్పొంగ కళ్యాణములను సమకూర్చునదియు నగు నీ చక్కని కటాక్షమునకు దేవీ ! నమస్కరించెదను.

దర్పాఙ్కురో మకరకేతనవిభ్రమాణాం
నిన్దాఙ్కురో విదలితోత్పలచాతురీణామ్
దీపాఙ్కురో భవతమిస్రకదమ్బకానాం
కామాక్షి పాలయతు మాం త్వదపాఙ్గపాతః॥ ౮౫

అదియొక గర్వమంకురమ యమ్మ కరధ్వజవిభ్రమాళి, క
య్యదియొక దీపపుంగళిక యాత్తభవాంధతమిస్రపాళి, క
య్యదియొకపాటినింద విరియంజను కల్వలనేర్పుపాళి, క
య్యది త్వదపాంగరేఖ కమలాక్షి ననుం దయ నేలుగావుతన్.

అది మన్మథుని విలాసములకు గర్వాంకురము. అది వికసించిన కలువల చాతుర్యములకు నిందాంకురము. సంసారాంధకారపటలమునకు దీపాంకురము. అట్టి నీ కటాక్షప్రసారము నన్ను బాలించునుగాక !

కైవల్య దివ్యమణిరోహణ పర్వతేభ్యః
కారుణ్యనిర్ఝరపయః కృతమజ్జనేభ్యః
కామాక్షి కింకరితశంకరమానసేభ్య
స్తేభ్యో నమోఽస్తు తవ వీక్షణవిభ్రమేభ్యః॥ ౮౬

మోక్షము పేరి దివ్యమణిపొల్చెడు రోహణశైలపాళికిన్
శిక్షితకింకరాయిత వశీకృతశంకర హృత్పదాళికిన్
లక్షిత సత్కృపారసవిలాస నిమజ్జనకేళికిన్ భవ
ద్వీక్షణ విభ్రమాళి కివె వేమరు నా నతు లౌనుగావుతన్.

మోక్షమను దివ్యమణి మొలచుటకు రోహణపర్వతములైనవి, కరుణయను సెల యేటి ధారలలో నిమగ్నములైనవియు శంకరుని మనస్సును దమకు గింకరుని యొనర్చుకొన్నవియు నగు నీ వీక్షణవిలాసములకు నమస్కారము.

యు ఏవ నవ ముత్పల మమ్బ ! హీనా
మీనస్య వా సరణి రమ్బురుహాం చ కిం వా
దూరే మృగీ త దసమఞ్జస మఞ్జనం చ
కామాక్షి వీక్షణరుచౌ తవ తర్కయామః॥ ౮౭

అలుపమ నల్లగల్వ, కడునల్పము చేఁపయు తమ్మిపూవు న
ప్పొలు పిఁక యాడులేఁడి నిలుపుంగననేరదు చూపుమేర మి
క్కిలి యసమంజసమ్మ యిదె కేవల మంజనమంచు తర్కమున్
జలిపెదమమ్మ నీ కనుల చక్కనినీటు గణించి పార్వతీ !

క్రొత్త కలువపూవు నీ కనుల నెఱినీటుకడ నల్పము. చేఁపయు నంతకంటె నల్పాల్పము. తామరపువ్వు నాపాటియు. ఇఁక ఆడులేడి నీ చూపుమేరనే నిలువఁబడదు. అంజనము (కాటుక) మిక్కిలి యసమంజసము అని నే నూహించుచున్నాను.

మిశ్రీభవద్గరలపఙ్కిలశఙ్కరోర
స్సీమాఙ్గణే కిమపి రింఖణ మాదధానః
హేలావధూత లలిత శ్రవణోత్పలోఽసౌ
కామాక్షి బాల ఇవ రాజతి తే కటాక్షః॥ ౮౮

గరళముచేత పంకిలతగాంచిన శంకరు నయ్యురస్థలిన్
గర మటు గంతువెట్టుచును గాంతివిలాసములన్ శ్రవఃపుటాం
తర పరిక్లప్త ముత్పలముఁ దా నదిరా ! యెగమీటుచున్ భవ
త్పరమకటాక్షమన్న చిరుపాపఁడు దా నిట నాటలాడెడున్.

గరళముచేఁబంకిలమైన త్రిపురహరుని వక్షఃస్థలముపై నెగిరెగిరిపడుచు తన కాంతి విలాసములచే చెవియాకుగ గైసేసిన నల్లగలువ నెగమీటుచు నీ మనోహర కటాక్షమను బాలకుడు చక్కఁగ నాటలాడుచున్నాడు.

ప్రౌఢీకరోతి విదుషాం నవసూక్తిధాటీ
చూతాటవీషు బుధకోకిలలాల్యమానామ్
మాధ్వీరసం పరిమలం చ నిరర్గలం తే
కామాక్షి వీక్షణవిలాస వసంతలక్ష్మీః॥ ౮౯

లలిత కటాక్షవీక్షణ విలాసవసంతరమావధూటి యిం
పలరెడి సూక్తిధాటియను నామ్రమహాటవిఁ బండితాళి కో
కిల లయి మెచ్చి క్రోఁల దమకించెడి తేనెలధారలన్ నిర
ర్గళశుభవాసనల్ దిటవుగా నిడి విందిడు ధన్యపాళికిన్.

నవ్యనవ్యములైన సూక్తుల ధాటియను తీయమామిడితోటలందు నీ వీక్షణ విలాసము వసంతఋతుశోభ గని పండితులనెడి కోకిలలు మిగుల నుబలాటపడు తేనెలను పరిమళమును నిరర్గళముగ వారికి విందువెట్టుచున్నది. అనగా మధురకవితను శుభవాసనలను గూర్చు నన్నమాట.

కూలంకషం వితనుతే కరుణామ్బువర్షీ
సారస్వతం సుకృతిన స్సులభం ప్రవాహమ్
తుచ్ఛీకరోతి యమునామ్బు తరఙ్గభఙ్గీం
కామాక్షి కిం తవ కటాక్షమహామ్బువాహః|| ౮౦

జననీ ! నీదు కటాక్షమేఘము కృపాసారంబు వర్షించుచున్
గొని సారస్వతమన్ ప్రవాహ మిదిగో కూలంకషంబుం బొన
ర్చును బుణ్యాత్ముల కందుబాటగునటుల్; శోభిల్లు నయ్యామునాం
తనటచ్చారుతరంగభంగిఁ దగునా ! తాఁ జిన్నవోఁజేసెడిన్.

నీ కటాక్షమనెడి మహామేఘము కరుణరసము వర్షించుచు సుకృతులైనవారికి మాత్రము సులభమైయుండు సారస్వతప్రవాహమును కూలంకషముగ నొనరించుచున్నది. అట్టి మేఘము యమునాజలతరంగభంగిని తుచ్ఛమును గావించుచున్నది; ఎందుచేత ? మేఘము ఒకచో ప్రవాహము నుప్పొంగజేసి మఱొక్కయెడ క్రుంగజేయుట విరుద్ధమని చమత్కారము. దేవీకటాక్షము యమునకంటె నెక్కుడు నల్లగా నున్నదని భావము.

జాగర్తి దేవి కరుణా శుకసున్దరీ తే
తాటఙ్కరత్నరుచి దాడిమఖణ్డశోణే
కామాక్షి నిర్భర కటాక్షమరీచిపుఞ్జ
మాహేన్ద్రనీలమణిపంజరమధ్యభాగే|| ౮౧

పొలుచు భవత్కటాక్షరుచిపుంజమునాఁజను నింద్రనీల మం
జులమగు రత్నపంజరముచోటున నీ చెవికమ్మతళ్కులం
దొలసెడు రత్నకాంతు లవియున్ యెర దానిమగింజ లట్లుగన్
సొలయుచు నీ కృపాఖ్యశుకసుందరి సుందరి ! కుల్కు నయ్యెడన్.

ఓ శివసుందరీ ! తాటంకరత్న కాంతులనెడి దానిమ్మగింజలచే నెఱ్ఱనై యొప్పు నీ కటాక్షకాంతిపుంజమనెడి ఇంద్రనీలమణి పంజర మధ్యభాగమున నీ కరుణయను పెంటి రాచిలుక కులుకుచున్నది.

కామాక్షి సత్కువలయస్య సగోత్రభావా
దాక్రామతి శ్రుతి మసౌ తవ దృష్టిపాతః
కిం చ స్ఫుటం కుటిలతాం ప్రకటీకరోతి
భ్రూవల్లరీపరిచితస్య ఫలం కి మేతత్|| ౯౨

కువలయ సాధుపాళికి సగోత్రత గాంచుట నీదు చూపు వై
భవ మిది యాక్రమించె శ్రుతిపార మదైనను నైజవక్రతన్
దవిలి స్ఫుటమ్ముగన్ బ్రకటన మ్మొనరించెడునమ్మ భ్రూలతా
వ్యవసితమైన యప్పరిచయమ్ము ఫలమ్మిది యేమొ చెప్పవే !

ఉత్తమమైన కువలయమునకు సగోత్రభావ మొనగూడుటవలననే నీ కటాక్షము శ్రుతినాక్రమించుచున్నది. అనఁగా నీచూపు ఆకర్ణాంత విశ్రాంతమైనదని తాత్పర్యము. శ్లేష--సత్ + కువలయస్య = పుణ్యభూవలయమునకు అనగా పుణ్యభూమిలో జన్మించిన జనులయొక్క సగోత్రభావాత్ = సగోత్రభావమ్మువలన శ్రుతిమ్ = వేదమును; అక్రామతి = ఆక్రమించుచున్నది. పవిత్రమగు ఆర్యావర్తమున జన్మించిన ఉత్తమగోత్రులు వేదసంపన్నులగుట యుచితమన్నమాట. అట్టిదయ్యు నీ చూపు కుటిలతను స్పష్టముగ బ్రకటించుచున్నది. వంకరలగు కనుబొమలతోడి పరిచయమున కిది ఫలమా యేమి ?

ఏషా తవాక్షిసుషమా విషమాయుధస్య
నారాచవర్షలహరీ నగరాజకన్యే
శఙ్కే కరోతి శతధా హృది ధైర్యముద్రాం
శ్రీకామకోటి యదసౌ శిశిరాంశుమౌళేః|| ౯౩

అదె భవదీయనేత్రరుచి యవ్విషమాయుధ బాణవర్ష సం
పద యయి జాలువారెనని భావన సేసెదఁ గామకోటి ! యె
య్యదనున నో నగేంద్రతనయా ! శిశిరాంశుకిరీటు దిట్టమౌ
హృదయము ధైర్యముద్ర నది యివ్విధిఁ దా విశదీకరించుటన్.

నీ నేత్రశోభ అవ్విషమాయుధు బాణవర్షప్రవాహమో యని శంకించుచున్నాను. అందుచేతనే యిది చంద్రశేఖరుని హృదయమందుగల ధైర్యముద్రను శతవిధముల ఖండింపఁగల్గుచున్నది.

బాణేన పుష్పధనుషః పరికల్ప్యమాన
త్రాణేన భక్తమనసాం కరుణాకరేణ
కోణేన కోమలదృశ స్తవ కామకోటి
శోణేన శోషయ శివే మమ శోకసింధుమ్॥ ౯౧

శోణము పుష్పచాపకృతశోభనబాణము కల్ప్యమాన సం
త్రాణ మపారచారు కరుణాభరణాయతలక్ష్మి కెల్ల ను
గ్రాణము కామకోటి ! బహురమ్యము కోమలమైన నీదు దృ
క్కోణముచేత నింకునటు గొల్పవె మామక శోకసింధువున్.

పుష్పబాణుని బాణము, భక్తచిత్తములకు రక్షణము గల్పించునది, కరుణకు నిధానము, అరుణవర్ణమును నైన నీ కోమల దృక్కోణముచే మదీయ దుఃఖసాగరము నింకింపుము.

మారద్రుహో మకుటసీమని లాల్యమానే
మన్దాకినీపయసి తే కుటిలం చరిష్ణుః
కామాక్షి కోపరభసా ద్వలమానమీన
సందేహ మఙ్కురయతి క్షణ మక్షిపాతః॥ ౯౨

చేకొని స్వామి దా మకుటసీమను లాలనముంబొనర్చు మం
దాకినిపైని వక్రగతి దాఁకి జరించుచుఁ గోపవేగ సం
వ్యాకులమౌచు మిట్టిపడు నయ్యొకచేఁప యటన్న సంశయ
మ్మీకడ నంకురింపఁ బొనరించెడి నీక్షణ మీక్షణ మ్ముమా !

మన్మథవైరి కిరీటసీమ కెక్కించుకొని లాలించు మందాకిని జలమునెడ వక్రగతిం జరించునదై యున్న నీ దృష్టి కోపవేగముచే నచ్చట మిట్టిపడు నొక చేపయేమో యన్న సంశయమును క్షణములో నంకురింపఁ జేయుచున్నది.

కామాక్షి సంవలితమౌక్తికకుణ్డలాంశు
చఞ్చత్ స్మితశ్రవణచామరచాతురీకః
స్తమ్భే నిరన్తర మపాఙ్గమయే భవత్యా
బద్ధ శ్చకాస్తి మకరధ్వజమత్తహస్తీ॥ ౯౩

ఒలసెదు ముత్తియంపురుచి నొప్పెడు కుండలకాంతితోడ ని
చ్చలు నెలనవ్వు దా శ్రవణచామరచాతురిఁ గుల్కుచున్ గడున్
దలకొను నీ యపాంగమను స్తంభమునం దనుబద్ధమౌచు మి
క్కిలి విలసిల్లు న మ్మకర కేతనగంధగజంబు తల్లిరో.

తల్లీ ! సుడిదిరుగు ముత్తియపు తళుకులచే నలరెడి కుండలముల కాంతితో నింపుగుల్కు నీ చిరునవ్వు కర్ణములనెడి చామరములయొక్క చాతుర్యముతో గూడినదై మకరధ్వజుని మదగజమై నీ కటాక్షమనెడి స్తంభమునందు నిరంతరము కట్టబడి మిక్కిలి శోభించుచున్నది.

యావత్కటాక్షరజనీసమయాగమ స్తే
కామాక్షి తావ దచిరా న్నమతాం నరాణామ్
ఆవిర్భవ త్యమృతదీధితిబిమ్బ మమ్బ
సంవిన్మయం హృదయపూర్వగిరీన్ద్రశృఙ్గే|| ౯౭

ఎంతట నీ కటాక్షమను నింపగు పున్నమరేయి వచ్చునో
యంతట నానతిం జలుపు నందఱియం దమృతాంశుబింబ మం
తంతట జ్ఞానరూపమనసై హృదయోదయపర్వతాగ్ర శృం
గాంతమునం దనంత నుదయ మ్మగు నో మదనాంతకప్రియా !

ఎంతటిలో నీ కటాక్షమను పూర్ణిమారాత్రి దార్శసిల్లునో యా క్షణమునందె నీదరిని వినతులగు భక్తబృందమునందు వారల మనసనెడి పొడుపుగొండశిఖరముపై జ్ఞానమనెడి చంద్రబింబము తనంత నుదయించును.

కామాక్షి కల్పవిటపీవ భవత్కటాక్షో
దిత్సు స్సమస్తవిభవం నమతాం నరాణామ్
భృఙ్గస్య నీలనలినస్య చ కాన్తిసంప
త్సర్వస్వమేవ హరతీతి పరం విచిత్రమ్|| ౯౮

ఆనతులైన ధన్యులకు నందఱి కన్నిధనంబు లీయఁగా
బూనిక గాంచి కల్పతరువుంబలె నీదుకటాక్ష మేలొకో
తాన హరించుచున్నదిగదా యళులందఱినల్వ గల్వలం
దైన యమూల్యకాంతిసిరియంతయు నెంతయు వింత యింతయున్.

తనయెడ వినతులైన ధన్యుల కందరికి నన్ని ధనంబుల నీయగలదియయ్యును నీ కటాక్షము తుమ్మెదయొక్కయు నల్లగలువయొక్కయు కాంతిసంపదలను దాన కొల్లగొనుచున్నది. ఇది యెంతయు జిత్రము.

అజ్ఞాతభక్తిరస మప్రసరద్వివేక
మత్యన్తగర్వ మనధీతసమస్తశాస్త్రమ్
అప్రాప్తసత్య మసమీపగతం చ ముక్తేః
కామాక్షి నైవ తవ కాఙ్క్షతి దృష్టిపాతః|| ౯౯

అనధిగతప్రపత్తి ననమార్గవిధిప్రసరద్వివేకు న
త్యనుపమగర్వధూర్వహు నహో ! యనధీతసమస్తశాస్త్రునిన్
అననుగతాత్మముక్తి ననవాప్తయథార్థు భవత్కటాక్ష మే
యనువుననైన నెందయిన నమ్మ వరింపదు కామలోచనీ !

ఓ కామాక్షీ ! నీ కటాక్షము అజ్ఞాత భక్తిరసనంపన్నుని, బ్రహ్మానందమురుచియెఱుగనివానిని ఆత్మనెఱుగనివానిని, యత్యంతగర్విని, శాస్త్రమును చదువనివానిని సత్యము నెఱుగనివానిని ముక్తిమార్గముసమీపమున లేనివానిని వరింపదు.

అత్యన్తశీతల మనర్గలకర్మపాక
కాకోలహారి సులభం సుమనోభి రేతత్
పీయూష మేవ తవ వీక్షణ మమ్బ కిం తు
కామాక్షి నీల మిద మిత్యయమేవ భేదః|| ౧౦౦

మూలము చల్వలన్నిఁటికిఁ బోల్చ ననర్గళకర్మపాకకా
కోలహరమ్ము నొచు దొరకున్ సుమనస్తతి కందుబాటుగన్
హేలగ నీదుచూ పమృతమే యనవచ్చును గాని రంగులో
బోలిచిచూడ నీల మిదెపో యొక కొంచెము భేద మమ్మరో !

అత్యంతశీతలము దుష్కర్మపరిపాకవిషమును హరించుచు నీ చూపు దేవసులభమైన పీయూషమే. అమృతమే కాని యిది నల్లనిదగుట యొక్కటి మాత్రమే భేదము.

పాతేన లోచనరుచే స్తవ కామకోటి
పోతేన పాతకపయోధి భయాతురాణామ్
పూతేన తేన నవకాఞ్చనకుణ్డలాంశు
వీతేన శీతలయ భూధరకన్యకే మామ్|| ౧౦౧

పోతము పాతకాబ్ధిఁ జడిపోయి భయాతురులైనవారికిన్
పూతము నవ్యకాంచన విభూషితకుండలమండలాంశు సం
వీతము నీ కటాక్షరుచివిస్ఫృతి భూధరరాజకన్య ! శ్రీ
మాతరొ ! దాన నన్ దనుపుమా కరుణామృతశీతలస్రుతిన్.

పాతకములనెడి సముద్రములో బడి భయాతురులైనవారికి నోడయై పవిత్రమై నవ్య మణికాంచనకుండలకాంతిమండితమై యొప్పు నీ శీతలకటాక్షప్రభాప్రసారముచే నో తుహినగిరిరాజకన్యా ! నన్నుఁ దనియింపుము.

ఇది కటాక్షశతకము సంపూర్ణము.

# మందస్మిత శతకము

బధ్నీమో వయ మంజలిం ప్రతిదినం బన్ధచ్ఛిదే దేహినాం
కందర్పాగమతన్త్రమూలగురవే కల్యాణకేలీభువే
కామాక్ష్యా ఘనసారపుంజరజసే కామద్రుహ శ్చక్షుషామ్
మందారస్తబకప్రభామదముషే మన్దస్మితజ్యోతిషే॥ ౧

కందర్పాగమతంత్రమూలగురువై కామారిమేల్చూపులన్
బొందౌ నచ్చపుఁబచ్చకప్రపురజఃపుంజమ్మునై జీవులన్
బందమ్ముల్ దెగఁద్రెంచు భద్రనిధియై వర్తిల్లు కామాక్షి త
న్మందస్మేరమనోజ్ఞహాసరుచికిన్ గైమోడ్తు మే మెప్పుడున్.

కామశాస్త్రమనెడి తంత్రమునకు మూలగురువు శుభములకు విలాస స్థానమును కామవైరి కన్నులకు పచ్చకప్పురపుపొడి మందారంపుపూగుత్తుల కాంతిగర్వమును దొంగిలించునదియు నగు కామాక్షియొక్క మందస్మిత ప్రకాశమునకు మేము అనుదినము కైమోడ్చెదము.

సధీచే నవమల్లికాసుమనసాం నాసాగ్రముక్తామణే
రాచార్యాయ మృణాలకాణ్డమహసాం నైసర్గికాయ త్విషే
స్వర్ధున్యా సహయుధ్వనే హిమరుచే రర్ధాసనాధ్యాసినే
కామాక్ష్యాః స్మితమంజరీధవలి మాద్వైతాయ తస్మై నమః॥ ౨

నవమల్లీ సహవాసి, నాసికతుదన్ రంజిల్లు ముక్తామణి
చ్ఛవి కాచార్యక మమ్మృణాళరుచిలో సాజంపుత ళ్కుందు వై
భవమర్ధాసనగంబు, గంగకెదు రంబా ! మందహాసమ్ము నాఁ
దవు పూగుత్తులతో నెసంగు పరమాద్వైతానకున్ నా నతుల్.

క్రొత్తమల్లికలకు సమానము అడ్డబాసముత్తియమునకు ఆచార్యకము (గురువు) తామరతూడుతళుకులకు స్వాభావిక మూలతేజస్సు గంగానదితో జగడ మాడునది చంద్రబింబముతో నర్ధాసన మధిష్ఠించునదియు నగు కామాక్షియొక్క మందహాస మంజరియొక్క తెలుపుతోడి యద్వైతమునకు నమస్కారము. అనగా నింతకన్న మించిన తెలుపు లేదని తాత్పర్యము.

కర్పూరద్యుతిచాతురీ మతితరా మల్పీయసీం కుర్వతీ
దౌర్భాగ్యోదయమేవ సంవిదధతీ దౌషాకరీణాం త్విషాం
క్షుల్లా నేవ మనోజ్ఞమల్లినికరా న్ఫుల్లానపి వ్యంజతీ
కామాక్ష్యా మృదులస్మితాంశులహరీ కామప్రసూ రస్తు మే|| 3

ఘనసారద్యుతిచాతురిం బలుచనంగావించి దౌషాకర
ప్రణుతశ్రీ కళలం దభాగ్యదశ సంపాదింపఁగం జాణలై
కనదుత్ఫుల్లమనోజ్ఞమల్లికలరేకన్ దెల్లవోఁజేయు చ
ల్లని నీ కోమలమందహాసలహరుల్ మా కోర్కె లీడేర్చుతన్.

పచ్చకప్పురపు తెలికాంతినిగ్గుల నవి యేపాటి యనునది. వెన్నెలయొక్క దుర దృష్ట రేఖను బయల్పఱచునది విరిసిన మల్లెపూలను దెల్లబోజేయునదియు నగు కామాక్షియొక్క కోమల మందహాసకిరణవైభవము మా పాలిటి కామధేను వగు గాక ! దోషాకరుడు = రాత్రిని చేయువాడు చంద్రుడు. (శ్లేష) దోషములకు స్థానమైనవాడు. కావున అతని కాంతులకు దౌర్భాగ్యదశకూర్చుట న్యాయమే.

యా పీనస్తనమండలోపరి లసత్కర్పూరలేపాయతే
యా నీలేక్షణరాత్రికాన్తితతిషు జ్యోత్స్నాప్రరోహాయతే
యా సౌన్దర్యధునీతరంగతతిషు వ్యాలోలహంసాయతే
కామాక్ష్యా శ్శిశిరీకరోతు హృదయం సా మే స్మితప్రాచురీ|| ౪

పొలుపగుపచ్చకప్పురపుఁబూతయగున్ గుచమండలాన వె
న్నెలచిఱుమొల్కయై కులుకు నీ నయనాఖ్య నిశాతమఃప్రభన్,
వెలసెడి యందమన్న నదివీచికఁ దూగెడు రాజహంస నాఁ
జెలువగు తల్లిలేనగవు నేరిమి నామది సల్ల సేయుతన్.

ఏ మందహాససమృద్ధి కామాక్షియొక్క వలుదచనుకట్టుపై పచ్చకప్పురపు పూత యగునో ఏది నల్లని కాటుక కన్నులనెడిరాత్రి యొక్క కాంతిపుంజములందు తరిపివె న్నెలయగుచుండునో యేది చక్కదనమనెడి యేటికెరటములయందు గదలు రాయంచ యయి తోచునో యట్టి కామాక్షిస్మితసమృద్ధి నా హృదయమును జల్లబఱచుగాక!

యేషాం గచ్ఛతి పూర్వపక్షసరణిం కౌముద్వతః శ్వైతిమా
యేషాం సంతత మారురుక్షతి తులాకక్ష్యాం శరచ్చన్ద్రిమాః
యేషా మిచ్ఛతి కమ్బుర ప్యసులభా మన్తేవసత్వక్రియాం
కామాక్ష్యా మమతాం హరన్తు మమ తే హాసత్విషామంకురాః|| ౫

కలువలయచ్చపుందళుకు గాంచును వేనికిఁ బూర్వపక్షతం
దుల సరితూగు నే సొబగుతో వలనై శరదిందుబింబ, మె
వ్వలనున శిష్యభావమొదవం జదువున్ దెలిశంఖ, మట్టి నీ
యెలనగవందుఁ గుల్కు రుచు లీశ్వరి ! మన్మమతన్ హరించుతన్.

తెల్లకలువయొక్క తెలుపు వేనికి పూర్వపక్షస్థానము బొందునో అనగా దానిని త్రోసి రాజనునో, శరత్కాలచంద్రుఁడు వేనితో నెల్లప్పుడు సరితూగునో, శంఖము కూడ వేనికడ దుర్లభమైన శిష్యపరిచర్య (శుశ్రూష) సేయ ముచ్చటపడునో, యట్టి కామాక్షియొక్క మందహాస ప్రభాంకురములు నా మమకారమును హరించుఁగాక !

ఆశాసీమసు సంతతం విదధతీ నైశాకరీం వ్యాక్రియాం
కాశానా మభిమానభంగకలనాకౌశల్య మాబిభ్రతీ
ఈశానేన విలోకితా సకుతుకం కామాక్షి తే కల్మష
క్లేశాపాయకరీ చకాస్తి లహరీ మందస్మితజ్యోతిషామ్|| ౬

నానాశాస్థలులం బొనర్చుచు శరన్నైశాకరవ్యాక్రియన్
బూనన్నేరిచి తెల్లుపూలసిరిపెంపుం డింపు నన్నేర్మి నీ
శానాలోకన మోహనమ్ములగు నీ చారుస్మితజ్యోతి రు
న్మానప్రాగ్రసరుల్ సుధాలహరు లస్మత్తాపమున్ బాపెడిన్.

సకలదిక్కులయందు శరత్కాలంపు వెన్నెలసొంపును విశదపఱచునదై, తెల్లపువ్వుల గర్వము నడంచుటలో నేరిమి ప్రదర్శించునదై, పాపక్లేశమును హరించునదై, నీ చిఱునవ్వు తళుకులప్రవాహము పరమశివునిచే వేడుకతో నవలోకింపబడుచు నెంతయు రాజిల్లుచున్నది.

ఆరూఢస్య సమున్నతస్తనతటీ సామ్రాజ్యసింహాసనం
కందర్పస్య విభో ర్జగత్త్రియజయప్రాకట్యముద్రానిధేః
యస్యా శ్చామరచాతురీం కలయతే రశ్మిచ్ఛటా చంచలా
సా మందస్మితమంజరీ భవతు నః కామాయ కామాక్షి తే|| ౭

స్మరుఁడన్ ఱేని సమున్నత స్తనతటీసామ్రాజ్యసింహాసన
స్థిరుఁడౌవాని జగత్త్రియాద్భుత జయశ్రీముద్రితుం గొల్వగా
విరియంజేయుచుఁ జంచలాంచితరుచుల్ వింజామరల్ వీచు సుం
దరమౌ నీ దరహాసమంజరి యుమా ! నా కోర్కు లీడేర్చుతన్.

ఉన్నత కుచమండలమనెడి సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించినట్టియు, జగత్త్రియ విజయముద్ర గైకొన్నట్టియు మన్మథుఁడను సార్వభౌమునకు ఏ దరహాసమంజరియొక్క చంచలమైనకాంతిపుంజము వింజామరల చాతుర్యమును ప్రదర్శించునో యా చిరునవ్వు మాకోర్కెల నీడేర్చుగాక !

శంభో ర్యా పరిరంభసంభ్రమవిధౌ నైర్మల్యసీమానిధి
ర్గైర్వాణీవ తరంగిణీ కృతమృదుస్యన్దాం కలిన్దాత్మజామ్
కల్మాషీకురుతే కలంకసుషమాం కంఠస్థలీచుంబినీమ్
కామాక్ష్యాః స్మితకన్దలీ భవతు సా కల్యాణసందోహినీ॥ ౮

ఎది గంగానదివోలె నచ్ఛమయి య య్యీశానునిన్ గౌగిటన్
గదియం జేసి తదీయకంఠముఁ గలంకస్ఫూర్తి ముద్దాడు న
న్నదిఁ గాలిందిని నల్లనం జరుగుదానిన్ నల్పుగావించు నొ
ప్పిదమౌ నంబిక లేతనవ్వు పిదుకున్ వేవేగ వేవేల్సిరుల్.

ఏ కామాక్షి చిరునవ్వు స్వచ్ఛతకు బరమావధియైన దేవనదివలె యల్లల్లనఁ జాలువారి శివునికంఠమును ముద్దాడు విషాంకచ్ఛాయ యనెడి కళిందకన్యను (యమునను) కల్మషపఱచుచుండునో (నలుపొనరించుచుండునో) యట్టి కామాక్షిమొలకనవ్వు మా కఖిల కళ్యాణకామధేనువగుగాక !

జేతుం హారలతా మివ స్తనతటీం సంజగ్ముషీ సంతతం
గన్తుం నిర్మలతా మివ ద్విగుణితాం మగ్నా కృపాస్రోతసి
వక్తుం విస్మయనీయతా మివ హరం రాగాకులం కుర్వతీ
మంజుస్తే స్మితమంజరీ భవభయం మథ్నాతు కామాక్షి మే.

హారలతం జయించుటకొ యన్నటు లక్కుచసీమం బ్రాకి, తె
ల్పారుచి రెట్టిగం బడయ నన్నటు మున్గి కృపాప్రవాహమం,
దారసి తెల్ప వింతనెల వన్నటు శంకరు రాగరంజితుం
గా రచియించు నీ నగవు నా భవభీతి హరించుఁగావుతన్.

ముత్యాలహారమును దన ప్రభచే జయించుటకో యన్నట్లు స్తనమండలమున గ్రీడించునదై రెట్టింపు స్వచ్ఛతను బడయుటకో యన్నట్లు కృపాప్రవాహమున మున్కలు వెట్టినదై ఎల్లర కాశ్చర్యపడదగినవానిఁగా నిరూపించుటకో యన్నట్లు తెల్లనివాఁడైన శివుని ఎఱ్ఱనివానిగా నొనరించుచున్నదై (శ్లేష :— సహజవిరాగియైన శివుని అనురాగాకులునింగా జేయుచున్నదై) యొప్పు చక్కని నీ దరహాసమంజరి మా సంసారభయమును హరించుగాక !

శ్వేతాపి ప్రకటం నిశాకరరుచాం మాలిన్య మాతన్వతీ
శీతాపి స్మరపావకం పశుపతే స్సంధుక్షయన్తీ సదా
స్వాభావ్యా దధరాశ్రితాపి నమతా ముచ్చైర్దిశన్తీ గతిమ్
కామాక్షి స్ఫుట మన్తరా స్ఫురతు నస్త్వన్మన్దహాస ప్రభా॥ ౧౦

శ్వేతమ్మయ్యును నిండు జాఁబిలికళం జెందించి మాలిన్యమున్,
శీతమ్మయ్యును శంభుమన్మథమహాగ్నిన్ రేచుచున్ నైజవి
ఖ్యాతమ్మౌ నధరాస్థితిన్ వినతులం దౌన్నత్యముంగూర్చు మేల్
చాతుర్యాన స్ఫురించు నా యెడఁద నీ సన్మందహాసప్రభల్.

సహజముగ దాను దెల్లనిదయ్యు చంద్రకాంతులకు మాలిన్యమును సంపాదించునదై, నైజముగా దాను జల్లనిదయ్యు-పశుపతికి మన్మథాగ్నిరగుల్కొల్పుచున్నదై (స్వభావముచే నధరము (పెదవి) నాశ్రయించినదయ్యు శ్లేష--అధర+ఆశ్రితా+అపి=క్రిందు క్రిందుగా వర్తించునదయ్యు తనయెడ వినతులగువారికి ఉన్నతగతిని సమకూర్చునదై యొప్పు నీ మందహాసప్రభ నాలోన బ్రస్ఫుటముగ స్ఫురించుఁగాక !

వక్త్ర శ్రీ సరసీజలే తరలితభ్రూవల్లి కల్లోలితే
కాలిమ్నా దధతి కటాక్షజనుషా మాధువ్రతీమ్ వ్యాపృతిమ్
నిర్నిద్రామలపుండరీక కుహనాపాండిత్య మాబిభ్రతి
కామాక్ష్యాః స్మితచాతురీ మమ మనఃకాతర్య మున్మూలయేత్॥ ౧౧

మొగమన్నట్టి సరోవరామృతమునన్ భ్రూవల్లికల్లోలముల్
వగలీనన్, గడగంటి నల్పుగొలుపన్ మాధువ్రతవ్యాపృతిన్
బగ లింపొందెడి పుండరీకకుహనాపాండిత్యముంబూని చ
క్కఁగ మా యమ్మ స్మితమ్ము నేరిమి మనఃకాతర్యముం బాపుతన్

ముఖమనెడి చక్కని సరోవరోదకములందు భ్రూవల్లి కదలికలు కెరటములు వేయగా కటాక్షములందలి నలుపుచే తుమ్మెదలు మునురుకొన్నవై చక్కగ వికసించిన తెల్లదామరపూవుల కపటమైన పాండిత్యమును వహించినదై యొప్పు కామాక్షియొక్క మందస్మిత చాతుర్యము నా మనసులోని కాతర్యమును (భయమును) బాపుగాక !

నిత్యం బాధితబంధుజీవ మధరం మైత్రీజుషం పల్లవైః
శుద్ధస్య ద్విజమండలస్య చ తిరస్కర్తార మప్యాశ్రితా
యా వై మల్యవతీ సదైవ నమతాం చేతః పునీతేతరాం
కామాక్ష్యా హృదయం ప్రసాదయతు మే సా మన్దహాసప్రభా॥ ౧౨

మంకెనగెల్చి లేఁజిగురుమైత్రి పొనర్చి ద్విజాళియచ్ఛపుం
బింక మదల్చు నయ్యధరబింబముమీఁదఁ జరించి తన్ను ని
శ్శంక భజించువారి మదిఁ జక్కఁగఁదేలుచు తల్లిమందహా
సాంకుర మస్మదీయహృదయమ్ముఁ బ్రసన్నముసేయుఁ గావుతన్.

పల్లవైః=చిగురాకులతో మైత్రిజుషం. స్నేహముచేయును (శ్లేష.) పాదలేశములతో చెల్మిచేయును. (నీచస్నేహముచేయుచు) బంధుజీవ = మంకెనపూవును బాధించును (శ్లేష.) బంధువుల ప్రాణమునకు బాధగూర్చును. శుద్ధమైన ద్విజమండలమును = పలువరుసను కప్పివేయును. (శ్లేష.) బ్రాహ్మణసంఘమును తిరస్కరించును. అట్టి పెదవిని ఆశ్రయించి వర్తించు కామాక్షి మందహాసప్రభ విమలమై వినతులైన వారి మనసును బవిత్రముజేయుచున్నది. అట్టి లేనవ్వుసొంపు నా హృదయమును బ్రసన్నముఁజేయుగాక !

ద్రుహ్యన్తీ తమసే ముహుః కుముదినీసాహాయ్య మాబిభ్రతీ
యాన్తీ చన్ద్రికిశోరశేఖరవపుస్సౌధాంగణే ప్రేంఖణం
జ్ఞానాంభోనిధివీచికాం సుమనసాం కూలంకషాం కుర్వతీ
కామాక్ష్యాః స్మితకౌముదీ హరతు మే సంసారతాపోదయమ్|| ౧౩

అంతముసేసి చీఁకటుల, నాప్తసఖమ్మయి కల్వపూలకున్,
గంతులువెట్టి యిందుధరుకాయముపేరిటి సౌధవీథి, న
త్యంతము పొంగఁజేసి విబుధావళి జ్ఞానమహాపయోధి, బ
ల్వింతగు దేవి లేనగవువెన్నెల మా భవతాప మార్చుతన్.

చీఁకటికి ద్రోహముసేయుచు కలువకు సాయపడుచు చంద్రశేఖరుల శరీరమనెడి సౌధాంగణమున గంతులిడుచు సుమనసులయొక్క అనఁగా పరిశుద్ధమనస్కుల యొక్క (దేవతలయొక్క) జ్ఞానమనెడి సముద్రతరంగమును కూలంకష మొనరించుచు నొప్పెడి కామాక్షియొక్క చిరునవ్వనెడి వెన్నెల నా సంసారతాపమును హరించుగాక !

కాశ్మీరద్రవధాతుకర్దమరుచా కల్మాషతాం బిభ్రతీ
హంసౌఘైరివ కుర్వతీ పరిచితిం హారీకృతై ర్మౌక్తికైః
వక్షోజన్మతుషారశైలకటకే సంచార మాతన్వతీ
కామాక్ష్యా మృదులస్మితద్యుతిమయీ భాగీరథీ భాసతే|| ౧౪

కని కాశ్మీరరసాఖ్యధాతుచయపంక మ్మూని కాలుష్య మొ
య్యన రాయంచలతో వలెన్ బరిచితమ్మై తారహారాళితోన్
ఘనవక్షోజ తుషారశైలతటులన్ సంచారిముల్సేయుచున్
గననౌ నీ దరహాసకాంతి లహరుల్ గంగానదీవైఖరుల్.

కుంకుమరసాలేపమనెడి గైరికాదిధాతువుల యెఱ్ఱని బెందడిచే గలగినదై ముత్యాలహారములనెడి రాజహంసలతోడి పరిచయమువడసి చనుకట్టనెడి హిమశైలతటములందు సంచారము సేయుచునుండు నీ చిరునవ్వు కాంతిప్రవాహములు గంగానదివలె నుల్లసిల్లుచున్నవి.

కంబో ర్వంశపరంపరా ఇవ కృపాసంతానవల్లీభువః
సంఫుల్లస్తబకా ఇవ ప్రసృమరా మూర్తాః ప్రసాదా ఇవ
వాక్పీయూషకణా ఇవ త్రిపథగాపర్యాయభేదా ఇవ
భ్రాజన్తే తవ మన్దహాసకిరణాః కాంచీపురీనాయికే|| ౧౫

మురువౌ శంఖకులంబులో(దరతరమ్ముల్ నిండు పూగుత్తులున్
గరుణాకల్పలతావితానభవముల్ గాఢప్రసాదాకృతుల్
వరభాషామృతబిందువుల్ త్రిపధగాపర్యాయముల్ తల్లి ! నీ
దరహాసద్యుతు లుల్లసిల్లును లసత్కాంచీపురాధీశ్వరీ !

నీ చిరునవ్వుకాంతులు శంఖముయొక్క వంశపరంపరవలె దయయనెడి కల్పలతయందు బొడమిన పూగుత్తులవలె మూర్తీభవించిన యనుగ్రహ ప్రసారములవలె వాగమృతము యొక్క చినుకులవలె గంగానదీపర్యాయములవలె విలసిల్లుచున్నవి.

వక్షోజే ఘనసారపత్రరచనాభంగీ సపత్నాయితా
కంఠే బంధురదంతపత్రకుహనావ్యాపార ముద్రాయితా
ఓష్ఠశ్రీనికురుంబపల్లవపుటే ప్రేఙ్ఖత్ప్రసూనాయితా
కామాక్షి స్ఫురతాం మదీయహృదయే త్వన్మందహాసప్రభా|| ౧౬

స్తనసీమన్ దెలిపచ్చకప్పురపుపత్రశ్రీ( బిసాళించుచున్
గని కంఠమ్మున వజ్రపత్రరచిత గ్రైవేయముద్రాకృతిన్
జని యోష్ఠాంచలనవ్యపల్లవపుటిన్ జంచత్ప్రసూనాకృతిన్
గననౌ నీ దరహాసకాంతి వొలుచుంగా కస్మదీయాత్మలో

కుచములందు బచ్చకర్పూరముచే రచించిన మకరికాదిపత్రరేఖలై కంఠమునందం దముగుల్కు దంతపత్రముల యనుకరణముద్రాస్వరూపములై అధరకాంతిపుంజ మనెడి పల్లవపుటమునం దుల్లసిలు పుష్పములై తోచెడి నీ మందహాసప్రభలు నా హృదయ మునందు స్ఫురించుగాక !

యేషాం బిన్దురివోపరి ప్రచలితో నాసాగ్రముక్తామణి
ర్యేషాం దీన ఇవాధికంఠ మయతే హారః కరాలంబనమ్
యేషాం బన్ధురి వోష్ఠయో రరుణిమా ధత్తే స్వయం రంజనమ్
కామాక్ష్యాః ప్రభవన్తు తే మమ శివోల్లాసాయహాసాంకురాః|| ౧౭

మురువగు నడ్డబాస తెలిముత్తెము బిందువు వోలు వేనిపై
నురవగుహార మేకరము నూతగఁ గైకొనుఁ గంఠసీమ, నా
ధరరుచి వేనిచుట్టమటు తాలుచునో యనురంజనత్వమున్
దరహసితాంకురమ్ము లవి తావకముల్ శివదమ్ములయ్యెడిన్.

ఏ మందహాసంపుమొలకలతుద బిందువుమాత్రమగు నడ్డబాసముత్తియము తళ తళ మెరయు చుండునో ఏ మందహాసాంకురములయొక్క కరావలంబమును (కర = కాంతికిరణములయొక్క) ఆలంబనమును = ఆధారమునుగొని ఒకానొక దీనుడట్లు ముత్యాలహారము కంఠాగ్రభాగమున కెగయుచుండునో వేనికి జుట్టమువలె పెదవులమీఁది యెరుపు తనయంతటఁ రంజించుచుండునో అట్టి శ్రీ కామాక్షీదేవి మందహాసాంకుర ములు నాకు సకలమంగళోల్లాసమును సమకూర్చ సమర్థములగుగాక.

యా జాడ్యాంబునిధిం క్షిణోతి భజతాం వైరాయతే కైరవై
ర్నిత్యం యా నియమేన యా చ యతతే కర్తుం త్రినేత్రోత్సవం
బింబం చాంద్రమసం చ వంచయతి యా గర్వేణ సా తాదృశీ
కామాక్షి స్మితమంజరీ తవ కథం జ్యోత్స్నే త్యసౌ కీర్త్యతే|| ౧౮

విరఁజిమ్మున్ నిజభక్తజాడ్యజలధిన్, వేధించెడిం గల్వలన్,
నిరతిన్ గుల్కుఁద్రినేత్రు నుత్సవవిధిన్ నిందించెడిం జందురున్
గరువంపుం బిగి నేది యయ్యది యహో ! కామాక్షి ! నీ హాసమం
జరి యవ్వెన్నెలగాఁ బ్రశంసగను టాశ్చర్యమ్ము సర్వేశ్వరీ !

ఏ నీదరహాసమంజరి జాడ్యమనెడి (బుద్ధిమాంద్యమనెడి) సముద్రమును చిమ్మి వేయునో, యేది కలువలతో గలహమునకు ఢీకొనునో, యేది త్రినేత్రోత్సవమును (మాఘబహుళ చతుర్దశి చీఁకటిరాత్రులందు జరుగు శివరాత్రి మహోత్సవమును) జరుపయత్నించునో, నిజగర్వముచే నేయది చంద్రబింబమును గించపరచునో యట్టి నీ మందహాస మంజరి వెన్నెలయని ప్రశంసింపబడుచున్నది, ఇది యెట్లు ?

ఆరూఢా రభసా త్పురః పురరిపో రాశ్లేషణోపక్రమే
యా తే మాత రుపైతి దివ్యతటినీశంకాకరీ తత్క్షణం
ఓష్ఠం వేపయతి భ్రువౌ కుటిలయ త్యానమ్రయ త్యాననం
తాం వన్దే మృదుహాసపూరసుషమా మేకామ్రనాథప్రియే॥ ౧౯

హరునిన్ వేగఁ గవుంగలింపఁజను నీ హాసాంకురశ్రేణి వి
స్ఫురణ మ్మక్కడ గంగయన్నతలపుం బూనించి నీ కప్పు డా
ధరకంపమ్మును మోమువంచుటలు మీదన్ భ్రూకుటీభంగమున్
జరుగంజేసెడు నట్టి నీదు దరహాసస్ఫూర్తికిన్ మ్రొక్కెదన్.

అమ్మా ! ఏది వేగముగా బరమశివుని తానె మునుముందుగ గౌరవించు ప్రక్రియయందు బయల్పడి దేవనది యను సంశయమును గలిగించునదై అప్పుడే నీ పెదవులను గదలించుచు కనుబొమలను కుటిలపఱచుచు నీ మోమును వంచుకొనజేయుచున్నదో యట్టి నీ మందహాస ప్రవాహప్రభకు నమస్కరించుచున్నాను.

వక్త్రేన్దోస్తవ చంద్రికా స్మితరుచి ర్వల్గు స్ఫురన్తీ సతాం
స్యాచ్చే ద్యుక్త మిదం చకోరమనసాం కామాక్షి కౌతూహలం
ఏతచ్చిత్ర మహర్నిశం యదధికా మేకం సదా గాహతే
బింబోష్ఠద్యుమణిప్రభాస్వపి చ యద్బిబ్బోక మాలంబతే॥ ౨౦

ఎలనవ్వన్ దెలివెన్నెలల్ విరిసి నీ యింపైన మోమన్న జా
బిలిలో సాధుచకోరచిత్తములకున్ వేడ్కల్ వెలారించు నా
వెలుఁగుల్ రేఁబవ లద్భుతంబెనసి నీ బింబోష్ఠమన్ నింగి రం
జిలు సాంధ్యారుణ రేఖలన్ నెఱపెడిన్ బిబ్బోకశృంగారమున్.

నీ ముఖమనెడి చంద్రబింబమునుండి వెడలి ఇంపుగులుకు నీ చిరునవ్వన్న వెన్నెల సాధుచకోరచిత్తములకు వేడుకఁగూర్చునన్న నిది యెంతయు నుచితమే. ఇందులో నీ దొండపండువంటి పెదవియందు సాంధ్యరాగములందు ఏకాకారమైన కాంతినే బడసి రాత్రి పవలుకూడ బిబ్బోకవిలాసమును అనగా ఇష్టవస్తువాంఛారూపమైన శృంగారచేష్టలో నిమగ్నమగుచున్నది. ఇది యెంతయు చిత్రమైన విషయము.

సాహాయ్యం కలశాంబుధే ర్వహతి తే కామాక్షి మన్దస్మితం
శోభా మోష్ఠరుచాం చ విద్రుమభువా మేతద్భిదాం బ్రూమహే
ఏతస్మా దుదితం పురా కిల పపౌ శర్వః పురాణః పుమా
నేతన్మధ్యసముద్భవాం రసయతే మాధుర్యరూపాం సుధామ్‌॥ ౨౧

అరయన్ నీ చిరునవ్వు పాల్కడలి తోడైయున్న దాలోని యా
ధరశోభల్ పవడంపుడంబును గొనెం, దర్కింతు నావైన మీ
శ్వరి ! మున్ ద్రావెం బురాణపూరుషుఁడు శర్వస్వామి చేఁదైన యా
సర; కీలోమధురామృత మ్మిపుడె యాస్వాదించుచున్నా డుమా !

నీ చిరునవ్వు పాలసముద్రమునకు చెలికత్తె యగుచున్నది. అత్తరి నీ యధర కాంతి పవడపుకాంతిని వహించుచున్నది. ఈ సందర్భములో నే నిట్లు తర్కించుచున్నాను. ఈ పాలసముద్రములో జనించిన చేఁదును (విషమును) ఇంత మున్ను పురాణపురుషుఁడగు శివుఁడు త్రావివైచెను. ఇఁక మిగిలియున్న అధరోష్ఠమధ్యగతమైన (చిరునవ్వురూపమైన) అమృతమును ఇప్పు డాతఁ డాస్వాదించుచున్నాడు -- అని.

ఉత్తుంగస్తనకుంభశైలకటకే విస్తారి కస్తూరికా
పత్ర శ్రీజుషి చంచలాః స్మితరుచః కామాక్షి తే కోమలాః
సంధ్యాదీధితిరంజితా ఇవ ముహుః స్వాన్తాధరజ్యోతిషా
వ్యాలోలామల శారదాభ్రశకల వ్యాపార మాతన్వతే॥ ౨౨

సముదంచత్కుచకుంభశైలతటిపై జాల్కొన్న కస్తూరిప
త్రమనోజ్ఞద్యుతిఁ బ్రాకి చంచలములై రాగిల్లి నీ మందహా
సము లూరించెడి మోవిపెంపెనసి యా సాంధ్యారుణచ్ఛాయ నం
దములం గుల్కెడి శారదాభ్రశకలోదంచ త్క్రియాచాతురిన్.

ఉన్నతస్తనపర్వతతటమునందు వ్యాపించిన కస్తూరికామకరికాది పత్రరేఖాసౌందర్యమందు గులికెడి నీ చంచలకోమలమందహాసరుచులు దట్టమగు పెదవియందలి మెరుపు డాలుచే సంజకెంజాయలు పైపై నలముకొనిన శరత్కాలంపు తెలిమబ్బుతునకల సౌందర్యమును విస్తరింపఁజేయుచున్నవి.

క్షీరం దూరత ఏవ తిష్ఠతు కథం వైమల్యమాత్రా దిదం
మాత స్తే నహసాతవీథిమయుతాం మన్దస్మితై ర్మంజులైః
కిం చేయం తు భిదాస్తి దోహనవశా దేతత్తు సంజాయతే
కామాక్షి స్వయమర్థితం ప్రణమతా మేతత్తు దోదుహ్యతే॥ ౨౩

పాలను నీదు నవ్వు సహపాఠి యనం దగదెంత స్వచ్ఛతన్
గ్రాలిన; నెవ్వరేఁ బిదుకగావలెఁ గావలెనన్న వాని; నా
పోలికఁగాక నీదు నగవుల్ తము మ్రొక్కిన యంతమాత్ర సు
శ్రీలలితమ్ము లిష్టములఁ జేపు బుధాళికిఁ గుంభవృష్టిగన్.

అమ్మా ! పాలు తెల్లనైనంతమాత్రముచే నీ చక్కని చిరునవ్వులకు సాటి యెట్లు కాగలవు ? ఈ రెండింటికిని భేదము గలదు. పాలు ఒకరు పితుకగా లభించునవి. నీ చిరునవ్వు భక్తకోటికి స్వయముగా తాన చేపునది.

కర్పూరై రమృతాంశుభి ర్జనని తే కాన్తైశ్చ చన్ద్రాతపై
ర్ముక్తాహారగుణై ర్మృణాలవలయై ర్ముగ్ధస్మితశ్రీ రియమ్
శ్రీకాంచీపురనాయికే సమతయా సంస్తూయతే సజ్జనై
స్తత్తాదృఙ్మమ తాపశాన్తివిధయే కిం దేవి మన్దాయతే॥ ౨౪

నెలయున్ వెన్నెల పచ్చకప్పురమునున్ లేఁదూండ్లు ముత్యాలదం
డలు నీ నవ్వుల కీడటంచుఁ గవులాడన్ వింటిమో యమ్మ ! యా
కళ నేడంతయు నెందు డాగెనొకదే కాంచీపురాధీశ్వరీ !
యలసమ్మైనది నాదులోనుడుకుఁ జల్లార్ప న్ననుం దేర్పగన్.

ఉత్తములు నీ చిరునవ్వును పచ్చకప్పురపుపొడులతో, నమృతము చిందు వెన్నెలలతో, ముత్యాలహారములతో, తామరతూండ్లతో, సమానమైనదని పొగడుదురు. అట్టి నవ్వు నా తాపమును శమింపఁజేయ నేల వెనుకాడుచున్నది?

మధ్యే గర్భితమంజువాక్యలహరీ మాధ్వీఝరీ శీతలా
మన్దారస్తబకాయతే జనని తే మందస్మితాంశుచ్ఛటా
యస్యా వర్ధయితుం ముహు ర్వికసనం కామాక్షి కామద్రుహో
వల్గు ర్వీక్షణవిభ్రమవ్యతికరో వాసన్తమాసాయతే॥ ౨౫

మందారమ్ములబంతియై కులికెడిన్ మందస్మిత మ్మందులో
నం దొల్కాడెడి ముద్దుబాస లవియుం ద్రాక్షాఝరీమాధురీ
సందోహమ్ములు తద్వికాసమునకున్ సాక్షాదుమానాధవీ
క్షాందోళమ్ము వసంతమాసమధురవ్యాసంగమై యొప్పెడిన్.

తన నడుమనున్న తీయనిపలుకుదేవియలచే చలువగ్రమ్మిన నీ చిరునవ్వు సొగసు మందారకుసుమగుచ్ఛమై యొప్పుచున్నది. వాని వికాసమును బెంపొందింప జేయుటకు కామవైరి (శివునియొక్క) కన్నులసొంపు వసంతమాసమై యొప్పుచున్నది.

బింబోష్ఠద్యుతిపుంజరంజితరుచి స్త్వన్మందహాసచ్ఛటా
కల్యాణం గిరిసార్వభౌమతనయే కల్లోలయ త్వాశు మే
ఫుల్లన్మల్లిపినద్ధహల్లకమయీ మాలేవ యా పేశలా
శ్రీకాంచీశ్వరి మారమర్దితు రురోమధ్యే ముహూ ర్లంబతే॥ ౨౬

కెంబెదవిం జెలంగు నునుకెంజిఁగికిన్ జిఁగివొందు మందహా
సంబు నగేంద్రకన్య వికసన్నవమల్లిక లల్లినట్టి యం
దంబగు నెఱ్ఱదామరలదండయనం దులకించి శంభు వ
క్షంబున, మా కశేషశుభసంతతులం దులకింప జేయుతన్.

మల్లెలతోగలిపి గ్రుచ్చిన యెఱ్ఱదామరపూలమాలవలె శివుని వక్షఃస్థలమున సొగసు గుల్కుచు దొండపండువంటి నీ పెదవియొక్క కాంతి పుంజముతోగూడిన నీ యచ్చపుఁ జిరునవ్వులప్రభ నాయెడ సకలకల్యాణములను దరంగిత మొనరించుగాక !

బిభ్రాణా శరదభ్రవిభ్రమదశాం విద్యోతమానా ప్యసౌ
కామాక్షి స్మితమంజరీ కిరతి తే కారుణ్యధారారసమ్
ఆశ్చర్యం శిశిరీకరోతి జగతీ మాలోక్య చైనా మహో
కామం ఖేలతి నీలకంఠహృదయం కౌతూహలాన్దోళనమ్॥ ౨౭

శరదభ్రద్యుతివిభ్రమంబుఁ గొనియున్ సర్వేశి ! నీ హాసమం
జరి ధారారసకుంభవృష్టికురియుం గారుణ్య ; మాశ్చర్య మ
మ్మరొ ! యీ యెల్లజగంబుఁ జల్లబఱచున్ మన్నించి యా సొంపు న
బ్బురమౌ వేడుక నీలకంఠహృదయమ్ముం దాండవమ్మాడెడిన్.

నీ చిరునవ్వు శరత్కాలమేఘముయొక్క విలాసమునుబూని విలసిల్లు చున్నదయ్యు కరుణారసధారలను వర్షించుచున్నది. మఱియు వింతగ నీ లోకమును మంచుచే దనియించుచున్నది. అంతేకాదు, దీనిం జూచి నీలకంఠహృదయము (శివుని మనస్సు) శ్లేష -- నెమలి చిత్తము) వేడుకగొని నృత్యము సేయుచున్నది. శరదృతువునందు వర్ష శిశిరర్తుధర్మములు గోచరించుట యిచట ఆశ్చర్యమన్నమాట.

ప్రేంఖత్ప్రౌఢకటాక్ష కుంజకుహరే ష్వత్యచ్ఛ గుచ్ఛాయితం
వక్త్రేందుచ్ఛవిసిన్ధువీచినిచయే ఫేనప్రతానాయితం
నైరంతర్యవిజృంభితస్తనతటే నైచోలపట్టాయితం
కల్మాషం కబలీకరోతు మమ తే కామాక్షి మన్దస్మితమ్|| ౨౮

పొలుపగు వాలుచూపు లను పూఁబొద నచ్చపుపూవుగుత్తులై
వెలయు ముఖేందుకాంతి నడివీచికలం దెలినుర్వుప్రోవులై
కులికెడు గబ్బిగుబ్బలను గోమలమౌ వలిపంపు పైటయై
చెలఁగెడు నీదు నవ్వుల విశేషము మా దురితమ్ము వాపుతన్.

నీ చిరునవ్వు తులకించెడి కటాక్షములనెడి పూబొదలయం దచ్చపు పూగుత్తులై ముఖమనెడి చంద్రబింబముయొక్క తళుకులనెడి సముద్రతరంగములందు నురుపై నిరంతరము నెగసిపడు పాలిండ్లపైని దెలిపట్టు పైటచెఱగైయొప్పెడి నీ చిఱునవ్వు మా కల్మషమును గబళించుగాక !

పీయూషం తవ మంథరస్మితమితి వ్యర్థైవ సాపప్రథా
కామాక్షి ధ్రువమీదృశం యది భవే దేతత్కథం వా శివే
మన్దారస్య కథాలవం న సహతే మథ్నాతి మన్దాకినీ
మిన్దుం నిన్దతి కీర్తితే చ కలశీపాథోధి మీర్ష్యాయతే|| ౨౯

అమృత మ్మందురు నీదు లేనగవు వ్యర్థాలాప మామాట స
త్యమ మందారముపేరెనైప దది యేలమ్మా కలంగించు నే
లమ ? మందాకిని నిందుబింబమును దూలంబల్కు నేమమ్మ ? కొం
చెముపేరెత్తినఁజా లసూయగొనునే క్షీరాబ్ధిపై నేలొకో ?

నీ లేనవ్వు అమృతమనుట వ్యర్థమైనమాట. నిజముగా నది యట్టిదేయైనచో మందారమును మాటకైన సహింపదేల ? మందాకిని నేల కలతపెట్టును? చంద్రబింబము నెందులకు నిందించును ? పాల్కడలి మాట సెప్పిన నేల యీర్ష్యగొనును?

విశ్వేషాం నయనోత్సవం వితనుతాం విద్యోతతాం చన్ద్రిమా
విఖ్యాతో మదనాన్తకేన ముకుటీమధ్యే చ సమ్మాన్యతాం
ఆః కిం జాత మనేన హాససుషమా మాలోక్య కామాక్షి తే
కాలంకీ మవలంబతే ఖలు దశాం కల్మాషహీనోఽప్యసౌ|| 30

నానాలోకవిలోకనోత్సవము సంధానించునేకాక యీ
శానోత్తంసనివాసగౌరవకళన్ సాధించునేకాక యు
ద్దానం జంద్రున కేమి యబ్బెను భవద్వ్యాలోలహాసావలో
కానన్ దా నకళంకుఁడయ్యును గళంకచ్ఛాయపాలయ్యెడిన్.

చంద్రుడు సకల విశ్వమునకు కనులపండు వొనరించుగాక ! మిగుల ప్రకాశించుగాక ! పరమశివునిచే శిరసావహింపఁబడి గౌరవింపఁబడుగాక ! అంతమాత్రమున నేమైనది? నీ చిరునవ్వును జూచి యోర్వలేక నైజముగ కల్మషములేనివాడయ్యు నతడు కళంకదశ నందుచున్నాడు !

చేతః శీతలయన్తు నః పశుపతే రానన్ద జీవాతవో
నమ్రాణాం నయనాధ్వసీమసు శరచ్చంద్రాతపోపక్రమాః
సంసారాఖ్యసరోరుహాకరఖలీకారే తుషారోత్కరాః
కామాక్షి స్మరకీర్తిబీజనికరా స్త్వన్మన్దహాసాంకురాః|| 30

చలువల్ నించుత మా మనమ్ముల శరచ్చంద్రాతపోపక్రమ
మ్ములు నమ్రాళిదృగంచలమ్ముల, భవంపుందమ్మి కన్నీయగాఁ
దలకొన్నట్టి తుషారధారలు, లసత్సత్కీర్తివల్లీసము
జ్జ్వలబీజమ్ములు తల్లి ! నీదు దరహాసశ్రేణికాంకూరముల్.

శివుని యానందమునకు ప్రాణధారకములు, వినతులైనవారి కనుచూపులందు శరత్కాలంపు వెన్నెలలు, సంసారమను తామరలను మూతవడ జేయుటలో మంచుజల్లులు. మన్మధుని కీర్తితి మొలకకు బీజప్రాయము లైనవియునగు నీ దరహాసాంకురములు మా మనసును జల్లబఱచుగాక !

కర్మౌఘాఖ్యతమఃకచాకచికరా న్కామాక్షి సంచిన్తయే
త్వన్మందస్మితరోచిషాం త్రిభువనక్షేమంకరా నంకురాన్
యే వక్త్రం శిశిరశ్రియో వికసితం చన్ద్రాతపాంభోరుహ
ద్వేషోద్ఘోషణచాతురీమివ తిరస్కర్తుం పరిష్కుర్వతే|| 31

ఇదె శిశిరంపుశోభ తులకింపఁగ వెన్నెలఁ దమ్ములందునున్
విదితముసేసెడిన్ బగను వేనడగించుట కన్నయట్లుగన్
గదిసి భవమ్ముఖ మ్మదిరి కర్మతమమ్మును జుట్టుజుట్టుప
ట్టొదవ జగమ్ముక్షేమముల కొప్పెడి నీ యెలనవ్వు లెన్నెదన్.

కర్మప్రవాహమను చీఁకటితో జుట్టుజుట్టు పట్టుకొని పెనగునట్టియు, ముల్లోకములకు క్షేమంకరములైనట్టివియు నీ చిఱునవ్వు లేమొలకలను భావించుచున్నాను. ఆ చిరునవ్వులు శిశిరశ్రియః =చల్లని కాంతిగలవై శ్లేష -- శిశిరర్తుశోభగలవై వెన్నెలకు తామరపువ్వులకుగల పగను తిరస్కరించుటకో యన్నట్లు నీ వికసించిన ముఖము నలంకరించుచున్నవి.

కుర్యు ర్నః కులశైలరాజతనయే కూలంకషం మంగళమ్
కున్దస్పర్ధనచుంచవస్తవ శివే మన్దస్మితప్రక్రమాః
యే కామాక్షి సమస్తసాక్షి నయనం సంతోషయ న్త్యాంతరం
కర్పూరప్రకరా ఇవ ప్రసృమరాః పుంసా మసాధారణాః|| 33

కులశైలాత్మజ మాకు మంగళములన్ గూలంకష మ్మిచ్చుతన్
వలపుల్ నించి యశేషసాక్షికనులన్ సంతోషముల్ వెంచి నా
ఘులపాలన్ దెలి పచ్చకప్పురములై క్రొనాడి యమ్మొల్లపు
వ్వులు మల్లెల్ విలసిల్లి మొల్లముగ నీ పొల్పొందు నవ్వుల్ శివా !

ఓ కులగిరికన్య ! ఏ మందహాస విలాసములు యోగులకు పచ్చకప్పురపు కుప్పలై యెల్లరకు నందనివై యంతకును సాక్షియైన శివుని నేత్రమును (సర్వమునకు సాక్షులైన సూర్య -- చంద్ర -- అగ్నులు కన్నులుగాగల శివుని) సంతోషపెట్టునో యట్టి మొల్లపువ్వులతో దగవాడు నీ మందహాస విలాసములు మాకు సంపూర్ణమంగళమును జేకూర్చుగాక !

క్రమేణ స్నపయస్వ కర్మకుహనాచోరేణ మారాగమ
వ్యాఖ్యాశిక్షణదీక్షితేన విదుషా మక్షీణలక్ష్మీపుషా
కామాక్షి స్మితకన్దలేన కలుషస్ఫోటక్రియాచుంచునా
కారుణ్యామృతవీచికావిహరణప్రాచుర్యధుర్యేణ మామ్|| 34

క్రమతన్ స్నానమొనర్పఁజేయుగదవే కామాక్షి ? నన్ మన్మథా
గమసంశిక్షణదీక్షితమ్ము దురితగ్రామమ్ముఁ బోనాడ ద
క్షము వాత్సల్యరసామృతామరధునీ సంచారచాతుర్య ము
త్తములం దక్షయలక్ష్మి బెంపఁగ సమర్థమ్మైన నీ నవ్వుతో.

మన్మథశాస్త్ర వ్యాఖ్యానమును విద్వాంసులకు శిక్షింప దీక్ష గొన్నట్టియు, కర్మతంత్రముయొక్క కాపట్యమును దొంగిలించునట్టియు, పాపమును భేదింప సమర్థమైనట్టియు, కరుణామృతము వెల్లువగొని పొరునట్టియు, అక్షీణలక్ష్మీకళాసంపన్న మైనట్టియు, నీ నవ్వు మొలకచే నన్ను యథావిధిగా స్నానమాడింపుము.

త్వన్మందస్మితకన్దలస్య నియతం కామాక్షి శంకామహే
బింబః కశ్చన నూతనః ప్రచలితో నైశాకర శ్శీకరః
కించ క్షీరపయోనిధిః ప్రతినిధిః స్వర్వాహినీవీచికా
బిబ్బోకో௨పి విడంబ ఏవ కుహనా మల్లీమతల్లీరుచః|| 35

నీ మందస్మితకాంతికందళికతో నిక్కమ్ము నైశాకర
శ్రీమద్బింబ మదొక్కతుంపురు సుమీ క్షీరాబ్ధి ప్రత్యర్థి య
మ్మా ! మాయల్ నవమల్లిచాయ లటుపై మందాకినీవిభ్రమం
బేమో వట్టి విడంబనమ్ము గదవే యీశాని కాత్యాయినీ !

నీ నవ్వు మొలకతో నొక చిన్నతుంపురు చంద్రబింబమై ఒకానొకటి యుద యించె నేమోయని యనుమానపడుచున్నాను. నీ నవ్వునకు పాల్కడలి ప్రతినిధి మాత్రము. వేల్పుటేటి తరంగముల శృంగారము వట్టి యనుకరుణ మాత్రము. మల్లికల సొగసులెల్ల మాయా మాత్రములే.

దుష్కర్మార్కనిసర్గ కర్క శమహాసంపర్కతప్తం మిల
త్పంకం శంకరవల్లభే మమ మనః కాంచీపురాలంక్రియే
అంబ త్వన్మృదులస్మితామృతరసే మంక్త్వా విధూయ వ్యథా
మానన్దోదయసౌధశృంగపదవీ మారోఢు మాకాఙ్క్షతి|| 36

కాంచీమండలమండనమ్మ ! విను దుష్కర్మప్రచండప్రభో
దంచచ్చండరుచిం దపించుచు మిలత్పంకుండనౌ నామదిన్
ముంచన్ నీ మృదులస్మితా௨మృతమునం బోనాడి తాపమ్ము సా
గించున్ జిన్మయసౌధశృంగవలభీక్రీడావినోదమ్ములన్.

ఓ కాంచీపురభూషణమా ! శంకర ప్రియవల్లభా ! నీ కోమలమందహాసా మృత రసముచే దుష్కర్మమనెడి సూర్యుని తీవ్రమగు వేడిమిచే దప్తమగునట్టియు పంకిల మగునట్టియు నా మనసును ముంచెత్తుము. అది దుఃఖములను విదల్చుకొని బ్రహ్మానంద సౌధశిఖరమున నధిష్ఠింపవలెనని యువ్విళ్ళూరుచున్నది.

నమ్రాణాం నగరాజశేఖరసుతే నాకాలయానాం పురః
కామాక్షి త్వరయా విపత్ప్రశమనే కారుణ్యధారాః కిరన్
ఆగచ్ఛన్త మనుగ్రహం ప్రకటయ న్నానందబీజాని తే
నాసీరే మృదుహాస ఏవ తనుతే నాథే సుధాశీతలః|| 37

నతులౌ వేల్పులకున్ విపత్తులడఁపన్ గామాక్షి ! ప్రాంచత్కృపా-
మృతధారల్ వడిఁజల్లి చల్లును వెసన్ శ్రీమన్మహానందబీ
జతతిన్ నీదగు మందహాసము సుధాశైత్యమ్ము దేవాసురో
న్నత యుద్ధాంగణజాంగలక్షితిపయిన్ సర్వార్థసంధాయిగన్.

అమృతశీతలమైన నీ నవ్వు నీ పాదములకడ వ్రాలెడి వేల్పుల యాపదలను నివారింపజేయుటయందు వేవేగ కరుణారసధారలను జల్లుచు అనుగ్రహావిర్భావమును వెలువరించుచు రాక్షసులతో వారు పోరునెడ న య్యుద్ధరంగమనెడి మెరకపొలమునం దానందబీజములను వెదజల్లుచున్నది.

కామాక్షి ప్రథమానవిభ్రమనిధిః కందర్పదర్పప్రసూ
ర్ముగ్ధస్తే మృదుహాస ఏవ గిరిజే ముష్ణాతు మే కిల్బిషమ్
యం ద్రష్టుం విహితే కరగ్రహ ఉమే శంభు స్త్రపామీలితం
స్మేరం కారయతిస్మ తాండవవినోదాహిండినా తండునా॥ 3౮

కొండొక సిగ్గుచే నడచికొన్న భవద్దరహాసమున్ గనం
దండువుచేతఁ బల్ వికటతాండవమున్ బొనరింపఁజేయు శం
భుండు వివాహవేళ సువిముగ్ధ విలాసము మందహాస మొ
క్కండు సుమాస్త్రగర్వజనకం బది నా దురితం బడంచుతన్.

కల్యాణసమయమున శంకరుడు సిగ్గుచే నడచికొన్న నీ చిరునవ్వును జూడఁగోరి తాండవవినోదమును బ్రదర్శింప నేర్చిన తన పరివారములో నొకడగు తండువుచే గంతులు వేయించి నీ చిరునవ్వును వికసింపజేయును. అట్టి ముగ్ధమనోహరమును, విలాసనిధియు, మన్మథ గర్వకారణమునగు నీ మందస్మితము నా పాపమును హరించుగాక !

క్షుణ్ణం కేనచిదేవ ధీరమనసా కుత్రాపి నానాజనైః
కర్మగ్రన్థినియన్త్రితై రసుగమం కామాక్షి సామాన్యతః
ముక్తైర్దృష్టు మశక్యమేవ మనసా మూఢస్య మే చక్షుషో
మార్గం దర్శయతు ప్రదీప ఇవ తే మన్దస్మితశ్రీ రియం॥

నలిగినదారిపో దృఢమనస్కుని కేనికొ కర్మమ న్మదుల్
దొలఁగనివారి కందనిది తోరపుమౌఢ్యముగొన్న నాదు చూ
పుల కసలే యగోచరము ముక్తికిమార్గము చూపుఁగాక నీ
యెలనగవన్న మేలిసిరి యిప్పుడు దీపమువోలె నమ్మరో !

ధీరుడైనవాని కెవ్వనికో మాత్రము నలిగినబాటయై సులభమైనదియు. కర్మగ్రంథిబంధితులగు సామాన్యుల కసులభమును. అజ్ఞాని మనసునకు నగోచరమును నగు ముక్తిమార్గమును నీ యీ మందస్మితకాంతి దీపమువలె నాకు జూపించుగాక !

జ్యోత్స్నా కాంతిభిరేవ నిర్మలతరం నైశాకరం మండలం
హంసైరేవ శరద్విలాససమయవ్యాకోచ మంభోరుహం
స్వచ్ఛైరేవ వికస్వరైరుడుగణైః కామాక్షి బింబం దివః
పుణ్యైరేవ మృదుస్మితై స్తవ ముఖం పుష్ణాతి శోభాభరమ్|| ౪౦

ఉరు నైశాకరమండలమ్ము విమలమ్మొప్పారు నవ్వెన్నెలన్
వరహంసంబులచే శరత్సమయసువ్యాకోచ మా తమ్మియున్
విరియందోఁచెడి చుక్కగుంపులఁగడున్ వెల్గున్ వియద్బింబమున్
పురుపుణ్యమ్ముల లేఁతనవ్వులన నీ మో మింపులం గుల్కెడిన్.

వెన్నెలలచేతనే చంద్రబింబము స్వచ్ఛమై రాణించును. హంసలచేతనే పద్మము శరత్కాలమందు వికాసమునొందును. చుట్టును చక్కగ మెఱయు చుక్కలచేతనే ఆకాశము శోభించును. పవిత్రములైన నీ మందస్మితములచేతనే నెమ్మోము సొంపుల నిండును బెంపొందించును.

మానగ్రంథివిధుంతుదేవ రభసా దాస్వాద్యమానే సవ
ప్రేమాడంబరపూర్ణిమాహిమకరే కామాక్షి తే తత్క్షణమ్
ఆలోక్య స్మితచన్ద్రికాం ముహు రిమా మున్మీలనం జగ్మషీం
చేత శ్శైలయతే చకోరచరితం చన్ద్రార్ధచూడామణేః|| ౪౧

మానమ్మన్మడి రాహువై గమియఁ బ్రేమస్ఫూర్తియన్ పూర్ణిమా
శ్రీ నైశాకరబింబమం దట భవచ్ఛ్రీమందహాసమ్మునాఁ
గానవ్వచ్చెడి చాయవెన్నెలకునై గాలించెడింబో చకో
రానీకమ్ముచరిత్ర మిందుమకుటవ్యాలోలచిత్తమ్ము మా !

మానము (గుట్టు) అనెడి రాహువు గ్రమ్మగా నూతనానురాగమనెడి పూర్ణిమా చంద్రబింబ మాస్వాదింపఁబడగా జూచి యల్లల్లన నుస్మీలితమగుచుండు నీ చిరునవ్వు వెన్నెలను జకోరమువోలె చంద్రమౌళిమనసు వెదకికొనుచున్నది.

కామాక్షి స్మితమంజరీం తవ భజే యస్యా స్త్విషామంకురా
నాపీనస్తనపానలాలసతయా నిశ్శంక మంకేశయః
ఊర్ధ్వం వీక్ష్య వికర్షతి ప్రసృమరా నుద్దామయా శుండయా
సూను స్తే బిసశంకయాశు కుహనాదంతావలగ్రామణీః|| ౪౨

అంకముఁజేరి పాల్గుడువ నా కుహనాగజరాజు బాలకుం
డంకిలిలేక మీఁదు గని యల్లనఁ దుండము సాఁచి యమ్మృణా
ళాంకురశంకఁ దాఁ దిగుచు నచ్చము నేసొగసెంచి యెంచి యో
శాంకరి ! దానిఁ గొల్చెదను జక్కని నీ దరహాసమంజరిన్.

నీ వలుదపాలిండ్లఁ బాల్గుడుచుతమిచే దొడపైగూర్చున్న గజాననుఁడు నీ బిడ్డ యే మందహాస విలాసమును పైపై మోమెత్తిచూచి తామరతూండ్లనుకొని మాటిమాటికి దిగుచుచుండునో యట్టి నీ చిరునవ్వుగుత్తుల తళుకు మొలకలను నేను సేవించెదను.

గాఢాశ్లేషవిమర్దసంభ్రమవశా దుద్దామముక్తాగుణ
ప్రాలంబే కుచకుంభయో ర్విగలితే దక్షద్విషో వక్షసి
యా సఖ్యేన పినహ్యతి ప్రచురయా భాసా తదీయాం దశామ్
సా మే ఖేలతు కామకోటి ! హృదయే సాన్ద్రస్మితాంశుచ్ఛటా|| ౪౩

వ్రాలినకౌగిటన్ జెదరుపాటున నీ కుచసీమనుండి ము
త్యాలసర మ్మెడమ్మువడ నచ్చఁపుఁ జెల్మిని నంతకంటెనున్
మేలగు తళ్కులన్ శివుని మించుటురమ్మున నట్టి శోభఁ దే
బోలెడు కామకోటి ! యవి పొల్చుత నా యెద నీ స్మితప్రభల్.

పరమశివుని గాఢముగ గౌగలించుకొన్న సమయమున నీ కుచకుంభములందు జెదరిన ముత్యాలహార మెడమువడఁగా దానితో జెలిమివాటించెడి నీ మందహాసప్రభలు నీ స్వామి వక్షఃస్థలమున వ్యాపించి యా ముత్యాలహారముకంటె మించిన శోభను సమకూర్చును. ఆ నీ మందహాసకాంతిపుంజము నా హృదయమునందు గంతులిడుగాక

మన్దారే తవ మన్దరస్మితరుచో మాత్సర్య మాలోక్యతే
కామాక్షి స్మరశాసనే చ నియతం రాగోదయో లక్ష్యతే
చాన్ద్రీషు ద్యుతిమంజరీషు చ మహాదోషాంకురో దృశ్యతే
శుద్ధానాం కథ మీదృశీ గిరిసుతేఽశుద్ధా దశా కథ్యతామ్|| ౪౬

మందారప్రభలందు మచ్చరము నీ మందస్మితజ్యోతి క
య్యిందుశ్రీరుచిమంజరిం గనపడున్ హేరాళదోషాంకుర
మ్మెందుం గాంతుము కామవైరియెడ నెంతే రాగ మేలమ్మ యీ
చంద మ్మచ్చములైనవాని కిటు లస్వచ్ఛత్వముల్ సెప్పవే !

నీ మందస్మితకాంతికి మందారమునెడల మాత్సర్యము గానవచ్చుచున్నది. పరమశివునం దత్యంతము రాగము కానవచ్చుచున్నది. చంద్రప్రభామంజరులందు దోషారోపణము గోచరించుచున్నది. సహజస్వచ్ఛములైనవానికి నిట్టి యస్వచ్ఛత (రాగద్వేషదోషదశ) యెందుకు బట్టినదో చెప్పుము.

పీయూషం ఖలు పీయతే సురజనై ర్దుగ్ధాంబుధి ర్మథ్యతే
మాహేశైశ్చ జటాకలాపనిగళై ర్మందాకినీ సహ్యతే
శీతాంశుః పరిభూయతే చ తమసా తస్మా దనేతాదృశీ
కామాక్షి స్మితమంజరీ తవ వచోవైదగ్ధ్య ముల్లంఘతే|| ౪౭

తమిఁబడి త్రాగివైచి రమృతమ్ము సురల్, మథనంబుచెందె నో
యమ తెలిపాలవెల్లి, శివు నా జడలున్ నిగళంబు లందె గం
గమ, వెనుజీకటన్ శశియు గానగరా డిటు నీదు నవ్వుతో
సమ మిఁక లేదు తల్లి ! వచనమ్ముల చాతురి కందరా దుమా !

అమృతమును దేవతలువైకొని త్రాగివేసిరి. పాలసముద్రము మథింపబడినది. గంగానది శివుని జటాకలాపమనెడి సంకెలల గట్టబడినది. చంద్రుడు చీఁకటి (రాహువు)చే బరాభవింపబడుచున్నాడు. కావున నీ మందహాస మంజరికి ఉపమాన మింకొకటి కనిపింపదు. మాటల నేర్పుల కది యతీతమై యున్నది.

ఆశంకే తవ మన్దహాసలహరీ మన్యాదృశీం చన్ద్రికా
మేకామ్రేశకుటుంబిని ప్రతిపదం యస్యాః ప్రభాసంగమే
వక్షోజాంబురుహే న తే రహయతః కాంచిద్దశాం కౌట్మలీ
మాస్యాంభోరుహ మంబ కిం చ శనకై రాలంబతే ఫుల్లతామ్|| ౪౮

అది యేదో యొక రీతి వెన్నెలయటం చన్మన్మతిం దోచు నీ
మృదుహాసప్రభ దేని సంగమముచే నేకామ్రనాథేశ్వరీ !
త్వదురోజాబ్జము లించుకే మునుఁగవంచా ! నీ ముఖాబ్జమ్మొ ఆ
స్పదమై యున్న దితోఽధికాద్భుతవికాసస్ఫూర్తి కిం దల్లిరో.

నీ చిరునవ్వు నొక విచిత్రమైన వెన్నెలగ భావించుచున్నాను. తత్కాంతి సంగమమున నీ కుచపద్మములు మునిగిపోవుటలేదు సరిగదా, ఒకానొక చక్కని కుట్మలదశను వీడకున్నవి. అంతియకాదు, నీ ముఖకమలముగూడ విప్పారుచున్నది.

ఆస్తీర్ణాధరకాంతిపల్లవచయే పాతం ముహు ర్జుగ్మషీ
కామద్రోహిణి మాంసలస్మరశరజ్వాలావలీ ర్వ్యంజతీ
నిన్దన్తీ ఘనసారహారవలయజ్యోత్స్నామృణాలాని తే
కామాక్షి స్మితచాతురీ విరహిణీరీతిం జగాహేతరామ్|| ౪౭

పఱచినయట్టి నీ యధరపల్లవశయ్యను వ్రాలి తూలుచున్
నెఱపి యనంగవైరిపయి నెక్కొను కౌసుమబాణవహ్ని నే
ర్తెఱ ఘనసారహారశశిదీధితులన్ బిసవల్లి దూరుచున్
నెఱి వహియించు నవ్విరహిణీదశ నీ చిరునవ్వుచాతురుల్.

నీ యధరకాంతియను లేజిగురుపాన్పునందు మాటిమాటికి వ్రాలి తూలుచు. గామవైరిపై మన్మథబాణాగ్నిజ్వాలల నెరపుచు, పచ్చకప్పరము ముత్యాలహారములను వెన్నెలలను దామరతూటిదారములను నిందించుచు, నీ చిఱునవ్వు జాణతనము నిర హిణీదశను బొచ్చుచున్నది.

సూర్యాలోకవిధౌ వికాసమధికం యాన్తీ హరన్తీ తమ
స్సన్దోహం నమతాం నిజస్మరణతో దోషాకరద్వేషిణీ
నిర్యాన్తీ వదనారవిన్దకుహరా న్నిర్ధూతజాడ్యా నృణాం
శ్రీకామాక్షి తవ స్మితద్యుతిమాయీ చిత్రీయతే చన్ద్రికా|| ౪౮

ఒక చందమ్మగుచంద్రికాసముదయ మ్మోయమ్మ ! నీ నవ్వు చి
మ్ముకవచ్చున్ వదనారవిందకుహరమ్మున్ జాడ్య మావంత లే
దు కదా ! ఆనతులై తలంచుకతనన్ దోషాకరున్ లెక్కసే
యక కామాక్షి ! తమ మ్మడంచెడిని సూర్యాలోకవిస్ఫూర్తియై.

నీ చిరునవ్వు ఒక వింత వెన్నెలగా గన్పించుచున్నది. అది సూర్యాలోకమం దెక్కువ నికాసమును బొందుచున్నది. శ్లేష-సూరి+ఆలోకవిధి – జ్ఞానుల దృష్టి యందు తమస్సును హరించుచున్నది. (అసలు వెన్నెల దమస్సుచే ననగా రాహువుచే నాక్రాంతమగును) భక్తులు తలంచిన మాత్రమున వారిలోని దోషములకు బాధకమ గుచున్నది. శ్లేష=దోషాకర-- చంద్రునియెడ ద్వేషముగలదగుచున్నది. నీ ముఖమనెడి పద్మమునుండి వెడలుచున్నది. మానవుల జాడ్యమును హరించుచున్నది.

కుంఠీకుర్యు రమీ కుబోధఘటనా మస్మన్మనోమాథినీం
శ్రీకామాక్షి శివంకరా స్తవ శివే శ్రీమన్దహాసాంకురాః
యే తన్వన్తి నిరన్తరం తరుణిమస్తంబేరమగ్రామణీ
కుంభద్వంద్వవిడంబిని స్తనతటే ముక్తాకుథాడంబరమ్॥ ౪౯

పటుతారుణ్యకరీంద్రకుంభయుగలిన్ భాసిల్లి ముత్యాల దు
ప్పటియన్నట్టులు మొల్కనవ్వులు భవద్వక్షోజయుగ్మమ్మునన్
జటులస్ఫూర్తి నటించు నాదు మనసున్ స్తంభింపఁగాఁజేసి యు
ద్భటదుర్బోధ మడంచు గావుత నుమా ! భద్రానుసంధాయులై.

యౌవనమనెడి మదగజముయొక్క కుంభస్థలములన్నట్లు భాసిల్లు నీ కుచకుంభము లందు పఱచిన ముత్యాలరత్నకంబళముయొక్క శోభను విస్తరింపజేసెడి శివంకరములైన నీ మందహాసాంకురములు నా మనసును స్తంభింపజేయు నజ్ఞానఘటన నడంచుఁగాక!

ప్రేంఖన్తః శరదంబుదా ఇవ శనైః ప్రేమానిలైః ప్రేరితా
మజ్జన్తో మదనారికంఠసుషమాసిన్ధౌ ముహు ర్మంథరమ్
శ్రీకామాక్షి తవ స్మితాంశునికరాః శ్యామాయమానశ్రియో
నీలాంభోధరనైపుణీం తత ఇతో నిర్నిద్రయం త్యంజసా॥ ౫౦

శారదవేళ మేఘములచాయను జాగుచు ప్రేమవాయువుల్
ప్రేరణ సేయ మున్కలిడి వేమరు శంకరుకంఠకాంతియన్
నీరధి నీ స్మితాంశుతతి నీలరుచిన్గని నీలమేఘ శృం
గారము జాగృతిన్ గొలుపుఁగాదె హిమాచలకన్యకామణీ.

ప్రేమవాయువులచే బ్రేరితములైన నీ మందహాసములు శరత్కాల మేఘములట్లు జాగి మన్మథవైరికంఠకాంతియనెడి సముద్రమున మునిగి నలుపుగొన్నవై నీలమేఘ సౌందర్యమును మెఱయించుచున్నవి.

వ్యాపారం చతురాననైకవిహృతౌ వ్యాకుర్వతీ కుర్వతీ
రుద్రాక్షగ్రహణం కరేణ సతతం వాగూర్మికల్లోలితా
ఉత్ఫుల్లం ధవలారవింద మధరీకృత్య స్ఫురన్తీ సదా
శ్రీకామాక్షి సరస్వతీ విజయతే త్వన్మందహాసప్రభా॥ ౫౧

అక్షయవాక్తరంగకళయై చతురాస్యవిహారమూని రు
ద్రాక్షవిలాసముంగొని కరమ్మున విచ్చిన పుండరీక మే
ణాక్షి ! యధఃకరించుచు నిరంతర మీ చిరునవ్వుశోభ కా
మాక్షి ! సరస్వతీస్ఫురణ నభ్యుదయోదయమూర్తిఁ గుల్కెడిన్.

నీ మందహాసప్రభ చతుర + అనన + ఏక + విహృతౌ = నేర్పరులగు కవుల నెమ్మోమున విహరించుటయందు శ్లేష -- బ్రహ్మయొక్క ముఖమునందు విహరించుటయందు ప్రవర్తించుచున్నదై, సరసవచస్తరంగిణియై కరముచే (కాంతికిరణముచే) రుద్ర + అక్షగ్రహణమ్ కుర్వతీ = శివుని చూడ్కి నాకర్షించుచున్నదై శ్లేష -- రుద్రాక్షమాల దాల్చినదై విచ్చిన తెల్లదామర పువ్వును గ్రిందొవరించి విలసిల్లుచున్నదై (తెల్లతామరపువ్వుకంటె మించిన తెలికాంతితో విలసిల్లుచున్నది) శ్లేష -- తెల్లదామరపూగద్దెపై యనగా పుండరీకముపై గూర్చున్నదియగు సరస్వతియై సర్వోన్నతి నందుచున్నది.

కర్పూరద్యుతితస్కరేణ మహసా కల్మాషయత్యాననమ్
శ్రీకాంచీపురనాయికే పతిరివ శ్రీమన్దహాసోఽపి తే
ఆలింగ త్యతిపీవరాం స్తనతటీం బింబాధరం చుంబతి
ప్రౌఢం రాగభరం వ్యనక్తి మనసో ధైర్యం ధునీతేతరామ్॥ ౫౨

ఘనసారద్యుతి తస్కరమ్మగు రుచిన్ గాలుష్యమున్ నించి మో
మునఁ గాంచీపుర నాయికాధవుని సొంపుంబూని నీ నవ్వు నీ
స్తనయుగ్మమ్ము గవుంగలించు నెఱపున్ రాగమ్ము బింబాధర
మ్మును ముద్దాడును చిత్తపుంబిగువునున్ బోనాడెడుం దల్లిరో !

ఓ కాంచీపురాధీశ్వరీ ! నీ నవ్వు పచ్చకప్పురపు తళుకును దొంగిలేడికాంతిచే నీ ముఖమును నీ స్వామివలె నలముకొనుచున్నది. సమున్నతస్తనతటమును గౌగలించుకొనుచున్నది. దొండపండువంటి నీ కెంపెదవిని ముద్దాడుచున్నది. రాగాతిశయమును బ్రకటించుచున్నది. మనోధైర్యమును విదిలించుచున్నది.

వైశద్యేన చ విశ్వతాపహరణ క్రీడాపటీయస్తయా
పాండిత్యేన పచేలిమేన జగతాం నేత్రోత్సవోత్పాదనే
కామాక్షి స్మితకందలై స్తవ తులా మారోఢు ముద్యోగినీ
జ్యోత్స్నా సా జలరాశిపోషణతయా దూష్యాం ప్రపన్నా దశాం॥ ౫౩

ఎల్ల జగమ్ముతాపము హరించెడి యాటల నేర్పునందు నీ
యెల్లర కంటివిందు లొనరించుటఁ బండిన పాండితిన్ సము
త్ఫుల్ల భవత్స్మితాంకురముతోఁ దులతూగియుఁగూడ వెన్నెలల్
తల్లిరొ ! నిందపాల్పడెఁ గదా జననీ ! జడరాశిపోషణన్.

లోకముయొక్క తాపములను హరించెడి విలాసక్రీడయందుగల దార్ఢ్యముచేతను, స్వచ్ఛతచేతను, జగత్తులకు కన్నులపండువు సేయుటయందలి పాండిత్యముచేతను నీ చిరునవ్వుమొలకతో సామ్యమును బడయుటకు బ్రయత్నించియు నీ వెన్నెల జలరాశిని =సముద్రమును శ్లేష -- జడరాశి = జడులయొక్క సమూహమును బెంపొందించున దగుటచేత నింద్యదశను పొందినది. నీ నవ్వు చైతన్యవర్ధకము. కావున జడపోషకమైన వస్తువు దానికి సాటికానేరదని భావము. వెన్నెలకంటెను దేవిచిరునవ్వు సొగసైనదని తాత్పర్యము.

లావణ్యాంబుజినీమృణాలవలయై శ్శృంగారగన్ధద్విప
గ్రామణ్యః శ్రుతిచామరై స్తరుణిమస్వారాజ్యబీజాంకురైః
ఆనన్దామృతసిన్ధువీచిపృషతై రాస్యాబ్జహంసై స్తవ
శ్రీకామాక్షి మథాన మన్దహసితై ర్మత్కం మనఃకల్మషమ్॥ ౫౪

నిగనిగ తమ్మితూండ్ల నెఱ నీటులు నందము పేరివేల్పుటే
నుగుశ్రుతిచామరమ్ములు మనోహరయౌవనదేవరాజ్య మిం
పుగ మొలపించు బీజములు; మోదసుధాంబుధిలోనిచిన్కులున్
మొగమను తమ్మి హంసలయి పొల్చెడి నవ్వుల దోషమార్పవే.

లావణ్యమనెడి తామరపువ్వుయొక్కతూండ్లును శృంగారమనెడి మదపుటేనుగు యొక్క కర్ణచామరములును, యౌవనమనెడి స్వారాజ్యమును మొలపింపఁజేయు విత్తనములును ఆనందామృతసముద్రతరంగములపై చినుకులును, నీ ముఖమనెడి పద్మమునందు మసలు హంసలును నగు నీ చిరునవ్వులచే నా మనస్సులోని కల్మషమును విఱిచివేయుము.

ఉత్తుంగస్తనమండలీపరిచల న్మాణిక్యహారచ్ఛటా
చంచ చ్ఛోణిమపుంజమధ్యసరణిం మాతః పరిష్కుర్వతీ
యా వైదగ్ధ్య ముపైతి శంకరజటాకాంతారవాటీ పత
త్స్వర్వాపీపయసః స్మితద్యుతి రసౌ కామాక్షి తే మంజులా|| ౫౫

లాలన నున్నతస్తన చలన్మణిహారము కెంపుచాయలం
దోలి నటించి మధ్యమున నుద్ధతి శంభుజటాటవీకుటిం
దూలి కడున్ వడిం దుముకు తోయము తోయము వింతనేరుపుల్
గ్రాలెడు నీదు లేనగవుకాంతు లనంతసుఖమ్ము లిచ్చుతన్.

ఉన్నతకుచకుంభములందు గదలెడి మణిహారములచే గులుకు నెరుపు కాంతి నడిమిభాగమును అలంకరించినదై శంకరుని జటామండలమనెడి వనవాటిం దుముకు మందాకినీ జలముల చాతుర్యమును వడయు నీ యీ చిరునవ్వు మనోహరమై యొప్పుచున్నది.

పన్నామైకజుషా జనేన సులభం సంసూచయన్తీ శనై
రుత్తుంగస్య చిరా దనుగ్రహతరో రుత్పత్స్యమానం ఫలం
ప్రాథమ్యేన వికస్వరా కుసుమవ త్ప్రాగల్భ్య మభ్యేయుషీ
కామాక్షి స్మితచాతురీ తవ మమ క్షేమంకరీ కల్పతామ్|| ౫౬

మంచి యశమ్ముగొన్న యొక మానిసిమూలమునన్ సమున్నతిన్
గాంచిన య య్యనుగ్రహ మనందగు చెట్టునఁ బండు పండు సూ
చించుచు నంతమున్న వికసించిన చొక్కపుఁ బువ్వువోలె రా
ణించెడు నీదు లేనగవునేరిమి మా కొసగున్ శుభంబులన్.

మంచి యశస్సు గడించిన యొకానొక పురుషుని మూలమున అనుగ్రహమనెడి యొక మహావృక్షమునుండి పుట్టినఫలమును సూచించుచు నంతకు ముందుగ పూచి వికసించిన పువ్వువోలె రాణింపు వడసిన నీ చిరునవ్వునేరిమి నాకు క్షేమము గూర్చునది యగుగాక !

ధానుష్కాగ్రసరస్య లోలకుటిలభ్రూలేఖయా బిభ్రతో
లీలాలోకశిలీముఖం నవవయ స్సామ్రాజ్యలక్ష్మీపుషః
జేతుం మన్మథమర్దినం జనని తే మన్దస్మితప్రక్రమో
వల్గు ర్విభ్రమభూభృతో వితనుతే సేనాపతిప్రక్రియామ్|| ౫౭

పొలుపౌ విభ్రమచక్రవర్తి చలితభ్రూరేఖ చేఁబట్టి మేల్
విలుకాఁడై కొని చూపుబాణములఁ బూవిల్కాని శత్రున్ వడిన్
గెలువన్ యౌవనరాజ్యలక్ష్మిఁ బెనుపన్ లీలావినోదమ్ములన్
జలుపున్ వల్గువు నీదు లేనగవు దా సైన్యాధిపప్రక్రియన్.

విలాసమనెడి యొకానొక ప్రభువు నవయౌవనసామ్రాజ్యలక్ష్మిని బెంపొందించుకొనుటకు నీ చంచలించు వక్రమైన కనుబొమలతీరుచే మేటివిలుకాఁడై విలాసముకులుకు నీ చూపులనెడి బాణముం గొని మన్మథుని మర్దించినవానిం జయించుటకు పూనుకొనగా నతని యెడ నీ చిరునవ్వుతీరు సేనాధిపత్యమును బ్రకటించుచున్నది.

య న్నాకంపత కాలకూటకబలీకారే చుచుంబే న యద్
గ్లాన్యా చక్షుషి రూషితానలశిఖే రుద్రస్య తత్తాదృశమ్
చేతో యత్ప్రసభం స్మరజ్వరశిఖిజ్వాలేన లేలిహ్యతే
త త్కామాక్షి తవ స్మితాంశుకణికా హేలాభవం ప్రాభవమ్||

వణకదు కాలకూటవిషభక్షణకున్ శివదేవుచిత్త ము
ల్బణమగు కంటిమంట వసివాడదు మన్మథవహ్నికీలకున్
జుణిగి కరంగి పార దది చూ భవదీయ దరస్మితాంశువుం
గణిక విలాసవైభవ మొకానొకటైన ప్రభావ మీశ్వరీ !

కాలకూట విషమును భక్షింపవలసినపుడైన శివుని చిత్తము వణకలేదు. మూడవ కంట నెగసిన మంటకైన నది వసివాడలేదు. మన్మథ జ్వరాగ్నికైన నది కరిగి నీరు కాలేదు ఇట్లు కాకుండుటయెల్ల నీ చిరునవ్వు మొలకయొక్క విలాససంభవమైన మొకానొక ప్రభావమే.

ంభిన్నేవ సుపర్వలోకతటినీ వీచీచయై ర్యామునైః
ంమిశ్రేవ శశాంకదీప్తిలహరీ నీలై ర్మహానీరదైః
ామాక్షి స్ఫురితా తవ స్మితరుచిః కాలాంజనస్పర్ధినా
ిలిమ్నా కచరోచిషాం వ్యతికరే కాంచి ద్దశా మశ్నుతే||

లుపుటేరు న య్యమునవీచికలన్ విరఁబారినట్టుగాన్
పయోదరాజి రజనీకరు వెన్నెలజాలు నేకమౌ
లిక నీదు లేనగవుపొల్పది పొల్పగు నల్లకాటుకన్
ాలుచుఁ గొప్పున న్నలుపుతోడి జతన్ గను నొక్క యందమున్.

యమునాతరంగములచే గంగానది యొరసికొని విరబారినట్లు, వెన్నెల క్రొక్కారు నీలమేఘములతో నేకమైనట్లు, నీ చిరునవ్వు సొంపు నల్లకాటుకను ధిక్కరించు నీ తలకట్టునందలి నలుపుతోడ గూడి యొకానొక వింతసొంపు వడయుచున్నది.

జానీమో జగదీశ్వరప్రణయిని త్వన్మందహాసప్రభామ్
శ్రీకామాక్షి కుముద్వతీ మభినవా మేషా యత స్సర్వదా
ఆస్యేందో రవలోకనే పశుపతే రభ్యేతి సంఫుల్లతాం
తన్ద్రాలు స్తదభావ ఏవ తనుతే తద్వైపరీత్యక్రమమ్॥ ౬౦

అచ్చము నీదు లేనగవునందలి యా ప్రభ కల్వకన్నెయై
విచ్చును శంకరాస్యశశిబింబము దర్శవమైనయంతటన్
నిచ్చలు; కానిచో ముణిగి నిద్దురమోమగు, వింతకారణం
మ్మిచ్చట నంతకంటె జగదీశమనఃప్రియ ! వేఱ యేమగున్.

ఓ జగదీశ్వరవల్లభా ! నీ మందహాసప్రభ యొకానొక కలువకన్నియ యని గ్రహించినాము. కారణ మేమనఁగా నది శంకర ముఖచంద్రబింబదర్శనమైన యంతటనే చక్కగ వికసించుచున్నది. అది కానపుడు ముడిగి నిద్దుర మోమగుచున్నది.

యాస్తి లోహితభావ మభ్రతటినీ ధాతుచ్ఛటాకర్దమై
ర్యాన్తి బాలగభస్తిమాలికిరణై ర్మేఘావలీ శారదీ
బింబోష్ఠద్యుతిపుంజచుంబనకలా శోణాయమానేన తే
కామాక్షి స్మితరోచిషా సమదశా మారోఢు మాకాఙ్క్షతే॥ ౬౧

గైరిక ముఖ్యధాతురసకర్దమముంగొని యెఱ్ఱవారి భా
గీరథి, బాలభానుకరకీలితమై శరదంబుదాళియున్
నీ రుచిరోష్ఠబింబరుచినీటులచే నెఱుపెక్కుచున్న యా
తోరపు మొల్కనవ్వుకళతోఁ దులఁదూగఁ దలంచు నమ్మరో !

గైరికాది ధాతురసములచే నెఱ్ఱవారి ఆకాశగంగయు బాలసూర్యకిరణ సంపర్కము వడసి శరత్కాలమేఘపంక్తియును, నీ యెఱ్ఱని యధరోష్ఠబింబమందలి కాంతులచే నెఱుపుడాలు వడసిన నీ చిరునవ్వుకళతో దులతూగవలెనని వేడుకపడుచున్నవి.

శ్రీకామాక్షి ముఖేన్దుభూషణమిదం మన్దస్మితం తావకం
నేత్రా నన్దకరం తథా హిమకరో గచ్ఛే ద్యథా తిగ్మతామ్
శీతం దేవి తథా యథా హిమజలం సంతాపముద్రాస్పదం
శ్వేతం కించ యథా తథా మలినతాం ధత్తే చ ముక్తామణిః॥ ౬౨

శ్రీకామాక్షి ! ముఖేందుభూషణము నీ చిర్నవ్వు జాబిల్లియున్
గాకల్ సెందెదునంతగాఁ గనులకున్ గల్పించు నాహ్లాదమున్
వీకన్ మం చుడుకున్ వహించునటుగా నిండించెడిన్ జల్వ లా
హా ! కాలుష్యముఁ గైకొనంగ మనుముత్య మ్మచ్ఛ మచ్ఛమ్మగున్.

ఓ కామాక్షీ ! నీ ముఖచంద్రభూషణమగు లేనవ్వు చంద్రుఁడుకూడ లోలోన నుడికిల్లునంతగా మా కనుల కాహ్లాదము గల్పించుచున్నది. మంచుకూడ కాకవహిం చునంతగా చలువలను నించుచున్నది. అచ్ఛమైన మంచిముత్యముకూడ కాలుష్యము చెందునంతగా మిగుల స్వచ్ఛమై యొప్పుచున్నది.

త్వన్మన్దస్మితమంజరీం ప్రసృమరాం కామాక్షి చన్ద్రాత్రితపం
సంత స్సంతత మామన న్త్యమలతా తల్లక్షణం లక్ష్యతే
అస్మాకం న ధునోతి తాప మధికం దూనోతి నాభ్యన్తరమ్
ధ్వాన్తం తత్ఖలు దుఃఖినో వయమమీ కేనేతి నో విద్మహే|| ౬౩

నునుపూగుత్తిని నీదు లేతనగవున్ దొల్కాఁడు నవ్వెన్నెలం
చును వర్ణింతురు బుద్ధిమంతు లిదియున్ శుద్ధంబుగాబట్టి ; యై
నను మా కాఁక లడంపఁకున్నదది యంతర్ధ్వాంతముం జింపఁబో
దనయు మ్మేలకొ మేము శోకవశులై యారాటముం జెందుటల్.

నీ చిరునవ్వు పూగుత్తిని వెన్నెలయని సత్కవులు వర్ణించుచున్నారు. స్వచ్ఛత్వము తల్లక్షణముగా గనబడుచునే యున్నది. అయినను అది మా తాపమును హరించుటలేదు. లోలోని చీకటిని అనఁగా అంతరంగగతమైన అజ్ఞానమును వారింపకున్నది. మే మిట్లు దుఃఖవశులమై యుండుట యెందువలననో తెలిసికొనలేకున్నాము.

నమ్రస్య ప్రణయప్రరోహకలహచ్ఛేదాయ పాదాబ్జయో
ర్మన్దం చన్ద్రకిశోరశేఖరమణేః కామాక్షి రాగేణ తే
బన్ధూకప్రసవశ్రియం జితవతో బంహీయసీం తాదృశీం
బింబోష్ఠస్య రుచిం నిరస్య హసితజ్యోత్స్నా వయస్యాయతే|| ౬౪

పొలయలుకన్ వినమ్రుడయి పూని పదమ్ముల నల్లవ్రాలు న
చ్చలి వెలుగుంగిశోరము లసన్మణిశేఖరమైన వాని లోఁ
గులికెడు నట్టి రాగమునకుం జెలియయ్యెడు నీదు నవ్వువె
న్నెల నునుమంకెనం గెలుచు నీ యధరద్యుతి నెట్టి దూకుచున్.

రాగముచే (ఎఱుపుచే) మంకెనపూవుయొక్క యాలాటి సుసంపన్నమైన శోభను జయించునట్టి, దొండపండువంటి నీ పెదవియొక్క కాంతిని త్రోసిపుచ్చి, నీ ప్రణయ కలహమును వారించుటకు నీ పాదములపై వ్రాలిన చంద్రశేఖరులకు నెచ్చెలివలె నీ చిరునవ్వువెన్నెల యుపచరించుచున్నది. నీ మందహాసము శివుఁడు నీ పొలయలుక తగ్గినదని గ్రహించి యానందభరితుడగుటకు సాయపడుచున్నదని భావము.

ముక్తానాం పరిమోచనం విదధత స్తత్ప్రీతినిష్పాదినీ
భూయో దూరత ఏవ ధూతమరుత స్తత్పాలనం తన్వతీ
ఉద్భూతస్య జలాన్తరా దవిరతం తద్దూరతాం జగ్ముషీ
కామాక్షి స్మితమంజరీ తవ కథం కంబో స్తులా మశ్నుతే॥ ౬౫

ముక్తాళిన్ విడుచున్ నిజమ్మది యిద్దో మోదంబిడున్ వానికిన్
రక్తిన్, దవ్వు మరున్నిరోధులకుఁ దద్రక్షాచణమ్మిద్ది యా
సక్తిన్, బుట్టె జలంబునం దది యిదో జాడ్యానకుం దూర, మే
యుక్తిన్ సామ్యము తెల్పు నీ నగవుతో నోయమ్మ ! శంఖానకున్.

శంఖము ముత్యములను విరజిమ్మును. నీ చిరునవ్వు వానికి ఉల్లాసము గల్పించును. శంఖము ధూతమరుతః=దేవతాదూరులకు దూరమయినది. నీ నవ్వు ధూతమరుతః= ప్రాణాయామాదులచే వాయువును నిరోధించిన యోగులకు సంరక్షకము. శంఖము జలాంతరమునుండి పుట్టినది. నీ నవ్వో జల (డ) +అంత రాత్ జడమతులయినవారికి దూరమగును. కాన నీ చిరునవ్వు శంఖమున కెట్లు సాటియగును?

శ్రీకామాక్షి తవ స్మితద్యుతిఝరీవైదగ్ధ్యలీలాయితమ్
పశ్యన్తో౽పి నిరన్తరం సువిమలంమన్యా జగన్మండలే
లోకం హాసయితుం కిమర్థ మనిశం ప్రాకాశ్య మాతన్వతే
మన్దాక్షం విరహయ్య వస్తువిభవం మన్దారచంద్రాదయః॥ ౬౬

అమ్మా ! నీ దరహాసపూరమున జాలై వారు నందమ్ము చం
దమ్మున్ దా నిరతమ్ము గన్గొనియునున్ మందారమున్ జంద్రుఁడే
లమ్మా ! సిగ్గరి యీ జగాన జగమహో ! నవ్విపోఁజేతు రో
యమ్మా ! స్వచ్ఛులమంచు వెల్వఱచి తా రా వస్తు వీ వస్తువున్.

అమ్మా ! నీ చిరునవ్వుకాంతిప్రవాహముయొక్క విలాసమును జూచుచుంగూడ యీ జగమ్మున తామే స్వచ్ఛమైనవార మనుకొని మందారవృక్షము, చంద్రుడు మొదలయినవారు సిగ్గు విడిచి తమ వెలుగులచే నా యా వస్తువులను వెలువరింతురు. ఇది యెందుల కమ్మా !

క్షీరాబ్ధేరపి శైలరాజతనయే త్వన్మందహాసస్య చ
శ్రీకామాక్షి వలక్షమోదయనిధేః కించిద్భిదాం బ్రూమహే।
ఏకస్మై పురుషాయ దేవి స దదౌ లక్ష్మీం కదాచిత్పురా
సర్వేభ్యోఽపి దదాత్యసౌ తు సతతం లక్ష్మీం చ వాగీశ్వరీమ్॥ ౮౭

ఓ గిరికన్య ! పాల్కడలి కొద్దిక నచ్చపుకాంతి నిగ్గులన్
దూగెడు నీదు నవ్వులకు దోచిన భేద మొకింత సెప్పెదన్
సాగరుఁ డిచ్చె లచ్చి నొకసామికి మున్నొకనా డిదెప్పుడున్
వాగధినాయికన్ సిరి నవారిగ నిచ్చెడు నెల్లవారికిన్.

తెలుపు సమృద్ధికి నిధియైన నీ మందహాసమునకు పాలసముద్రమునకును నొక్కింత భేదమున్నదని చెప్పుచున్నాము. క్షీరసముద్రము ఒకానొక పురుషునికే లక్ష్మినీయ గల్గెను. నీ నవ్వు అందరికిని లక్ష్మీప్రసన్నతనే కాక సరస్వతీప్రసన్నతనుగూడ కల్పించుచున్నదమ్మా.

శ్రీకాంచీపురరత్నదీపకలికే తాన్యేవ విశ్వాంతరే
చాకోరాణి చరాచరేశ్వరి పరం ధన్యాని మన్యామహే।
కంపాతీరకుటుంబచంక్రమకలాచుంచూని చంచూపుటై
ర్నిత్యం యాని తవ స్మితేందుమహసా మాస్వాద మాతన్వతే॥ ౮౮

కాంచీపట్టణరత్నదీపకలికా ! కామాక్షి ! కంపాతట
ప్రాంచచ్చారు కుటుంబ చంక్రమకళాపారీణముల్ నిచ్చలున్
చంచుశ్రేణుల నీ ముఖేందురుచి నాస్వాదించు నన్నేర్మి నూ
హించన్ ధన్యము లా చకోరములు తల్లీ ! యెల్ల విశ్వమ్మునన్.

ఓ కాంచీపురరత్నదీపకలికా ! కంపాతీరకుటుంబములందు సంచరించు కళలందు నేరిమిగన్నవై ఏ చకోరసమూహములు నిరంతరమును దమ చంచువులచే నీ మందహాసచంద్రికాస్వాదమును జేయుచుండునో ఆ చకోరకులములే మిక్కిలి ధన్యములని భావించుచున్నాము. నీ దరహాసమును నిరంతరము దర్శించు మహాయోగులు కృతార్థులని భావము.

శైత్యప్రక్రమ మాశ్రితోఽపి నమతాం జాడ్యప్రథాం ధూనయ
న్నాగవ్యంజనపేశలోఽపి గిరిశే వైమల్య ముల్లాసయన్।
లీలాలాపపురస్సరోఽపి సతతం వాచంయమాన్ ప్రీణయ
న్కామాక్షి స్మితరోచిషాం తవ సముల్లాసః కథం వర్ణ్యతే॥ ౮౯

చల్లనిదయ్యు నాశ్రితుల జాడ్యము మాటవిదల్చు; కొండ రా
జల్లునిపైని రాగమును వ్యక్తమొనర్చును మార్దవాన శో
భిల్లుచు స్వచ్ఛతన్ గొలువు నింపగుపల్కుల ముందు జాగి రం
జిల్లఁగఁజేయు మౌనులను నీ దరహాసవిలాస మేమనన్.

నీ చిరునవ్వుల సముల్లాస మేమని వర్ణింతుము ? అది తాను నిత్యము చలువతో నుండియు, తనయెడ వినతులైనవారి జాడ్యమును విదిలించుచున్నది. తాను పరమనిర్మలభావమున గూడియు, శంకరుని రాగాకులు నొనరించి త్రిప్పటబెట్టుచున్నది. విలాసభాషణములకు దాను ముందగుచు గూడ, మౌనులకు ప్రీతి గల్పించుచున్నది

శ్రోణీచంచల మేఖలాముఖరితం లీలాగతం మంథరం
భ్రూవల్లీచలనం కటాక్షవలనం మందాక్షవీక్షాచణమ్
యద్వైదగ్ధ్యముఖేన మన్మథరిపుం సమ్మోహయ త్యంజసా
శ్రీకామాక్షి తవ స్మితాయ సతతం తస్మై నమస్కుర్మహే|| ౭౦

మెలఁగునితంబసీమ మణిమేఖలఘల్లుల లింపుగుల్కు న
య్యలసగతుల్ కనుంబొమలు నానును సిగ్గులవాలుఁజూపులో
జలనము దేని నేరిమిపసం గొని యా స్మరవైరి మోహితుం
జలుపునొ యట్టి నీదు చిఱునవ్వుల కంజలిగూర్తు మమ్మరో !

పిఱుదులపై గదలు మొలనూలి ఘలఘలలతో గూడిన మందవిలాస గమనము, సిగ్గుదొలకు చూపుల నేరిమితో గూడిన కనుబొమల కదలికగల వాలుజూపుల విభ్రమమున్నూ ఏ చిఱునవ్వుల నేరిమి నూతసేసికొని మన్మథవైరిని మోహింపజేయుచుండునో యట్టి నీ చిఱునవ్వున కెప్పుడు నమస్కరింతుము.

శ్రీకామాక్షి మనోజ్ఞమందహసితజ్యోతిష్ప్రరోహే తవ
స్ఫీతశ్వైతిమసార్వభౌమసరణిప్రాగల్భ్య మభ్యేయుషి|
చన్ద్రోఽయం యువరాజతాం కలయతే చేటీధురం చన్ద్రికా
గంగా సా చ సుధాఝరీ సహచరీ సాధర్మ్య మాలంబతే|| ౭౧

అందము గుల్కు నీ నగవు న వ్వెలుగుంజిరుమొల్క తెల్పు నా
విందగు సార్వభౌమపదవిన్ గడు రీవి వహింప జంద్రుఁ డం
దొందును యౌవరాజ్యపద; మూనును వెన్నెలచేటిభావ మిం
పొందఁగఁ జెల్మికత్తెయయి యొప్పను గంగ సుధాస్రవంతియున్.

నీ సుందర మందహాసాంకురము నిండైన తెలుపురంగుయొక్క సార్వభౌమాధికారము నుబడయుగా చంద్రుడు దానికడ యువరాజభావమును, వెన్నెల నెచ్చెలితనమును, అమృతంపువాకయగు గంగ సఖీసాధర్మ్యమును నెఱపుచున్నవి.

జ్యోత్స్నా కిం తనుతే ఫలం తనుమతా మౌష్ణ్యప్రశాంతిం వినా
త్వన్మందస్మితరోచిషా తనుమతాం కామాక్షి రోచిష్ణునా॥
సంతాపోఽపి నివార్యతే నవవచఃప్రాచుర్య మంకూర్యతే
సౌన్దర్యం పరిపూర్యతే జగతి సా కీర్తిశ్చ సంచార్యతే॥ ౮౨

వేడిమి వాపుకంటె మఱి వెన్నెల చేయు విశేషమేమి ? బల్
వేడిమి నాపు నీ నగవు పోనడచున్ పరితాప మమ్మరో
యీడగు పల్కుసొంపు మొలపించును జక్కఁదనాల నించెడిన్
వాడని కీర్తియున్ జగమునన్ బ్రసరింపఁగఁజేసెడిం గదే !

వెన్నెల ప్రాణుల యుడుకు నుపశమింపజేయుటకంటె విశేషఫల మేమి కూర్చుచున్నది? మిగుల మెఱయు నీ మందహాసప్రభయో తాపమును వారించుచున్నది. వినూతన వాఙ్నైపుణ్య మంకురిపజేయుచున్నది. లోకమున సౌందర్యము నించుచున్నది. సాటిలేని కీర్తిని వ్యాపింపజేయుచున్నది.

వైమల్యం కుముదశ్రియాం హిమరుచః కాంత్యైవ సంధుక్ష్యతే
జ్యోత్స్నారోచిరపి ప్రదోషసమయం ప్రాప్యైవ సంపద్యతే।
స్వచ్ఛత్వం నవమౌక్తికస్య పరమం సంస్కారతో దృశ్యతే
కామాక్ష్యా స్మితదీధితే ర్విశదిమా నైసర్గికో భాసతే॥ ౮౩

హిమకరుకాంతిచేతఁ దళుకెక్కును గల్వసిరుల్, ప్రదోష కాలమునన కుల్కు వెన్నెల విలాసరుచుల్, నునుముత్తియంబు న
చ్చము తెలికాంతి యయ్యెదియు సంస్కరణైకవశంబ, తల్లి ! నీ
విమల దరస్మితంబు తెలివింతరుచుల్ సహజంబు

కలువల సిరులకు వెన్నెలల వెలుగులచే స్వచ్ఛత ఇనుమడించుచున్నది. వెన్నెలకు బ్రదోషసమయులాభముచేతనే శోభ నిండుచున్నది. తెలిముత్తియమునకు సంస్కారము చేతనే (పులుగడుగుటచేత) యచ్ఛమైన కాంతి సిద్ధించుచున్నది. అమ్మా ! నీ చిరునవ్వు కాంతికిమాత్రము స్వచ్ఛత్వము స్వభావముగనే సిద్ధించుచున్నది.

ప్రాకాశ్యం పరమేశ్వరప్రణయిని త్వన్మన్దహాసశ్రియః
శ్రీకామాక్షి మమ క్షిణోతు మమతావైచక్షణీ మక్షయామ్|
యద్భీత్యేవ నిలీయతే హిమకరో మేఘోదరే శుక్తికా
గర్భే మౌక్తికమండలీ చ సరసో మధ్యే మృణాలీ చ సా|| ౭౪

ఏ వెలుఁగన్నభీతి రజనీశుఁడు మబ్బులలోన నక్కు, ము
క్తావళి చిప్పలోనడఁగు, నద్దిర తామరతూఁడు నీళ్ళలో
నా విధి నీదు, నా మృదులహాసము మేల్సిరివెల్గువాక మ
ద్భావముఁ బాయకున్న మమతాగుణజృంభణ మాపుగావుతన్.

ఏ నీ మందహాససంపద తళుకునకు జడిసి చంద్రుడు మేఘములలో దాగుచున్నాడో, ముత్తెములగుంపు ముత్తెపుంజిప్పలలో నిఱుకుకొనుచున్నదో, తామరతూడు మడుగునడుమ నడగుచున్నదో అట్టి నీ దరహాసలక్ష్మీప్రభ నాలోని తెగని మమకారమును హరించుగాక !

హేరంబే చ గుహే చ హర్షభరితం వాత్సల్య మంకూరయ
న్మారద్రోహిణి పూరుషే సహభువం ప్రేమాంకురం వ్యంజయన్
ఆనమ్రేషు జనేషు పూర్ణకరుణావైదగ్ధ్య ముత్తాలయ
న్కామాక్షి స్మితమంజరీ తవ కథంకారం మయా కథ్యతే|| ౭౫

లలి హేరంబునిపైఁ గుమారుపయి నాహ్లాదంబు వాత్సల్యమున్
మొలవంజేయుచు, సామి శంకరుపయిం బూనించుచుం బ్రేమపుం
గళికన్ నమ్రులపైని బూర్ణకరుణానైపుణ్య మూరించుచున్
వెలయు న్నీచిరునవ్వు చంద మది నేఁ బేర్కొంటకున్ శక్యమే.

వినాయకునందును, గుమారునియందు నానందభరితమైన కూరిమి నంకురింపజేయునది, మదనారియందు సహజప్రేమాంకురములను వ్యక్తము సేయునది, నీయెడ వినతులైన భక్తులందు పరిపూర్ణకృపానైపుణ్యము నుత్తంభింపజేయునదియు నగు నీ చిఱునవ్వు సొగసును నే నేమని నుతింపగలను ?

సంక్రుద్ధద్విజరాజకోఽప్యవిరతం కుర్వన్ద్విజైః సంగమం
వాణీపద్ధతిదూరగోఽపి సతతం తత్సాహచర్యం వహన్|
అశ్రాన్తం పశుదుర్లభోఽపి కలయ న్పత్యౌ పశూనాం రతిం
శ్రీకామాక్షి తవ స్మితామృతరసస్యన్దో మయి స్యన్దతామ్|| ౭౬

కనలించున్ ద్విజరాజు నైన; ద్విజలోకమ్మంటి వర్తించు; నం
దనిదై పల్కుల కెప్పుడున్ జలిపెడిం దత్సాహచర్యంబ; పొం
దనిదయ్యుం బశుకోటి నా పశుపతిం గామించు కామాక్షి ! యొ
య్యన నాపై నది నీ స్మితామృతరసస్యందమ్ము చిందాడుతన్.

అమ్మా ! నీ మందహాసామృతము ద్విజరాజును అనగా చంద్రుని, (శ్లేష.) ఉత్తమ బ్రాహ్మణుని -- గోపింపజేయును. అయినను ద్విజులతో బ్రాహ్మణులతో, (శ్లేష.) -- పలువరుసతో సహవాసము నెరపుచున్నది. సరస్వతియొక్క పద్దతికి దూరమయ్యును అనగా మాటలకు అందనిదయ్యును ఎల్లప్పుడు ఆ పలుకులతోడి సాహచర్యమునే పొందుచున్నది. పశుదుర్లభ మయ్యు -- నన ఁగా నజ్ఞానులగు జీవుల కందరానిదయ్యు పశుపతియందు వేడుకగలదగుచున్నది. అట్టి నీ మందహాసామృతము నాయందు చిందునుగాక ! శ్లేషానుప్రాణిత విరోధాభాసాలంకారము.

శ్రీకామాక్షి మహేశ్వరే నిరుపమప్రేమాంకురప్రక్రమం
నిత్యం యః ప్రకటీకరోతి సహజా మున్నిద్రయ న్మాధురీమ్।
తత్తాదృక్త్వవ మన్దహాసమహిమా మాతః కథం మానితాం
తన్మార్ధ్నా సురనిమ్నగాం చ కలికా మిన్దోశ్చ తాం నిన్దతి॥ ౭౭

శ్రీకామాక్షి ! మహేశుపై నిరుపమప్రేమాంకురప్రక్రమ
శ్రీ కైసేయుచు సాజమౌ మధురిమన్ రేకెత్తగాఁ జేయు నీ
యా క్రమస్మితరేఖ తల్లి ! తగునే యా స్వామి తా నౌఁదలం
జేకొన్నట్టి సురాపగన్ శశికళన్ నిందించెడిన్ నిచ్చలున్.

మహేశ్వరునిపై సహజమైన మాధుర్యమును వెలయించుచు సాటిలేని ప్రేమాంకురమును మొలపింపఁజేయుచు నుండెడి నీ మందహాసరేఖ అతఁడు దలఁదాల్చిన దేవనదిని, జంద్రకళను దూలనాడుచున్నది. ఇది యెందుచేత తల్లీ ?

యే మాధుర్యవిహారమణ్డపభువో యే శైత్యముద్రాకరా
యే వైశద్యదశావిశేషసుభగా స్తే మన్దహాసాంకురాః।
కామాక్ష్యా స్సహజం గుణత్రయమిదం పర్యాయతః కుర్వతాం
వాణీగుమ్భనడంబరే చ హృదయే కీర్తిప్రరోహే చ మే॥ ౭౮

అవి మాధుర్యవిహారమండపము లాహో శైత్యముద్రానిధుల్
భువి వైశద్యదశావిశేషసుభగంబుల్ మందహాసాంకుర
చ్ఛవు లీ మూఁడుగుణంబులున్ వరుసగా సందర్భమౌఁగాక నా
కవితాగుంఫనడంబరంబున నెదన్ గైసేసి నా కీర్తిలోన్.

నీ చిరునగవుమొలకలు మాధుర్యమునకు విహారమండపములు, చలువకు ముద్రాధికారస్థానములు, స్వచ్ఛతావిశేషసుందరములు. ఇట్టి సహజగుణములు మూడింటిని ఒకదానివెంట నొకటిగా నీ మందహాసములు నా కవితాగుంఫనమునందు, నా హృదయమునందు, నా కీర్తియందు నలరించుగాక. అనఁగా నీ మందస్మితసందర్శనభాగ్యముచే మధురమైన కవిత్వము, చల్లని హృదయము, స్వచ్ఛమైన కీర్తియు నాకు లభించుతమని తాత్పర్యము.

కామాక్ష్యా మృదులస్మితాంశునికరా దాక్షాన్తకే వీక్షణే
మన్దాక్షగ్రహిలా హిమద్యుతి మయూఖాక్షేప దీక్షాంకురాః|
దాక్ష్యం పక్ష్మలయన్తు మాక్షికగుడద్రాక్షాభవం వాక్షు మే
సూక్ష్మం మోక్షపథం నిరీక్షితుమపి ప్రక్షాలయేయు ర్మనః|| ౭౯

కామాక్షీ మృదులస్మితాంశువులు దక్షద్వేషికన్జాయ ల
జ్జామాధుర్యముగాంచుఁ జాంద్రరుచి శిక్షాదక్షదీక్షాంకుర
గ్రామమ్ముల్ మధు రేక్షుమాక్షికగుడద్రాక్షారసప్రౌఢి నా
పై ముంచెత్తుచు సూక్ష్మముం గనుగొనన్ నా బుద్ధి క్షాళించుతన్.

కామాక్షితల్లియొక్క మందస్మితకిరణములు దక్షవైరిచూపులయందు లజ్జామాధుర్యమును నించి వెన్నెలతళుకులను శిక్షింపజాలు దీక్షగొని, తీయని చెఱకుతేనె ద్రాక్ష మొదలైనవాని సామర్థ్యమును నాయందు నా (కవిత్వమందు) వెలయించుగాక ! సూక్ష్మమైన మోక్షమార్గమును దర్శించుటకు ననువుగ నా మనస్సును అద్దమునట్లు ప్రక్షాళించుగాక !

జాత్యా శీతలశీతలాని మధురా ణ్యేతాని పూతాని తే
గాంగానీవ పయాంసి దేవి పటలా న్యల్పస్మితజ్యోతిషామ్
ఏనఃపంకపరంపరామలినతా మేకామ్రనాథప్రియే
ప్రజ్ఞానా త్సుతరాం మదీయధిషణాం ప్రక్షాలయన్తు క్షణాత్|| ౮౦

కొంచెపునవ్వులోని తళుకుల్ గడు తీయని వెంతొ చల్లలన్
నించును జాతిచే సురధునీజలముల్ బలె జ్ఞానధారలన్
నించుచుఁ బాపమన్ బురద నిక్కము నామది క్షాళనమ్ము గా
వించుత నేకచూతపతియింతిరో ! చక్కదనాలబంతిరో !

ఓ ఏకామ్రేశ్వరుని అంతఃపురరాజ్ఞీ ! నీ మందహాసకాంతిపుంజములు గంగా జలములవలె మిక్కిలి చల్లనివి. తీయనివి, పవిత్రములైనవియును. అవి పాపపంకిలమైన నా బుద్ధిని జ్ఞానధారచే క్షణములో ప్రక్షాళించుగాక !

అశ్రాన్తం పరతంత్రితః పశుపతి స్త్వన్మందహాసాంకురైః
శ్రీకామాక్షి తదీయవర్ణసమతాసంగేన శంకామహే।
ఇన్దుం నాకధునీం చ శేఖరయతే మాలాం చ ధత్తే నవై
ర్వైకుంఠై రవకుంఠనం చ కురుతే ధూళీచయై ర్భాస్మనైః॥ ౮౧

ఔర ! త్వదీయమందహసితాంకురపాళికి లోఁగి శంకరుం
డా రుచి కీడుజోడగుటనేమొ కదా తలఁదాల్చినాఁడు భా
గీరథి, నిందుబింబమును గిలిచె నచ్చము తుమ్మిపూల మేల్
హారము నిండఁబూసె నొడలన్ మఱి య వ్వెలిబూది నమ్మరో!

నీ మందహాసాంకురములచే వివశుడై కాబోలు శంకరుఁడు ఆ శోభకు సాటి యగునని చంద్రుని, గంగానదిని దలకెక్కించుకొనును. క్రొత్త తుమ్మిపూలమాలను దాల్చును. వెలిబూదిని ఒడలెల్ల బూసికొనును.

శ్రీకాంచీపురదేవతే మృదువచస్సౌరభ్యముద్రాస్పదం
ప్రౌఢప్రేమలతానవీనకుసుమం మన్దస్మితం తావకమ్
మన్దం కన్దలతి ప్రియస్య వదనాలోకే సమాభాషణే
శ్లక్ష్ణే కుట్మలతి ప్రరూఢపులకే చాశ్లేషణే పుల్లతి॥ ౮౨

అరయ మృదూక్తిసౌరభము లల్లుకొనన్ దృఢరాగవల్లరిన్
విరిసినపూవు నీ నగవు వింతగఁ బూయుఁ బ్రియాస్యదర్శన
స్ఫురణ నతండు పల్కు నెడ మొగ్గయిడున్ సుదృఢోపగూహనం
బెరసి వికాసముం బొరయు వేమఱు నెమ్మెయి పుల్కరింపులన్.

ఓ కాంచీపురదేవతా ! మృదుమధుర వచనపరిమళముద్రాస్థానము. ప్రౌఢానురాగ లతాకుసుమము నగు నీ లేనగవు ప్రియుని ముఖాలోకనమున జిగురించును. తత్సంభాషణమున మొగ్గదొడుగును. ఆయన బిగికౌగిలి నెనసి పులకించి కుసుమవికాస మందును.

కిం త్రైస్రోతస మంబికే పరిణతం స్రోత శ్చతుర్థం నవం
పీయూషస్య సమస్తతాపహరణం కిం వా ద్వితీయం వపుః।
కింస్వి న్నైకటికం గిరో మధురిమాధ్యాపాయ నవ్యం పయః
శ్రీకాంచీపురనాయకప్రియతమే మన్దస్మితం తావకమ్॥ ౮౩

దేవీ ! నాల్గవపాయ యౌ త్రిపథగాదివ్యాపగం దాపముల్
వే వాపన్ దనునవ్వుని రెండవదియై పీయూషమే చిందెనా ?
భావింపన్ భవదుక్తిలో మధురిమాభ్యాసమ్ముగావింప నం
బా ! వెంటాడిన పాలమీగడయ యౌనా నీదు లేన వ్వుమా!

నీ చిరునవ్వు సకల తాపములు వాపుటకు ఆ త్రిపథగనుండి అనగా గంగా నదినుండి జాల్కొన్న నాల్గవపాయ కాదుగదా ! అమృతముయొక్క రెండవమూర్తి అవునా ? లేక నీ పలుకులనుండి తియ్యందనమును నేర్చుకొనుటకు వచ్చిన పాలే యౌనా ? తెల్పుమమ్మా !

భూషా వక్త్రసరోరుహస్య సహజా వాచాం సఖీ శాశ్వతీ
నీవీ విభ్రమసంతతేః పశుపతే స్సౌధీ దృశాం పారణా
జీవాతు ర్మదనశ్రియ శ్శశిరుచే రుచ్చాటనీ దేవతా
శ్రీకామాక్షి గిరా మభూమి మయతే హాసప్రభామంజరీ|| ౮౪

బోటియ ముద్దుపల్కులకు, మోమనుతమ్మికిఁ బుట్టుసొమ్ము, బ
ల్నీటులకెల్ల నీవి, శివు నిద్దపుఁజూడ్కికి వేల్పుబువ్వ, యు
చ్చాటనశక్తి వెన్నెలకుఁ జక్కని ప్రాణ మనంగుకల్మికిన్
మాటకు నీదు లేనగవుమంజరిమాధురి యందబో దుమా !

నీ ముఖపద్మమునకు నైజమైన కళ, నీ పలుకులతో కలకాలము వొలుచు నెచ్చెలి. విలాసములకెల్ల పోకముడి. పరమశివుని చూపుల కమృతసంతర్పణము. మన్మధసంపదకు జీవనౌషధము. వెన్నెల కుచ్చాటనదేవతయు నై నీ మందహాసప్రభామంజరి మాటల కందనిదై యున్నది.

సూతి శ్శ్వేతిమకన్దలస్య వసతి శ్శృంగారసారశ్రియః
పూర్తిః సూక్తిఝరీరసస్య లహరీ కారుణ్యపాథోనిధేః|
వాటీ కాచన కౌసుమీ మధురిమస్వారాజ్యలక్ష్మ్యాస్తవ
శ్రీకామాక్షి మమాస్తు మంగలకరీ హాసప్రభాచాతురీ|| ౮౫

తెలుపన్ మొల్కకు మూలముక్తిఝరికిం దీర్ఘంబు; కారుణ్యమన్
జలదిన్ వీచిక; పూలతోట సొగసన్ స్వారాజ్యలక్ష్మీమహో
కళకున్ దా వది నీదు హాసరుచి శృంగారైకసారంబుక
ల్మలకా చాతురి యిచ్చుఁగావుత శుభంబుల్ మాకు శంభుప్రియా.

తెలుపు అనెడి మొలకకు మూలము. శృంగారసారసంపదకు నెలవు. సూక్తిప్రవాహమునకు పరిపూర్తి. కారుణ్యపయోధిపైని జాల్కొను కెరటము. మాధుర్యమనెడి స్వారాజ్యలక్ష్మికళ విహరించు నౌకానౌక పూదోటయునై యొప్పు నీ మందహాసప్రభా చాతురి మాయెడ మంగళకరి అగుగాక !

జన్తూనాం జని దుఃఖ మృత్యులహరీ సంతాపనం కృంతతః
ప్రౌఢానుగ్రహపూర్ణ శీతలరుచో నిత్యోదయం బిభ్రతః।
శ్రీకామాక్షి విసృత్వరా ఇవ కరా హాసాంకురాస్తే హఠా
దాలోకేన నిహన్యు రన్ధతమసస్తోమస్య మే సంతతిమ్‖ ౮౬

నానాజీవుల జన్మదుఃఖమయ సంతాపంబు పోకార్చియు
న్మానానుగ్రహపూర్ణచంద్రునుదయానన్ నిత్యముంబొల్చుచున్
గాన న్వెల్గుచు నెల్లెడన్ గిరణముల్‌గా నీదు హాసాంకుర
శ్రేణుల్ నేఁ గనినంతఁ జెండెడిని నా చిత్తమ్ములోఁ జీఁకటిన్.

జీవుల జన్మదుఃఖమును, మృత్యుపరంపరవలని సంతాపమును హరించుచు పరమాను గ్రహరూప పూర్ణచంద్రోదయమును బడసి వ్యాపించు నీ మందహాసాంకురములు హఠాద్దర్శనమై నాలోని అంధకారమును హరించుగాక !

ఉత్తుంగ స్తనమణ్డలస్య విలసల్లావణ్యలీలానటీ
రంగస్య స్ఫుటమూర్ధసీమని ముహుః ప్రాకాశ్య మభ్యేయుషీ।
శ్రీకామాక్షి తవ స్మితద్యుతితతి ర్బింబోష్ఠకాన్త్యంకురై
శ్చిత్రాం విద్రుమముద్రికాం వితనుతే మౌక్తీం వితానశ్రియమ్‖ ౮౭

ప్రోత్తుంగస్తనమండల మ్మదియునున్ బొల్పొందులావణ్య రే
ఖాత్తశ్రీనటిరంగమై తనర నీ హాసాంకురచ్ఛాయ మేల్
ముత్తెంపుంజిగి నిండు చాందినికళన్ బూనించు బింబోష్ఠమం
దత్తళ్కుంబస విద్రుమంబు సొబగుం దా నింపు మేల్సొంపుగన్.

లావణ్యరేఖయను నాట్యకత్తెకు రంగస్థలమై తనరు నీ యుత్తుంగస్తనమండలము పైని వికాసమువడసినదై నీ చిరునవ్వుతళుకు దొండపండువంటి నీ పెదవియొక్క కాంతులచేత బవడంపుకాంతిని, ఆమీద ముత్యాలజాలరులతోకూడిన చాందినియొక్క సొంపును గల విచిత్రమైన శోభను విస్తరింపజేయుచున్నది.

స్వాభావ్యాత్తవ వక్త్రమేవ లలితం సంతోషసంపాదనం
శంభోః కిం పున రంచితస్మితరుచఃపాండిత్యపాత్రీకృతమ్।
అంభోజం స్వత ఏవ సర్వజగతాం చక్షుఃప్రియంభావుకం
కామాక్షి స్ఫురితే శరద్వికసితే కీదృగ్విధం భ్రాజతే॥ ౮౮

జనని నిసర్గసుందరము సంతస మిచ్చును నీ మొగంబు శం
భుని, కెలనవ్వుపాండితినిఁ బొల్చినచో నది యేమనన్ వలెన్
విను కమలమ్ము దాన కనువిందగు నెల్ల జగాన నందులో
గొనిన శరద్వికాస మొనఁగూడెడియందము సెప్ప శక్యమే?

స్వాభావముచే నందమై నీ ముఖము ఇందుశేఖరున కానందము గూర్చును. అందు మందహాసప్రభ యలమికొనినచో నా సొగ సేమని చెప్పవలెను ! పద్మము సహజముగ సర్వజగములకు గనువిందుసేయును. అది శరదృతుశోభచే వికసించినచో దాని సొగసు వర్ణించుటకు శక్యమా?

పుంభి ర్నిర్మలమానసై ర్విదధతే మైత్రీరసం నిర్మలం
కర్తుం కర్మలయం చ నిర్మలతమాం కీర్తిం లభన్తేతరామ్।
సూక్తిం పక్ష్మలయన్తి నిర్మలగుణాం యత్తావకా స్సేవకా
స్తత్కామాక్షి తవ స్మితస్య కలయా నైర్మల్యసీమానిధేః॥ ౮౯

మలినవిహీనచిత్తులగు మాన్యులతోఁ జెలికారమూను ని
ర్మలముగఁ గర్మవాసనలు మానుచు నచ్చఁపుఁ గీర్తిఁగాంచుఁ దాఁ
బొలిచెడి నచ్చపుంబలుకుపోడిమి నీదు జన మ్మదెల్ల ని
ర్మలతకు హద్దు పెన్నిధియు మాతరొ ! నీ చిరునవ్వులోకళన్.

భవదీయ భక్తసమాజము నైర్మల్యపరమావధియైన నీ మందహాసకళకుఁ బాత్రమై పరిశుద్ధమనస్కులగు మహానుభావులతో జెలికారము సేయును. కర్మవాసనలను హరించును. స్వచ్ఛమైన కీర్తిని బొందును. స్వచ్ఛమైన పలుకులసొంపును ఉన్మీలింపఁజేయును.

ఆకర్షన్నయనాని నాకిసదసాం శైత్యేన సంస్తంభయ
న్నిందుం కించ విమోహయ న్పశుపతిం విశ్వార్తి ముచ్చాటయన్
హింసన్ సంసృతిడంబరం తవ శివే హాసాహ్వయో మాన్త్రికః
శ్రీకామాక్షి మదీయతాపతమసో విద్వేషణే చేష్టతామ్॥ ౯౦

ఆకర్షించును జల్వ దేవతల చూ, పయ్యిందుసంస్తంభనన్
వీఁకన్ వర్తిలు, మోహిఁజేయు శివునిన్, విశ్వార్తి కుచ్చాటన
మ్మాకర్పించు, భవ మ్మడంచుఁ, జిరునవ్వన్నట్టి య మ్మంత్రగాఁ
డో కామాక్షి ! మదీయతాపతమ ముత్పాటించు విద్వేషణన్.

నీ చిరునవ్వనెడి మాంత్రికుఁడు చలువచే దేవతల చూపుల నాకర్షించును. చంద్రుని స్తంభింపఁజేయును. శివుని మోహింపఁజేయును, జగముల దుఃఖముల నుచ్చాటనము సేయును. సంసారాటోపము నడంచును. అతడు నా పరితాపమనెడి చీఁకటియొక్క విద్వేషణమందు అనగా నా తాపము హరించుటయందు ప్రవృత్తుడగుగాక !

క్షేపీయః క్షపయన్తు కల్మషభయా న్యస్మాక మల్పస్మిత
జ్యోతిర్మండలచంక్రమా స్తవ శివే కామాక్షి రోచిష్ణవః|
పీడాకర్మఠకర్మఘర్మసమయ వ్యాపారతాపానల
శ్రీపాతా నవహర్షవర్షణసుధా స్రోతస్వినీశీకరాః|| ౯౦

దరహాసద్యుతిచక్రచంక్రమణముల్ తత్తద్వ్యధాకర్మరో
త్కరకర్మమ్మనుగ్రీష్మకాలపు మహాతాపాగ్నిచల్లార్చు నీ
స్ఫురదానందరసప్రవర్షణసుధాస్రోతస్వినీ శీకరో
త్కరముల్ మా కలుషంపుపెన్బురద సంక్షాళించుతన్ దక్షతన్.

ఆనందమును వర్షించుటలో నమృతప్రవాహంపు తుంపురులైన నీ చిరునవ్వు కాంతుల మండలాకార పరిభ్రమణములు, బాధాకరమైన కర్మచయమనెడి గ్రీష్మకాలపు తాపాగ్నిని జల్లార్చునవై మా పాపమనెడి బురదను క్షాళనసేయుగాక !

శ్రీకామాక్షి తవ స్మితైందవమహఃపూరే పరిస్ఫూర్జతి
ప్రౌఢాం వారిధిచాతురీం కలయతే భక్తాత్మనాం ప్రాతిభమ్|
దౌర్గత్యప్రసరా స్తమఃపటలికాసాధర్మ్య మాబిభ్రతే
కిం కిం కైరవసాహచర్యపదవీరీత్యాం న ధత్తే పదమ్|| ౯౧

కలకల నీదు లేనగవు గాటఁపు వెన్నెల గాయ భక్తులం
గల ప్రతిభావిశేషమది గైకొనుఁ బొంగినవార్ధిచందమున్
జెలఁగు మహాపదల్ గటికచీఁకటి సామ్యము, నెందునేని య
క్కలువలచెల్మియన్ బదవి గల్గినఁ గల్గని యంద మేమిఁకన్.

నీ చిరునవ్వు నిండువెన్నెలయై ప్రసరింపగా భక్తుల నవనవ కవితానమున్మేష శాలిని యైనబుద్ధి యుప్పొంగిన సముద్రముతోడి పోలికను బడయును. అపదలు కారుచీఁకటి సామ్యమును బడయును. అనఁగా విపత్తులు చీకటులవలె విరియునని తాత్పర్యము. కలువల తోడి సహవాసపదవి లభ్యమైనపుడు (అనఁగా చంద్రునితో సామ్యము పొందినపుడు) లభ్యముగాని యుంద మేమి యుండును ?

మందారాదిషు మన్మథారిమహిషి ! ప్రాకాశ్యరీతిం నిజాం
కాదాచిత్కతయా విశంక్య బహుశో వైశద్యముద్రాగుణః|
శ్రీకామాక్షి ! తదీయసంగమకలా మన్దీభవత్కౌతుకః
సాతత్యేన తవ స్మితే వితనుతే స్వైరాసనావాసనామ్|| ౯౩

మందారాదుల నెప్డో యొకతరిన్ భాసించు నాత్మీయ ము
ద్రం దా నెంచుచు నచ్ఛపుందనము తత్తత్సంగమోల్లాస కే
ళిం దా నంతగ వేడుకంగొనక తల్లీ ! నీదు లేనవ్వుచా
యం దా స్వైరవిహారవాసనన దా నంతంతకుం బెంచెడిన్.

మందారాది కల్పవృక్షములయందు ఎప్డో ఒకసారి తన వ్యక్తస్థితిని గమనించి యెంతయు సంశయపడి, స్వచ్ఛత్వరూపమైన లక్షణము (వైశద్యముద్రాగుణము) ఆ కల్పవృక్షముల నిరంతరసహవాసమునకు వేడుకపడక నీ చిరునవ్వులతోనే స్వేచ్ఛావిహారము సేయవలెననెడి వాసనను విస్తరింపజేసికొనుచున్నది.

ఇన్ధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచండానల
ప్రౌఢిమ్నా బహులీకృతే నిపతితం సంతాపచింతాకులమ్|
మాత ర్మాం పరిషించ కించిదమలైః పీయూషవర్షై రివ
శ్రీకామాక్షి తవ స్మితద్యుతికణైః శైశిర్యలీలాకరైః|| ౯౪

కడుకొని కర్మమన్న పెనుగాలి రగుల్కొని యేసరేగి పెం
పడరు భవాగ్నియం దుడుకువారిన న న్గని గన్నతల్లి నన్
దడుపుము నిండుచల్వల దనర్చెడు న య్యమృతంపుసోనపె
న్జడివలె నచ్ఛమై తనుపఁజాలిన నీ చిఱునవ్వుతళ్కులన్.

కర్మప్రవాహమనెడి పెనుగాలిచే రగుల్కొనెడి సంసారమనెడి యగ్నిచే నుడికిన నన్ను, దల్లీ ! నిండుచల్వలను నించు అమృతంపు వానజడివలె దనుపజాలిన నీ యచ్ఛమైన చిఱునవ్వుల తళుకులచే దడుపుము.

భాషాయా రసనాగ్రఖేలనజుష శ్శృంగారముద్రాసఖీ
లీలాజాతరతేః సుఖేన నియమస్నానాయ మేనాత్మజే|
శ్రీకామాక్షి సుధామయీవ శిశిరా స్రోతస్వినీ తావకీ
గాఢానందతరంగితా విజయతే హాసప్రభాచాతురీ|| ౯౫

ఇంపువహించి నాల్కతుద కెక్కి నటించుచునున్న వాణికిన్
సొంపగు చెల్మికత్తెయన నూల్కొని మేల్నియమంపుస్నాన ఘ-
టింప సుధారుచిన్ జలువ లెక్కఁగ హర్షతరంగసంగతిన్
సంపద లొల్కు నీ నగవుచాయల చాతురి పెంపుగుల్కెడిన్.

సరస్వతి సొంపుగ జిహ్వాగ్రమున నటించుచుండగా నామెకు చెలికత్తెయై నీ చిరునవ్వుకాంతుల నేరిమి ఆమెకు హాయిగా నఘమర్షణస్నానము సంఘటింపజేయుటకు బ్రహ్మానందమనెడి తరంగములతోగూడి చల్లని అమృతరసతరంగిణియై ఇంపుగులుకుచున్నది.

సంతాపం విరలీకరోతు సకలం కామాక్షి మచ్చేతనా
మజ్జన్తీ మధురస్మితామరధునీకల్లోలజాలేషు తే
నైరంతర్య ముపేత్య మన్మథమరుల్లోలేషు యేషు స్ఫుటం
ప్రేమేన్దుః ప్రతిబింబితో వితనుతే కౌతూహలం ధూర్జటేః|| ౯౬

కామసమీరముల్ విసరగాఁ గదలొందెడి వేనిలోపలన్
బ్రేమసుధాకరుండు ప్రతిబింబితుఁడై పతికెంతోకూర్చు నా
నీ మధురస్మితామరధునీరసవీచికలందుఁ దోగుచున్
శ్రీమతియైన నాదు మతి శ్రీమతి ! నా పరితాప మార్చుతన్.

మన్మథశృంగారవాయువులు విసరి చెలరేగిన యే నీయొక్క మధుర మందస్మితమనెడి అమృతతరంగిణీ తరంగములందు ప్రేమ యనెడి అమృతకరుఁడు (చంద్రుడు) ప్రతిబింబించి నీ స్వామి కెనలేని వేడుక కూర్చునో యట్టి నీ నవ్వుల వెల్లువలో మునుకలు వెట్టి నా బుద్ధి నా యశేష పరితాపమును హరించుగాక !

చేతఃక్షీరపయోధిమన్థనచలద్రాగాఖ్యమన్థాచల
క్షోభవ్యాపృతిసంభవాం జనని తే మన్దస్మిత శ్రీసుధామ్
స్వాదంస్వాద ముదీతకౌతుకరసం నేత్రత్రయీ శాంకరీ
శ్రీకామాక్షి నిరన్తరం పరిణమ త్యానందవీచీమయీ|| ౯౭

అరయన్ నీ మనసన్న పాల్కడలి రాగాఖ్యంబునౌ కవ్వపుం
గిరితోడం దరువం జనించె జననీ ! నీ నవ్వు శ్రీమత్సుధా
స్ఫురణన్ దానినిఁ గ్రోలి క్రోలి హరు న మ్ముక్కంటి సౌందర్య మ
మ్మరొ ! ఆనందతరంగరేఖఁ బరిణామంబందెఁ గామాక్షిరో !

నీ మనసనెడి పాల్కడలిలో ననురాగమనెడి కవ్వపుంగొండనుగొని తరువగా తరువగా బుట్టిన నీ లేనవ్వనెడి యమృతముం ద్రావి త్రావి శంకరుని యా నేత్రత్రయి యానందతరంగరేఖగా బరిణమించినదమ్మా !

ఆలోకే తవ పంచసాయకరిపో రుద్దామకౌతూహల
ప్రేంఖన్మారుతఘట్టనప్రచలితా దానందదుగ్ధాంబుధేః|
కాచిద్వీచి రుదంచతి ప్రతినవా సంవిత్ప్రరోహాత్మికా
తాం కామాక్షి కవీశ్వరాః స్మితమితి వ్యాకుర్వతే సర్వదా|| ౯౮

హరురాగంబను గాలితాఁకిడికి బ్రహ్మానందదుగ్ధాబ్ధి యం
బరముం దాఁకఁగ నందులోఁ గెరటమై భాసించె సంవిన్మయాం
కురమై తల్లిరొ ! దానినే కవులు వాకొంచున్నవారమ్మ నీ
దరహాసమ్ముగ సంతతంబును దయార్ద్రస్వాంత ! కామాక్షిరో !

పరమేశ్వరుని యనురాగమనెడి గాలితాకిడికి రేగి బ్రహ్మానందమనెడి క్షీరాబ్ధియం బరమును దాకగా నందులో జ్ఞానాంకురరూపమైన యొక కెరట మువ్వెత్తుగా లేచినది. తల్లీ ! దానినే కవీశ్వరులు నీ చిరునవ్వుగా బేర్కొనుచున్నారు.

సూక్తి శ్శీలయతే కి మద్రితనయే మన్దస్మితాత్తే ముహు
ర్మాధుర్యాగమసంప్రదాయ మథవా సూక్తేస్తు మన్దస్మితమ్|
ఇత్థం కామపి గాహతే మమ మన స్సందేహమార్గభ్రమిం
శ్రీ కామాక్షి న పారమార్థ్యసరణీస్ఫూర్తౌ విధత్తే పదమ్|| ౯౯

ఉమ ! మాధుర్యము పేరి యాగమరహస్యోదాత్తసత్సంప్రదా
యము నీ మాటయె నేర్చుకొన్నదొ మదంబా ! మందహాసాన ; న
వ్వమరన్ మాటలనుండి నేర్చుకొనెనో ! యంచున్ మదీయమ్ము డెం
దము సందేహపుఁ బెన్సుడింబడి యథార్థం బందుకోదయ్యెడిన్.

ఓ హిమగిరికుమారీ ! నీ చిరునవ్వునుండి మాటసొంపు మాధుర్యమనెడి యాగమసంప్రదాయరహస్యమును నేర్చుకొన్నదా ? లేక నీ మాటసొంపునుండి నీ మందహాసమే దాని నభ్యసించెనా ? అని యిట్లు నా మనసు సంశయమార్గమున సుడితిరుగుచు నెంతకును పరమార్థసరణియొక్క స్ఫూర్తియందు నిలుకడ పొందలేకున్నది.

క్రీడాలోలకృపాసరోరుహముఖీసౌధాంగణేభ్యః కవి
శ్రేణీ వాక్పరిపాటికామృతఝరీ సూతీగృహేభ్య శ్శివే|
నిర్వాణాంకురసార్వభౌమపదవీ సింహాసనేభ్య స్తవ
శ్రీకామాక్షి మనోజ్ఞమన్దహసిత జ్యోతిష్కణేభ్యో నమః|| ౧౦౦

సరసాలోల కృపాసరోరుహముఖీ సౌధాంగణక్షోణికిన్
స్ఫురదుద్యత్కవివాక్సుధారసఝరీ సూతీగృహద్రోణికిన్
స్థిరమోక్షాంకుర సార్వభౌమపదవీ సింహాసనాస్థానికిన్
సొరిదిన్ మ్రొక్కెద నీదు మందహసితజ్యోతిష్కణశ్రేణికిన్.

అమ్మా ! ఓ పరమశివా ! శ్రీ కామాక్షీ ! క్రీడావిలాసవిలోల యైన కృప యనెడి, లక్ష్మి విహరించు సౌధాంగణములును, కవికోటి వాక్పరిపాటి యనెడి యమృతంపువెల్లువకు బురిటిండ్లును, మోక్షస్ఫూర్తి యనెడి సార్వభౌమానందపదవికి సింహాసనములైనట్టి నీ మనోహర మందహాస జ్యోతిష్కణములకు నమస్కారము.

ఆర్యామేవ విభావయ న్మనసి యః పాదారవిందం పురః
పశ్య న్నారభతే స్తుతిం స నియతం లబ్ధ్వా కటాక్షచ్ఛవిమ్
కామాక్ష్యా మృదులస్మితాంశులహరీజ్యోత్స్నావయస్యాన్వితా
మారోహ త్యపవర్గసౌధవలభీ మానందవీచీమయీమ్|| ౧౦౧

భావింపంగని ఆర్య నెట్టయెదుటం బాదారవిందంబు సం.
భావింపం గనుచున్ స్తుతిం జలిపి యాపై శ్రీకటాక్షద్యుతిన్
సేవింపన్ నరుఁ డెక్కు మందహసిత శ్రీ చంద్రికాకాంతతో
సావాసమ్ముగ ముక్తిసౌధవలభిన్ సానంద వీచీకళన్.

ఆర్యయగు పరదేవతను మదిలో భావించుచు, మున్ముందు తత్పాదారవిందము నెదుట దర్శించుచు, తత్ స్తుతిని నియమముతో నారంభించిన యతడు తత్కటాక్షరుచి వడసి ఆ కామాక్షియొక్క మందహాసములకాంతివెల్లువ యనెడి వెన్నెలయను చెలికత్తెతో గూడిన యానందరసతరంగితమైన ముక్తియనెడి సౌధాగ్రచంద్రశాల కెక్కును. ఇందలి ఆర్యాదిశబ్దము లీ గ్రంథమందలి· ఆర్యాదిశతకము లైదింటినిగూడ పేర్కొనును.

ఇది మూకార్యక శంకరార్యులకు న య్యీశాని వీటీరసా
భ్యుదితోదార సుధారసోపమ కవిత్వోన్మేష సౌందర్య సం
పద కౌండిన్యసగోత్రుఁడైన కవి సుబ్రహ్మణ్య నాంధ్రమ్ము శా
రదసాక్షాత్కృతియైన యీ కృతి గురుబ్రహ్మార్పణ మ్మియ్యెడన్.

ఇది మూకపంచశతి యను కామాక్షిస్తోత్రము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

